# స్వాతంత్ర్య సమరం


బిపిన్ చంద్ర

అమలేష్ త్రిపాఠీ

బరున్ డే

అనువాదం

తిరుమలశెట్టి శ్రీరాములు





నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# విషయ సూచిక

పేజీ

అధ్యాయము

# I బ్రిటిషు పరిపాలనా ప్రభావము

*"అనేక సంవత్సరాల క్రితమే మన భవితవ్యం గురించిన గమ్యస్థానాన్ని చేరుకొని తీరాలని మనం నిర్ణయించాం. మన ఈ నిర్ణయాన్ని పూర్తిగా, కూలంకషంగా సాధించే సమయం యిప్పుడు ఆసన్నమయింది. అర్ధరాత్రి పన్నెండు గంటలు కొట్టగానే, ప్రపంచమంతా నిద్రాదేవి ఒడిలో పారవశ్యం చెందివున్న సమయాన, భారతదేశం, పునరుజ్జీవంతో, స్వేచ్ఛగా, స్వతంత్రదేశంగా ఆవిర్భవిస్తుంది."*

1947 వ సంవత్సరం ఆగష్టు నెల 15 వ తేదీ రాజ్యాంగ నిర్ణయ సభలో భారత ప్రజల నుద్దేశించి మాట్లాడుతూ శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ చెప్పిన మాటలివి. స్వతంత్ర భారత దేశం ప్రధాన మంత్రిగా శ్రీ నెహ్రూ మాట్లాడారు. స్వాతంత్ర్య సమరం పరిసమాప్త మయింది; భారత దేశం స్వతంత్ర మయింది.

అయితే శ్రీ నెహ్రూ చెప్పిన ఈ భవితవ్య నిర్ణయం, ఏమిటి ?

భారతదేశం స్వాతంత్ర్యం పొందటానికి పదిహేడేండ్ల ముందు, 1929 డిసెంబరు 31 వ తేదీన మరో అర్ధరాత్రి, నూతన సంవత్సరంలో అడుగు పెడుతూవుండగా, భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షులుగా శ్రీ నెహ్రూ, రావి నది ఒడ్డున అశేష ప్రజానీకం సమక్షంలో త్రివర్ణ పతాకను ఎగురవేస్తూ, పూర్ణ స్వరాజ్యం, సంపూర్ణ స్వాతంత్ర్యమే స్వేచ్ఛా ఉద్యమ లక్ష్యమని ప్రకటించారు. ప్రజలంతా ప్రతిజ్ఞ పట్టారు. తమ స్వాతంత్ర్యంకోసం సమరం జరపడమే ప్రజల దృఢ నిశ్చయమని, 1930 జనవరి 26 వ తేదీన జరిగే బహిరంగ సమావేశాలలో భారత ప్రజలు ప్రతినపూనాలని నిర్ణయించారు. ఆ రోజును, స్వాతంత్ర్య దినోత్సవంగా ప్రకటించారు. ఈ రోజుకుగల చరిత్రాత్మక ప్రాముఖ్యంవల్లనే, 1950 లో నవభారత రిపబ్లిక్ రాజ్యాంగం సిద్ధంగా వున్నప్పుడు జనవరి 26 వ తేదీన, దానిని ప్రవేశపెట్టారు. అప్పటినుంచీ ప్రతీ ఏడు, ఆ రోజున భారత రిపబ్లిక్ దినోత్సవాలను జరుపుకుంటున్నారు.

1929 మొదలు 1930 వరకూ జరిగిన సంఘటనలను దృష్టిలో వుంచుకునే, శ్రీనెహ్రూ మన భవితవ్య నిర్ణయం గురించి ప్రస్తావించారు. ఆ రోజున పట్టిన ప్రతిజ్ఞను,

1947 ఆగష్టు 15 వ తేదీన భారతదేశం స్వతంత్రం కావడంతో సాధించడం జరిగింది.

అయితే భారత స్వాతంత్ర్య సమరం 1929 లోనే ప్రారంభమయిందని అనుకో కూడదు. ఈ సమరం అనేక దశాబ్దాలముందే ప్రారంభమయింది. ఈ పుస్తకం, స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలకోసం భారతదేశం జరిపిన చరిత్రాత్మక సమరం గురించిన కథనాన్ని విశదం చేస్తుంది.

భారత చరిత్ర క్రీస్తు శకానికన్నా అనేక శతాబ్దాలముందు నుంచే ప్రారంభ మయింది. అయితే ఈ సుదీర్ఘ చరిత్ర సమంగా ఒకే మోస్తరుగా లేకపోవడం ఆశ్చర్యకరం. చాలా కాలంవరకూ, భారతదేశం ఒకే దేశంగా వుండేదికాదు. ఇందులో అనేకమంది రాజుల పరిపాలన క్రింద వుండే రాజ్యాలుండేవి. ఈ ఉప ఖండంలో కొన్ని సువిశాల ప్రాంతాలు ఒకే సామ్రాజ్యం పాలన క్రిందవున్న రోజులు కూడా వున్నాయి. విదేశీయులు పలుమారులు ఈ దేశం మీద దండయాత్రలు జరిపారు; వీరిలో కొంతమంది యిక్కడ స్థిరపడిపోయి భారతీయులయ్యారు; రాజులుగా, చక్రవర్తులుగా రాజ్యాలను ఏలారు; ప్రజలను పరిపాలించారు; మరి కొంతమంది దేశాన్ని కొల్లగొట్టారు ; దోచుకున్నారు; చేతికి చిక్కిన భాగ్యాలతో తిరిగి వెళ్ళి పోయారు; ఘన విజయాలను సాధించిన సమయాలు వున్నాయి; స్పష్టంగా పలుబాధలను ప్రస్ఫుటంచేసే సమయాలు వున్నాయి. అయితే, భారత స్వాతంత్ర్య సమరం గురించి మనం మాట్లాడుతున్నప్పుడు, భారత చరిత్రలో, యిటీవల, బ్రిటన్, భారతదేశాన్ని పరిపాలించడం, విదేశీయుల ఆధిపత్యాన్ని అంతంచేసి, స్వేచ్ఛ పొందటంకోసం భారత ప్రజలు జరిపిన సమరం గురించీ ప్రస్తావిస్తూ వున్నామన్నమాట.

1757 ప్లాసీ యుద్ధంలో, ఇంగ్లీషు ఈస్టు ఇండియా కంపెనీ దళాలు బెంగాల్ నవాబయిన సిరాజ్ ఉద్దేలాను ఓడించినప్పటినుంచి, భారత దేశంలో బ్రిటిష్ పరిపాలన ప్రారంభమయిందని చెప్పవచ్చు. అయితే బ్రిటీష్ సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా శక్తివంతమైన జాతీయ సమరం భారతదేశంలో 19 వ శతాబ్దం రెండో అర్థభాగం లోనూ, 20 వ శతాబ్దం మొదటి అర్థభాగంలోనూ జరిగింది. భారత ప్రజల ప్రయోజ నాలకూ, బ్రిటిష్ పరిపాలకుల ప్రయోజనాలకూ మధ్య వైరుధ్యంవల్లనే ఈ సంఘర్షణ ఏర్పడింది. ఈ విరుద్ధ ప్రయోజనాల సంఘర్షణను అవగాహన చేసుకోవాలి అంటే భారత దేశంలో బ్రిటిష్ పరిపాలన మూల స్వభావం గురించీ భారతీయ సమాజంపై దాని ప్రభావం గురించీ తెలుసుకోవడం అవసరం. పరిపాలనవల్ల భారత ప్రజా నీకంలో జాతీయతాభావాలు చిగురించాయి; దీని మూలంగా శక్తివంతమయిన జాతీ

యోద్యమం తల ఎత్తి పెంపొందటానికి అవసరమయిన వస్తు, నైతిక, మేధా, రాజకీయ పరిస్థితులు ఏర్పడ్డాయి.

## భారత దేశంలో బ్రిటిషు పరిపాలన ఘట్టాలు

1757 నుంచీ. బ్రిటిష్‌వారు, తమ ప్రయోజనాలను ప్రోత్సహించుకోడానికి భారతదేశంమీద తమ అదుపాజ్ఞలను ఉపయోగించారు. అయితే వీరి యావద్ పరిపాలనలో మూల స్వభావం ఎల్లప్పుడు ఒకే మోస్తరుగా వుందని అనుకోకూడదు. దాదాపు 2 వందల సంవత్సరాల సుదీర్ఘ చరిత్రలో వీరి పరిపాలన అనేక ఘట్టాలను చేరుకుంది. బ్రిటిష్ పరిపాలన సామ్రాజ్య వాదుల స్వభావము, వాటి విధానాలు, ప్రభావము, బ్రిటన్ సాంఘిక, ఆర్థిక రాజకీయాభివృద్ధి మార్పులతోపాటు మారుతూ వుండేవి.

1757 వ సంవత్సరానికి ముందుకూడా ఇంగ్లీషు ఈస్టు ఇండియా కంపెనీకి రెండు అంశాలలో మాత్రమే శ్రద్ధ వుండేది. భారతదేశంతోనూ, తూర్పుదేశాలతోనూ గుత్త వ్యాపారం జరిపినట్లయితే తనతో పోటీపడే ఇంగ్లీషు లేక యూరోపియన్ వ్యాపారులు గానీ, వర్తక కంపెనీలుగానీ వుండవని ఈ కంపెనీ భావించింది. భారతదేశంలో సరుకులు కొనడం లేదా విదేశాలలో భారతీయ సరుకులను అమ్మడంలో కూడా భారత వర్తకులు తమతో పోటీపడటం ఈ కంపెనీకి యిష్టంలేదు. అంటే తమ సరుకులను విపరీతమైన ధరలకు అమ్ముకొని, భారత సరుకులను అతి తక్కువ చౌక ధరలకు కొన్నట్లయితే అధిక లాభాలు సంపాదించవచ్చునని ఈ కంపెనీ భావించింది. వివిధ కంపెనీలు - వ్యక్తులు పోటీపడే సాధారణ వర్తకంలో యిది సాధ్యంకాదు. లంచం పెట్టడంద్వారానూ యితర ఆర్థిక, రాజకీయ పద్ధతులద్వారానూ ఇంగ్లీషు పోటీదార్ల పోటీ లేకుండాచేసి, భారత దేశంతోనూ, తూర్పు దేశాలతోనూ గుత్త వర్తకం చేసుకునే హక్కును ఈస్టు ఇండియా కంపెనీకి యివ్వవలసిందిగా బ్రిటిష్ ప్రభుత్వానికి నచ్చ చెప్పడం సులభమయింది. అయితే బ్రిటిష్ చట్టాలు, ఇతర యూరోపియన్ దేశాల వర్తకులు, వ్యాపార కంపెనీలు, వర్తకం చేయకుండా అరికట్టలేకపోయాయి. ఇందు వల్లనే ఈస్టు ఇండియా కంపెనీ తమ లక్ష్యాన్ని సాధించుకోడానికి భీకరమైన పెద్ద యుద్ధాలను జరపవలసి వచ్చింది. సముద్రాంతరాలలోవున్న దేశాలతో వర్తకం జరపాలి కాబట్టి ఈ కంపెనీ, శక్తివంతమైన నౌకాదళాన్ని ఏర్పాటుచేసుకోవలసి వచ్చింది.

బలిష్ఠమయిన మొగలాయి సామ్రాజ్యం రక్షణ వుండటంవల్ల భారత వర్తకుల పోటీని అరికట్టడం కూడా అంత సులభమయిన పని కాకపోయింది. నిజానికి 17 వ శతాబ్దంలోనూ, 18 వ శతాబ్దం ప్రారంభంలోనూ, భారతదేశంలో వర్తకం చేసుకునే హక్కు పొందాలి అంటే మొగలాయి చక్రవర్తులకూ, వారి రాష్ట్ర గవర్నర్లకూ అర్జీ దాఖలు చేసుకోవడంద్వారా ఈ హక్కును పొందవలసివుంది. కాగా 18 వ శతాబ్దారంభంలో మొగలాయి సామ్రాజ్యం బలహీనమయి సుదూరంలోవున్న కోస్తా ప్రాంతాలు అదుపు తప్పిపోవడం ఆరంభమయిన వెంటనే, ఈ కంపెనీ, భారత తీర ప్రాంతం పొడవునా వ్యాపారాన్ని పదిల పరుచుకొని, తీర - విదేశ వర్తకం జరుప కుండా భారత వ్యాపారులను తరిమివేయడానికి, శక్తివంతమైన తన నౌకా దళాన్ని యింకా ఎక్కువగా వుపయోగించింది.

మరొక ముఖ్య విషయం కూడా వుంది. భారత దేశంలోనూ, మహా సముద్రాలలోనూ యుద్ధాలుచేసి నౌకా దళాన్నీ, సైన్యాలనూ, కోటలనూ వర్తక కేంద్రాలనూ కాపాడుకోటానికి ఈ కంపెనీకి అపారమైన ధనం అవసరమయింది. బ్రిటీష్ ప్రభుత్వానికిగానీ, ఈస్టు ఇండియా కంపెనీకిగాని ఇంత సంపదలేదు. అందువల్ల ఈ ధనాన్ని భారతదేశంలో సంపాదించాలి. కోస్తా ప్రాంతంలో తమ అదుపుక్రింద వున్న కలకత్తా, మద్రాసు, బొంబాయి వంటి పట్టణాలలో స్థానిక పన్నుల వసూళ్ళద్వారా, కంపెనీ, ఈ ధనాన్ని సేకరించగలిగింది. క్రమేపీ, యింకా ఎక్కువ ప్రాంతాలలో యింకా ఎక్కువ పన్నులువేసి తమ ధన సంపత్తిని ఎక్కువ చేసుకోడానికి, భారతదేశంలో తమ ప్రాంతాలను విస్తరించుకోవడం అవసరమయింది.

సరిగ్గా అదే సమయంలో బ్రిటిష్ పెట్టుబడిదారి వ్యవస్థకూడా అభివృద్ధి ఘట్టంలో అడుగు పెట్టింది. ఇంకా వృద్ధి చెందటానికి పరిశ్రమలూ వాణిజ్యం వ్యవసాయ రంగాలకు భారీ పెట్టుబడులు అవసరమయ్యాయి. ఆ కాలంలో బ్రిటన్‌లో యిటువంటి పెట్టుబడులకు సాధన సంపత్తులు పరిమితంగా వుండటంవల్ల, బ్రిటష్ పెట్టుబడిదారి వ్యవస్త అభివృద్ధికి అవసరమయిన పెట్టుబడిని సంపాదించడానికి, పెట్టుబడిదారులు విదేశాలను కొల్లగొట్టడం ప్రారంభిచారు. భారతదేశం సంపన్న దేశమని ప్రఖ్యాతి పొందటంవల్ల ఈ విషయంలో అతిముఖ్యపాత్ర నిర్వహించగలదని వారు భావించారు.

రెండు లక్ష్యాలనూ, — గుత్తవ్యాపారం, ఆర్థిక వనరులమీద అదుపునూ శీఘ్ర గతిలో సాధించారు. 1750లో బెంగాల్, దక్షిణ భారతావని, కంపెనీలు రాజకీయ అదుపు క్రిందికి రావడాన్ని ఈస్టు ఇండియా కంపెనీ డైరక్టర్లు ఊహించ నయినా ఊహించ లేకపోయారు.

తాము జయించిన ప్రాంతాల ప్రభుత్వ ఆదాయాలమీద ఈస్టుఇండియా కంపెనీ ప్రత్యక్ష అదుపాజ్ఞలను సంపాదించింది. స్థానిక పాలకులూ, అధిపతులు జమీందార్ల వద్ద మూలుగుతూవున్న సంపదను స్వాధీనం చేసుకునే స్థితిలోకి ఈకంపెనీ వచ్చింది. ఈ సంపదనూ, ప్రభుత్వాల ఆదాయాలనూ, స్వప్రయోజనాలకోసం, దాని ఉద్యోగుల లాభంకోసం. భారతదేశంలో తమ విస్తరణకు మరికొంత పెట్టుబడి పెట్టడానికే ఈ కంపెనీ భుక్తంచేసింది. ఉదాహరణకి 1765 నుంచి 1770 వరకూ ఈ కంపెనీ, బెంగాల్‌నుంచి నూటికి దాదాపు 33 శాతం నికర ఆదాయాన్ని సరుకుల రూపంలో పంపింది. అంతేకాకుండా కంపెనీ అధికారులు, భారత వర్తకులు, అధికారులు, జమీందార్ల వద్దనుంచి భుక్తంచేసిన అక్రమ ఆదాయాలలో పెద్దమొత్తాలను పంపివేశారు. భారత దేశంనుంచి దోచుకోబడిన సంపద బ్రిటన్, తన పెట్టుబడులను వృద్ధి చేసుకోవడంలో అతి ముఖ్యపాత్ర నిర్వహించింది. ఆకాలంలో, బ్రిటన్ జాతీయ ఆదాయంలో యిది దాదాపు రెండుశాతం వుంటుందని అంచనా వేశారు.

ఇదే సమయంలో, కంపెనీ, తన రాజకీయ అధికారాన్ని, భారత వర్తకం — ఉత్పత్తిమీద గుత్తాధికారాన్ని సంపాదించడానికి ఉపయోగించింది. భారత వర్తకులను క్రమేపీ యిరుకునపెట్టి గెంటివేశారు : చేనేత పనివారు, యితర హస్తకళా నిపుణులూ, తమ ఉత్పత్తులను నష్టానికి అమ్ముకునేటట్టు చేయడమో, లేక వీరు, కంపెనీక్రింద తక్కువ వేతనాలకు కూలీలుగా పనిచేసేటట్టు చేయడమో జరిగింది. బ్రిటిష్ పాలన మొదటి ఘట్టంలో అతిముఖ్య విశేష మేమిటంటే పాలనా నిర్వహణలోగానీ, న్యాయ వ్యవస్థలోగానీ. రవాణా, కమ్యూనికేషన్లలోగానీ, వ్యవసాయ పద్ధతులు — పారిశ్రామిక ఉత్పత్తి వ్యాపార నిర్వహణలోగానీ, విద్య, మేధస్సు రంగాలలోగానీ మూల మార్పు లేవీ ప్రవేశ పెట్టకపోవడం. ఆ ఘట్టంలో బ్రిటిష్ పాలనకూ మామూలు సామ్రాజ్యాలకు తేడా ఏదీ లేదు: తమ వలసల మన్ననలను పొందే ప్రావీణ్యాన్ని ఈ సామ్రాజ్యాలు కలిగి వుండేవి

తమకి ముందువున్న పాలకుల అడుగు జాడల్లో నడుస్తూ, పన్నులు వసూలుచేసే సాధారణ యంత్రాంగంద్వారా గ్రామాలలోని అధిక ఆర్థిక సంపత్తిని విజయవంతంగా రాబట్టుతూ వున్నంతవరకూ గ్రామాలలోకి చొచ్చుకు వెళ్ళవలసిన అవసరం లేదని బ్రిటిష్‌వారు భావించారు. దీని ఫలితంగా పాలనా నిర్వహణలో ఎటువంటి మార్పులు చేసినా వాటిని పన్నులు వసూలుచేసే ఉన్నత యంత్రాంగానికి వర్తింప చేసేవారు, సమర్థంగా పన్నులు వసూలుచేయడమే దీనిలక్ష్యం.

మేధారంగంలో, పశ్చిమ దేశాల జీవితాలను పూర్తిగా మార్చివేస్తూవున్న అధునాతన భావాలను పరివ్యాప్తం చేయడానికి ఎటువంటి ప్రయత్నము జరగలేదు. 18 వ శతాబ్దం

రెండో అర్ధభాగంలో కలకత్తాలో ఒకటి, బెనారస్‌లో మరొకటి, రెండు నూతన విద్యా సంస్థలను మాత్రమే ప్రారంభించారు. సంప్రదాయ సిద్ధమయిన పర్షియన్, సంస్కృతం అధ్యయనానికి యివి కేంద్రాలుగా వుండేవి. క్రైస్తవ మిషనరీలనుకూడా కంపెనీ ఆధిపత్యం క్రిందికి రాకుండా చేశారు.

బ్రిటన్‌లో పెద్ద పెద్ద వ్యాపార సంస్థల ఆధిపత్యం అంతమవుతూ వున్న సమయంలో భారతదేశాన్ని ఈస్టుఇండియా కంపెనీ జయించిందన్న విషయాన్నిగుర్తుంచుకోవాలి. బ్రిటిష్ సమాజంలోవున్న సాంఘిక శక్తులకు మాత్రమే ఈ కంపెనీ ప్రతినిధిగా వుండేది; ముందుకు వస్తున్న శక్తులకు మాత్రం కాదు.

## పారిశ్రామిక పెట్టుబడి స్వేచ్ఛా వర్తక యుగం

భారతదేశంలో ఈస్టు ఇండియా కంపెనీకి ప్రాదేశిక అధికారం హస్తగత మయిన వెంటనే, కొత్తగా సంపాదించిన ఈ సామ్రాజ్యం ఎవరి ప్రయోజనాలను కాపాడుతూ వుండాలి; అన్నవిషయమై బ్రిటన్‌లో సంకుల సమరం ప్రారంభ మయింది. ఏండ్లుగడిచిన కొద్ది ఈ కంపెనీ బ్రిటన్‌లోని యితర వాణిజ్య పారిశ్రామిక ప్రయోజనాలకు చోటు ఇవ్వవలసి వచ్చింది. 1813 నాటికి, భారత దేశంలో ఆర్థిక - రాజకీయ అధికారానికి యిది ఒక నామమాత్ర రూపంగా వుండేటట్టు చేశారు. వాస్తవ అధికారం బ్రిటిష్ పెట్టుబడిదారి వర్గం ప్రయోజనాలను కాపాడే బ్రిటిష్ ప్రభుత్వం చేతుల్లో వుండేది.

ఈలోగా బ్రిటన్‌లో పారిశ్రామిక విప్లవం జరిగింది. దీనివల్ల బ్రిటన్. ప్రపంచంలో ఉత్పత్తి ఎగుమతి విషయంలో అగ్రదేశ మయింది. బ్రిటన్‌లోనే పెద్ద మార్పు రావడానికి పారిశ్రామిక విప్లవం కారణమయింది. పారిశ్రామిక పెట్టుబడిదార్లు అనతి కాలంలోనే బ్రిటిష్ ఆర్థిక వ్యవస్థలో శక్తివంతమైన రాజకీయ పలుకుబడిని సంపాదించి ఆధిపత్యం చెలాయించే స్థితికి వచ్చారు. భారతదేశంలో వలసపాలన విధానాలను తమ ప్రయోజనాలకు అనుగుణంగా మార్చవలసి వచ్చింది. అయితే సామ్రాజ్యంలో వీరి ప్రయోజనాలు ఈస్టుఇండియా కంపెనీ ప్రయోజనాలకు భిన్నంగా వుండేది. ఈ కంపెనీ ఒక వర్తక సంస్థగా మాత్రమే వుండేది. దీనిఫలితంగా భారతదేశంలో బ్రిటిష్ పరిపాలన రెండో ఘట్టంలో ప్రవేశించింది.

భారత హస్తకళా వస్తువుల గుత్తఎగుమతి వల్లగానీ, భారతీయ ఆదాయాలను సరాసరి భక్షం చేయడం వల్లగానీ బ్రిటిష్ పారిశ్రామిక వేత్తలకు పెద్ద లబ్ధి ఏదీ లభించ

లేదు. కాగా అంతకంతకి ఎక్కువవుతూవున్న తయారయిన సరుకుల విక్రయానికి విదేశ మార్కెట్లు అవసరమయ్యాయి. భారతదేశంవంటి సువిశాల జనసమర్థమయిన దేశం వీరిని ఎల్లప్పుడూ ఆకర్షించింది. ఇదే సమయంలో బ్రిటిష్ పరిశ్రమలకు ముడిసరుకులు అవసర మయ్యాయి; బ్రిటిష్ శ్రామిక ప్రజలకు ఆహార పదార్థాలు కావలని వచ్చాయి; వీటిని దిగుమతి చేసుకోవలసి వచ్చింది. అంటే భారతదేశం, తనక్రింద వుండే వర్తక భాగస్వామిగా వుంటే బాగుంటుందనీ, మార్కెట్లను వినియోగంలోకి తెస్తే బాగుంటుందనీ బ్రిటన్‌కి అవసరమయిన ముడిసరుకులను ఆహార పదార్థాలనూ ఉత్పత్తి చేసి, సప్లయి చేసే వలసగా వుంటే బాగుంటుందనీ బ్రిటన్ భావించింది.

అయితే ఒక సమస్య వుంది. దిగుమతి చేసుకున్న సరుకులకు భారతదేశం చెల్లింపులు కట్టవలసి వుంది. కంపెనీ వాటాదార్ల లాభాలక్రింద చెల్లింపులకూ, బ్రిటిష్‌పేర సైనిక అధికారుల పింఛన్ల క్రిందా భారతదేశం అపార సంపదనుకూడ ఎగుమతి చేయవలసి వుంది. తమ పొదుపు మొత్తాలను స్వదేశానికి తీసుకెళ్ళడానికికూడ ఈ అధికారులకు అనుమతి యివ్వవలసి వుంది. బ్రిటిష్ వర్తకులు — తోటల యజమానుల లాభాలనుకూడా భారతదేశంనుంచి తీసుకెళ్ళవచ్చు. బ్రిటన్ ఈ దేశంలో వినియోగించిన పెట్టుబడిమీద వడ్డీనీ, లాభాలను కూడా భారతదేశం చెల్లించాలి. వీటన్నిటికోసం, భారతదేశం కొన్ని సరుకులను బ్రిటన్‌కీ యితరదేశాలకు ఎగుమతి చేయడం అవసరం. అయితే కంపెనీ అనుసరించిన స్వప్రయోజన విధానాల మూలంగా భారతదేశం సంప్రదాయ సిద్ధంగా ఎగుమతిచేసే హస్తకళల వస్తువుల ఎగుమతి ఆగిపోయింది. ఇంకాముఖ్యమైన విషయ మేమిటంటే భారతదేశం ఎటువంటి సామాగ్రినీ ఎగుమతి చేయడం బ్రిటన్‌కు ఇష్టంలేదు. అందువల్ల వ్యవసాయముడిసరుకులనూ, యితరతయారు కాని సరుకులను మాత్రమే ఎగుమతి చేయాలి. నల్లమందు దిగుమతిమీద చైనా, నిషేధం విధించినప్పటికీ, నల్లమందుఉత్పత్తి చైనాకుదాని ఎగుమతి మరికొంత వృద్ధి కావడమే కాక భారత ప్రభుత్వం, ప్రత్తి, జనపనార, పట్టు, నూనెగింజలు, గోధుమ, తోళ్ళు-చర్మాలు, నీలిమందు, తేయాకు ఎగుమతులను యిప్పుడు ప్రోత్సహించింది. ఈ విధంగా భారతదేశపు విదేశవర్తక స్వరూపం పూర్తిగా మారిపోయినప్పటికీ, మెరుగు పడిందని అనుకోడానికి వీలులేదు. శతాబ్దాల తరబడి జవుళివస్త్రాలు, ఇతర హస్తకళ వస్తువుల ఎగుమతికి పేరుమోసిన భారతదేశం, 19వ శతాబ్దంలో జవుళివస్త్రాలను దిగుమతి చేసుకోవలసి వచ్చింది; ప్రత్తి, యితర ముడిసరుకులను ఎగుమతిచేయ వలసివచ్చింది.

భారతదేశం తన నూతన విధులను అప్పటి ఆర్థిక - రాజకీయ సాంస్కృతిక పరిస్థితుల్లో నిర్వర్తించలేక పోయింది. బ్రిటిష్ ఆర్థికవ్యవస్థ అభివృద్ధిలో నూతన

పాత్రను నిర్వహించేటట్టు చేయడానికి, దానిని మార్చవలసి వచ్చింది. సంప్రదాయ సిద్ధ మయిన దాని పెట్టు బడేతర ఆర్థిక స్వరూపాన్ని మార్చ వలసిన అవసరం ఏర్పడింది. ఈ లక్ష్యాలను సాధించడానికే బ్రిటిష్ – భారత ప్రభుత్వం 1813 తర్వాత భారతీయ పరిపాలన ఆర్థిక సామాజిక వ్యవస్థలను మార్చడానికి పూనుకొంది.

ఆర్థికరంగంలో, బ్రిటిష్ పెట్టుబడిదార్లు భారతదేశంలో స్వేచ్ఛగా ప్రవేశించి, తమ చిత్తం వచ్చిన ఆర్థిక కార్య కలాపాలను నిర్వహించుకోడానికి అనుమతి యిచ్చారు. వీటన్నిటికన్నా స్వేచ్ఛా వర్తకాన్ని ప్రవేశ పెట్టారు; బ్రిటిష్ ఉత్పత్తిదార్లు భారతదేశపు రేవులు, మార్కెట్లలో స్వేచ్ఛగా ప్రవేశించడానికి అనుమతియిచ్చారు. భారతదేశం, బ్రిటిష్ వస్తువులను ఉచితంగా లేక నామమాత్రపు సుంకం రేట్లకు దిగుమతి చేసుకోడానికి అనుమతి యివ్వక తప్పిందికాదు. పాలనా నిర్వహణను ఇంకా వివరంగా సమగ్రం చేశారు; ఇందులో అనేక కార్యకలాపాలను చేర్చారు. పన్నుల వసూళ్ళకూ శాంతి భద్రతలను కాపాడటానికి మాత్రమేకాక వర్తక మార్గాలను సురక్షితంగా కాపాడటాని కూడా ఈ నియమములను వర్తింప చేశారు. పాలనా నిర్వహణ బహుముఖంగా విస్తృత మయి గ్రామాలస్థాయిని చేరడంవల్ల, బ్రిటిష్ సరుకులు లోతట్టునవున్న చిన్న పట్టణాలు, గ్రామాలను కూడా చేరుకున్నాయి; ఎగుమతికోసం వ్యవసాయసరుకులను రాబట్టగలిగారు. ఈ విధంగా, 19 వ శతాబ్దంలో భారతదేశపు బ్రిటిష్ పాలన విస్తృతంగా – త్వరగా మారిపోయింది.

అంతే కాకుండా భారత సమాజానికి పెట్టుబడి వాణిజ్య సంబంధాలు ప్రాతి పదికగా వుండాలి అంటే దాని న్యాయ నిర్వహణ స్వరూపాన్ని ప్రక్షాళనం చేయవలసి వచ్చింది. ఉదాహరణకు ఖరారునామ పవిత్రమైనదిగా భావించారు; దిగుమతులు ఎగుమతులను ప్రోత్సహించే లక్షలాది లావాదేవీలను ఆచరణసాధ్యం చేయాలి అంటే ఖరారునామా పద్ధతిని, మూల చట్టంచేయాలి; దేశపు నైతిక నియమం కావాలి. ఈ విధంగా కొత్త చట్టాలు, భారత శిక్షాస్మృతి—పౌరస్మృతి ప్రాతిపదికగా కొత్తన్యాయ నిర్వహణ పద్ధతి అమలులోకి వచ్చింది.

ప్రభుత్వపు నూతన విస్తృత పాలనా-న్యాయ యంత్రాంగ నిర్వహణకూ, బ్రిటిష్ వర్తకసంస్థల నిర్వహణకూ విద్యావంతులైన ఉద్యోగులు అనేకమంది అవసరమయ్యారు. వీటికి అవసరమైనంత అంగబలం బ్రిటన్‌కిలేదు సరికదా, భారతప్రభుత్వంకానీ, బ్రిటిష్ వ్యాపారులుకానీ ఈ ఉద్యోగాలన్నింటిలోనూ, ఇంగ్లీషు వారిని నియమించడం సాధ్యం కాదు. ఎందువల్లనంటే. ఎంతోదూరాన వున్న భారత వలసలో, దాని అననుకూల వాతావరణంలో పనిచేయడానికి వారిని ఆకర్షించాలంటే అత్యధిక వేతనాలు చెల్లించలేరు.

అందువల్ల 1813 తర్వాత ప్రవేశపెట్టిన ఆధునిక విద్యను 1833 తర్వాత విస్తృతం చేశారు.

భారీ దిగుమతులకూ, అపార మైన ముడిసరుకుల ఎగుమతులకు చౌకగా సుళువైన రవాణా పద్ధతి అవసరమయింది. అందువల్ల ప్రభుత్వం నదీమార్గాలలో ఓడలను ప్రవేశ పెట్టింది; రోడ్లను మెరుగు పరచింది. అంతే కాకుండా 1853 తర్వాత దేశంలోని పెద్ద పట్టణాలు, మార్కెట్లను, రేవులతోకలుపుతూ రైలుమార్గాలని నిర్మించారు. 1905 నాటికి దాదాపు 350 కోట్ల రూపాయల ఖర్చుతో సుమారు 28 వేల మైళ్ళ రైలుమార్గాలను నిర్మించారు. ఇదేమోస్తరుగా ఆధునిక తంతి-తపాల పద్ధతిని ప్రవేశ పెట్టారు; దీనివల్ల వర్తక లావాదేవీలు సులువయ్యాయి.

ఇదే కాలంలో, బ్రిటిష్ రాజనీతిజ్ఞులలోనూ, బ్రిటిష్ - భారత పరిపాలకుల్లోనూ లిబరల్ సామ్రాజ్యవాద రాజకీయ ఆదర్శం తల ఎత్తింది. 19 శతాబ్దం మొదటి అర్థ భాగంలో బ్రిటన్ ఒక్కటే పూర్తిగా పారిశ్రామికవంతమైన దేశం కావడంవల్ల, ప్రపంచ కార్ఖానాగా పేరుపొంది, మహాసముద్రాలపై అదుపు కలిగి వుండగలిగింది. వస్తూత్పత్తిలో బ్రిటన్ ప్రపంచ గుత్తాధిపత్యాన్ని కలిగి వుండటంవల్ల, స్వేచ్ఛా వర్తకం అమలులో వున్నంతవరకూ బ్రిటన్, భారతదేశాన్ని, యితర దేశాలనూ పరోక్షంగా లేక అనధికార ఆధిపత్యంద్వారా ఆర్థికంగా పీడించుకు తింటూ వుండవచ్చునని అనేక మంది భావించారు. అందువల్ల వీరు స్వపరిపాలన నిర్వహణలో భారతీయులకు శిక్షణ యిచ్చి, చిట్టచివరికి రాజకీయ అధికారాన్ని వారి చేతుల్లో పెట్టడం గురించి మాట్లాడటం మొదలు పెట్టారు. ఈ మాటలను, ఆ తర్వాత, భారత జాతీయవాదులు తమ రాజకీయ ఆలజడి సందర్భంగా, స్వేచ్ఛగా వుపయోగించారు.

బ్రిటిష్ పాలన రెండో ఘట్టంలో నూతన పద్ధతి ఆర్థిక పీడనను ప్రవేశపెట్టారు అంటే, యిదివరకటి పీడన పద్ధతులు అంతమయ్యాయని అనుకోకూడదు. భారత దేశంలో మిగతా ప్రాంతాలను జయించి, బ్రిటిష్ పాలనను పటిష్ఠం చేయడానికీ, సమకాలీన ప్రమాణాలకు అతీతంగా, ఉన్నత పాలనా నిర్వహణ, సైనిక పదవులలో వేలాదిమంది ఇంగ్లీషువారిని నియమించి వారికి ఎనలేని జీతాలు యివ్వడానికీ, భారత దేశం లోతట్టు ప్రాంతాలకు కూడా వలస రాజ్యాధిపత్యం చొచ్చుకువెళ్లేటట్టు చేయడానికి అవసరమయిన ఆర్థిక పాలనా మార్పులకు అయ్యే ఖర్చులక్రిందా, భారతీయ ఆదాయాలు యింకా అవసరమయ్యాయి. బ్రిటిష్ పాలన నూతన పద్ధతి ఫలితంగా భారత కర్షకుని పన్నుల భారం విపరీతంగా పెరిగిపోయింది.

ఇదే సమయంలో బ్రిటిష్ ఉత్పత్తిదార్లతో పోటీపడని నీలిమందు, నల్లమందు, తేయాకువంటి భారత ఉత్పత్తి రంగాలు కొన్నింటిని అభివృద్ధి చేశారు, కాని, ప్రభుత్వపు పూర్తి అదుపు క్రింద లేక భారత దేశంలోని బ్రిటిష్ పెట్టుబడిదారుల అదుపు క్రింద వుంచివేశారు. సాంకేతికంగా మెరుగయిన బ్రిటిష్ లేక బ్రిటిష్ అదుపు క్రిందవున్న వలసల ఉత్పత్తులతో యింకా పోటీచేయగల భారతీయ ఉత్పత్తులమీద బ్రిటన్‌లో అధిక దిగుమతి సుంకాలు విధించేవారు. ఉదాహరణకు 1824 లో భారతీయ జవుళీ వస్త్రాలమీద 30 మొదలు 70 శాతంవరకు సుంకాలు చెల్లించారు. భారతదేశంలో తయారయిన పంచదారమీద ఉత్పత్తిధరకు మూడురెట్లు సుంకంచెల్లించారు. కొన్ని సందర్భాలలో బ్రిటన్‌లో సుంకాలు 4 వందల శాతం వరకూ కూడా వుండేవి. ఇటువంటి ఉత్పత్తుల మీద దిగుమతి సుంకాలను, వీటిని బ్రిటన్‌కు ఎగుమతి చేయడం దాదాపు నిలిపి వేసిన తర్వాత మాత్రమే తొలగించారు. అంతేకాకుండా భారతీయ ఉత్పత్తిదార్లు, అఖిల భారత మార్కెట్ రూపొందటంవల్ల, కలిగే లాభాలను పొందకుండా, దేశంలో విస్తృతమైన సుంకాల స్వరూపాన్ని ఏర్పాటుచేసి అమలుపరచాలన్న ప్రభుత్వం నిర్ణయంద్వారా, అరికట్టగలిగారు. ఈ విధంగా భారతదేశం తన స్వంత ఉత్పత్తుల రవాణామీద పన్నులు వేస్తూ, విదేశ సరుకుల స్వేచ్ఛా రవాణాకు అనుమతి యివ్వవలసిన విడ్డూర పరిస్థితి ఏర్పడింది. ఈ అంతరంగిక సుంకాలను 1840 లో మాత్రమే రద్దు చేశారు. అప్పటికి బ్రిటిష్ ఉత్పత్తిదార్లు, భారతీయ మార్కెట్‌లో భారత హస్తకళా వస్తువులమీద పైచేయిని పొందగలిగారు.

## వలసల్లో విదేశ పెట్టుబడులు – అంతర్జాతీయ పోటీ యుగం

భారతదేశంలో బ్రిటిష్ పాలన మూడో ఘట్టం 1860 నుంచీ ప్రారంభమయిందని. చెప్పవచ్చు. ప్రపంచ ఆర్థిక పరిస్థితిలో మూడు ముఖ్య మార్పుల ఫలితమే యిది క్రమేపీ పశ్చిమ యూరోప్‌లోనూ, ఉత్తర అమెరికాలోనూ యితర దేశాలు పారిశ్రామికవంతమయ్యాయి; వస్తూత్పత్తిలోనూ, ఆర్థిక విషయాలలోనూ బ్రిటన్ ఆధిక్యత అంతమయింది. ఫ్రాంసు, బెల్జియమ్, జర్మనీ, అమెరికా. రష్యా. ఆ తర్వాత జపాన్ శక్తివంతమయిన పరిశ్రమలను ఏర్పరచుకున్నాయి; తమ ఉత్పత్తులకు విదేశ మార్కెట్ల కోసం అన్వేషణ ప్రారంభించాయి. మార్కెట్లకోసం ప్రపంచవ్యాప్తమైన తీవ్ర పోటీ యిప్పుడు ప్రారంభమయింది.

రెండోది, 19 వ శతాబ్దం ఆఖరి 25 సంవత్సరాలలోనూ పరిశ్రమల్లో శాస్త్రీయ పరిజ్ఞానాన్ని వర్తింపచేయడంవల్ల అనేక ముఖ్య సాంకేతిక పరిణామాలు సంభవించాయి. ఆధునిక ఉక్కు పరిశ్రమ, ఈ కాలంలోనే ఉద్భవించింది. 1850 లో ప్రపంచంలో ఉక్కు ఉత్పత్తి 80 వేల టన్నులు మాత్రమే వుండేది. 1870 లో కూడా 7 లక్షల టన్నులకు తక్కువగా మాత్రమే ఉక్కు ఉత్పత్తి జరిగింది. 1900 లో ఉక్కు ఉత్పత్తి 2 కోట్ల 80 లక్షల టన్నులను అందుకుంది. ఆధునిక రసాయనిక పరిశ్రమలు ఈ కాలంలో వృద్ధిచెందాయి. ఉష్ణ యంత్రాలకు పెట్రోలియంని ఇంధనంగా వుపయోగించడం, పారిశ్రామిక అవసరాలకు విద్యుచ్ఛక్తిని ఉపయోగించడం కూడా ఈ కాలంలో వృద్ధిచెందాయి. అంటే దీని అర్థం, ఒక వైపు పారిశ్రామిక అభివృద్ధి గతిని వేగిరపరిచారు; మరోవైపు కొత్త పరిశ్రమలు అపారమైన ముడిసరుకులను వినియోగించేవి. ముడి సరుకులు లేకపోయినట్టయితే పారిశ్రామిక స్వరూపానికే విఘాతం ఏర్పడేది. శీఘ్రగతిలో పరిశ్రమలు అభివృద్ధికావడం పట్టణ జనాభా ఎడతెరిపి లేకుండా ఎక్కువ కావడానికి కూడా దారి తీసింది. ఈ జనాభాకు యింకా ఎక్కువ ఆహారం అవసరమయింది. ముడిసరుకులకోసమూ, ఆహార పదార్థాలకోసమూ నూతన వనరులకోసం విస్తృత అన్వేషణ ప్రపంచమంతటా ప్రారంభమయింది. ఆఫ్రికా, ఆసియా, లేటిన్, అమెరికా దేశాలలో శక్తివంతమైన వ్యవసాయ ఖనిజ ముడి సరుకులమీద పూర్తి కంట్రోలు సంపాదించడానికి దేశాలు ఒక దానితో మరొకటి పోటీ పడ్డాయి.

ఇహ మూడోది - వర్తక - పరిశ్రమల అభివృద్ధి. వలసలనూ - వలస దేశాల మార్కెట్లనూ బాగా పీడించుకు తినడంవల్ల అభివృద్ధి చెందిన పెట్టుబడిదారి దేశాల పెట్టుబడి, పరిమితిలేకుండా పెరిగిపోవడం మొదలు పెట్టింది. అంతేకాకుండా ఈ పెట్టుబడి కొద్ది బ్యాంకులు, కార్పొరేషన్‌లూ, ట్రస్టులూ, కార్టెల్సులో ఎక్కువగా పేరుకుపోయింది. ఈ పెట్టుబడిని వినియోగించడానికి మార్గాలను కనిపెట్టవలసి వచ్చింది. ఆయాదేశాలలో అత్యధిక ప్రజలు పేదరికంతో జీవిస్తూ వుండటంవల్ల పెట్టుబడి పెట్టడానికి ఎంతో అవకాశ మేర్పడింది. అయితే ఈ దేశాలలో కార్మిక వర్గం వ్యవస్థీకృతం కావడం ప్రారంభమయింది; పెద్ద పెట్టుబడులు, దాని ఫలితంగా విస్తృతంకావడం, సంప్రదింపుల శక్తిని మెరుగుపరచడంవల్ల అప్పుడున్న పరిశ్రమలు లాభాలు కూడా తగ్గిపోడానికి దారి తీసింది. కాగా ఈ పెట్టుబడిని, ఖనిజ, వ్యవసాయ ముడి సరుకులను ఉత్పత్తి చేయడానికి విదేశాలలో గనుక ఉపయోగించినట్టయితే ఒక్క దెబ్బతో అనేక పక్షులను చంపడం సాధ్యమవుతుంది. మిగులుగావున్న పెట్టుబడిని వినియోగించడానికి మార్గాన్ని కనిపెట్టాలి. అభివృద్ధి చెందని దేశాలలో వేతనాలు

చాలా తక్కువగా వున్నందున అధిక లాభాలు రావడం సహజం. ఇదే సమయంలో దేశవాళి పరిశ్రమలకు, అతి ముఖ్యమైన ముడి సరుకులు అందుతూ వుంటాయి. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారి దేశాలు మరోసారి తమ మిగులు పెట్టుబడిని వినియోగించడానికి అనువైన ప్రాంతాల అన్వేషణ ప్రారంభించాయి.

ఈ ఘట్టంలో సామ్రాజ్యవాదం, విస్తరణ—ఇవి సామ్రాజ్యవాద దేశాలలో సిద్ధాంత పరంగానూ రాజకీయ పరంగానూ అతిముఖ్య పాత్రను నిర్వహించాయి. 19వ శతాబ్దం రెండో అర్ధభాగంలో సామాన్య ప్రజానీకంలో శక్తివంతమైన ప్రజాస్వామిక భావాలు పెల్లుబికాయి; దాదాపు పశ్చిమ యూరోపియన్ దేశాలన్నింటిలోనూ, అమెరికాలోనూ ఓటింగ్ హక్కు అమలులోకి వచ్చింది. కార్మికులు—కర్షకులు, ఈహక్కును తమవర్గ ప్రయోజనాలను ప్రోత్సహించడానికి ఉపయోగిస్తారనీ, ధనిక వర్గాలు సమాజంపై రాజకీయ ఆర్థిక ఆధిపత్యం చెలాయించడం అంతమయ్యే రోజులు దగ్గర పడ్డాయనీ ఈ దేశాల అధికార ధనిక వర్గాలు కలవర పడుతూ వుండేవారు. సామ్రాజ్యవాదం దీనిని పరిష్కరించింది. బాహ్య యశస్సునుంచి ప్రజల దృష్టిని మళ్ళించడానికీ, అతివాద జాతీయత దేశభక్తి ఆత్మయశస్సు భావాలను ప్రజలలో పరివ్యాప్తంచేసి తమ సమాజాలు మళ్ళీ పెట్టుబడిదారి వ్యవస్థను బలపరిచేటట్టు చేయడానికి సామ్రాజ్యవాదాన్ని ఉపయోగించవచ్చు. కార్మికులలో గర్వాన్ని సంతృప్తి భావాన్ని వ్యాప్తం చేయడానికి, బ్రిటిష్ సామ్రాజ్యంమీద సూర్యుడు ఎన్నటికి అస్తమించడు అన్న నినాదాన్ని బ్రిటిష్‌వారు లేవతీశారు. వాస్తవానికి తమ కార్మికులు నివసించే మురికి వాడలమీద సూర్యకిరణాలు అరుదుగాతప్ప పడవు. ‘సూర్యునిక్రింద తలదాచుకోడానికి ఒకచోటు’ అన్న నినాదాన్ని జర్మన్లు బలపరిచారు. నాగరికత విధిలో ఫ్రెంచి వారికి విశ్వాసముండేది. ఆసియా సంరక్షకుడను తానని జపాన్; స్లావేల సంరక్షకుడను తానని రష్యా అనేవి. లేటిన్ అమెరికా తమ ధర్మకర్తృత్వం క్రిందవుందని ఉత్తర అమెరికా అనేది. లేటిన్ అమెరికా భవితవ్యం తమ భవితవ్యంతో ముడిపడి వుందని ఉత్తర అమెరికా భావించేది. 20వ, శతాబ్దం అమెరికా శతాబ్దమని వీరు విశ్వసించడం ప్రారంభించారు. ఓటింగ్ హక్కు లభించడానికి ముందు పాలిస్తూ వున్నట్టుగానే, తమ ప్రజాఓటుద్వారా, విస్తరణ ఆదర్శం, సామ్రాజ్య వాదం, జాతీయ ఔన్నత్యంవల్ల ప్రజలు అదేరకం ప్రభుత్వాలను మళ్ళీ అధికారంలోకి తెచ్చేవారు. ఈ కొత్త ప్రక్రియలు — శక్తులు, మార్కెట్లు, ముడిసరుకులు, పెట్టుబడిమీద పూర్తి ఆధిపత్యం కలిగివుండే సామ్రాజ్యవాదదేశం, వలసలనూ, అర్ధవలసలనూ అన్వేషించడానికి తోడ్పడ్డాయి. నూతన వలస ఆధిపత్యం చెలాయించడానికి అనువైన కొత్త ప్రాంతాలు లభించడం మృగ్యం

కావడంతో వలసలనూ అర్ధవలసలనూ సంపాదించడానికి పోటీ విపరీతంగా ఎక్కువ యింది. ప్రపంచాన్ని వలసలుగా విభజించడానికి ఉద్దేశించిన సమరం, యిప్పుడు వలస ప్రపంచాన్ని పునర్ విభజించడానికి ఉద్దేశించిన సమరంగా మారిపోయింది.

వ్యాపార—పెట్టుబడిరంగాలలో, బ్రిటన్, ప్రముఖస్థానాన్ని అభివృద్ధి చెందిన నూతన పెట్టుబడిదారి దేశాలు గ్రహించడంవల్ల ఈకాలమంతా బ్రిటన్, అనేక యిబ్బందు లకు లోనుగావలసి వచ్చింది. తన సామ్రాజ్యంమీద అదుపాజ్ఞలను పటిష్టం చేసుకుని దానిని మరికొంత విస్తరించే కృషికి బ్రిటన్ యిప్పుడు పూనుకుంది.

భారతదేశంలో బ్రిటిష్‌పాలన మూడో ఘట్టంలో సామ్రాజ్యవాదుల కంట్రోలు ద్విగుణీకృత మయింది. అప్పటి వైస్రాయిలయిన లిట్టన్, డఫరిన్, లాన్స్‌డవున్, వీరందరికన్నా ఎక్కువగా కర్జన్, అభివృద్ధి నిరోధక విధానాలను అనుసరించడమే దీనికి కారణం. ప్రపంచమంతటా పోటీ ఎక్కువ కావడంవల్ల తాము పెట్టిన పెట్టుబడికి భారతదేశం స్వర్గతుల్యంగా వుంటుందని బ్రిటన్ భావించింది.

1850 తర్వాత, అపారమైన బ్రిటిష్ పెట్టుబడిని రైల్వేలలోనూ, భారత ప్రభుత్వా నికి ఋణాలుగానూ, కొంతవరకూ తేయాకు తోటలు, బొగ్గుగనులు, జనుప మిల్లులు, నౌకాయానం, వర్తకం—బ్యాంకింగ్‌లలో పెట్టారు. ఈ పెట్టుబడులు ఆర్థిక—రాజకీయ ప్రమాదాలకు లోనుగాకుండా పదిలంగా కాపాడుకోడానికి, భారతదేశంపై బ్రిటిష్ పాలనను యింకా కట్టుదిట్టంగా అమలు పరచాలి. సమకాలీన బ్రిటిష్ అధికారులు, రాజనీతిజ్ఞులు దీనిని స్పష్టంగా గుర్తించారు. ప్రభుత్వోద్యోగి బొంబాయి గవర్నరు అయిన రిచ్చర్డు టెంపిల్ 1880లో వ్రాస్తూ, "ఇంగ్లండు భారతదేశాన్ని అట్టిపెట్టుకోవాలి... ఎందువల్లనంటె, బ్రిటిష్ పాలన శాశ్వతంగా వుంటుందన్న హామీమీద ఈదేశంలో అపారమయిన బ్రిటిష్ పెట్టుబడిని వినియోగించారు" అని పేర్కొన్నారు.

బ్రిటిష్ సామ్రాజ్యవాద పథకంలో భారతదేశంకూడా మరో ముఖ్యవిధిని నిర్వర్తిం చింది. ఆఫ్రికాలోనూ, ఆసియాలోనూ బ్రిటిష్ అధికారాన్ని విస్తరించి—పటిష్టం చేయడానికి భారతీయ సైన్యాన్ని ముఖ్యసాధనంగా వుపయోగించారు. ప్రపంచ మంతటా బ్రిటిష్ సామ్రాజ్య పరిరక్షణకు భారతసైన్యం, బ్రిటిష్ నౌకాదళంతో కలిసి ప్రధాన సాధనంగా పనిచేసింది. దీని ఫలితంగా శాశ్వతమైన సైన్యం ఏర్పడింది ; 1904లో భారత ఆదా యంలో దాదాపు 52 శాతం ఈసైన్యంకోసం ఖర్చుచేయవలసి వచ్చింది.

ఈకాలంలో, స్వపరిపాలనలో భారతీయులకు శిక్షణ యివ్వాలన్న మాటలన్నీ అడు గంటి పోయాయి. అయితే భారత జాతీయ ఉద్యమం ప్రభావం క్రింద 1918లో దీనిని పునరుద్ధరించడం జరిగింది. భారతదేశంపై శాశ్వత ధర్మకర్తృత్వం లేదా దాతృత్వ

నియంతృత్వమే బ్రిటిష్ పాలన లక్ష్యమని ప్రకటించడం జరిగింది. భౌగోళిక, జాతి, చారిత్రక, సాంఘిక — సాంస్కృతిక కారణాలవల్ల భారత ప్రజలు, స్వపరిపాలనకు శాశ్వతంగా, అర్హులుకారని పేర్కొనడం జరిగింది. అందువల్ల, బ్రిటిష్‌వారు, వీరికి, అనేక శతాబ్దాల వరకు నాగరికమైన దాతృత్వమైన పాలనను ప్రసాదించాలి.

అంతకుముందు కాలంలో ప్రారంభమయిన భారత పరిణామం మూడో ఘట్టంలో కూడా కొనసాగింది. బ్రిటిష్ పాలన, భారతదేశంలో ప్రతి మారుమూల ప్రాంతానికీ, భారత సమాజానికీ, అందుబాటులో వుండటం అతిముఖ్యం. బ్రిటన్ లాభంకోసం, ప్రతిరేవు, ప్రతిపట్టణం, ప్రతిగ్రామం, ప్రపంచ ఆర్థిక వ్యవస్థతో సంబంధం కలిగి వుండాలి. అయితే యింతకిముందు మోస్తరుగానే, ఈ పరిణామం పరిమితంగానూ, కొంతవరకుమాత్రమే వుండిపోయింది. భారతదేశంలో బ్రిటిష్ వలస రాజ్యాధిపత్య స్వభావమే దీనికి కారణం.

మొదటి కారణం, ఇంతకిముందు మోస్తరుగా బ్రిటిష్‌వారు జరిపిన దండయాత్రలకు అయ్యే ఖర్చులను భారత ఆదాయాలనుంచి భరించి నట్టుగానే, పాలన నిర్వహణ, ఆర్థిక సాంస్కృతిక మార్పులకు అయ్యేఖర్చులను భారత ఆదాయాలనుంచి భరించ వలసి వచ్చింది. అయితే భారతదేశం పేదదేశం ; వలస రాజ్యాధిపత్యం దీనిని యింకా పేదదేశంగా మార్చి వేసింది. ఆర్థికంగా అభివృద్ధి చెందుతూవున్న దేశం సులభంగా ఆదాయాలను ఎక్కువ చేయవలసి వున్నప్పటికీ, భారత దేశంలో ఈ పెరుగుదల వల్ల పన్నులస్థాయి యింకా ఎక్కువయింది. అయితే ఈ పద్ధతికి రాజకీయ పరిమితులుండటం సహజం. స్తబ్దమయిన ఆర్థిక వ్యవస్థలో పన్నులు పెరుగుతూ వున్నట్టయితే ప్రజల తిరుగుబాటు తప్పనిసరి అవుతుంది. అంతేకాకుండా భారతదేశం, అతి ప్రియమైన పాలన,సైనిక వ్యవస్థ, విద్య,సేద్యపునీరు,రవాణావ్యవస్థ ఆధునిక పరిశ్రమల అభివృద్ధికీ ఎక్కువ పన్నులను చెల్లించలేక పోయింది. భారత దేశంలో వలసరాజ్యాధిపత్యం వైరుధ్యానికి ముఖ్య కారణం యిదే. వలస పీడనను మరికొంత విస్తరించాలిఅంటే అంతరంగిక అభివృద్ధికొంత జరగవలసి వున్నప్పటికీ, ఈ పీడన పద్ధతివల్ల, భారతదేశం వెనుకబడి వుండటంతో మరికొంత విస్తరణ దుస్సాధ్య మయింది.

ఇహ రెండో కారణం :— ఈ ఫలితాలను గమనించిన వెంటనే, వలస అధికారులు భారత దేశంలో ఆధునిక పద్ధతులమీద కొన్ని పరిమితులను విధించారు. కొద్ది మార్పు అయినా కూడా సాంఘిక శక్తులలో, సామ్రాజ్య వాదాన్నీ భారతదేశాన్నీ పీడించుకుతినే యంత్రాంగాన్ని ప్రతిఘటించే శక్తిని కలిగించింది. అందువల్ల వలస అధికారులు మరో సందిగ్ధ అవస్థలో పడ్డారు. భారత దేశం నుంచి ఎక్కువ ఆదాయాన్ని రాబట్టడానికి

ఉద్దేశించిన మార్పులు వలస రాజ్యాధి పత్యానికి వ్యతిరేకమైన సమరభావాన్ని సాంఘిక శక్తులలో కలిగించి వలస పాలనకే ముప్పు తెచ్చిపెట్టాయి.

## భారతదేశంలో వలస రాజ్యాధిపత్యముల లక్షణాలు

బ్రిటిష్ పాలన ఫలితంగా 19వ శతాబ్దం అంతమయ్యే టప్పటికి భారత దేశం, మొదటి రకం వలసగా మారిపోయింది. బ్రిటిష్ ఉత్పత్తులకు పెద్ద మార్కెట్‌గానూ, ముడి సరుకులకూ, ఆహార పదార్థాలకూ పెద్ద ఒనరుగానూ, బ్రిటిష్ పెట్టుబడిని వినియోగించడానికి ఒక ముఖ్య రంగంగానూ తయారయింది. సామ్రాజ్య వాదుల ప్రయోజనం కోసం దీని వ్యవసాయం మీద విపరీతమైన పన్నులు వేశారు. రవాణా వ్యవస్థల్లో ఎక్కువ భాగం, ఆధునిక గనులు- పరిశ్రమలు, విదేశ వర్తకం, తీర అంతర్జాతీయ నౌకా యానం, బ్యాంకులు, భీమా కంపెనీలు - అన్నీ విదేశ ఆధిపత్యం క్రింద వుండేవి. వేలాది మంది మధ్య తరగతి ఇంగ్లీషు వ్యక్తులకు భారత దేశంలో ఉద్యోగాలు లభించాయి. దీని ఆదాయంలో దాదాపు మూడోవంతు ఇంగ్లీషు వ్యక్తుల జీతాల క్రింద ఖర్చు చేసేవారు. భారత సైన్యం, దూరానవున్న బ్రిటిష్ సామ్రాజ్యాన్ని కాపాడటానికీ, తూర్పు, ఆగ్నేయ, మధ్య, పశ్చిమ ఆసియాలోనూ, ఉత్తర - తూర్పు - దక్షిణ ఆఫ్రికాలలో బ్రిటిష్‌సామ్రాజ్యవాద ప్రయోజనాలను కాపాడి ప్రోత్సహించడానికీ ముఖ్య సాధనంగా ఉపయోగ పడింది.

వీటన్నిటికన్నా, భారత ఆర్థిక వ్యవస్థ, సాంఘికాభివృద్దీ, బ్రిటిష్ ఆర్థిక వ్యవస్థ - సాంఘికాభివృద్ధి క్రింద వుండేటట్టు చేశారు. భారత ఆర్థిక వ్యవస్థను ప్రపంచ పెట్టుబడిదారి ఆర్థిక వ్యవస్థతో సంఘటితం చేశారు. అయితే అతిచోద్యమయిన అంతర్జాతీయ కార్మిక విభజనతో, రెండో స్థానంలో వుండేటట్టు చేశారు. 1760 తర్వాత, బ్రిటన్, ప్రపంచంలో ప్రముఖ అభివృద్ధి చెందిన, పెట్టుబడిదారిదేశంగా రూపొందుతూ వున్నప్పుడు, భారత దేశాన్ని, ప్రపంచంలో అభివృద్ధిలో వెనుకబడిన ముఖ్యమైన దళిత- వలస దేశంగా తయారు చేశారు. వాస్తవంగా ఈ రెండు పద్ధతులకు, కారణం- ఫలితం దృష్ట్యా, ఒక దానితో మరోదానికి అతి సన్నిహిత సంబంధం వుంది. బ్రిటన్‌కీ - భారత దేశానికీ మధ్య, వర్తకం, ఆర్థిక-సాంకేతిక విషయాలకు సంబంధించిన ఆర్థిక సంబంధాల పూర్తి స్వరూపంవల్ల భారతదేశం వలస దాస్యంక్రింద వుంటూ అభివృద్ధిలో వెనుకబడిన దేశంగా వుంటూ వుండవలసి వచ్చింది.

## వ్యవసాయముపై ప్రభావము

బ్రిటిష్ పాలన, భారతదేశంపై దాని ప్రభావంవల్ల శక్తివంతమైన సామ్రాజ్య వాద వ్యతిరేక ఉద్యమం తల ఎత్తడానికీ, భారత ప్రజలు ఒక జాతిగా సమైక్యం కావడానికీ అనువైన పరిస్థితులు ఏర్పడేటట్లు చేశాయి. భారతదేశంలో బ్రిటీష్ పాలకులు అనుసరించిన స్వార్థ విధానాలవల్ల, భారత వ్యవసాయము, వ్యవసాయ వర్గాలు, వర్తకం, పరిశ్రమలు బాగా దెబ్బతిన్నాయి. సాంస్కృతిక, సాంఘిక రంగాలలో అనుసరించిన విధానాల ప్రభావం కూడా ఎంతో శక్తివంతంగా కనుపించింది.

బ్రిటీష్‌వారు, భారత వ్యవసాయ వ్యవస్థలో అతిముఖ్యమైన మార్పులు తెచ్చారు; అయితే యిది ఉత్పత్తిని ఎక్కువచేసి, వ్యవసాయంతో సంబంధం వున్నవారి సంక్షేమాన్నీ, సౌభాగ్యాన్నీ మెరుగుపరిచే ఉద్దేశ్యంతోకాక, భూమి శిస్తులను అందుబాటులో వున్న వ్యవసాయ మిగుళ్ళనూ భుక్తంచేసి, భారత వ్యవసాయం, వలస వ్యవస్థలో తనకు నిర్ణయించిన పాత్రను తప్పని సరిగా నిర్వర్తించేటట్లు చేయడమే అసలు లక్ష్యం. పాత సంబంధాలు వ్యవస్థలు నాశన మయ్యాయి; కొత్తవి ఆవిర్భవించాయి. అయితే ఈ కొత్త లక్షణాలు, ఆధునిక పోకడలకు గానీ, సరియైన పథంలో పురోగమించడానికి గానీ మార్పులు కాలేక పొయ్యాయి.

బ్రిటిష్‌వారు రెండు ముఖ్యమైన భూమి శిస్తులు- కౌలుదారి పద్ధతులు ప్రవేశ పెట్టారు. ఒకటి జమీందారీ పద్ధతి. (ఆ తర్వాత యిదే జమీందారి పద్ధతిని సవరించి, మహల్‌వారి పద్ధతి అన్న పేరుతో ఉత్తర భారత దేశంలో ప్రవేశ పెట్టారు.) మరొకటి రైతువారీ పద్ధతి.

జమీందారి పద్ధతి క్రింద పాత పన్నుల కర్షకులు, రెవెన్యూ కలెక్టర్లు, జమీందారులు ప్రయివేటు భూకామందులుగా మారి పోయారు. అయితే. భూస్థితి వున్న వీరికి తమ భూమిమీద ఉండే హక్కుల్లో కొన్నే వీరికిచ్చారు. కౌలుదార్లనుంచి లభించిన కౌలులో ఎక్కువ భాగం ప్రభుత్వానికి అప్పజెప్పాలి. ఇదే సమయంలో వీరిని గ్రామ తెగల పెద్దలను చేశారు. భూములు దున్నే కర్షకులను ఇష్టం వచ్చినప్పుడు తీసివేయడానికి వీలయిన కర్షకులుగా చేశారు.

రైతువారి పద్ధతి క్రింద, ప్రభుత్వం, వ్యక్తిగత కర్షకులనుంచి పన్నులను వసూలు చేసేది. వీరు సేద్యంచేసే భూమికి వీరు యజమానులుగా చట్టరీత్యా గుర్తించారు. అయితే వీరియాజమాన్యం పరిమిత మయినది. భూమిశిస్తు సెటిల్‌మెంటు తాత్కాలిక మైనది కావడం. ఎక్కువ శిస్తురేటు చెల్లించాలని కోరడం, దీనికి కారణాలు. ఎక్కువ రేటు శిస్తులను వీరు చెల్లించలేక పోయేవారు.

పద్ధతిపేరు ఏదైనప్పటికీ, కర్షక రైతులు ఎన్నోబాధలకు గురిఅయ్యేవారు. ఎక్కువ కౌలు చెల్లించ వలసిందిగా వీరిని ఒత్తిడి చేసేవారు. వీరు వాస్తవంగా యిష్టంవచ్చినపుడు తీసివేయడానికి వీలయిన కౌలుదార్లుగా పని చేసేవారు. చట్టవిరుద్ధమైన బకాయిలూ - సెస్సులు చెల్లించ వలసిందిగా ఒత్తిడి పెట్టేవారు. వీరు, వెట్టి చాకిరికూడా చేయవలసి వచ్చేది. ఇంకా ముఖ్యమైన విషయమేమిటంటే, రెవిన్యూ పద్ధతి పేరు, స్వభావం ఏదైనప్పటికి, క్రియలో, ప్రభుత్వం, భూకామందు స్థానాన్ని ఆక్రమించేది. కొద్ది సంవత్సరాల తర్వాత ముఖ్యంగా, 1901 సంవత్సరం తర్వాత, రెవెన్యూ రేట్లను క్రమేపీ తగ్గించారు. అయితే, అప్పటికి వ్యవసాయ వ్యవస్థ ఎంత నాశనమయిందంటే, భూకామందులూ, డబ్బు అప్పులిచ్చేవాళ్ళు, వర్తకులు, గ్రామాలలో బాగా స్థిరపడి పోయారు; కర్షక రైతులకు వాస్తవంగా ఎటువంటి ప్రయోజనమూ లేకపోయింది.

భారత వ్యవసాయ వ్యవస్థ విషయంలో బ్రిటిష్ విధానాలవల్ల తలఎత్తిన గొప్పచెడుగు ఏమిటంటే వడ్డీలవారు, దేశంలో పలుకుబడిగల ఆర్థిక – రాజకీయ శక్తిగా రూపొందారు. ఎక్కువ రెవెన్యూరేట్లు చెల్లించాలని కోరడంవల్లా, కఠినమైన వసూళ్ళ పద్ధతివల్ల, కర్షక రైతులు, పన్నులు చెల్లించడంకోసం, డబ్బు, అప్పుతీసుకోవలసి వచ్చేది. పంటలు సిద్ధంగా వున్నప్పుడు, విపరీతమైన వడ్డీ చెల్లించడమేకాక, పంటలను చౌకగా అమ్మ వలసి వచ్చేది. కర్షకుల పేదరికంవల్ల, అనావృష్టి వరదలు, క్షామాలు ఏర్పడినపుడు, అప్పులవాళ్ళదగ్గరికి వెళ్లక తప్పేదికాదు. కాగా అప్పులవాళ్ళు నూతన న్యాయ వ్యవస్థనూ, పాలనా యంత్రాంగాన్నీ తమకు అనుకూలంగా మార్చుకునేవాడు. ఈ విషయంలో ప్రభుత్వం, వాస్తవంగా వీరికి తోడ్పడేది. ఎందువల్లనంటే, వీరులేకపోయి నట్లయితే భూమి శిస్తులను సకాలంలో వసూలు చేయడానికి వీలులేదు; వ్యవసాయోత్పత్తు లను ఎగుమతికోసం రేవులకు తీసుకురావడానికి వీలులేదు. వాణిజ్య పంటలను ఎగుమతి చేసేటట్టు చేయడానికికూడా, ప్రభుత్వం వడ్డీవ్యాపారులమీద ఆధారపడేది. కర్షకులకు పెట్టుబడి పెడతామని వడ్డీవ్యాపారులు ఆశపెట్టే వారు. అందువల్ల, అనతికాలంలో వడ్డీ వ్యాపారులు గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో అతిముఖ్య స్థానాన్ని ఆక్రమించారు అంటే అందులో ఆశ్చర్యం లేదు. జమీందారీ, రైతువారి ప్రాంతాలు రెండింటిలోకూడా, వాస్తవంగా భూమి దున్నేవారి చేతుల్లోనుంచి, భూమిని, వడ్డీవ్యాపారులకూ, వర్తకులకూ, అధికారులకూ, ధనిక కర్షకులకూ బదలాయించడం జరిగింది. ఇది, భూపెత్తందారీ వ్యవ స్థకు దారితీసింది. దేశమంతటా భూముల సంబంధాలలోయిది ఒక ముఖ్య లక్షణమయింది.

కౌలు వసూలుచేసే మధ్యవర్తులుకూడా ఎక్కువయ్యారు. వీరిని దళారులు అవి అంటూ వుండేవారు. నూతన భూకామందులకూ – జమీందార్లకూ, భూమితో, పాత

జమీందార్లకన్నా తక్కువ సంబంధాలు వుండేవి. కౌలు వసూలుచేసే, యంత్రాంగాన్ని నియమించడానికి బదులు తమ తరపున శిస్తు వసూలుచేసే మధ్యవర్తులకు కొన్ని హక్కులు ఇచ్చారు.

బ్రిటిష్ పరిపాలన ప్రభావం, ఈవిధంగా వ్యవసాయ సంబంధాలలో నూతన స్వరూపం తలఎత్తడానికి దారితీసింది; ఇది అభివృద్ధి నిరోధకంగా వుండేది. ఈ కొత్త పద్ధతి. వ్యవసాయాభి వృద్ధిని అనుమతించేదికాదు. సమాజంలో, పైన, అట్టడుగునకూడ, నూతన సాంఘిక వర్గాలు తలఎత్తాయి. పైన, భూకామందులూ, మధ్యవర్తులూ, వడ్డీ వ్యాపారస్తులూ. అట్టడుగున హక్కులులేని కౌలుదార్లు, పంటల వాటాదార్లు, వ్యవసాయ కూలీలు తయారయ్యారు. ఈ కొత్త పద్ధతి, కేపిటలిజమూకాదు; ఫ్యూడలిజమూకాదు; ప్రాచీన మొఘల్ పద్ధతిని కొనసాగించడమూకాదు. వలసతత్వం రూపొందించిన కొత్త స్వరూపమిది. న్యాయమూర్తి రనడె, జవహర్‌లాల్ నెహ్రూ, ఆర్. పామేదత్ వంటి అనేకమంది రచయితలు, దీనిని, మధ్యయుగపు పెత్తందారీ — వలసతత్వ విధానంగా వర్ణించారు.

వీటన్నిటివల్ల దురదృష్ట కరమైన ఫలితమేమిటంటే వ్యవసాయ పద్ధతులను మెరుగు పరచడానికిగానీ, అధిక ఆహారోత్పత్తికి దానిని ఆధునిక పద్ధతుల ప్రకారం వృద్ధిచేయడానికి గానీ. ఎటువంటి కృషి జరగకపోవడం. వ్యవసాయ పద్ధతుల్లో ఎటువంటి మార్పులేదు. మెరుగయిన పనిముట్లనూ, మంచి విత్తనాలనూ, వివిధరకాల ఎరువులనూ, ఉపయోగించడమనేది ప్రవేశ పెట్టనేలేదు. నిరుపేదలయిన వ్యవసాయ కర్షకులకు, వ్యవసాయాన్ని మెరుగుపరిచే సాధన సంపత్తులులేవు; దీనిని మెరుగు పరచాలన్న ఉత్సాహం భూకామందులకులేదు; పోతే వలసప్రభుత్వం, నిజమైన భూకామందు మోస్తరుగా ప్రవర్తించింది. ఎక్కువ పన్నులను వసూలు చేయడంలో మాత్రమే దీనికి శ్రద్ధవుండేది; భారత వ్యవసాయాన్ని ఆధునికంచేసి, మెరుగుపరిచి, అభివృద్ధి పరచడానికి యిది ఎటువంటి చర్యలు తీసుకోలేదు.

దీని ఫలితంగా వ్యవసాయోత్పత్తిలో చాలాకాలం వరకూ స్తబ్దత ఏర్పడింది. 20వ శతాబ్దానికి సంబంధించిన వ్యవసాయసంఖ్య వివరాలు మాత్రమే అందుబాటులో వున్నాయి. పరిస్థితి ఎంత దిగజారిపోయిందో వీటినిచూస్తే తెలుస్తుంది. 1901—1939 మధ్య కాలంలో, తల ఒక్కింటికీ వ్యవసాయోత్పత్తి 14శాతం పడిపోగా, తల ఒక్కింటికీ ఆహారధాన్యాల ఉత్పత్తి 24శాతానికి పైగా పడిపోయింది. 1918 తర్వాత యివి బాగా పడిపోయాయి.

## వర్తక - పరిశ్రమలపై ప్రభావము

వ్యవసాయం మోస్తరుగానే, బ్రిటిష్ భారత ప్రభుత్వం, తమ బ్రిటిష్ ప్రయోజనాలను ప్రోత్సహించాలనే ఉద్దేశ్యంతోనే వర్తక – పరిశ్రమలను కంట్రోలు చేసింది. వలసతత్వం ప్రభావంక్రింద, భారతదేశంలో వాణిజ్య విప్లవం జరిగింది. ఇది, భారత దేశాన్ని, ప్రపంచ మార్కెట్‌తో సంఘటితం చేసింది ; అయినప్పటికీ, భారతదేశం తక్కువస్థానాన్ని ఆక్రమించ వలసివచ్చింది. విదేశ వర్తకం, ముఖ్యంగా, 1858 తర్వాత పెద్ద ముందడుగు వేసింది ; 1834లో 15కోట్ల రూపాయలనుంచి, 1858లో 60కోట్ల రూపాయలకూ, 1899లో 213 కోట్ల రూపాయలకూ పెరిగింది. 1924లో 758కోట్ల అత్యున్నత స్థాయినందుకుంది. అయితే ఈ పెరుగుదల భారత ఆర్థిక వ్యవస్థలో అనుకూల లక్షణాన్ని సూచించనూలేదు. భారత ప్రజల సంక్షేమానికీ దోహదము కాలేదు. దీనికి కారణం, భారత ఆర్థిక వ్యవస్థను వలస వ్యవస్థగా, ప్రపంచ పెట్టుబడిదారి వ్యవస్థమీద ఆధారపడే వ్యవస్థగా చేయడానికి దీనిని ముఖ్య సాధనంగా ఉపయోగించడమే. భారత విదేశ వర్తకం పెరుగుదల సహజమయినదికాదు, సాధారణ మయినదికాదు. సామ్రాజ్యవాదానికి తోడ్పడటానికీ, దీనిని కృత్రిమంగా ప్రోత్సహించారు. విదేశ వర్తక స్వరూపమూ—స్వభావమూ సమతూకంలో వుండేవి కాదు. బ్రిటన్‌నుంచి ఉత్పత్తి అయిన సరుకులతో దేశాన్ని ముంచివేశారు ; బ్రిటన్‌కీ యితర విదేశాలకూ అవసరమయిన ముడిసరుకులను ఉత్పత్తిచేసి, ఎగుమతిచేసేటట్టు చేశారు.

ఇహ విదేశ వర్తకం, అంతరంగిక ఆదాయ పంపిణీకి విఘాతం కలిగించింది. బ్రిటిష్ విధానం, సాధన సంపత్తులను కర్షకులు, వృత్తి పనివారినుంచి, వర్తకులు, వడ్డీ వ్యాపారులు, విదేశ పెట్టుబడి దార్లకు బదలాయించడానికి మాత్రమే తోడ్పడింది.

ఈ కాలంలో, భారత విదేశ వర్తకంలో ముఖ్యమయిన విశేషమేమిటంటే, దిగుమతులకన్నా, ఎగుమతులు, ఎల్లప్పుడు ఎక్కువగా వుండేవి. అయితే, యిది భారత దేశానికి లాభదాయకమని మనం అనుకోకూడదు. ఈ ఎగుమతులు భారత విదేశవర్తక వాణిజ్య శేషాన్ని సూచించవు ; భారతదేశపు సంపద, సాధన సంపత్తుల తరుగుదలను మాత్రమే సూచిస్తాయి. విదేశ వర్తకంలో ఎక్కువభాగం, విదేశీయుల చేతుల్లో వుండేది; దాదాపు యిదంతా విదేశ నౌకలద్వారా జరిగేది.

బ్రిటిష్ పాలనవల్ల కలిగిన అతిముఖ్య ఫలితాలలో ఒకటి ; పట్టణ, గ్రామప్రాంతాల హస్తకళా పరిశ్రమలు, క్రమేపీ క్షీణించి, సర్వనాశనం కావడం. భారతదేశం, ఆసియా-

యూరోప్‌లలో విదేశ మార్కెట్లను కోల్పోవడమేకాక, భారతీయ మార్కెట్లను, చౌక అయిన యంత్ర తయారీ సరుకులతో దండిగా ముంచివేశారు. ఆ తర్వాత స్వదేశీ హస్తకళలు పడిపోయాయి.

స్వదేశీ పరిశ్రమలు నాశనమయి, యితర ఉపాధి అవకాశాలు లేకపోడంవల్ల కోట్లాది మంది వృత్తిపనివారు, వ్యవసాయానికి పూనుకోవలసి వచ్చింది. ఈ విధంగా, జనాభా, భూమిమీద ఆధారపడటం ఎక్కువయింది.

## ఆధునిక పరిశ్రమల అభివృద్ధి

బ్రిటిష్‌పాలన, ఆధునిక పెట్టుబడిదారి పరిశ్రమలు తలఎత్తడానికి అవసరమయిన పరిస్థితులను కల్పించింది. దేశవిస్తృత రవాణా పద్ధతిని నెలకొల్పడంద్వారా అఖిల భారత మార్కెట్‌ని ఏర్పాటు చేసింది. భారతదేశంలో గ్రామీణ పరిశ్రమలకూ-వ్యవసాయానికి మధ్య అనాదినుంచి సన్నిహిత సంబంధం వుండేది. అయితే హస్తకళా పరిశ్రమలతోసహా గ్రామీణ గృహ పరిశ్రమల ఉత్పత్తి పద్ధతి నాశనం కావడమోలేక పూర్తిగా విచ్ఛిన్నం కావడంవల్ల, గ్రామీణ పరిశ్రమలకూ – వ్యవసాయానికీ మధ్య సంబంధం తెగిపోయింది. లక్షలాదిమంది హస్తకళా నిపుణులు నిరుద్యోగు లయ్యారు. కొత్త రెవెన్యూ పద్ధతి, తమభూములను లక్షలాది కర్షకులకు దక్కకుండా చేసింది, ఈ రెండు కారణాలవల్ల స్వేచ్ఛా శ్రామిక వర్గమొకటి అవతరించింది. ఈ కార్మికులు, కూలిచేసుకుని, దినసరి వేతనాలు తెచ్చుకొని బ్రతకడం మినహా, మరోగత్యంతరంలేదు. ఈ విధంగా ఆధునిక పెట్టుబడి పరిశ్రమ తలఎత్తడానికి అవసరమైన ముఖ్య అవసరాలు రెండింటిని ; అంటే అఖిలభారత మార్కెట్‌నీ, చౌకగా మస్తయిన కార్మికులనూ సాధించడం జరిగింది. 19వ శతాబ్దం రెండో అర్ధభాగంలో ఆధునిక పరిశ్రమలు ఏర్పాటు కావడం ప్రారంభమైంది.

20 వ శతాబ్దం ప్రారంభంవరకూ, భారతదేశంలో పారిశ్రామిక అభివృద్ధి ముఖ్యంగా నాలుగు పరిశ్రమలకు మాత్రమే – అంటే ప్రత్తి, జనపనార ఉత్పత్తులు, బొగ్గుఉత్పత్తి, తేయాకు తోటలకుమాత్రమే పరిమితమయి వుండేది. మరికొన్ని, ప్రత్తివిత్తనాలు తీయడం బేళ్లుకట్టడం, బియ్యం, పిండి, కలపమిల్లులు, తోళ్ళు శుభ్రపరచడం, ఉన్నివస్త్రాలు, కాగితం, పంచదార మిల్లులు, ఉప్పు, అభ్రకం, పెట్రోలియం, ఇనుపగనులువంటి చిన్న పరిశ్రమలను అభివృద్ధి చేశారు. కొన్ని ఇంజనీరింగు రైల్వేకార్ఖానాలు, ఇనుము–రాగి పోత పరిశ్రమలుకూడా ఏర్పాటయ్యాయి.

ఈ యదార్థాలబట్టి, పారిశ్రామిక విప్లవానికి పునాదులు వేయబడ్డాయని మనం అనుకో కూడదు. అంతేకాకుండా అభివృద్ధి చెందిన అనేక ఆధునిక పరిశ్రమలను విదేశ పెట్టు బడిదారులు కంట్రోలు చేసేవారు. రెండోది: ఈ ఘట్టంలో పారిశ్రామిక ప్రగతి నిలకడగా, తెంపులేకుండా జరిగినప్పటికీ అది, మందకొడిగా వుండేది. దేశం విశాలత జనాభాతో పోల్చిచూసినట్టయితే, పారిశ్రామికవంతం చేయడానికి జరిగినకృషి అతి స్వల్ప మైనది; అసలు, పారిశ్రామికవంతం అన్న పదాన్ని ఉపయోగించడం కూడా సబబు కాదు, 1913 నాటికి కూడా ఫ్యాక్టరి చట్టంక్రిందికి వచ్చిన కార్మికులసంఖ్య 10 లక్షల మందికి తక్కువగా వుండేది.

మొదటి ప్రపంచ యుద్ధమూ, 1930 సంవత్సరాలలో ఏర్పడిన మాంద్యమూ, భారత పెట్టుబడిదారి వర్గం మొట్టమొదటిసారిగా, తాత్కాలికంగా ముందుకు వెళ్ళడానికి అవసరమైన అవకాశాన్ని కలిగించాయి. విదేశదిగుమతిదార్లనుంచి పోటీలేదు; ప్రభుత్వం భారత పారిశ్రామికవేత్తలు, వర్తకులు, కాంట్రాక్టర్లకు పెద్దపెద్ద ఆర్డర్లు యివ్వవలసిన పరిస్థితిఏర్పడింది. అయితే భారత పెట్టుబడిదారులు ఈ కాలంలో విపరీతమైన లాభాలు ఆర్జించినప్పటికీ, యుద్ధం అంతమయి, విదేశీయులపోటీ మళ్ళీ ప్రారంభంకావడంవల్ల, పరిశ్రమలు మళ్ళీస్తబ్దంగా వుండిపోవలసి వచ్చింది.

1947 వరకు, భారత దేశంలో పారిశ్రామికాభివృద్ధి, మందకొడిగా ఎదుగు, బొదుగు లేకుండాజరిగింది. పారిశ్రామిక విప్లవం ప్రారంభమయిన సూచనగానీ, ప్రారంభమయ్యే సూచనలుగానీ కనుపించలేదు. ఇంతాముఖ్యమయిన విషయమేమిటంటే, పరిమిత అభివృద్ధికూడా స్వతంత్రంగా జరగలేదు. విదేశపెట్టుబడి అదుపుక్రింద యిది వుండేది. రెండోది: పారిశ్రామికస్వరూపం ఎలావుండేదంటే, యిదిఏమాత్రం అభివృద్ధి కావాలన్నా బ్రిటన్‌మీద ఆధారపడవలసిందే. భారీపెట్టుబడిసరుకులు, రసాయనిక పరిశ్రమలు లేనేలేవు. ఇవిలేకుండా శీఘ్రగతిలో, స్వతంత్రమైన పారిశ్రామిక అభివృద్ధి అనేదిజరగదు. యంత్రపరికరాలు, ఇంజనీరింగ్, లోహపరిశ్రమలు అనేవి లేనేలేవు. అంతేకాకుండా, భారత దేశం, సాంకేతికరంగంలో, పూర్తిగా సామ్రాజ్యవాద దేశాలమీద ఆధారపడివుండేది. ఈదేశంలో సాంకేతిక పరిశోధన అనేది జరగనేలేదు.

మొత్తంమీద చెప్పాలంటే భారత దేశంలో వాణిజ్యరంగం మార్పు చెందిందికాని పారిశ్రామిక విప్లవం జరగలేదు. అసలు పోకడ, స్వతంత్ర పారిశ్రామిక పెట్టుబడిదారి ఆర్థిక వ్యవస్థవైపు కాక, పరాధీన అభివృద్ధి చెందని వలస ఆర్థిక వ్యవస్థ వైపు మొగ్గు చూపింది. బ్రిటిష్ పాలన క్రింద భారత పారిశ్రామిక ప్రగతిలో మరొక వ్యతిరేక అంశంకూడా వుంది. పరిశ్రమలు అన్నిచోట్ల సమానంగా కాక కొన్ని ప్రాంతాలలో,

పట్టణాలలో మాత్రమే, కేంద్రీకృతమై వుండేవి. ఆఖరికి సేద్యపునీరు, విద్యుచ్ఛక్తి సౌకర్యాలు కూడా, సమానంగా ఏర్పాటు కాలేదు. దీనివల్ల ఆదాయాలలోనూ, ఆర్థికాభి వృద్ధిలోనూ సాంఘిక వర్గాలలోనూ అసమానతలు ఏర్పడ్డాయి.

భారత దేశంలో బ్రిటిష్ పాలనవల్ల ముఖ్యంగా కలిగిన ఫలితమేమిటంటే, మామూలు కాలంలో జీవనభృతి స్థాయికన్నా తక్కువస్థాయిలో బ్రతుకుతూవున్న అనేకమంది ప్రజలు, నిరుపేదలుగా తయారయ్యారు. అనావృష్టి వరదలు ఏర్పడినపుడు లక్షలాది మంది మరణించేవారు. తలసరి ఆదాయం అతి తక్కువగా వుండేది; నిరుద్యోగం పెచ్చుపెరిగి పోయింది. 1880లో దాదాభాయి నౌరోజీ. భారతీయుని సగటు ఆదాయంకన్నా, జైలులోవున్న నేరస్తునికి దాదాపు 50 శాతం ఎక్కువ ఖర్చుచేసే వారనితెలియజేశారు. ఈ పేదరికంవల్ల, ఆరోగ్యం క్షీణించింది. ఆయుర్దాయం తగ్గింది శిశు మరణాలు ఎక్కువయ్యాయి, 19వ శతాబ్దం రెండో అర్థభాగంలో దేశమంతటా ఏర్పడిన క్షామ పరం పరవల్ల ప్రజల పేదరికం యింకా ప్రస్ఫుట మయింది. 1860 మొదలు 1908 వరకూ 20 ఏళ్ళు క్షామాలు ఏర్పడ్డాయి. 1854 మొదలు 1901 వరకూ క్షామాలలో దాదాపు 2 కోట్ల 90 లక్షలమంది మరణించినట్టు అంచనా. ఈ క్షామాలబట్టి. పేదరికమూ, ఆకలి ఆర్తనాదాలు వలస భారతిదేశంలో శాశ్వతంగా ఏర్పడి పోయినట్టు స్పష్టమయింది.

భారతదేశపు పేదరికానికి భౌగోళిక పరిస్థితులుగానీ, సహజ సంపదలు లేకపోవడం గానీ, స్వతహ ప్రజల స్వభావంలోనూ, శక్తి స్థోమతలలోనూ కొన్ని లోపాలుండటం కానీ కారణాలుకావు. సరికదా మొఘల్‌కాలం అవశేషంవల్లగానీ బ్రిటిష్‌వారికి ముందు గతచరిత్ర వల్లగానీ సంభవించినదికాదు. గత రెండు శతాబ్దాల చరిత్రవల్ల యిది ఏర్పడింది. దీనికిముందు భారతదేశం, శతాబ్దాల తరబడివెనుక బడివున్న పశ్చిమ యూరోప్‌కన్నా వెనుకబడిలేదు. అప్పట్లో ప్రపంచదేశాలమధ్య జీవనప్రమాణాలలో హెచ్చుతగ్గులు మరీ ఎక్కువగాలేవు. సరిగ్గాయిదేకాలంలో, పశ్చిమదేశాలు అభివృద్ధిచెంది, సౌభాగ్యవంత మయ్యాయి; భారతదేశం ఆధునికవలస తత్వానికిలోనయింది; అభివృద్ధి చెందకుండా అరికట్టబడింది. ఈనాడు అభివృద్ధిచెందిన దేశాలన్నీ బ్రిటన్, భారతదేశాన్ని పరిపాలిస్తూ వున్నకాలంలో అభివృద్ధి చెందాయి; వీటిలో ఎక్కువ 1850 తర్వాత అభివృద్ధి చెందాయి. 1750 వరకూ ప్రపంచంతో వివిధ ప్రాంతాలమధ్యా జీవనప్రమాణాలలోహెచ్చుతగ్గులు అంతఎక్కువగాలేవు. ఈసందర్భంలో, బ్రిటన్‌లో పారిశ్రామిక విప్లవం ప్రారంభం, బెంగాల్‌ని బ్రిటన్ జయించడం, ఒకేసారి జరగడం గమనించవలసిన విషయం.

బ్రిటన్‌లో పారిశ్రామిక అభివృద్ధి, సాంఘిక, సాంస్కృతిక ప్రగతికి కారణాలయిన సాంఘిక, రాజకీయ, ఆర్థిక పద్ధతులే, ఆర్థికాభివృద్ధిని కలిగించి, కొనసాగించి భారత దేశంలో సాంఘిక, సాంస్కృతిక వెనుకబడిన తనాన్నికూడా కలిగించాయన్నది, అసలు యదార్థం. దీనికి కారణాలు విదితమే. భారత ఆర్థిక వ్యవస్థను, బ్రిటన్, తన ఆర్థిక వ్యవస్థకు లోనుగా వుండేటట్టు చేసుకుంది; తన అవసరాలకు తగినట్టుగా భారత దేశంలో మూలసాంఘిక పోకడలను నిర్ణయించింది. దీనిఫలితంగా భారత వ్యవసాయం—పరిశ్రమల్లో స్తబ్దత ఏర్పడింది; కర్షకులనూ, కార్మికులనూ, జమీందార్లు భూకామందులు, సంస్థానాధిపతులు, వడ్డీవ్యాపారులు, వర్తకులు, పెట్టుబడిదారులు, విదేశప్రభుత్వమూ, దాని అధికారులు పీడించుకుతిన్నారు; పేదరికం, వ్యాధులు, ఆకలి బాధలు వ్యాప్తిచెందాయి.

## సాంస్కృతిక - సాంఘిక రంగాలలో ప్రభావం

బ్రిటిష్ పాలనతోపాటు పశ్చిమదేశాలతో సంబంధంకూడా ఏర్పడింది. పశ్చిమ యూరోప్‌లో మొట్టమొదట బయలుదేరిన ఆధునిక భావాలు, భారత దేశానికికూడా వ్యాపించాయి. ఒకవేళ బ్రిటన్ భారత దేశానికివచ్చి వుండకపోయినా 18, 19శతాబ్దాలలో పశ్చిమదేశాలలో జరుగుతూవున్న మార్పులతో ఈదేశం సంబంధం లేకుండా ఉండి ఉండేదికాదు. ఇతరదేశాలతో మనకేమీ సంబంధంలేదు అన్న విధానాన్ని భారతదేశం ఎన్నడు అవలంబించలేదు. కాబట్టి, మార్పులు మనదేశానికి తప్పకుండా వచ్చివుండేవి. అనేక శతాబ్దాలతరబడి వర్తకం పర్యటనలద్వారా, భారతదేశం, ఆసియా దేశాలలో మాత్రమేకాక, యూరోప్‌తోకూడా కమ్యూనికేషన్ సంబంధాలను ఏర్పాటు చేసుకుంది. ఈసంబంధాల ద్వారా, యూరోప్‌లోనూ, యితరచోట్ల, కొత్తసంఘటనలు, విషయాల గురించిన సమాచారం, పశ్చిమదేశాలలో ప్రబలిన నూతనభావాల సమాచారమూ, 18వ శతాబ్దంలో భారతదేశానికి అందుతూ వుండేవి. అయితే, యిది, చాలాకాలంవరకూ, అతిమెల్లిగా జరుగుతూవుండేది. బ్రిటిష్‌పాలన భారతదేశంలోకి యివిరావడం వేగిరపరచడమే కాక, విదేశ ఆధిపత్యమనేది ఈప్రభావాలను స్థానిక పరిస్థితులకు అనుగుణంగా వేగిరమే అర్థయుక్తంగా అమలుజరిగేటట్టు చేసింది.

ప్రజాస్వామ్యం, ప్రజలసర్వం సహాధికారం, హేతువాదం, మానవత అన్న భావాల ప్రభావంక్రింద, భారతప్రజల మేధాజీవితంలో విప్లవాత్మకమైన మార్పులురావడం మొదలు పెట్టాయి. ఈ కొత్త భావాలు, తమసమాజం, ఆర్థిక వ్యవస, ప్రభుత్వమూ పట్ల విమర్శ

నాత్మకదృష్టితో చూడటానికి భారతీయులకు తోడ్పడటమేకాక, భారతదేశంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదం వాస్తవస్వరూపాన్ని అర్థం చేసుకోవడానికి కూడా తోడ్పడ్డాయి.

ఆధునిక భావాలు, అనేక మార్గాలద్వారా వ్యాప్తిచెందాయి. రాజకీయపార్టీలు, పత్రికలు, కరపత్రాలు, బహిరంగ సమావేశాలద్వారా యివి వ్యాపించాయి. 1813 తర్వాత ప్రభుత్వము, భారతదేశంలో ప్రవేశపెట్టిన ఆధునిక విద్యావ్యాప్తికి, మిషనరీలు, కొంత మంది భారతీయుల కృషికూడా అతిముఖ్యపాత్ర నిర్వహించాయి, అయితే ఈపాత్ర, అతిక్లిష్టమయినది; ఎన్నో వైరుధ్యాలతో నిండుకొన్నది.

ఉదాహరణకు; ఆధునిక విద్యావ్యాప్తి పరిమితమైనది. నాశనమైన సంప్రదాయ సిద్ధ మయిన విద్యావిధానం స్థానే ప్రత్యామ్నాయ పద్ధతిని దాదాపు వంద సంవత్సరాలకు కూడా ప్రవేశపెట్టలేక పోయింది. ప్రయిమరీ పాఠశాలవిద్యపట్ల విదేశప్రభుత్వం, ఉదాసీనత కనబరచటమేకాక, 1858 తర్వాత ఉన్నతవిద్యపట్ల శతృభావాన్ని ప్రదర్శించింది. విద్యావంతులయిన భారతీయులు అనేకమంది, తాము యిటీవల సంపాదించుకున్న ఆధునిక విజ్ఞానాన్ని బ్రిటిష్‌పాలన సామ్రాజ్యవాద, పీడితస్వభావాన్ని విమర్శించి, సామ్రాజ్యవాద వ్యతిరేక రాజకీయ ఉద్యమాన్ని ఏర్పాటుచేయడానికి ఉపయోగించడంతో, బ్రిటిష్ పాలకులు, ఉన్నతవిద్యను తగ్గించే కఠిన చర్యలు తీసుకోవడం ప్రారంభించారు. ఉన్నతవిద్యా పెరుగుదలను అరికట్టడానికి ప్రభుత్వం తీసుకున్నచర్యలు విఫలమయ్యాయి: ఎందువల్లనంటే, ఒకసారి ప్రారంభించిన తర్వాత, విద్యాప్రమాణాలు తగ్గిపోతూ వచ్చినప్పటికీ, ప్రజల ఒత్తిడివల్ల యిది ముందుకుసాగడం ప్రారంభించింది.

విద్యాపద్ధతి, జాతీయతాభావాన్ని ప్రోత్సహించడానికి ఒకసాధనంగా ఉపయోగ పడింది. అంటే, భౌతిక – సాంఘికశాస్త్రాలలోనూ, మానవశాస్త్రాలలోనూ మౌలిక సారస్వతాన్ని సరాసరి ప్రజలకు అందజేయడంద్వారా సాంఘిక వివరణలను తెలుసుకునే శక్తిసామర్థ్యతలను వారిలో ప్రోత్సహించింది. లేకపోయినట్టయితే, దీనిస్వరూపము, పద్ధతి, లక్ష్యాలు, విధానాలు, పాఠ్యఅంశాలు, అర్థాలు, – యివన్నీ వలసతత్వాన్ని ప్రోత్సహించడానికి ఉద్దేశించినవే.

వలస స్వభావం వల్ల, భారతవిద్యా విధానాలలో తలఎత్తిన మరికొన్ని అంశాలను కూడా గమనించవలసి వుంది. వీటిలోఒకటి ఆధునిక పరిశ్రమల స్థాపనకు, అభివృద్ధికి ప్రాథమిక అవసరమయిన ఆధునిక సాంకేతికవిద్యను పూర్తిగా అలక్ష్యం చేయడం. మరొకటి, భారతీయ భాషల స్థానంలో ఇంగ్లీషుకు, బోధనాభాషగా అధికప్రాధాన్యం యివ్వడం. ఇది, సామాన్య ప్రజానీకం విద్యావంతులు కాకుండా అరికట్టడమేకాక, విద్యావంతులకూ – సామాన్య ప్రజానీకానికి మధ్యభాష, సాంస్కృ

తిక అగాధాన్ని ఏర్పరిచింది. విద్యకు తగిన నిధులను కేటాయించడానికి ప్రభుత్వం నిరాకరించడంవల్ల, విద్యాప్రమాణాలు క్రమేపీ బాగాపడిపోయాయి. పాఠశాలల్లోనూ, కళాశాలల్లోనూ, విద్యార్థులు జీతాలు చెల్లించవలసి వున్నందున, విద్య, మధ్యతరగతి, పైతరగతి నగర–పట్టణ ప్రజలకుమాత్రమే అందుబాటులో వుండేది.

నూతన భావాలు, నూతన ఆర్థిక రాజకీయ జీవితం, బ్రిటిష్ పాలన, భారతప్రజల సాంఘిక జీవితంమీద గొప్ప ప్రభావాన్ని కలిగించింది. ఇది మొదట పట్టణ ప్రాంతాలలో కనుపించి, ఆతర్వాత గ్రామాలకు వ్యాపించింది. ఆధునిక పరిశ్రమలు, నూతన రవాణా సాధనాలు, పట్నవాసం పెరిగిపోవడం, ఫ్యాక్టరీలు, ఆఫీసులు, ఆస్పత్రులు, పాఠశాలల్లో మహిళలకు ఉద్యోగాలు పెరగడం, సాంఘిక మార్పును ప్రోత్సహించాయి. సాంఘిక వివక్షతలు, కులవిచక్షణలు అంతమయ్యాయి. పాత భూములు, గ్రామీణ సంబంధాలు పూర్తిగా విచ్ఛిన్నం కావడంతో, గ్రామప్రాంతాలలో కులాల బలాబలాలు తారుమారయ్యాయి. అనేక చెడుగులు అంతంకాక పోయినప్పటికి పెట్టుబడిదారి విధానం. సాంఘికహోదా, ముఖ్యంగా డబ్బుమీద ఆధారపడేటట్టు చేసింది; లాభాలు ఆర్జించడం అతిముఖ్యమయిన సాంఘిక కార్యకలాప మయింది.

ఆదిలో, వలసప్రభుత్వ విధానాలు సాంఘిక సంస్కరణలనుకూడా ప్రోత్సహించాయి. దేశంలో ఆర్థికంగా స్థిరపడిపోయి, బ్రిటిష్ పాలనను పటిష్టం చేయడంకోసం, భారతసమాజాన్ని ఆధునికం చేయడానికి కృషిజరిగింది. భారత కుల పద్ధతుల్లోవున్న సాంఘిక దురన్యాయాలవల్లా, సమాజంలో మహిళలకున్న తక్కువహోదావల్లా, కొంతమంది అధికారులలో కలిగిన మానవతా భావాలుకూడా ముఖ్యపాత్ర నిర్వహించాయి. ఈ ఘట్టంలో భారతసమాజాన్ని సంస్కరించడానికి క్రైస్తవ మిషనరీలుకూడా దోహదమయారు. కాని శీఘ్రగతిలో వలసతత్వపు పాతభావాలు, దీర్ఘకాలప్రయోజనాలు తీవ్రరూపం ధరించి, సాంఘిక సంస్కరణలపట్ల వలస విధానాలను మార్చివేశాయి. అందువల్ల బ్రిటిష్వారు సంస్కరణలను బలపరచడం మానివేశారు; సమాజంలో ఆచారాలు నిష్టలలో నమ్మక మున్నవారినీ, సనాతనులనూ బలపరచడం మొదలుపెట్టారు.

అయితే బ్రిటిష్వారు అనుసరించిన సాంఘిక విధానం, సమాధాన పరిచేదిగా లేదు. పెరిగిపోతోన్న జాతీయతాభావం సవాలును ఎదుర్కోవడానికి, పరిపాలకులు, విభజించి పరిపాలించు అన్న విధానాన్ని అనుసరించారు. కుల– మత తత్వాన్ని ప్రోత్సహించడం వల్ల, అభివృద్ధి నిరోధక సాంఘిక శక్తులను బలపరచినట్టయింది.

ప్రజలలో కలిగిన నూతన మేధాభావాలు. రాజకీయ భావాలు కూడా సాంఘిక మార్పులకు దారితీశాయి. అయితే దళిత జాతులు, మహిళలు తమ అధోగతిని గుర్తించి సమాజాన్ని సరిదిద్దడానికి సమరం ప్రారంభించడంతో, సాంఘిక మార్పుకి శక్తివంతమైన శక్తులు తలఎత్తాయి. జ్యోతిబాపూలవంటి వ్యక్తుల నాయకత్వాన దళిత జాతులు 19 వ శతాబ్దం చివరినుంచి శక్తి వంతమైన ఉద్యమాలను ప్రారంభించారు. ఇదే మోస్తరుగా దక్షిణ భారత దేశంలోని కేరళలోనూ మిగతా ప్రాంతాల్లోనూ తక్కువ జాతులవారు 1920-1930 సంవత్సరాలలో, ఉన్నతజాతుల సాంఘిక-ఆర్థిక దమన విధానాలకు వ్యతిరేకంగా ఒక ఉద్యమాన్ని ప్రారంభించారు. మహిళలు ఆదిమ వాసులుకూడా తమ హక్కుల పరిరక్షణకోసం పోరాటం ప్రారంభించారు. సామ్రాజ్యవాద వ్యతిరేక సమరంలో ప్రజల అండదండలను సంపాదించడం కోసం, జాతీయ ఉద్యమం, కులం - మతం - స్త్రీ- పురుష విభేదం ప్రాతిపదికగా వున్న తర తమాల నన్నింటినీ రద్దుచేయడానికి పూనుకుంది. అంతేకాకుండా, ప్రదర్శనలు,బహిరంగ సమావేశాలు, ప్రజాఉద్యమాలు, ట్రేడ్ యూనియన్లు, కిసాన్ సభలు మొదలయినవాటిలో ఉమ్మడిగా పాల్గొనడంవల్ల, కులతత్వ భావాలు బలహీనమయి, ఆధిక్యత సంపాదించాడు.

భారతీయ సంస్కృతి ఆధునికంకావడంలో మరో ముఖ్య విశేషముంది. భారత సమాజంలో సనాతనులు, సాంఘిక అభివృద్ధి నిరోధక వర్గాలు, తమ సాంఘిక, సాంస్కృతిక స్థానానికి ముప్పు ఏర్పడటంవల్ల, ఆధునిక సంస్కృతి ప్రవేశాన్ని ప్రతిఘటించగా, భారత ప్రజల్లో, మధ్యతరగతి, పైతరగతి వర్గాలుకొన్ని, దీనికి భిన్నమైన పోకడకు లోనయ్యాయి. తమకుగల అనుకూలత, మానవత, శాస్త్రీయ లక్షణాలను జాగ్రత్తగా ఆకళింపు చేసుకోవడానికి బదులు, వీరు, గ్రుడ్డిగా పశ్చిమ దేశాల జీవితాన్ని, సంస్కృతినీ, అనుకరించారు. ఆధునికత్వము అంటే, వైఖరి, భావన, విలువలకు సంబంధించినదని తెలుసుకోలేక. మాట్లాడేపద్ధతి, లేక దుస్తులు లేక ఆహారపు అలవాట్లకు సంబంధించినదని భావించి యూరోపియన్ పద్ధతులనూ, సంప్రదాయాలనూ అనుకరించారు. ఆధునిక భావాలనూ, సంస్కృతినీ భారతీయ సంస్కృతితో మిళితం చేసినట్టయితే వాటిని బాగా ఆకళింపు చేసుకోవచ్చునని వీరు గ్రహించలేదు.

ఈ పోకడకు ముఖ్యకారణాలు, వలస విధానాలేనని మళ్ళీ మరోసారి స్పష్టమయింది. తమ వస్తువులను విరివిగా కొనేవారుగానూ, పరిపాలకులకు విధేయతతో వుండేప్రజలు గానూ భారతీయులను చేయడానికి తమ వలస అయిన భారతదేశంమీద బ్రిటిష్ సంస్కృతిని బలవంతాన నెత్తిన రుద్దటానికి బ్రిటన్ సకలవిధాలా ప్రయత్నించింది.

భారతదేశంపై బ్రిటిష్‌రాజకీయ ఆర్థిక ఆధిపత్యాన్ని సమర్థించుకోడానికి బ్రిటిష్ రచయితలు - రాజనీతిజ్ఞులు భారతీయ సంస్కృతినీ, సమాజాన్నీ విమర్శించడానికి పూనుకున్నారు. భారతీయులకు స్వతహా సాంఘిక, సాంస్కృతిక లోపాలున్నాయి కాబట్టి, విదేశీయులు శాశ్వతంగా పరిపాలించే గతి వీరికి పట్టిందని వారు ప్రకటించారు. ఈరెండు అంశాలు, భారతదేశంలో తీవ్ర వ్యతిరేక భావాన్ని కలిగించాయి. తమ ప్రాచీన చరిత్రను ఉజ్వలింపచేయడం ద్వారా స్వపరిపాలనా ప్రభుత్వానికి తాము అర్హులమని ఋజువుచేసుకోవడం అవసరమని, అనేకమంది భారతీయులు భావించారు. ఇతరులు, వీరిని, పశ్చిమదేశాల సంస్కృతిని అనుకరించేవారని అవహేళన చేశారు; ఆధునిక భావాలూ, సంస్కృతిని ప్రవేశపెట్టడాన్ని ప్రతిఘటించారు. సాంస్కృతిక స్వేచ్ఛను కాపాడాలి అంటే, మళ్ళీ ఆత్మ పరిశీలన చేసుకోవాలని, వీరు, విశ్వసించారు. అల్ప సంఖ్యాకులలో మాత్రమే ఈభావ మున్నప్పటికీ, దీనిప్రభావం కొంత, ముఖ్యంగా పట్టణాలలోవున్న క్రింది మధ్యతరగతి ప్రజలమీద పడింది.

బ్రిటిష్‌పాలన, దేశపు భౌగోళిక ప్రాంతాన్నంతటినీ, ఒకే ఒక పాలనావ్యవస్థ క్రిందికి తెచ్చింది. ఓకేమోస్తరు చట్టాలనూ - ప్రభుత్వాన్నీ ప్రవేశ పెట్టడంద్వారా దేశాన్నంతటినీ, యిది సమైక్యం చేసిందికూడా. రైల్వేలు, తంతి, ఆధునిక తపాలా పద్ధతి, రోడ్ల అభివృద్ధి మోటారు రవాణావంటి ఆధునిక కమ్యూనికేషన్ పద్ధతులను ప్రవేశ పెట్టడంకూడా ఈసమైక్య ప్రభావాన్ని కలిగించాయి. గ్రామీణ స్థానిక ఆర్థిక స్వయంసమృద్ధిని నాశనం చేయడంవల్లా, అంతరంగిక వర్తకాన్ని పెంచడంవల్లా, సమైక్య భారత ఆర్థికవ్యవస్థ తలఎత్తడానికి అవసరమయిన పరిస్థితులు ఏర్పడ్డాయి. ముడిసరుకుల ఉత్పత్తికీ, వాటివిక్రయానికి సంబంధించినంత వరకూ, ఆధునిక పరిశ్రమలు మొత్తందేశానికి చెందినవిగా వుండేవి. వీటికార్మిక జలాన్నికూడా అంతర్ ప్రాంతీయ ప్రాతిపదికమీద చేర్చుకునేవారు. భారతప్రజల ఆర్థికపరిస్థితులు అంతకంతకి ఎక్కువగా పెనవేసుకు పొయ్యాయి; భారత ఆర్థికజీవనం ఒకే ఒక ఖండంగా తయారవుతూ వచ్చింది. దేశమంతటా ఉమ్మడివిద్యా పద్ధతి, ప్రజలకు ఆధునిక భావాలు కల్గడంకూడా, ఉమ్మడి వైఖరితో, సమాజాన్ని ఉమ్మడి భావంతోచూసే మేధావులు దేశమంతటా తలఎత్తడానికి దారితీశాయి. ఇదే మోస్తరుగా, ఈకాలంలో తలఎత్తిన రెండు నూతన వర్గాలు, — పెట్టుబడిదారి వర్గమూ, కార్మికవర్గము, అఖిలభారత ప్రాతిపదిక కలిగివుండేవి; ఇవి, కులం, ప్రాంతం, మతమన్న సంప్రదాయ విభజనకు అతీతంగా వుండేవి.

వీటన్నిటితోపాటు, సాంఘికవర్గమూ, కులమూ, మతమూ, ప్రాంతము అన్న వివక్షతలు లేకుండా భారత ప్రజలను అణగద్రొక్కిన ఉమ్మడి శత్రువు వుండటంవల్ల,

వీరంతా సమైక్యమయ్యారు. సామ్రాజ్యవాద వ్యతిరేక సమరమూ, అసందర్భంగా వుదయించిన సమైక్యతా భావము, భావ — మానసిక సమైక్యతకు దారితీసి, ప్రజలను సన్నిహితంచేసి, ఉమ్మడి జాతీయ దృక్పథం ఆవిర్భవించడానికి దారితీశాయి.

## భారత సాంఘిక వర్గాలు - తరగతులు - బ్రిటిష్ పాలన

రోజులు గడిచేకొద్ది బ్రిటిష్ రాజ్ ప్రభావం స్పష్టం కావడం మొదలైంది; బ్రిటిష్ పాలన లక్ష్యాలకూ — భారత ప్రజల ప్రయోజనాలకూమధ్య సంఘర్షణ - వైరుధ్యమూ స్పష్టంగా విదితమయ్యాయి. తమ ప్రయోజనాలను ప్రోత్సహించడానికే బ్రిటిష్వారు భారతదేశాన్ని పరిపాలిస్తున్నారనీ, దీనివల్ల, సాధారణంగా బ్రిటిష్ జాతికోసం, ముఖ్యంగా బ్రిటిష్ పెట్టుబడిదారులకోసం, భారత ప్రయోజనాలను బలిపెట్టడానికి వారు వెనుదీయరనీ, భారతదేశం, ఆర్థికంగా, సాంఘికంగా, సాంస్కృతికంగా, రాజకీయంగా వెనుకబడి వుండటానికి వలస తత్వమే ముఖ్యకారణమనీ, అంతకంతకి ఎక్కువమంది భారతీయులు గ్రహించారు. అన్ని ముఖ్యరంగాలలోనూ తమ అభివృద్ధికి బ్రిటిష్పాలన అవరోధం కలిగిస్తోందని భారత సమాజంలో వివిధ వర్గాలు జాతులు క్రమేపీ కనిపెట్టాయి.

బ్రిటిష్ వలస తత్వానికి ముఖ్యంగా బలి అయింది, కర్షకులని చెప్పవచ్చు. ప్రభుత్వం, వీరి ఉత్పత్తులలో ఎక్కువ భాగాన్ని భూమిశిస్తు, ఇతర పన్నుల రూపంలో తీసివేసుకునేది. వీరు, భూకామందులు - వడ్డీవ్యాపారస్తుల చేతుల్లో చిక్కుకు పోయారు. తమ భూమిమీదకానీ, తాము పండించిన పంటలమీదకానీ, చివరికి తమ శ్రమశక్తిమీద కూడా తమకు అధికారం లేదని కర్షకులు తెలుసుకున్నారు. జమీందారులు, భూకామందులు, వడ్డీ వ్యాపారస్తులమీద కర్షకులు, ఆర్థిక - రాజకీయ సమరం ప్రారంభించినపుడు, ప్రభుత్వం, శాంతి - భద్రతల పేరుమీద, యావద్ పోలీసు బలాన్ని, న్యాయ నిర్వహణ యంత్రాంగాన్నీ ఉపయోగించి, అతి కిరాతకంగా ఈ సమరాన్ని అణచివేసింది. కొద్దికాలంలోనే కర్షకులు, సామ్రాజ్యవాదం పాత్రగురించి తెలుసుకున్నారు. తమ కడగండ్లకు ఇదే ముఖ్యకారణమని గ్రహించారు.

సామ్రాజ్యవాదం చేతుల్లో, హస్తకళా నిపుణులూ, వృత్తిపనుల నిపుణులుకూడా ఎన్నో బాధలకు గురి అయ్యారు. అనేక శతాబ్దాలనుంచి జీవనభృతి కలిగిస్తోన్న ఒనరులను, ఉపాధి అవకాశాలను కల్పించకుండానే, కొత్తవాటిని అభివృద్ధి పరచకుండానే,

తొలగించారు. 19వ శతాబ్దం ఆఖరయ్యేటప్పటికి వీరిపరిస్థితి మరీ అధ్వానమయినది. దీని ఫలితంగా 20వ శతాబ్దంలో జరిగిన సామ్రాజ్యవాద వ్యతిరేక సమరాలలో, వీరు, క్రియాత్మకంగా పాల్గొన్నారు.

ఆధునిక పరిశ్రమలు పెంపొందటంతో భారతదేశంలో ఒకనూతన సాంఘికవర్గం - కార్మికవర్గం, ఆవిర్భవించింది. ఇది సంఖ్యలో చిన్నదే అయినప్పటికీ, జనాభాలో ఒక చిన్న భాగమే అయినప్పటికీ, ఈ వర్గం, ఒక నూతన సాంఘిక వైఖరిని ప్రదర్శించింది. శతాబ్దాలనుంచివున్న సంప్రదాయాన్ని, అలవాట్లను, జీవన పద్ధతులను మోయవలసిన భారం దీనిపైలేదు. దీని దృక్పథమూ, ప్రయోజనాలు, మొదటినుంచి అఖిల భారత లక్షణాన్ని కలిగివుండేవి. అంతేకాకుండా కార్మికులు ఫ్యాక్టరీలలోనూ, పట్టణాలలోనూ, కేంద్రీకృతమై వుండేవారు. ఈ అంశాలన్నీ వారి రాజకీయ కృత్యాలకు వారి సంఖ్యకుమించి ప్రాముఖ్యాన్ని ఇచ్చాయి.

భారతీయ కార్మికులు, అసంతృప్తికరమైన పరిస్థితులలో పనిచేసి, నివసిస్తూ వుండేవారు. 1911 వరకూ, వీరు ఎన్నిగంటలు పనిచేయాలన్న విషయాన్ని క్రమబద్ధంచేసే నిబంధనలు ఏవీలేవు. అస్వస్థత, వృద్ధాప్యం, నిరుద్యోగం, ప్రమాదం, హఠాన్మరణం- వీటికి ఎటువంటి సాంఘిక భీమా పద్ధతి అమలులోలేదు. ప్రావిడెంట్ ఫండ్ పథకాలేవీ అమలులోలేవు. ఎంతో అసంతృప్తి కరమైనదైనా ప్రసూతిసౌకర్యం ఒకటి 1930లో మాత్రమే అమలులోకి వచ్చింది.

ఫ్యాక్టరీ కార్మికుల వాస్తవ వేతనాలు 1889–1929లో పడిపోయాయి ; శక్తివంతమైన ట్రేడ్ యూనియన్ ఉద్యమం ప్రారంభమైన తర్వాత మాత్రమే, 1930లో యివి, 1880–1890లో వున్న స్థాయిని అందుకున్నాయి. ఇదికూడా కార్మిక ఉత్పాదక శక్తి 50 శాతానికి పైగా పెరిగినపుడు. వీటి ఫలితం, సగటు కార్మికుడు, కేవలం తిండి లభించే స్థాయికన్న తక్కువగా నివశిస్తూ వుండేవాడు. బ్రిటిష్ పాలనలో భారతీయ కార్మికుల జీవన పరిస్థితుల గురించి 1938లో వ్రాస్తూ ప్రఖ్యాత జర్మన్ ఆర్థిక—చరిత్రకారుడు ప్రొఫెసర్ "Jurgen Kuczyaski" "తగిన ఆహారంలేక, జంతువుల మోస్తరుగా నివశిస్తూ, వెలుతురు, గాలి, నీరులేకుండా, భారత పారిశ్రామిక కార్మికుడు, ప్రపంచ పారిశ్రామిక పెట్టుబడిదారి విధానంలో అతిగా పీడింప బడిన వాడిలో ఒకడయ్యాడని" వ్రాశారు.

తేయాకు – కాఫీ తోటల్లో పరిస్థితులు యింకా అధ్వానంగా వుండేవి. ఈ తోటలు అతి తక్కువ జనంగల ప్రాంతాలలో ఆరోగ్యవంతంకాని వాతావరణంతో వుండేవి. అయినప్పటికీ, తోటల యజమానులు, బయటినుంచి కార్మికులను ఆకర్షించడానికి తగిన

వేతనాలు, చెల్లించేవారు కారు. దీనికి బదులు, కార్మికులను భర్తీచేసుకోడానికి అబద్ధపు హామీలు యిచ్చేవారు ; తోటల్లో వీరిని బానిసలుగా వుంచడానికి, బలవంతం, దౌర్జన్యం-హింసలు పెట్టేవారు. తోటల కార్మికులను పీడించి, బానిసలుగా వుంచడానికి అనువైన శిక్షాస్మృతులను ఆమోదించి, ప్రభుత్వం, యజమానులకు పూర్తిగా తోడ్పడేది.

కొద్దికాలంలోనే, భారత కార్మికవర్గం అతిశక్తివంతమైన సామ్రాజ్యవాద వ్యతిరేక వైఖరిని అవలంబించింది.

జనాభాలో, జాతీయ ఉద్యమానికి వెన్నెముకగా మరో ముఖ్య సాంఘిక వర్గమైన మధ్యతరగతి, దిగువ మధ్యతరగతి వర్గం, ఏర్పడ్డాయి. 19వ శతాబ్దం మొదటి అర్థ భాగంలో బ్రిటిష్‌వారు చిన్నచిన్న ప్రభుత్వ ఉద్యోగులను భర్తీచేసుకొని, కొత్తపాఠశాలలు, కోర్టులు తెరిచి కొత్తఉద్యోగాలు వృత్తులు ఏర్పాటు చేయడంతో ఈ వర్గాలకు నూతన అవకాశాలు ఏర్పడ్డాయి. అంతేకాకుండా అంతరంగిక, విదేశ వర్తకం హఠాత్తుగా పెరిగిపోవడంవల్ల అన్ని స్థాయిలలోనూ వర్తకవర్గం విస్తృతమైంది. అయితే అభివృద్ధిచెందని వలస ఆర్థిక వ్యవస్థ అసలు స్వభావం తేటతెల్లమయింది. 19వ శతాబ్దం ఆఖరుకల్లా, విద్యావంతులైన కొద్దిమంది భారతీయులలోకూడా, నిరుద్యోగం ప్రబలింది. యావద్ భారతదేశంలోనూ అప్పుడు విద్యావంతులసంఖ్య, ఢిల్లీవంటి ప్రస్తుత చిన్న ప్రాంతంలోకన్నా, తక్కువగా వుండేది. అంతేకాకుండా, ఉద్యోగాలు దొరికినా, మంచివుద్యోగాలన్నీ ఇంగ్లీషు మధ్యతరగతి, ఎగువ తరగతి వర్గాలకు కేటాయించారని, వీరు తెలుసుకున్నారు. ముఖ్యంగా, బి. ఏ. డిగ్రీ పొందకుండా, విశ్వవిద్యాలయాలనుంచి చదువు మానివేయవలసి వచ్చినవారికి ఉద్యోగ అవకాశాలు మృగ్యమయ్యాయి. ఆర్థికంగా అభివృద్ధిచెందుతూ, సాంఘికంగా, సాంస్కృతికంగా ఆధునికమైన దేశం మాత్రమే ప్రయోజనకరమైన, అర్థవంతమైన జీవితం గడపడానికి, ముఖ్యంగా, పేదరికమూ, నిరుద్యోగము, సాంఘిక – ఆర్థికహోదా కోల్పోవడము లేకుండా సాంఘిక – ఆర్థిక అవకాశాలను కల్పించగలదని, మధ్యతరగతి, క్రింది మధ్యతరగతి భారతీయులు త్వరగా గ్రహించారు.

భారత పారిశ్రామిక పెట్టుబడిదారి వర్గం, 1858 తర్వాత వృద్ధి చెందింది. వీరు, త్వరగా బ్రిటిష్ పెట్టుబడిదారులలో పోటీ చేయడం మొదలు పెట్టారు. అధికార వర్తక సుంకాలు, రవాణా, ప్రభుత్వ ఆర్థిక విధానాలవల్ల తమ పెరుగుదల అరికట్టబడుతోందని వీరు గ్రహించారు. స్వతంత్ర ఆర్థికాభివృద్ధికి సతమతమవుతూనే వీరు, ప్రతి మూల ఆర్థిక సమస్యమీద సామ్రాజ్యవాదంతో ఘర్షణకు దిగారు.

పశ్చిమ యూరోప్‌లో సుస్థాపితమయిన పరిశ్రమలతో పోటీ చేయడంలో ఎదు రవుతూవున్న బలహీనాన్ని అవరోధాలనూ అధిగమించాలి అంటే, భారత పెట్టుబడిదారీ వర్గాలకు ప్రభుత్వం, క్రియాత్మకంగా, సరాసరి సహాయాన్ని అందజేయాలి. ఇదే సమయంలో ఫ్రాంసు, జర్మనీ, జపాన్‌లలో పరిశ్రమలను క్రియాత్మకమైన, అశేష ప్రభుత్వ సహాయంతో అభివృద్ధి చేస్తున్నా ఇటువంటి సహాయం భారత పెట్టుబడి దార్లకు లభించడం లేదు. ముఖ్యంగా భారత పరిశ్రమలకు సుంకాల రక్షణ లభించి నట్లయితే, చౌక అయిన విదేశ సరుకులు, మన వస్తువులకన్నా ఎక్కువగా అమ్ముడు బోవు. ఇటువంటి రక్షణ యివ్వలేదు; దీనికి బదులు ప్రపంచంలో మరే దేశంలోనూ లేని స్వేచ్ఛా వర్తకాన్ని పూర్తిగా ప్రవేశపెట్టారు.

సానుభూతిగల అధికారదర్ప ప్రభుత్వం, భారత పెట్టుబడిదార్లకు సహాయపడి, అనేక విధాల తోడ్పడేది. పశ్చిమ యూరోప్‌లో అధికార దర్పంగల ప్రభుత్వాలు, పెట్టుబడిదారుల వర్గం మోస్తరుగానే, పెట్టుబడిదారీ అనుకూల దృక్పధాన్ని కలిగి వుండేవి. వీరిద్దరినీ వందలాది బంధాలు అతి సన్నిహితం చేశాయి. భారత దేశంలో అధికారదర్ప ప్రభుత్వం, విదేశీయమైనది. ఇది, బ్రిటిష్ పెట్టుబడిదార్లతో అత్యంత సన్నిహితంగా వుండేది. వీరి సహజ సానుభూతి, బ్రిటన్‌లోగానీ, భారత దేశంలోగానీ వున్న పెట్టుబడిదార్ల పట్ల మాత్రమే వుండేది. కాగా, వీరు, భారత పారిశ్రామికుల కృషిపట్ల సానుభూతిలేని భావాన్ని, శత్రు భావాన్ని కూడా కలిగివుండేవారు.

భారత పెట్టుబడిదార్లు, పటిష్టమయిన విదేశ పెట్టుబడిదార్లు ఆధిపత్యం చెలాయించి అణగద్రొక్కుతారని భయపడేవారు. 1918 తర్వాత, భారత పరిశ్రమల్లో, భారీ విదేశ పెట్టుబడులను పెట్టడం ప్రారంభమయి, 1920 సంవత్సరాలలోనూ, 1930 సంవత్స రాలలోనూ సుంకాల రక్షణ క్రింద లాభాన్ని పొందటానికి పెద్దపెద్ద బ్రిటిష్ పారిశ్రామిక సంస్థలు, భారత దేశంలో అనుబంధ సంస్థలను ప్రారంభించి చౌక అయిన భారత కార్మికులనూ, సమీప మార్కెట్లను, ఉపయోగించుకోవడం మొదలు పెట్టడంతో, ఎలాగయినా మనుగడ సాగించాలన్న భావం వీరిలో బయలుదేరింది. భారతీయ పెట్టుబడిదార్లు, అప్పుడు "భారతీయ మార్కెట్లు భారతీయుల ఆధిపత్యంలో ఉండాలి" అన్న నినాదాన్ని లేవతీశారు.

భారత పెట్టుబడిదార్లు, ఈ విధంగా వలస ఆర్థిక స్వరూపానికీ, పాలనా యంత్రాం గానికీ, విధానాలకూ బాహాటంగా ఎదురు తిరిగారు. దేశీయ పెట్టుబడిదార్లకు అనుకూల మయిన జాతి. దేశమూ - ప్రభుత్వమూ అవసరమని వీరు క్రమేపీ గ్రహించారు. విదేశ సామ్రాజ్యవాదులు దేశంపై ఆధిపత్యం చెలాయిస్తువున్నంతవరకు, భారత వర్తక

పరిశ్రమలు శీఘ్రగతిలో అభివృద్ధి చెందజాలవని వీరు భావించారు. అయితే ఆస్తిగల వారుగానూ, అభివృద్ధిచెందుతూవున్న వర్గమయినా బలహీనవర్గం వారుగానూ తాము ఆధారపడివున్న విదేశ పరిపాలకులతో, బాహటంగా, ప్రత్యక్ష సంఘర్షణకు వెంటనే వీరు దిగలేదు. పాలకుల పక్షపాతంకోసం వీరు ఎదురుచూసేవారు. అయితే 1918 తర్వాత, ముఖ్యంగా ఆర్థికంగా వీరు, శీఘ్రగతిలో అభివృద్ధి చెందుతూవున్న జాతీయ ఉద్యమాన్ని, వ్యక్తిగత జాతీయ నాయకులనూ బలపరచడం మొదలు పెట్టారు.

జాతీయతా భావం తల ఎత్తడంతో ఆధునిక భారతీయ మేధావులు అతి ముఖ్యమైన, సృజనాత్మక పాత్ర నిర్వహించారు. భారత దేశంలో బ్రిటిష్ అధికారం సుస్థాపితం కావడంతో గతంతో సంబంధంలేకుండా పోయిందనీ. నూతన చారిత్రక యుగం ప్రారంభమైందనీ మొట్టమొదట గుర్తించినది వీరే. ఆరంభంలో వీరు బ్రిటిష్ పాలన పట్ల అనుకూల వైఖరి ప్రదర్శించారు. 19 వ శతాబ్దం ఆరంభంలో రాజారామ్ మోహన్ రాయ్‌వంటి వ్యక్తులు గ్రుడ్డిగా దేశభక్తిని కలిగివుండటంవల్ల ప్రయోజనంలేదనీ, కొద్ది మంది విదేశీయులు యింత విశాలమయిన దేశాన్ని, అంతరంగిక సాంఘిక, ఆర్థిక, రాజకీయ, మేధాబలహీనత వల్లనే జయించ గలిగారనీ, బ్రిటన్, అప్పట్లో, ఉన్నతమైన సంస్కృతి, నాగరికత కలిగివుందనటం నిస్సందేహమనీ, స్పష్టంగా గ్రహించారు. సమకాలీన భారత సమాజాన్ని, వ్యవస్థనూ, వీరు, బాహాటంగా నిర్మొహమాటంగా విమర్శించారు. ఈ వ్యవస్థ భవిష్యద్ భారత అభివృద్ధికి ప్రాతిపదికగా ఉపకరించ జాలదని వీరు స్పష్టంచేశారు. అందువల్ల వీరు, సమాజాన్ని, దేశాన్ని ఆధునికం చేయ డానికి పూనుకున్నారు.

ఇహ ఆర్థిక రంగంలో, ఆధునిక పరిశ్రమలు, ఆర్థికాభివృద్ధి-సౌభాగ్యవంతమయ్యే అవకాశాలు, వీరిని ఆకర్షించాయి. అప్పట్లో ఆర్థికంగా ఎంతో అభివృద్ధి చెందిన బ్రిటన్, ఆధునిక శాస్త్ర—సాంకేతిక, ఆర్థిక వ్యవస్థలను భారతదేశంతోసహా తనవలసల్లో ప్రవేశపెడుతుందని ఆశించారు. రాజకీయ రంగంలో, ఆధునిక భావాలు, ప్రజాస్వామ్యానికి దారితీసే ప్రజల సర్వం సహాధికార సిద్ధాంతమూ, వాక్స్వాతంత్ర్యమూ, పత్రికల స్వేచ్ఛ, సమావేశాలు, పాలకులను బహిరంగంగా విమర్శించేహక్కు, వీరిని ఆకర్షించాయి. తమ కండ్లముందు, భారతదేశం సమైక్యం కావడం, భారతప్రజలు ఒకే ఉమ్మడిజాతిగా రూపొందటం—వీరుచూశారు. ఈపనిని పూర్తిచేయడంలో బ్రిటన్ తోడ్పడుతుందని వీరు ఆశించారు. విశ్వాసానికి భిన్నంగా, ఆధునిక హేతువాదం, వీరిని ఆకర్షించింది. సారస్వతాన్ని, కళలనూ ప్రజారంజకం చేయాలనీ, పెద్దలకు మాత్రమే యివి అందుబాటులో వుండకూడదనీ, వీరు గ్రహించారు. ఇందుకోసం. వీరు, ఇంగ్లీషుభాషా

విద్యా బోధనద్వారా ఒకవైపు ఆధునిక విద్యను వ్యాప్తిచేయాలనీ, మరోవైపు ఆధునిక భారతీయ భాషలను అభివృద్ధి పరచాలనీ, వీరు ప్రచారంచేశారు. సాంఘికరంగంలో, సాంఘికస్వేచ్ఛ, సమాజంపట్ల, వ్యక్తిపట్ల మానవతా భావము, ప్రతివ్యక్తికి పారితోషికం లభించాలన్న భావమూ, వీరిని ఆకర్షించాయి.

ఈ విధంగా దాదాపు అర్థశతాబ్దం, బ్రిటన్ అప్పుడు బాగా పురోభివృద్ధిచెందిన దేశం కాబట్టి, భారతీయ సమాజాన్ని తీర్చిదిద్ది, మార్చడం బ్రిటిష్ పాలనక్రింద జరగగలదని ఆధునిక భారత మేధావులు విశ్వసించారు. దీని ఫలితంగా వీరు, బ్రిటిష్‌పాలనను బలపరిచారు. భగవదనుగ్రహంవల్లయిది ఏర్పడిందనికూడా వారు వర్ణించారు. 1857లో తిరుగుబాటు జరిగినపుడుకూడా వీరు, యిదే బలాన్నియిచ్చారు.

అయితే 19వ శతాబ్ది మొదటి 75 సంవత్సరాలలోనూ పరిణామాలు, ఏరంగంలోనూ తాము అనుకొన్నట్టుగా జరగనందున వీరు నిరాశ చెందారు. తాము ఎదురు చూచిన వాటిని మరుగు పరిచారనీ, బ్రిటిష్ పాలన స్వభావ—స్వరూపాలను తప్పుగా అర్థంచేసు కోవడమే, దీనికికారణమనీ, వీరుభావించారు.

ఈవిధంగా వాస్తవంగా, బ్రిటిష్‌వారు, ఆధునిక సాంకేతిక—పరిశ్రమలను భారత దేశానికి బదలాయించలేదు. 1866 మొదలు 1901 వరకూ, భారతదేశంలో సంభవించిన క్షామపరంపరవల్ల అభివృద్ధిని గురించి కన్న పగటి కలలన్నీ పటాపంచలయ్యాయి; మేధావులకు, ప్రజల పేదరికమూ, దేశం ఆర్థికంగా అభివృద్ధిలో బాగా వెనుకబడి వుండటం మాత్రమే మిగిలాయి. భారత ఆర్థిక వ్యవస్థమీద సామ్రాజ్యవాదుల కంట్రోలు వున్నంతవరకూ, భారతదేశం, ఆర్థికంగా అభివృద్ధి చెందజాలదనీ, అంతే కాకుండా యింకా వెనుకబడినదేశంగా మారిపోయిందనీ వీరు గ్రహించారు. రాజకీయ రంగంలో బ్రిటిష్ అధికారులు, రాజకీయ నాయకులు స్వపరిపాలనా ప్రభుత్వంలో భార తీయులకు శిక్షణ యివ్వడమన్న నినాదాన్ని వదులుకున్నారు. శాశ్వతమైన దాతృత్వ నియంతృత్వాన్ని ఏర్పాటు చేయడమే బ్రిటిష్‌పాలన రాజకీయ లక్ష్యమని ప్రకటించారు. భారతీయులు, స్వపరిపాలనా ప్రభుత్వానికి గానీ, ప్రజాస్వామ్యానికిగానీ అర్హులుకారని వారన్నారు. భారత మేధావులను ఆకర్షించిన పత్రికాస్వాతంత్ర్యంతో జోక్యంకలగ జేసుకోవడం మొదలు పెట్టారు. ప్రాథమిక పౌరహక్కులనూ, భావస్వాతంత్ర్యాన్ని, వాక్‌స్వాతంత్ర్యాన్నీ, సమావేశ స్వేచ్ఛనూ అంతకంత ఎక్కువగా ఉల్లంఘించి, పరి మితం చేశారు. శాంతియుత అభివృద్ధికీ, ఆధునికీకరణకూ ముఖ్యషరతుగా అంతకి ముందువారికి కనుపించిన శాంతిభద్రతలు, రాజకీయ—ఆర్థిక ఆక్షేపణకు ముసుగుగా తయారయ్యాయి. భారతదేశాన్ని సమైక్యంచేసి, ఒకేజాతిగా రూపొందించడానికి బదులు,

బ్రిటిష్‌వారు, కులమత విద్వేష శక్తులనూ ప్రాంతీయతత్వ విచ్ఛిన్నకర శక్తులనూ, అటుగంటి పోతోన్న సంస్థానాధిపతులనూ ప్రోత్సహించడంద్వారా, దేశాన్ని తమ అదుపుక్రింద వుంచుకోడానికి ప్రయత్నించారు

సాంస్కృతిక రంగంలో, భారత మేధావులు, పురోభివృద్ధి భావాలు త్వరగా అంత రించి పోతున్నాయని గ్రహించారు. బ్రిటిష్ భారతప్రభుత్వం తన బడ్జెటులో మూడో శాతానికన్నా తక్కువగా విద్యకోసం ఖర్చుచేసింది. సామాన్య ప్రజానీకం విద్యనూ, స్త్రీ విద్యను అలక్ష్యం చేసింది ; ఉన్నత విద్యనూ, ఆధునిక భావాలవ్యాప్తినీ అరికట్టింది. 1858 తర్వాత బ్రిటిష్ పరిపాలకులు సాంఘిక సంస్కరణల ప్రయత్నాల నన్నింటినీ వదులుకున్నారు ; బాగా వెనుకబడిన, సంప్రదాయ సిద్ధమైన, సనాతన, సాంస్కృతిక, మత, సాంఘిక శక్తులకు సన్నిహితం కావడం మొదలు పెట్టారు.

దీని ఫలితంగా ఆధునిక భారతీయ మేధావులు, బ్రిటిష్ పాలకుల మూలలక్షణాలను అవగాహన చేసుకొని పరిశీలించే ముఖ్యకర్తవ్యానికి పూనుకున్నారు. వీరి అవగాహన పెంపొందటానికి కొంత వ్యవధి పట్టింది. అయితే 19వ శతాబ్దం అంతమయ్యేటప్పటికి, తమకు లోగడ కనుపించిన భారతదేశపు ఆధునికీకరణ అన్నది, వాస్తవంగా పలస తత్వాన్ని విధించడమేనని, వీరు, గ్రహించ గలిగారు. ఇప్పుడు వీరు, సామ్రాజ్యవాదా నికి వ్యతిరేకంగా జాతీయ రాజకీయ ఉద్యమాన్ని పటిష్ఠం చేయడానికి పూనుకున్నారు.

మరోమూడు సాంఘిక వర్గాలయిన జమీందార్లు, భూకామందులు, సంస్థానాధిపతులు, ప్రభుత్వ సర్వీసుల్లోవున్న ఉన్నత భారత ఉద్యోగులు, సంప్రదాయ సిద్ధమైనమేధావులు, సామ్రాజ్యవాదంపట్ల ద్వంద్వవైఖరిని ప్రదర్శిస్తూ వుండేవారు. జమీందార్లు, భూకా మందులు, సంస్థా నాధిపతులు, తమ ప్రయోజనాలు, పరిపాలకుల ప్రయోజనాలతో ఏకీభవించడం వల్ల ఒకే వర్గంగా విదేశ పాలనకు, విధేయతతో వుండేవారు ఇదే విధంగా ప్రభుత్వ సర్వీసులలో వున్న ఉన్నత భారత ఉద్యోగులు, ఒక పేదదేశంలో ఉన్నత జీవన ప్రమాణాలను పరిపాలకులతోపాటు అనుభవిస్తూ, పాలనాధికార, ఉన్నత సాంఘిక హోదా దర్పంతో వుండేవారు. వీరు చివరివరకు మొత్తంమీద బ్రిటిష్ పాలన సాధనాలుగా విధేయతతో వుండేవారు. అయితే ఈ రెండు సాంఘిక వర్గాలనుంచికూడా అనేకమంది వ్యక్తులు, దేశభక్తి భావంతో, అప్పుడు ప్రారంభించిన జాతీయ ఉద్యమంలో చేరారు.

మేధావుల్లో, మతబోధకులు, తత్వవేత్తలు, ఉపన్యాసకులు, విద్యావిధానంలోని అధ్యాపకులు పరస్పర వైరుధ్య ఒత్తిడులకు లోనయ్యారు సాంఘిక — మతసనాతన

దృక్పథంవల్ల, రాజకీయ సనాతన దృక్పథానికి వీరు లోనయ్యారు. అధికారంలో వున్నవారికి విధేయతతో వుండే సుదీర్ఘ చారిత్రక సంప్రదాయం కూడా, వీరికి వుంది.

ఇదే సమయంలో, ఆధునిక పాఠశాలలు, కళాశాలల వ్యాప్తి, సంప్రదాయ సిద్ధమైన పాఠశాలలు, బడులు, ఉన్నత విద్యాకేంద్రాలు మూతపడటానికి దారితీయడంతో క్రింది స్థాయిలలోని సంప్రదాయ సిద్ధమైన మేధావులసంఖ్య, బాగా తగ్గిపోయింది. మేధావులలో చాలామంది ఆధునిక సంస్కృతి భావన, మత సాంఘిక సంస్కరణల ఉద్యమాలకు, ఆదర్శ కారణాలవల్లా, సమాజంపై తమ ఆధిపత్యాన్ని తామే అలక్ష్యం చేయడంవల్లా, తీవ్రంగా ప్రతికూలమయ్యారు. క్రైస్తవ మిషనరీల విద్రోహపూరితమైన మతప్రచారం కూడా — వీరిలో కోపోద్రేకాలను కలిగించాయి.

దీనిఫలితంగా చిట్ట చివరికి సంప్రదాయ సిద్ధమైన మేధావులలో రెండు భిన్న పోకడలు తలఎత్తాయి. ఒక పోకడను గట్టిగా బలపరిచేవారు, ఆధునిక భావాలకు తమ వ్యతిరేకతను కొనసాగిస్తూనే, జాతీయ ఉద్యమంలో పాల్గొనడాన్ని బలపరిచారు. మరో పోకడను బలపరిచేవారు, సమాజంలో తమ ప్రముఖ స్థానాన్ని కాపాడుకుంటూ వుండగలమనే ఆశతో, విదేశ పరిపాలకులను బలపరిచారు. ప్రభుత్వం రెండోపోకడను అనుసరించే వారిని, గట్టిగా ప్రోత్సహించింది.

దీనివల్ల, దేవాలయాలు, మఠాలు, మసీదులు, దర్గాలు, గురుద్వారాలు, ఇతర మత వ్యవస్థలు, సంప్రదాయ సిద్ధమైన మేధావుల పూర్తి అదుపుక్రిందికి వచ్చివేశాయి. ప్రభుత్వంకూడా, పింఛన్లు, ఆర్థిక బహుమతులు, బిరుదులు, గౌరవాలు మొదలయినవి యివ్వడంద్వారా, మేధావులను పోషించడం మొదలుపెట్టింది. సంప్రదాయ సిద్ధమైన విద్యావిధానాన్ని కృత్రిమంగా అమలులో వుంచడానికి కూడా యిది చర్యలు తీసుకుంది. ఇంతకె ముందు మోస్తరుగా, సాంఘిక — సాంస్కృతిక సంస్కరణల విధానాన్ని వదులుపని సనాతనుల గౌరవాన్నికూడా ప్రభుత్వం పొందగలిగింది. ఆధునిక భావాలయిన జాతీయత, ప్రజాస్వామ్యం, ఆర్థికాభివృద్ధి, భావాలు వ్యాప్తికాకుండా అరికట్టడానికి బ్రిటిష్‌వారు. భారతదేశపు సంప్రదాయ సిద్ధమైన భావాలు — సంస్థలు భారతీయులకు బాగా సరిపోతాయనీ, భారతీయులు, తమ తాత్విక — మత సంప్రదాయాలపై దృష్టిని కేంద్రీకరించాలనీ, ఆధ్యాత్మిక చింతన కలిగివుండాలనీ, తమ ఆర్థిక, రాజకీయ, పాలనా వ్యవహారాలను నిర్వహించేబాధ్యతను, బ్రిటిష్‌వారికి వదిలివేయాలనీ, బ్రిటిష్‌వారు, ప్రచారం చేయడం మొదలుపెట్టారు. ఈ కార్మిక విభజనకూడా సంప్రదాయ సిద్ధమైన మేధావులను ఆకర్షించింది

పరిపాలకులు జాతి ఔన్నత్యాన్ని ప్రదర్శించడంవల్ల కూడా, సంస్థానాధిపతులు — అతి పేదవారిలోనూ, జమీందార్లు — కౌలుదార్లలోనూ, ఉన్నత అధికారులు — గుమాస్తాలలోనూ, ధనికులు పేదలలోనూ, జాతీయతా భావం పెచ్చు పెరిగిపోయింది. బ్రిటిష్‌వారు, ఎల్లప్పుడు భారతీయులకు దూరంగా వుండేవారు; జాతిరీత్యా ఉన్నతులమని భావించేవారు. అయితే, 19 వ, శతాబ్దం అర్థభాగంలో, ఇరువురి మధ్యా సాంఘిక — జాతి వ్యత్యాసం ఎక్కువ కావడంతో ఒక ముఖ్యమైన మార్పువచ్చింది. సామ్రాజ్య వాదాన్నీ, సామ్రాజ్యవాద ఆదర్శాలనూ పునరుజ్జీవింప చేయడంలో ఒక భాగంగా నల్లవారికన్నా తెల్లవాళ్ళు అధికులన్న జాతిసిద్ధాంతాలను యూరోప్‌లో ప్రచారం చేయడం మొదలయింది. భారతదేశంలోని బ్రిటిష్‌వారు యిప్పుడు బాహాటంగా, భారతీయులు తక్కువజాతి వారని ప్రకటించారు. అధికారం చెలాయిస్తున్న వారికి ప్రత్యేక హక్కులుండాలని గట్టిగా చెప్పారు. వైస్రాయి మేయో వంటి ప్రముఖవ్యక్తి కూడా 1870 లో పంజాబ్ లెఫ్టినెంట్ గవర్నర్‌కి వ్రాస్తూ మేమంతా తక్కువజాతి వారిని పరి పాలించే అద్భుతకృషిని నిర్వహిస్తూవున్న బ్రిటిష్ పెద్దలమని మీక్రిందివారికి బోధించండి" అని తెలియజేశారు. ఈ జాతి అహంకారాన్ని ప్రదర్శించడంవల్ల, సద్భావమూ, ఆత్మ గౌరవమూగల ప్రతిభారతీయుడు అగౌరవ పరచబడి, హీనపరిచినట్టు భావించాడు; జాతీయతా భావాలు — కార్యకలాపాలు వారిలో పురికొల్ప బడ్డాయి.

మొత్తంమీద చెప్పాలంటే, బ్రిటిష్‌పాలన మూలవలస స్వభావము, భారత ప్రజల జీవి తంపై దాని దుష్ప్రభావము, భారతదేశంలో శక్తివంతమైన సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమం తలఎత్తి పటిష్టంకావడానికి దారితీశాయి. ఈ ఉద్యమం, భారత సమాజంలోని అన్ని జాతుల్లోనూ, వర్గాల్లోనూ, పరివ్యాప్తం కావడంతో, యిదిజాతీయ ఉద్యమ మయింది. ఈజాతులకూ వర్గాలకూ, సామ్రాజ్యవాదంతో వైరుధ్యమేర్పడటంవల్ల, ఉమ్మడిజాతీయ ఉద్యమంలోవీరంతా సన్నిహిత మయ్యారు. వీరి ప్రయోజనాలలో పరస్పర సంఘర్షణ కూడా ఏర్పడింది. అయితే ఈ పరస్పర విబేధాలను వీరు విస్మరించి ఉమ్మడి శత్రువుకు వ్యతిరేకంగా వీరంతా సమైక్య మయ్యారు.

# II ప్రారంభ ఘట్టం

## సంప్రదాయసిద్ధమైన ప్రతిఘటన

భారతదేశంలో బ్రిటిష్ పాలన ఏర్పడిన మొదటి రోజునుంచి కూడా భారతప్రజలు బ్రిటిష్ పాలనను ప్రతిఘటించారు. దాదాపు ఒక సంవత్సరంగడిచినప్పటినుంచీ, 1857 వరకూ, దేశంలో ఏదో ఒక ప్రాంతంలో సాయుధ తిరుగుబాట్లు జరుగుతూనే వుండేవి. సంప్రదాయ సిద్ధమైన నిరాఘాటమయిన ఈ తిరుగుబాటు స్థూలంగా మూడు రూపాలలో వుంది: పౌరతిరుగుబాట్లు; ఆదిమవాసుల తిరుగుబాటు; కర్షక ఉద్యమాలు, తిరుగుబాట్లు.

## పౌరతిరుగుబాట్లు

భారతదేశాన్ని బ్రిటన్ జయించిన పద్ధతి, బ్రిటిష్ పరిపాలన పటిష్ఠం కావడం, ప్రజలలో అసంతృప్తినీ, ఏహ్యభావాన్నీ కలిగించాయి. బ్రిటిష్ భారతసైన్యంలో పని చేస్తూవున్న భారత సైనికులకు కూడా ఈ భావం కలిగింది. దాదాపు 100 సంవత్సరాలు ప్రజలలో కలిగిన అసంతృప్తివల్ల, పదవీచ్యుతులైన సామంతులు లేక వారి సంతానము, బంధువులు, జమీందార్లు, పోలిగార్లు, మాజీసైనికులు, అధికారులు, భారత సంస్థానాలను అదుపులో వుంచుకున్న వారి నాయకత్వం క్రింద, సాయుధ తిరుగుబాటు జరిగింది. తమ స్వంత కష్టనిష్ఠురాలవల్ల అనేక మంది కర్షకులు, వృత్తి పని వారు, ఈ తిరుగుబాట్లలో పాల్గొని, వీటికి వెన్నెముకవలె పనిచేశారు. బెంగాల్, బీహార్‌లలో బ్రిటన్ పాలన ఏర్పడినపుడే ఈ పౌర తిరుగుబాట్లు ప్రారంభమయ్యాయి. భూమి శిస్తు ఎక్కువ చేయడం, ఈస్టు ఇండియా కంపెనీ, దాని ఉద్యోగులు వృత్తి పని వారిని పీడించుకు తినడం, పాత జమీందార్లను తొలగించడం. అతి ప్రమాదకరమైన పరిస్థితి తలఎత్తేటట్టు చేశాయి. ప్రతి జిల్లాలోనూ, రాష్ట్రంలోనూ, ప్రజా తిరుగుబాట్లు జరిగాయి. ఈ అసంతృప్తి ఎంత విస్తృతమైనదో, విశదం చేయడానికి ముఖ్యమైన వాటిలో కొన్నింటిని ఉదాహరిస్తే చాలు.

మత భిక్షువులు, తొలగింపబడిన జమీందార్ల నాయకత్వం క్రింద జరిగిన సన్యాసి తిరుగుబాటులో బెంగాల్‌కి చెందిన మాజీ సైనికులు నిర్వాసులయిన కర్షకులు పాల్గొన్నారు. సన్యాసి తిరుగుబాటు 1763 నుంచి 1800 సంవత్సరం వరకూ జరిగింది. ఆ తర్వాత షెవార్ తిరుగుబాటు బెంగాల్ కీహార్ల లోని ఐదు జిల్లాలలో 1766 నుంచి 1772 వరకూ జరిగింది. 1795 నుంచి 1816 వరకూ మరో షేవార్ తిరుగుబాటు జరిగింది.

బ్రిటీష్ అధికారాన్ని దేశంలో యితర ప్రాంతాలకు విస్తరించటంవల్ల, యిదేమో స్తరుతిరుగుబాట్లు జరిగాయి. ఒరిస్సా జమీందార్ల తిరుగుబాటు 1804 నుంచి 1817 వరకూ జరిగింది. దక్షిణ భారతదేశంలో విజయనగరం రాజా 1794 లో తిరుగుబాటు జరిపాడు. తమిళనాడు పోలిగార్లు 1790 సంవత్సరాలలోనూ, మలబార్ - దిండిగల్ 1801 సంవత్సరంలోనూ, ఆంధ్ర తీరం 1801 నుంచి 1805 సంవత్సరం వరకూ. పర్లాకిమిడి 1813 నుంచి 1834 వరకూ, తిరుగుబాటు జరిపాయి. 1830-34 లో విశాఖపట్టణం తిరుగుబాటు ప్రజ్వరిల్లింది. తిరువాన్కూర్ దివాన్ వేలుతంపి 1805 లో తిరుగుబాటు జరిపాడు. పశ్చిమ భారతదేశంలో, సౌరాష్ట్ర అధిపతులు 1816 నుంచి 32 వరకూ పదేపదే తిరుగుబాట్లు జరిపారు. గుజరాత్ కోలీలు 1824 మొదలు 1825 వరకూ, 1828, 1839, 1849 లోనూ, తిరుగుబాట్లు జరిపారు, మహారాష్ట్రలో అనేక తిరుగుబాట్లు జరిగాయి. వాస్తవంగా చెప్పాలంటే మహారాష్ట్ర ఎల్లప్పుడు, తిరుగుబాటు జరుపుతూనే వుండేది. 1824 మొదలు 29 వరకూ కిట్టూరు తిరుగుబాటు, 1824లో కొల్హాపూర్ తిరుగుబాటు, 1841లో సతారా తిరుగుబాటు, 1844 లో గడ్‌కారీస్ తిరుగుబాటు - ముఖ్యంగా చెప్పుకోతగినవి. ఉత్తరభారతావని కూడా తిరుగుబాట్లకు తీసిపోలేదు. పశ్చిమ ఉత్తరప్రదేశ్ – హరియాణా జాట్లు, 1824 లో తీవ్రమైన తిరుగుబాటు జరిపారు. 1805 లో బిలాస్‌పూర్ రజపుట్‌లు, 1814-17 లో అలీగడ్ తాలూకాదార్లు, 1842 లో జబల్‌పూర్ బందేలాస్ జరిపిన తిరుగుబాట్లు ముఖ్యమయినవి.

భారతదేశంలో బ్రిటిష్ పాలన మొదటి వందసంవత్సరాల చరిత్రలోనూ ఎడతెరపి లేకుండా జరిగిన ఈ తిరుగుబాట్లకు, కర్షకులు, జమీందార్లు, చిన్న అధిపతుల మధ్య సంప్రదాయ సిద్ధమైన సంబంధాలు, విధేయతలు, ప్రాతిపదిక. ఇవన్నీ పూర్తిగా స్థానికంగానూ, చెదురుమదురుగానూ, జరుగుతూ వుండేవి. వీరికి వెను చూపు ఎక్కువ; జాతీయతను గురించిన ఆధునిక భావంగానీ, వలసరాజ్యాధిపత్యం స్వరూప స్వభావాల గురించి ఆధునిక పద్ధతుల్లో అవగాహనకానీ, నూతన సాంఘిక సంబంధాలు

ఆధారంగా నూతన సమాజాన్ని నిర్మించాలన్న భావంగానీ, వీరికి లేదు. వీరి నాయకులు పాతపద్ధతుల్లో నడిచేవారు; తమచుట్టూ మారుతూవున్న ప్రపంచం గురించి వీరికి ఏమాత్రము తెలియదు. వీరిని అణచి వేయడానికి పెద్ద సైన్యాలను ఒక్కొక్కప్పుడు బ్రిటిష్ వారు నియమించినప్పటికీ బ్రిటిష్ అధికారానికి వాస్తవమైన ముప్పుగా వీరు ఏర్పడలేదు. విదేశ పరిపాలనకు వ్యతిరేకంగా జరిపిన పోరాటంలో అమూల్యమైన స్థానిక సంప్రదాయాలను నెలకొల్పడమే వీరు చేసిన గొప్ప సహాయం.

1857 లో జరిగిన తిరుగుబాటులో, బ్రిటిష్ పాలనకు సంప్రదాయ సిద్ధమైన వ్యతిరేకత పరాకాష్ఠ నందుకుంది. ఈ తిరుగుబాటులో కోట్లాది కర్షకులు, వృత్తి పనివారు, సైనికులు పాల్గొన్నారు.

ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యానికి చెందిన సైనికుల తిరుగుబాటుతో ఈ తిరుగుబాటు ప్రారంభమైంది. వీరిని సిపాయిలు అనేవారు. ఈ తిరుగుబాటు అనతి కాలంలోనే విస్తార ప్రాంతాలకు వ్యాపించింది. ప్రజల్లో చాలామంది ఇందులో చేరారు. విదేశ పాలనకు వ్యతిరేకంగా ప్రజల్లో కొంతకాలంగా పేరుకుపోయిన అసంతృప్తి ఫలితమే ఈ తిరుగుబాటు. భూమిశిస్తు విషయంలో అధికార్లు అవలంబించిన విధానం, దాని ఫలితంగా భూములను కోల్పోవడం, పోలీసులూ చిన్నచిన్న ఉద్యోగులూ చిన్నచిన్న న్యాయస్థానాలూ అవలంబిస్తున్న అక్రమవిధానాలు - వీటన్నిటితో కర్షకుల్లో అసంతృప్తి ప్రబలింది. ప్రభుత్వంలో ఉన్నతోద్యోగాలు లభించకపోవడంతో, మధ్యతరగతి ప్రజలూ అంతకంటె పైతరగతివారూ, ముఖ్యంగా ఉత్తర భారతంలోని ప్రజలు ఇబ్బందులకు గురయ్యారు. భారతీయ పాలకులూ సంస్థానాధీశులూ జమీందార్లూ అధికారాన్ని కోల్పోవడంతో వీరిమీద ఆధారపడివున్న పండితులూ మౌల్వీలు మొదలైనవారికి ఆదాయం లేకపోయింది. 1856లో బ్రిటిష్‌వారు అవధ్‌ను స్వాధీనం చేసుకోవడాన్ని చాలామంది నిరసించారు. ముఖ్యంగా అవధ్ ప్రజలే ఎక్కువ నిరసించారు. ఈస్ట్‌ఇండియా కంపెనీ సైనికుల్లో చాలామందికి ఈచర్య కోపాన్ని కలిగించింది. ఈసైనికుల్లో చాలామంది అవధ్‌కు చెందినవారు. అంతేకాక, అవధ్‌లో తమ కుటుంబాలకు చెందిన భూములకు వీరు ఇప్పుడు ఎక్కువ పన్ను కట్టవలసి వచ్చింది. తాలూక్‌దార్లు - జమీందార్లలో చాలామందీ ఎస్టేట్‌లను బ్రిటిష్‌వారు స్వాధీనం చేసుకున్నారు. ఈ విధంగా తమ ఎస్టేట్‌లను పోగొట్టుకున్న తాలూక్‌దార్లు, బ్రిటిష్ పాలనకు ప్రమాదకరంగా తయారయారు. బ్రిటిష్ వైస్రాయ్ లార్డ్ డల్‌హౌసీ అనుసరించిన విస్తరణ విధానం దేశంలోని చాలామంది సంస్థానాధీశులను భయకంపితులను చేసింది. విదేశ పాలకులకు పూర్తిగా లొంగిపోయినా లేదా వారికి విధేయులుగా వుంటామని అభిమానాన్ని వెడనాడి ప్రకటించినా

కూడా తమ ఉనికికి ప్రమాదం తొలగిపోదని ఈ సంస్థానాధీశులు గుర్తించారు. నానా సాహెబ్ - జాన్సీరాణి-బహదూర్‌షా, బ్రిటిష్‌వారికి ప్రధాన శత్రువులుగా తయారయేందుకు ఈ విస్తరణ విధానమే కారణం. కంపెనీ సైనికులు లేదా సిపాయీలు, తమకు లభిస్తున్న తక్కువజీతాలతోనూ కష్ట జీవితంతోనూ బ్రిటిష్ ఆఫీసర్లు తమను చూస్తున్న నీచమైన వైఖరితోనూ అసంతృప్తి చెందివున్నారు. ఆకాలంనాటి బ్రిటిష్ పరిశీలకు లొకరు ఈవిధంగా వ్రాశారు. "సిపాయిని పురుగుకింద పరిగణించేవారు. అతన్ని తిట్టే వారు. అతి అమర్యాదగా చూసేవారు. నిగ్గర్ అని వ్యవహరించేవారు. సువ్వర్ అంటే పంది అని పిలిచేవారు. బ్రిటిష్ వారిలో పిన్నవయసువారు తక్కువరకం మృగం క్రింద జమకట్టి చూసేవారు." సిపాయికి ఉద్యోగంలో పైకిపోయే అవకాశం వుండేదికాదు. ఏ భారతీయుడూ సుబేదార్‌కంటె పెద్దఉద్యోగి కాలేడు. సుబేదార్‌కు నెలకు అరవై డెబ్బయి రూపాయల జీతం లభించేది.

ఈ విధంగా, 1857 నాటికి ప్రజలందరూ తిరుగబడే పరిస్థితులు ఏర్పడ్డాయి. కొత్తరకం తుపాకిగుండ్లు, తిరుగుబాటు ప్రారంభానికి కారణభూతాలయాయి. కొత్త ఎన్‌ఫీల్డు రైఫిల్ ఉపయోగించే తుపాకి గుండ్లకు మైనపు కాగితం చుట్టి వుండేది. వీటిని ఉపయోగించేముందు సైనికులు ఈపైకాగితాన్ని పంటితో కొరికి తొలగించవలసి వచ్చేది. కొన్ని కొన్ని సందర్భాల్లో ఈ మైనం గోమాంసంతోనూ పందికొవ్వుతోనూ తయారు చేసినదిగా వుండేది. దీనితో, తమ మతపరమైన భావాలను కించపరచినట్టుగా భావించి సిపాయీలు కోపోద్రిక్తులయారు. తిరుగుబాటుకు సిద్ధమయారు. వీరి తిరుగు బాటు, భారతసమాజంలోని ఇతరవర్గాలుకూడా తిరుగుబాటు జరిపేందుకు అవకాశం ఇచ్చింది.

1857వ సంవత్సరం మేనెల 10వ తేదీన ఢిల్లీకి 36 మైళ్లదూరంలోవున్న మీరట్‌లో సైనికులు తిరుగుబాటు జరుపడంతో తిరుగుబాటు ప్రారంభమైంది. ఉత్తరంలోని పంజాబ్, దక్షిణంలోని నర్మదనుంచి తూర్పున బీహార్‌దాకా పశ్చిమాన రాజ్‌పుటానా దాకా ఈ తిరుగుబాటు వ్యాపించింది. మీరట్‌లోని సైనికులు తమ ఆఫీసర్లను చంపివేసి ఢిల్లీకి బయలుదేరారు. వీరు, ఆమరునాడు ఉదయం ఢిల్లీచేరుకోగానే ఢిల్లీ సైనికులుకూడా తిరుగుబాటు జరిపి నగరాన్ని స్వాధీనం చేసుకుని వృద్ధుడైన బహదూర్ షాను భారత చక్రవర్తిగా ప్రకటించారు. సైనికులు ఈవిధంగా తమ తిరుగుబాటును తిరుగుబాటు యుద్ధంగా మార్చారు. అప్పటినుంచీ తిరుగుబాటులో పాల్గొన్న సైనికులూ భారతీయ నాయకులూ జమీందార్లూ మొఘల్ చక్రవర్తికి విధేయులుగా ప్రకటించుకున్నారు. భారతీయులు ఐకమత్యానికి మొఘల్ చక్రవర్తి చిహ్నంగా రూపొందారు.

ఉత్తర – మధ్య భారతంలో ప్రతిచోటా సిపాయిల తిరుగుబాటు దరిమిలా ప్రజలు కూడా తిరుగుబాటు జరిపారు. మామూలు ప్రజానీకం శూలాలూ - గొడ్డళ్ళూ - విల్లంబులు - లాఠీలు - మొదలైన వాటిని ఉపయోగించారు. కర్షకులూ, వృత్తి పనులు చేసుకునేవారూ తిరుగుబాటులో పాల్గొనడంలో ముఖ్యంగా ఇప్పటి ఉత్తరప్రదేశ్ బీహార్‌తో తిరుగుబాటుకు మంచి బలం లభించింది. అవధ్‌లో బ్రిటిష్ వారితో పోరాటం సలిపి మరణించిన లక్ష యాభైవేలమందిలో లక్షమంది పౌరులని ఒక అంచనా.

1857 తిరుగుబాటుకు బలం ఇచ్చిన ఒక ముఖ్య అంశం, హిందూ ముస్లింలఐకమత్యం. సైనికుల్లో ప్రజల్లో నాయకుల్లో కూడా హిందువులు ముస్లింల మధ్య మొత్తరుగానే, పూర్తి సహకారం ఉండేది. తిరుగుబాటుదార్లందరూ, ఒక ముస్లిం అయిన బహదూర్‌షాను తమ చక్రవర్తిగా గుర్తించారు. హిందువులూ ముస్లింలూ సిపాయిలూ ఎదుటివారి భావాలను మన్నించారు. ఉదాహరణకు తిరుగుబాటు విజయవంతమైన చోటల్లా వెంటనే హిందువుల భావాలను మన్నింపు సూచనగా గోహత్యను నిషేధించారు. నాయకత్వంలో కూడా అన్ని స్థాయిల్లోనూ హిందువులకూ ముస్లింలకూ సమాన ప్రాతినిధ్యం ఉండేది. ఒక సీనియర్ బ్రిటిష్ అధికారి ఆ తర్వాత, ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ "ఈ సందర్భంలో మాత్రం మహమ్మదీయులకూ హిందువులకూ మధ్య వైషమ్యం - కల్పించలేకపోయాం" అని వాపోయారు. నిజానికి మధ్యయుగంలోనూ 1858 కి ముందూ భారత ప్రజలలో రాజకీయాలు మతపరమైనవికావని 1857 లో సంభవించిన పరిణామాలు స్పష్టం చేశాయి. చివరకు, దేశంలోని ఎక్కువమంది సంస్థానాధీశుల మద్దతూ ఆదిమ జాతుల నాయకుల మద్దతూకలిగి ప్రపంచమంతటా ఉన్నత స్థితిలో వెలిగిపోతూవున్న బ్రిటిష్ సామ్రాజ్యవాదుల సైనిక శక్తికి తిరుగుబాటుదార్లు తట్టుకోలేకపోయారు. వీరి దగ్గర చాలినన్ని ఆయుధాలు లేవు, ఒక వ్యవస్థ అంటూ లేకపోయింది, క్రమశిక్షణ లోపించింది, కృతనిశ్చయంతో కూడిన సమైక్య నాయకత్వం కూడా వీరికి లేదు. ఈ లోపాలను వీరు సరిదిద్దుకునే లోపునే బ్రిటిష్ ప్రభుత్వం తన అమితమైన వనరులన్నిటినీ సమకూర్చుకుని తిరుగుబాటుదార్లను అతి క్రూరంగా అణిచివేసింది. బ్రిటిష్ వారు 1857 సెప్టెంబరు 20 తేదీన ఢిల్లీని స్వాధీనం చేసుకొని చక్రవర్తి బహదూర్‌షాను బందీగా పట్టడంతో తిరుగుబాటుదార్లకు పెద్ద దెబ్బ తగిలింది. మిగతా నాయకులు పోరాటం కొనసాగించారు కాని ఒకరి తర్వాత ఒకరు పరాజయం పొందారు. కాన్పూరులో నానాసాహెబ్ ఓడిపోయారు. ఆయనకు విధేయుడైన సైన్యాధిపతి తాంతియాటోపి 1859 ఏప్రియల్‌లో తన మిత్రుడొకడు విద్రోహుడై శత్రువుకు తనను పట్టిచ్చేవరకూ ఎంతో ధైర్యసాహసాలతో గెరిల్లాపోరాటం

జరిపారు. ఝాన్సీరాణి 1858 జూన్ 17 తేదీ వరకూ పోరాడుతూ ఆరోజున కూడా పోరాటం జరుపుతూనే మరణించింది. బీహార్ కు చెందిన కన్వార్ సింగ్, ఢిల్లీ తిరుగుబాటుదార్లకు సైన్యాధిపతి అయిన అతిసమర్ధుడైన సిపాయి బాక్త్ ఖాన్ బరేలీకి చెందిన ఖాన్ బహదూర్ ఖాన్, ఫైజాబాద్‌కు చెందిన మౌలి అహముద్దుల్లా వీరందరూ 1859 నాటికి మరణించారు. అవధ్ బేగమ్, నేపాల్‌కు పారిపోవలసి వచ్చింది.

1859 వ సంవత్సరం చివరకు భారతదేశమంతటా బ్రిటిష్ అధికారం పూర్తిగా స్థిరపడిపోయింది. కాని తిరుగుబాటు వ్యర్థంకాలేదు. భారతదేశాన్ని రక్షించేందుకు సంప్రదాయ సిద్ధమైన నాయకత్వంలో పాతపద్ధతిలో అన్నిటికీ తెగించి చేసిన ప్రయత్నమే అయినా బ్రిటిష్ సామ్రాజ్య వాదులనుంచి విముక్తి పొందేందుకు భారతీయులు జరిపిన మొట్టమొదటి పోరాటం ఇదే. తిరుగుబాటులో పాల్గొన్న వీరుల పేర్లు దేశమంతటా... ఇంటింటా — ప్రతినోటా వెలిశాయి. పాలకులకు ఇది రుచించక పోయినా ప్రజలు భయపడలేదు.

1857 తిరుగుబాటు, బ్రిటిష్ పాలనను వ్రేళ్ళతో కదిపివేసింది.

## ఆదిమవాసుల తిరుగుబాట్లు

భారతదేశంలో చాలాచోట్లవున్న ఆదిమవాసులు, వందలాది తిరుగుబాట్లలో పాల్గొన్నారు. బ్రిటిష్ ఆధిపత్య విస్తరణను, వలసపాలనను అక్రమంగా వ్యాప్తి చేయడాన్ని వీరు గర్హించారు. అన్నిటికన్నా, వలస ఆర్థికవ్యవస్థ – పీడన – కంట్రోలు ప్రభావం క్రిందికి ఆదిమ వాసులను తీసుకుని రావడంలో బ్రిటిష్ వారికి సాధనాలయిన వడ్డీ వ్యాపారులు, వర్తకులు, రెవెన్యూ కర్షకులు, తమ నిరాడంబర ఆశ్రయ జీవితాలలోకి చొచ్చుకు రావడాన్ని వీరు గర్హించారు. ఆదిమ వాసులు జరిపిన తిరుగుబాట్లలో వారు అశేష ధైర్యసాహసాలనూ, త్యాగాన్ని ప్రదర్శించారు; వీరిని అణగద్రొక్కే అధికార యంత్రాంగం అతి కిరాతకంగా వీరిని హత్యచేసింది. కోపోద్రేకులై, వ్యవస్థీకృతం కాని గొడ్డళ్ళు, విల్లంబుల వంటి ప్రాచీన ఆయుధాలుగల వ్యక్తులకూ, ఆధునిక ఆయుధాలుగల క్రమశిక్షితులైన బ్రిటిష్ భారత సైనిక పటాలాలకూ మధ్య జరిగిన అసమాన యుద్ధాలలో లక్షలాది మంది మరణించారు. 1820 నుంచి 1837 వరకు కోల్సు, 1855 నుంచి 1856 వరకూ సంతాలులు, 1879 లో రంపాలు, 1895 నుంచి 1901 వరకూ ముందాలు జరిపిన ఆదిమ వాసుల తిరుగుబాట్లు అతి ముఖ్యమయినవి.



1885 లో జరిగిన భారత జాతీయ కాంగ్రెసు మొట్టమొదటి సమావేశం ప్రతినిధులు



పూనాలో హోమ్ రూల్ లీగ్ ఊరేగింపు



దాదాభాయి నౌరోజి



ఎం. జి. రనడె



బదురుద్దీన్ తయాబ్జీ



సురేంద్ర నాధ్ బెనర్జీ



గోపాల కృష్ణ గోఖలే



అరవింద ఘోష్



లాలాలజపత్ రాయ్      బాల గంగాధర తిలక్      బిపిన్ చంద్రపాల్

# Proclamation.

Whereas the Government has thought fit to effectuate the Partition of Bengal in spite of the universal protest of the Bengali nation, we hereby pledge and proclaim that we as a people shall do everything in our power to counteract the evil effects of the dismemberment of our Province and to maintain the integrity of our race. So help us God.

Dated this First day of November
in the year Nineteen Hundred
and Five and given under




బెంగాల్ విభజనకు ఆక్షేపణగా ప్రకటన

## కర్షకుల ఉద్యమాలు - తిరుగుబాట్లు

భారతీయ కర్షకులు, ముఖ్యంగా వలసపాలకుల పీడనకు లోనయ్యారు; దీని ఫలితంగా వీరు, ప్రతి అడుగున, సమరం జరిపారు. దురదృష్టవశాత్తు బ్రిటిష్ వలస తత్వానికి వ్యతిరేకంగా కర్షక ప్రతిఘటనవివరాలు సులభంగా అందుబాటులో లేవు. ఇవి, ప్రభుత్వ ప్రాచీన సంగ్రహాలయాలలోనూ, ఆధునిక చరిత్రకు సంబంధించిన ఇతరపత్రాల్లోనూ, యింకా గుప్తంగా వున్నాయి. అంతేకాకుండా, కర్షకుల తిరుగుబాట్లను, అధికారపత్రాలలో చట్టవ్యతిరేక, బందిపోటు చర్యలుగా వర్ణించారు. ఆఖరి కొద్దిసంవత్సరాలలో మాత్రమే, బ్రిటిష్ అధికారానికి వ్యతిరేకంగా కర్షకులు జరిపిన వివిధ ప్రతిఘటన చర్యలగురించి కొద్ది ప్రాథమిక వివరాలు తెలిశాయి.

ఇంతకి ముందు మనం తెలుసుకున్నట్టుగా, జమీందార్లు, చిన్న చిన్న సామంతుల నాయకత్వం క్రింద జరిగిన పౌర తిరుగుబాట్లకు, కర్షకులు వెన్నెముకగా పనిచేశారు. 1857లో జరిగిన తిరుగుబాటు దీనిని నిరూపించింది. మత ప్రాతిపదికగా కూడా, కర్షక తిరుగుబాట్లు జరిగాయి. మత - సాంఘిక సంస్కరణలు - పవిత్రత కాపాడటంకోసం ప్రారంభమయిన ఈ ఉద్యమాలు, కొత్త జమీందార్లనూ, భూకామందులనూ, వడ్డీ వ్యాపారులను, మత ప్రసక్తి లేకుండా తీవ్రంగా ప్రతిఘటించి తమ వ్యవసాయ స్వరూపాన్ని వెల్లడి చేసుకున్నారు. చివరిలో వీరు బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో తలపడ్డారు. బెంగాల్, బీహార్, పంజాబ్, మద్రాసులలో జరిగిన వాహబీ ఉద్యమం, బెంగాల్‌లో జరిగిన ఫరీజి ఉద్యమం, పంజాబ్‌లో జరిగిన కూక తిరుగుబాట్లు వీటికి ఉదాహరణలు.

1858 తర్వాత, బ్రిటిష్ పరిపాలనకు కర్షక ప్రతిఘటన స్వభావంతో కొంతమార్పు వచ్చింది. కర్షకులు, యిప్పుడు, కర్షకుల కోర్కెలను తీర్చటం కోసం ప్రభుత్వానికీ, విదేశ తోటల యజమానులకూ, దేశంలోని జమీందార్లకూ, వడ్డీవ్యాపారులకూ వ్యతిరేకంగా ప్రత్యక్ష పోరాటం జరిపారు.

ఆధునిక యుగంలో జరిగిన బ్రహ్మాండమైన కర్షక ఉద్యమాలలో 1859–60 లో బెంగాల్‌లో జరిగిన నీలిమందు ప్రతిఘటన ఒకటి. నీలిమందు తయారుచేయటం యూరోపియన్ల గుత్తాధికారం క్రింద వుండేది. విదేశ తోటల యజమానులు నీలిమందు మొక్కలను పెంచాలని కర్షకులపై ఒత్తిడి తెచ్చేవారు. వారిని పీడించుకు తినేవారు. తక్కువ రేట్లకు నీలిమందు తయారుచేసేటట్టు చేయడంకోసం, తోటల యజమానులు, చట్ట విరుద్ధంగా కర్షకులను కొట్టేవారు; నిర్బంధంలో వుంచేవారు. ఈ పీడనను ప్రఖ్యాత బెంగాలీ రచయిత దీనబంధుమైత్ర, 1860 లో ప్రచురించిన తమ నాటకం —

'నీల్ దర్పణ్‌లో' చిత్రించారు. కర్షకుల కోపోద్రేకాలు 1859 లో పెల్లుబికాయి. లక్షలాది మంది కర్షకులు నీలిమందు తయారు చేయడానికి నిరాకరించారు; తోటల యజమానులు వారి సాయుధ భటులు, చిత్రహింసలు - దౌర్జన్యాలను జరపడాన్ని తీవ్రంగా ప్రతిఘటించారు. బెంగాల్ మేధావులు సమయోచితంగా, తిరుగుబాటు జరుపుతోన్న కర్షకులను బలపరుస్తూ శక్తివంతమైన ఉద్యమాన్ని ఏర్పాటుచేశారు. ఈపద్ధతి లోట్లను తగ్గించే ఉపాయాల గురించి ఆలోచించటానికి, ప్రభుత్వం ఒక విచారణా సంఘాన్ని నియమించవలసి వచ్చింది. అయినప్పటికీ తోటలయజమానుల దమన విధానము, కర్షకుల ప్రతిఘటన కొనసాగాయి. బీహార్‌లో నీలిమందు కర్షకులు 1866-68 లో దర్భంగా. చెంపారన్‌లలో భారీతిరుగుబాటు జరిపారు. ఇదే మోస్తరుగా బెంగాల్‌లో జెస్సోర్‌లోని కర్షకులు, 1883 లోనూ 1889-90 లోనూ తిరుగుబాటు జరిపారు.

1870 సంవత్సరాలలో, తూర్పు బెంగాలులో మళ్ళీ వ్యవసాయ అశాంతి బయలు దేరింది. బెంగాలులో శక్తివంతమైన జమీందార్లు కౌలుదార్లను క్రూరంగా పీడించుకు తిన్నారు. కౌలుదార్లను వెల్లగొట్టడం హింసించడం చట్టవిరుద్ధంగా ఆస్తిని స్వాధీనం చేసుకోవడం, పంటలు మొదలయినవాటిని తీసుకెళ్ళడం కౌలు ఎక్కువచేయడానికి బలాన్ని ఉపయోగించటం, కౌలుదారి హక్కులు పొందకుండా కర్షకులను అరికట్టడం, మొదలయినవన్నీ జరిపారు. బెంగాల్ కర్షకులు కూడా సంప్రదాయ సిద్ధమైన ప్రతిఘటనకు పేరుమోశారు. 1782 లో ఉత్తర బెంగాల్ కర్షకులు, ఈస్టు ఇండియా కంపెనీ రెవెన్యూ కర్షకుడు దేవీసింగు మీద తిరగబడ్డారు. 1872 నుంచి 76 వరకూ, కౌలు చెల్లించకుండావుండే యూనియన్లలో వీరు చేరి, తూర్పు బెంగాలులో వివిధ ప్రాంతాలలోనూ, జమీందార్ల మీదా, వారి ఏజంట్లమీదా, వీరు దాడిజరిపారు. ప్రభుత్వం జోక్యం కలిగించుకొని, పటిష్టమయిన చర్యలు తీసుకున్న తర్వాతనే, కర్షకప్రతిఘటన ఉద్యమం అణచివేయబడింది. అయినప్పటికీ ఆతర్వాతి సంవత్సరాలలో అడపా దడపా ప్రతిఘటనలు జరిగాయి. జమీందార్ల దమన విధానంనుంచి కర్షకులను కాపాడటానికి శాసనం చేస్తామని ప్రభుత్వం హామీయిచ్చిన తర్వాతనే యివి సద్దుమణిగాయి. నూతన మేధావులలో పలువురు మరోసారి కర్షకుల కోర్కెలను బలపరిచారు.

1875 లో మహారాష్ట్రకు చెందిన పూనా, అహమ్మద్ నగర్ జిల్లాలలో పెద్ద వ్యవసాయ అలజడి జరిగింది. మహారాష్ట్రలో ప్రభుత్వం భూమిశిస్తు సమస్యను, ప్రత్యక్షంగా కర్షకులతో పరిష్కరించింది. అయితే యిదే సమయంలో ప్రభుత్వ రెవెన్యూ పద్దులు ఎంత ఎక్కువగా వున్నాయంటే, ఎక్కువ వడ్డీ తీసుకునే వడ్డీ వ్యాపారుల నుంచి అప్పుతీసుకోకుండా కర్షకులు ఈ శిస్తుకట్టడం అసంభవ మయ్యేది. వడ్డీ

వ్యాపారులకు యింకా ఎక్కువ భూమిని తనఖాపెట్టడమో అమ్మివేయడమో జరిగేది. కర్షకుని మీదా, అతని భూమి మీదా తన పట్టును పటిష్ఠం చేసుకోడానికి వడ్డీ వ్యాపారులు సాధ్యమయిన చట్ట అనుకూల - చట్టవ్యతిరేక ఉపాయాలన్నీ అవలంబించేవారు. 1874 అంతానికి కర్షకులలో శాంతం అంతమయింది. పూనా - అహమ్మద్‌నగర్ జిల్లాల కర్షకులు వడ్డీ వ్యాపారులను సాంఘికంగా బహిష్కరించారు. ఇది త్వరలో వ్యవసాయ కొట్లాటగా మారిపోయింది. ప్రతిచోట తమ ఋణాలకు సంబంధించిన బాండులనూ, డిక్రీలనూ యితర పత్రాలను బలవంతాన స్వాధీనం చేసుకొని వాటిని బహిరంగంగా తగులబెట్టారు. పోలీసులు కర్షక ప్రతిఘటన ధాటిని ఎదుర్కోలేక పోయారు; పూనాలోని సైనికదళం యావత్తూ — అశ్వికదళం, కాల్బలం, ఫిరంగి దళం వీరిమీద చర్యతీసుకొని అణచివేసింది. మహారాష్ట్రకు చెందిన ఆధునిక మేధావులు, మరోసారి కర్షకుల కోర్కెలను బలపరిచారు. ఎక్కువ భూమి శిస్తులను చెల్లించాలని ఒత్తిడి తేవడంవల్ల, ప్రభుత్వం కర్షకులకు చౌకగా ఋణాలు అందచేసే ఏర్పాట్లు చేయకపోవడం వల్ల కర్షకుల కష్టాలు ఎక్కువయ్యాయని కూడా వీరు పేర్కొన్నారు.

దేశంలో యితర ప్రాంతాలలోకూడా కర్షకుల ప్రతిఘటన ప్రజ్వరిల్లింది. దీనికి రెండు ఉదాహరణలను పేర్కొనవచ్చు. "జెన్మీస్" అనే భూకామందుల గొడవవల్ల, ఉత్తరకేరళ మలబార్‌కి చెందిన 'మాపిళ్లై' కర్షకులు 1836 మొదలు 1854 వరకు, 22 తిరుగుబాట్లు జరిపారు.

1873 మొదలు 1880 వరకూ, మాపిళ్లై అసంతృప్తివల్ల మరో ఐదు పెద్దతిరుగుబాట్లు జరిగాయి. ఇదే మోస్తరుగా ఎక్కువ భూమిశిస్తులు వేయడంవల్ల 1893–94లో అస్సాం మైదానాలలో కర్షకుల కొట్లాటల పరంపర జరిగింది. కర్షకులు, ఎక్కువ శిస్తులు చెల్లించడానికి నిరాకరించారు. తమ భూములను స్వాధీనం చేసుకోడానికి అధికారులు చేసిన ప్రయత్నాలను సమైక్యంగా ప్రతిఘటించారు. రెవెన్యూ కలెక్టర్లను ప్రతిఘటించారు. కర్షక ఉద్యమాన్ని అణచివేయడానికి ప్రభుత్వం, సైనికులనూ, సాయుధ పోలీసులను సమీకరించవలసి వచ్చింది. కిరాతకంగా కాల్పులు జరపడంవల్ల బయనెట్‌లతో కొట్టడంవల్ల, అనేకమంది కర్షకులు చనిపోయారు. ఆనాటి పోలీసుల, సైనికుల కిరాతక చర్యలను, అస్సాం ప్రజలు ఈనాటికి కూడా గుర్తుంచుకున్నారు.

ఏఘట్టంలో కూడా 19వ శతాబ్దం కర్షక ఉద్యమాలు, ప్రజాతిరుగుబాట్లు, భారతదేశంపై బ్రిటిష్ అధికారానికి ముప్పు తెచ్చిపెట్టలేదు. భారత ఆర్థిక వ్యవస్థను వలసవిధానం క్రిందికి తేవడంవల్ల, ఆస్తులను స్వాధీనం చేసుకొని, భరించరాని బాధలుపెట్టడంవల్ల

కర్షకులు, ఆదిమవాసులు స్వచ్ఛందంగా జరిపిన తిరుగుబాట్లను, యివి ప్రతిబింబిస్తున్నాయి. తమ కష్టాలకు కారకులయిన నీలిమందు తోటల యజమానులు, జమీందార్లు లేక వడ్డీ వ్యాపారస్థులమీద వీరు తిరగబడేవారు. అంతేకాకుండా శాంతిభద్రతలను కాపాడాలన్న మిషమీద వలసవ్యవసాయ స్వరూపాన్ని బలపరచడానికి బ్రిటిష్‌వారు చేసిన ప్రయత్నాలను వీరు తీవ్రంగా ప్రతిఘటించారుకూడా. వాస్తవం చెప్పాలంటే అమాయకులు నిరక్షరాస్యులయిన భారత సామాన్య ప్రజానీకం, కొత్తగా విద్యావంతులయిన పైతరగతి భారతీయులకన్నా వలసతత్వం బెడదను బాగా అవగాహన చేసుకున్నారు. అయితే యిదే సమయంలో వీరి సమరాలన్నీ విఫలమయ్యాయి. వీరి విశ్వాసము, ధైర్యసాహసాలు, సకలత్యాగాలకు సిద్ధంకావటం, ప్రపంచవ్యాప్త సామ్రాజ్య సాధన సంపత్తులు కలిగి, ఆధునిక ఆయుధాలుగల శక్తివంతమైన సామ్రాజ్యవాదానికి తగినఉజ్జీ కాలేకపోయాయి. వీరికి కొత్తఆదర్శంకాని, వలసతత్వంవల్ల ఉదయించిన నూతన సాంఘిక శక్తుల పరిశీలన ఆధారంగా నూతన సాంఘిక, ఆర్థిక, రాజకీయ కార్యక్రమంకాని లేదు. విశాల ప్రాతిపదికమీద ప్రజలను సమైక్యంచేసే సమాజమూ, నూతనజీవితం గురించి సరియైన భావమూ వీరికిలేదు. చెదురుమదురుగా, ఐక్యతలేకుండా ఎన్ని తిరుగుబాట్లు జరిగినా, ఆధునిక సామ్రాజ్యవాదాన్ని ఓడించలేక పొయ్యాయి. దీనికి, ఆధునికభావన, పరిశీలన ఆధారంగా ప్రతిఘటన, సమాజంగురించి నూతన దృక్పథం, దేశవ్యాప్తమయిన రాజకీయ కార్యకలాపాలకు సామాన్య ప్రజానీకాన్ని సమీకరించగల నూతన ఆదర్శాలు, పార్టీలు ఆధారంగా ప్రతిఘటన, వీరికిలేవు.

ఇది, 20వ శతాబ్దంలో, సామాన్య కర్షక అసంతృప్తిని, సాధారణ సామ్రాజ్యవాద వ్యతిరేక అసంతృప్తితో సంలీనం చేసినపుడు సాధించగలిగారు. వీరి రాజకీయ కార్యకలాపాలు, విస్తృతజాతీయ ఉద్యమంలోనూ, ఆధునిక కిసాన్ ఉద్యమాలలోనూ ప్రతిబింబించాయి. 19వ శతాబ్దంలో జరిగిన ప్రజాఉద్యమాలు, తిరుగుబాట్లు, భారత ప్రజలలో నిగూఢంగావున్న సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తిని ప్రస్ఫుటం చేశాయి.

## ఆధునిక రాజకీయాలు, నూతన రాజకీయ సంఘాలు

19వ శతాబ్దం రెండో అర్ధభాగంలో జాతీయ రాజకీయ చైతన్యం చిగురించడమూ, వ్యవస్థీకృతమైన జాతీయ ఉద్యమానికి పునాదులు ఏర్పడి, పెంపొందటమూ జరిగాయి. ఈకాలంలో ఆధునిక భారతీయ మేధావులు, రాజకీయ విద్యను వ్యాప్తిచేయడానికీ, దేశంలో రాజకీయ కృషిని ప్రారంభించడానికీ, రాజకీయ సంఘాలను ఏర్పాటుచేశారు.

ఈపనికి, నూతన రాజకీయ భావాలు, వాస్తవికతను తెలుసుకునే నూతన మేధాశక్తి, నూతన సాంఘిక, ఆర్థిక, రాజకీయ లక్ష్యాలు, సంఘర్షణ, ప్రతిఘటన నూతనశక్తులు, రాజకీయవ్యవస్థ నూతన పద్ధతులు, ప్రాతిపదికగా వుండాలి. ఆదర్శం, విధానం, వ్యవస్థ, నాయకత్వంలో యిది ఒక మలుపుగాయిగా వుండాలి. ఆధునిక రాజకీయ కృషితో భారతీయులకు పరిచయం లేనందువల్ల, ఈలక్ష్యం కష్టమయినది. తమ పరిపాలకులకు వ్యతిరేకంగా, ప్రజలు, రాజకీయ వ్యవస్థలను ఏర్పాటు చేయవచ్చునన్న అభిప్రాయంకూడా క్రొత్తది. దీని ఫలితంగా, ఈ ప్రాథమిక సంస్థలకృషి, ప్రాథమిక రాజకీయ కార్యకర్తల కృషికూడా మందకొడిగా జరిగింది; సామాన్య ప్రజలను ఆధునిక రాజకీయాలలోకి తేవడానికి అర్థశతాబ్దానికి పైగా పట్టింది.

రాజకీయ సంస్కరణల కోసం అలజడి ప్రారంభించిన మొట్టమొదటి భారతీయ నాయకులలో రాజారామ్ మోహన్‌రాయ్ ఒకరు. పత్రికలకు స్వేచ్ఛ, న్యాయవిచారణ కోసం, పరిపాలననుంచీ న్యాయశాఖను వేరుచేయడం, ఉన్నతపదవులకు భారతీయులను నియమించటం, జమీందారీ పీడననుంచి రైతులకు రక్షణకల్పించడం, భారతీయ వర్తక పరిశ్రమలను అభివృద్ధిపరచటం మొదలైన వాటినికోరుతూ ఆయన సమరం జరిపారు. బ్రిటిష్‌పాలన తర్వాత, స్వేచ్ఛా భారతావని ఉదయించ గలదన్న ఆశాభావం ప్రాతిపదికగా, ఆయన, ప్రజాకార్యక్రమాలను ప్రారంభించారు. అంతర్జాతీయ వ్యవహారాలలో ఆయన, అత్యంతశ్రద్ధ కనబరిచారు; ప్రతిచోట, స్వేచ్ఛ, ప్రజాస్వామ్యం, జాతీయతకోసం జరిగిన పోరాటాలను బలపరిచారు.

రామ్‌మోహన్ సంప్రదాయాన్ని, ఆయన మరణానంతరం రాడికల్ బెంగాలీ యువజనులు కొంతమంది, కొనసాగించారు. వీరు తమఅధ్యాపకులైన ప్రఖ్యాత ఆంగ్లో యిండియను 'హెన్రీ వివియన్ డెరోజియో,' పేరును,తమబృందానికి పెట్టుకున్నారు. ఫ్రెంచి విప్లవం, 'టాంపెనే' 'జర్మీబెన్‌థామ్' భావాలు ఆధారంగా, స్వేచ్ఛ, దేశభక్తి భావాలను తమవిద్యార్థులలో 'డెరోజియో' ఉత్తేజింపచేశారు. ఆధునిక భావాలగురించి చర్చించి, వాటిని భారతదేశానికి వర్తింప చేయడానికి డెరోజియన్లు అనేక ప్రజాసంస్థలను ప్రారంభించారు; ఈ భావాలను ప్రచారం చేయడానికి అనేకవార్తా పత్రికలనూ, యితర పత్రికలనూ ప్రారంభించారు. ఈవిధంగా ఆధునిక రాజకీయ చైతన్య బీజాలను, 1820 సంవత్సరాలలోనూ, 1830 సంవత్సరాలలోనూ, రామ్ మోహన్ రాయ్, డెరోజియన్‌లు నాటారు.

1837లో కలకత్తాలో భూకామందుల సంఘం అన్నపేరుమీద భారతదేశంలో మొట్ట మొదటి రాజకీయసంఘం ప్రారంభింప బడింది. అయితే, బెంగాల్, బీహార్, ఒరిస్సా

జమీందార్ల వర్గ ప్రయోజనాలను కాపాడే సంకుచిత లక్ష్యంతో దీనిని ప్రారంభించారు. 1843లో, విస్తృత రాజకీయ లక్ష్యాలతో, బెంగాల్ బ్రిటిష్ భారతసంఘాన్ని ఏర్పాటు చేశారు. ఈ రెండుసంస్థలనూ 1851లో సంలీనంచేసి, బ్రిటిష్ భారతసంఘాన్ని ఏర్పాటు చేశారు. ఇదేసమయంలో మద్రాసు వాస్తవ్యుల సంఘమూ, బొంబాయి సంఘమూ, 1852లో ఏర్పాటయ్యాయి. ఇదేమోస్తరు సంఘాలు, క్లబ్బులు, దేశమంతటా చిన్న పట్టణాలలోనూ, నగరాలలోనూ ఏర్పాటయ్యాయి. దాదాపు యివన్నీ భాగ్యవంతులయిన వాణిజ్య — జమీందారీ వర్గాల ఆధిపత్యం క్రింద, స్థానికంగా వుండేవి. వీరు, రాజకీయ— ఆర్థిక పద్దులను బ్రిటిష్ పార్లమెంటుకు సమర్పించేవారు. పాలనా సంస్కరణలకోసమూ, పాలనా శాఖల్లో ఎక్కువమంది భారతీయులకు ఉపాధికోసము, విద్యావ్యాప్తికి, ప్రభుత్వంలో భారతీయులకు సంబంధం పెట్టడానికీ, భారతీయ వస్త్రకపరిశ్రమలను ప్రోత్సహించడానికీ, ముఖ్యంగా వీరు, కృషిచేసేవారు.

1857లో జరిగిన తిరుగుబాటు విఫలంకావడంతో, జమీందార్లు, సంస్థానాధిపతులు, భూ కామందులతో కూడినభూస్థితికలిగిన పైతరగతివారి నాయకత్వం క్రింద. బ్రిటిష్ పరిపాలనకు, సంప్రదాయ సిద్ధమైన రాజకీయప్రతిఘటన ఎంతమాత్రము జయప్రదం కాజాలదనీ, వలసరాజ్యాధిపత్య ప్రతిఘటన నూతనమార్గాల ద్వారాజరగాలనీస్పష్టమైంది. కాగా, 1858 తర్వాత, బ్రిటిష్పాలన స్వభావము, విధానాలు ముఖ్యమార్పుకు లోనయ్యాయని ఇంతకిముందు తెలుసుకున్నాము. ఇది, యింకాఅభివృద్ధి నిరోధకంగా తయారయింది. భారతీయమేధావులు, క్రమేపీ, అంతకంతకి ఎక్కువగా బ్రిటిష్విధానాలను విమర్శించి బ్రిటిష్పాలన పీడన స్వభావాన్ని యింకాబాగా అర్థంచేసుకోవడం,మొదలు పెట్టారు. కర్షకుల సత్వరప్రతిఘటన మోస్తరుకాక వలసతత్వంపట్ల ఆధునిక భారత మేధావుల ప్రతిఘటన, తటపటాయింపుతోకూడి, బలహీనంగా, ఎక్కువశాస్త్రయుక్తంగా వుండేది. భారతీయ మేధావుల అవగాహన పెంపొందటానికి చాలాకాలం పట్టింది. ఆధునికభావన ప్రాతిపదికగా ఒకేసారి ప్రారంభమయిన ఈ అవగాహన సామ్రాజ్యవాద వాస్తవస్వభావంగురించి క్షుణ్ణంగా పరిశీలన జరిపి, చిట్టచివరికి ఆధునిక రాజకీయ పరిణామంగా పరిణితిచెందింది.

అప్పుడున్న రాజకీయ సంఘాలు సంకుచిత మైనవిగా ఉన్నాయనీ మారిన పరిస్థితుల్లో ఇవి ఉపయోగంగా వుండజాలవనీ రాజకీయ చైతన్యంగల భారతీయులు గ్రహించారు. ఉదాహరణకు, బ్రిటిష్ భారతసంఘం జమీందార్ల ప్రయోజనాలతోనూ తత్ఫలితంగా ప్రభుత్వంలోనూ పూర్తిగా ఏకీభవించింది. అయితే నూతన రాజకీయాలు బ్రిటిష్పాలన

విమర్శనాత్మక వైఖరి ప్రాతిపదికగా వుండాలి. అందువల్ల ఒక కొత్త రకం జాతీయ రాజకీయ సంస్థను ఏర్పాటుచేయడానికి వీరు పూనుకున్నారు.

1866లో దాదాభాయి నౌరోజీ, భారతీయ సమస్యలను చర్చించి, బ్రిటిష్ ప్రజాభిప్రాయాన్ని కూడగట్టుకు రావడానికి, లండన్‌లో ఈస్టుఇండియా సంఘాన్ని ఏర్పాటుచేశారు. దీని శాఖలను భారతదేశంలోని పెద్దనగరాలలో ఏర్పాటు చేశారు. దాదాభాయి నౌరోజీ, త్వరలో తమ సమకాలికులకూ, భారతదేశంలోని యువతరంవారికి భారతదేశపు పితామహుండుగా పరిచితులయారు. ఈయన 1825లో జన్మించారు. ఈయన గొప్పవ్యాపారులయ్యారు; కాని తమ జీవితాన్నీ, సంపదను జాతీయ ఉద్యమానికి అంకితం చేశారు. ఈయన సమర్పించిన, బ్రిటిష్‌పాలన ఆర్థిక పరిశీలన, అతిముఖ్య మయినది. భారతదేశపు పేదరికానికీ, ఆర్థికంగా వెనుకబడి వుండటానికీ, స్థానిక పరిస్థితులు కారణం కాదనీ, భారతదేశపు సంపదనూ, పెట్టుబడినీ దోచుకుంటూవున్న వలసపాలనే కారణమనీ, ఆయన స్పష్టంచేశారు. తమ జీవితాంతం వరకూ దాదాభాయి, యువకులకు సన్నిహితంగా వుండేవాడు. తమ భావనను, రాజకీయాలనూ ఎల్లప్పుడు మూలవిధానాలలో నడిపించేవారు.

జస్టిస్ రనడె, గనేష్‌వాసుదేవ్‌జోషి, ఎస్. హెచ్. చిప్‌లంకార్, యింకాయితరులు, 1870లో పూనా సార్వజనిక్ సభ, ఏర్పాటుచేశారు. ఈ సభ, 20ఏండ్ల వరకూ క్రియాత్మకమైన రాజకీయ విద్యను బోధించింది.

1876 నుంచి 1880 వరకూ, లిట్టన్ వైస్‌రాయ్‌గా వున్నప్పుడు ప్రవేశపెట్టిన దాహోటమైన అభివృద్ధి నిరోధక, భారతవ్యతిరేక చర్యలు, మందకొడిగావున్న భారత జాతీయ కార్యకలాపాలను వేగిరపరిచాయి. పెరుగుతూవున్న భారతజవుళి పరిశ్రమల పట్ల అసూయచెంది, లేంక్‌షైరు ఉత్పత్తిదార్లను తృప్తిపరచడానికి బ్రిటిష్ జవుళివస్త్రాల మీద దిగుమతి సుంకాలను రద్దించడం. ఆఫ్ఘనిస్తాన్‌మీద దురాక్రమణపూరితమైన విస్తరణ యుద్ధంజరపడం, దీనికయిన ఖర్చులభారాన్ని భారత బొక్కసంమీద పడవేయడం. భారతప్రజలు ప్రతిఘటన జరపడం అసంభవం చేయడానికి ఉద్దేశించిన ఆయుధాలచట్టం, కనీసం రక్షణకోసమయినా, వారు, శిక్షణ పొందకుండా వుండేటట్టు చేయడం. బ్రిటిష్‌పాలనను అంతకంతకి ఎక్కువగా విమర్శిస్తోన్న భాషాపత్రికలను అరికట్టడానికి భాషాపత్రికల చట్టాన్ని అమలు జరపడం. లక్షలాదిమంది క్షామంతో మరణిస్తూవున్న సమయంలో ఢిల్లీలో రాజ దర్బార్ జరపడం. ఇండియన్ సివిల్ సర్వీస్ పరీక్ష పోటీకి, గరిష్ఠవయః పరిమితిని 21 నుంచి 19 ఏండ్లకు తగ్గించి, సివిల్ సర్వీస్‌లలో ప్రవేశించే భారతీయుల అవకాశాలను మరికొంత తగ్గించడం. — ఈచర్య

లన్నీ, బ్రిటిష్ పాలన పీడిత – వలస తత్వాన్ని స్పష్టంగా ప్రస్ఫుటింప చేశాయి. ఈ చర్యలకు వ్యతిరేకంగా దేశమంతటా, నిరసన వ్యక్తమైంది. బ్రిటిష్ ఉత్పత్తి దారుల తీవ్రపోటీనుంచి భారత పరిశ్రమలకు రక్షణకల్పించే పద్ధతిక్రింద, స్వదేశి సిద్ధాంతాన్ని, మొట్టమొదట 1870 సంవత్సరాలలో ప్రచారం చేశారు.

యువ భారతీయుల్లో నూతన రాజకీయచైతన్యం, మొదట బెంగాల్‌లో కనుపించింది. బ్రిటిష్ ఇండియా సంఘపు సనాతన, జమీందార్ అనుకూల రాజకీయాలు, నూతన మధ్యతరగతి ప్రజలకూ మేధావులకు సరిపడలేదు. వీరు, జమీందార్లతో పోటీపడుతూ, ప్రజలకు తామే ప్రతినిధులమని చెప్పుకోవడం మొదలుపెట్టారు. భారతదేశాన్ని బ్రిటన్, శాశ్వతంగా పరిపాలించాలన్న సిద్ధాంతాన్ని ఆమోదించడానికి కూడా, వీరు నిరాకరించారు. ఆనంద్‌మోహన్‌బోస్, సురేంద్రనాథ్ బెనర్జి నాయకత్వం క్రింద, 1876 జూలైలో ఇండియన్ అసోసియేషన్‌ను వీరుస్థాపించారు. సివిల్‌సర్వీస్ పరీక్షల పద్ధతిని సంస్కరించ డానికి ఆలజడిజరపాలని, ఈ నూతనసంఘం మొదట నిర్ణయించింది. ఈ అలజడికి మద్దత్తు సంపాదించడంకోసం, ప్రత్యేక ప్రతినిధిగా సురేంద్రనాథ్ బెనర్జీని ఈసంఘం, దేశంలో యితరప్రాంతాలకు పంపించింది. అఖిలభారత ప్రజాదరణను పొందిన మొట్టమొదటి నవ భారతీయుడు ఈయనే అని చెప్పవచ్చు. విస్తృత రాజకీయ ఉద్యమంలోకి సామాన్య ప్రజానీకాన్ని తీసుకురావడం కోసం, భారతసంఘం నాయకులు జమీందార్లకు వ్యతిరేకంగా కౌలుదార్ల హక్కులను బలపరుస్తూ, విదేశ తేయాకుతోటల యజమానులకు వ్యతిరేకంగా తోటల కార్మికుల హక్కులను బలపరుస్తూనూ ఒక అలజడిని ఏర్పాటుచేశారు. ఈ సంఘం, బెంగాల్‌లో వివిధ పట్టణాలలోనూ, గ్రామాలలోనూ, బెంగాల్‌కి వెలుపల అనేక పట్టణాలలోనూ, శాఖలను తెరిచింది కూడా.

యువజనులుకూడా భారతదేశం యితర ప్రాంతాలలో చైతన్యవంతంగా వున్నారు. 1884 లో ఎమ్. వీరరాఘవాచారి. జి. సుబ్రహ్మణ్య అయ్యర్. ఆనందాచార్లు, యితరులు మద్రాస్ మహాజన్‌సభ ఏర్పాటుచేశారు. బొంబాయిలో ఫిరోజ్‌షా మెహతా. కె. టి. తెలెంగ్, యితరులు, 1885 లో బొంబాయి ప్రెసిడెన్సీ అసోసియేషన్‌ను ఏర్పాటు చేశారు.

## జాతీయ కాంగ్రెసు స్థాపన

పలువురి దృక్పథాలను తెలుసుకోడానికి ఉమ్మడి వేదికను ఏర్పాటు చేయడానికి ఉమ్మడి కార్యక్రమాన్ని రూపొందించడానికి మాత్రమేకాక, విస్తృత ప్రాతిపదిక

గల స్వాతంత్ర్య సమరాన్ని ప్రోత్సహించడానికి ప్రజావిద్యను కొనసాగించడంకోసం అఖిల భారత సంస్థ ఒకటి ఏర్పాటు చేయవలసిన అవసరముందని రాజకీయ చైతన్యం గల భారతీయులు అంతకంతకి ఎక్కువగా తెలుసుకున్నారు. ఇటువంటి సంస్థకు, సాంఘిక ప్రాతిపదిక వేయడం జరిగింది; తగిన అనుభవాన్ని గడించారు. దేశంలో వివిధ ప్రాంతాలనుంచి అనేకమంది భారతీయులు, — పశ్చిమ భారతదేశంలో దాదాభాయి నౌరోజీ, జస్టిస్ రనడె. ఫిరోజ్ షా మెహత. కె. టి. తెలంగ్. రహింతుల్లా మహమ్మద్ సయాని. జవేరిలాల్ ఉమాశంకర్ యాగ్నిక్. బదురుద్దీన్ తయాబ్జి. దక్షిణ భారతదేశంలో జి. సుబ్రహ్మణ్య అయ్యర్. ఎస్. సుబ్రహ్మణ్యం అయ్యర్. ఆనందాచార్లు. తూర్పు భారతావనిలో డబ్లియు. సి. బెనర్జి. సురేంద్రనాధ్ బెనర్జి. ఆనందమోహన్ బోస్. లాల్ మోహన్ ఘోష్. కాళీ చరణ్ బెనర్జి. వీరంతా ఒకే సమయంలో అఖిల భారత జాతీయ వ్యవస్థను ఏర్పాటు చేయడానికి పథకాలు ప్రారంభించారు. 1883 డిసెంబరులో, భారతీయ సంఘం, అఖిల భారత జాతీయ మహాసభను ఏర్పాటు చేసింది. అయితే ఈ ప్రయత్నం ఫలప్రదం కాలేదు. జాతీయ రాజకీయ కార్యకర్తల బొంబాయి బృందం, ఇంగ్లీషు వ్యక్తి, పింఛను తీసుకున్న సివిల్ సర్వెంటు అయిన ఎ. పి. హూమ్‌తో సహకరించి, దేశంలో వివిధ ప్రాంతాల రాజకీయ నాయకులను - 1885 డిసెంబరు ఆఖరి రోజుల్లో బొంబాయిలో సమావేశ పరచాలని నిర్ణయించడంతో, ఈ ప్రతిపాదనకు ఒక నిర్దిష్ట స్వరూపం ఏర్పడింది. ఈ నాయకులు మొట్టమొదటిసారిగా డబ్లియు. సి. బొనర్జి అధ్యక్షత క్రింద భారత జాతీయ కాంగ్రెసును ప్రారంభించాలని నిర్ణయించారు.

విద్యావంతులయిన భారతీయుల్లో పెరిగిపోతూవున్న అసంతృప్తిని తొలగించడానికి ఒక మార్గం కనిపెట్టడంకోసం, కాంగ్రెసును స్థాపించడానికి ప్రోత్సాహ మివ్వాలని హూమ్ భావించినట్టు చెబుతున్నారు. అసంతృప్తిచెందిన జాతీయ మేధావులు అసంతృప్తి చెందిన కర్షకులతో సమైక్యం కాకుండా అరికట్టాలని ఆయన భావించారు. చిన్న రాజకీయ ఉద్యమాన్ని ప్రోత్సహించడం ద్వారా, యిది అదుపు దాటిపోకుండా అరికట్టవచ్చునని, ఆయన ఆశించారు. ఆ తర్వాత ఆయన యిలా వ్రాశారు. "ఈ ఉద్యమానికి ప్రాథమిక ప్రోత్సాహ మిచ్చినవారికి, మరో గత్యంతరం లేకపోయింది. పెల్లుబుకుతూవున్న వీరి కృషి ఫలితాలు వృధాపోకుండా రాజ్యాంగ బద్ధమయిన మార్గాలను కనిపెట్టవలసిన జరూరు ఆవశ్యకత ఏర్పడింది."

జాతీయ కాంగ్రెసు స్థాపన గురించిన ఈ వివరణ సరిపడినంతగా లేకపోవడమేకాక, మభ్యపెట్టేదిగా కూడా వుంది. ఈ సంఘటనలో హూమ్ పాత్రను పరిమితంగామాత్రమే

యిది విశదం చేస్తోంది. అఖిల భారత రాజకీయ సంస్థను ఏర్పాటు చేయడంకోసం తీవ్రంగా కృషిచేసిన భారతీయులు బ్రిటిష్‌వారి ప్రయోజనాలకోసం, భారతదేశాన్ని పిడించుకుతింటూ వున్నవారికి వ్యతిరేకమయిన నూతన సాంఘిక శక్తులని చెప్పవచ్చు. భారతదేశపు రాజకీయ - ఆర్థిక అభివృద్ధికి, పోరాటం జరపడానికి, ఒక సంస్థ అవసరం. వీరంతా ఉన్నత ప్రవర్తనగల దేశభక్తులు; విదేశ ప్రభుత్వం చేతిలో వీరు కీలుబొమ్మలుకారు. ప్రారంభ రాజకీయ కృషికి అధికారుల్లో శతృత్వాన్ని రేకెత్తించ కూడదని భావించడంవల్ల, వీరు, హోమ్‌తో సహకరించారు; పింఛను తీసుకున్న ప్రభుత్వోద్యోగి, యిందులో క్రియాత్మకంగా పాల్గొనడంవల్ల, అధికారుల అపోహాలకు తావుండదని, వీరు ఆశించారు. కాంగ్రెసును ఒక "రక్షక సాధనంగా" ఉపయోగించాలని హోమ్ భావించినట్లయితే, ప్రారంభ కాంగ్రెసు నాయకులు ఈయన్ను "లైటెనింగ్ కండక్టర్"గా ఉపయోగించుకోవాలని ఆశించారు. గోపాలకృష్ణ గోఖలే, 1813 లో యిలా వ్రాశారు :

"భారత జాతీయ కాంగ్రెసును భారతీయు డెవ్వడు ప్రారంభించి వుండజాలడు. భారతదేశాని కంతటికీ వర్తించే యిటువంటి ఉద్యమాన్ని ప్రారంభించడానికి భారతీయు డెవడయినా ముందుకు వచ్చివున్నట్లయితే, అధికారులు, దానికి అనుమతి యిచ్చి వుండరు. ఆ రోజుల్లో రాజకీయ ఆలజడిపట్ల అవిశ్వాసం ఎంత ప్రబలంగా వుండేదంటే, కాంగ్రెసును స్థాపించిన వ్యక్తి, ప్రముఖ ఇంగ్లీషు వ్యక్తి, ప్రఖ్యాత మాజీ ఉద్యోగి కాకపోయినట్లయితే, అధికారులు, ఈ ఉద్యమాన్ని అణచివేయడానికి వెంటనే ఏదో ఒక మార్గం కనిపెట్టి వుండేవారు" అని వ్రాశారు

1885లో భారత జాతీయ కాంగ్రెసును స్థాపించడంతో, భారత స్వాతంత్ర సమరాన్ని చిన్నదిగా, తటపటాయిస్తూ, మెల్లిగానే అయినప్పటికీ, ఒక పద్ధతిలో ప్రారంభించారు. సంవత్సరాలు గడిచేకొద్దీ యిది పటిష్టమై చివరికి, విదేశ పరిపాలకులకు వ్యతిరేకంగా, శక్తివంతమైన, పోరాట ఉద్యమాల్లో భారత ప్రజలు పాల్గొనేట్లు చేసింది.

1885 మొదలు 1905 వరకూ, జాతీయతా చైతన్యాన్ని వ్యాప్తిచేయడానికి, భారత జాతీయ కాంగ్రెసు, ముఖ్యసాధనమని అనుకోవడం పొరపాటే అవుతుంది. ఈ కాలంలో జాతీయతా భావాన్ని పెల్లుబికేటట్లు చేయడానికి, అనేక యితర మార్గాలు కూడా వుండేవి. అనేక స్థానిక, రాష్ట్ర రాజకీయ సంఘాలు ప్రతినిత్యము రాజకీయ ఆలజడిని జరిపాయి. ప్రతిఏడు రాష్ట్రీయ సమావేశాలు జరిగేవి; యింకా అంతకంతకీ ఎక్కువమంది ప్రజలు పాల్గొనేవారు. ముఖ్యంగా జాతీయ వార్తాపత్రికలు జాతీయతా భావాన్ని ప్రచారంచేసే కార్యకర్తలుగా పనిచేశాయి. ఈ కాలంలో అనేక పత్రికలను

వ్యాపార సంస్థలుగాకాక, జాతీయ కార్యకలాపాల చైతన్య సాధనాలుగా ప్రారంభించారు. వీటి యజమానులు, సంపాదకులు, అనేకసార్లు గొప్పవ్యక్తిగత త్యాగాలు చేయవలసి వచ్చేది. ఈ కాలంలో ముఖ్యమైన జాతీయ వార్తాపత్రికల నన్నింటినీ, జాతీయ కాంగ్రెసు స్థాపించక పూర్వమే ఏర్పాటుచేశారు. బెంగాల్‌లో అమృతబజార్ పత్రిక, ఇండియన్ మిరర్, సంజీవని, బెంగాలి, మద్రాసులోది హిందూ,. స్వదేశ మిత్రక్, ఆంధ్రపత్రిక, కేరళ పత్రిక, బొంబాయిలో మహరాటా, కేసరి, ఇందుప్రకాష్ సుధారక్, ఉత్తరప్రదేశ్‌లో ది అడ్వొకేట్, ది హిందూస్థానీ, ది ఆజాద్, పంజాబ్‌లో ది ట్రిబ్యూన్, ది అక్బార్ ఇ ఆమ్, కోహినూర్, — ఆకాలంలో కొన్ని ముఖ్య జాతీయ వార్తాపత్రికలు.

## ప్రారంభ జాతీయ వాదుల కార్యక్రమం, కార్యకలాపాలు

దేశపు రాజకీయ విముక్తికి ప్రత్యక్షసమరం జరిపే పరిస్థితులు ఇంకా ఏర్పడలేదని, మొట్టమొదటి భారత జాతీయ వాదుల నాయకులు విశ్వసించారు. జాతీయభావాలను రేకెత్తించడం, ఈ భావాలను పటిష్టంచేయడం, అనేకమంది భారతీయ ప్రజలను జాతీయ రాజకీయాలలోకి తీసుకురావడం, వారికి రాజకీయాలలోను, అలజడిలోను, సమరంలోనూ శిక్షణఇవ్వడం, వీటికి పరిస్థితులు అనుకూలంగా ఉన్నాయని వీరుభావించారు. రాజకీయ సమస్యలలో ప్రజలకు శ్రద్ధకలిగించి, దేశంలో ప్రజాభిప్రాయాన్ని కూడగట్టుకు రావడం ఈవిషయంలో మొట్టమొదటి అతిముఖ్యవిధి. రెండోది, దేశవిస్తృత ప్రాతిపదికమీద ప్రజలకోర్కెలకు ఒకస్వరూప మివ్వాలి. దీనివల్ల, ప్రజాభిప్రాయంపై దేశప్రజలందరూ దృష్టిని కేంద్రీకరించడానికి వీలవుతుంది. అన్నిటికంటే ముఖ్యమయినది, మొట్టమొదట రాజకీయ చైతన్యంగల భారతీయులు, రాజకీయ కార్యకర్తలు, నాయకులలో జాతీయ ఐకమత్యాన్ని కలిగించాలి. భారత దేశం, ఒకజాతిగా రూపొందుతున్న దేశమనీ, భారతజాతి క్రమేపీ అమలులోకి వస్తోందనీ, అందువల్ల, యిది, సాధించిన యదార్థమని అనుకోవడానికి వీలులేదనీ మొదటి జాతీయ వాదులకు పూర్తిగా తెలుసు. ప్రాంతం, కులం, మతంతో ప్రమేయంలేకుండా, రాజకీయ నాయకులు, జాతీయ ఐక్యత భావాన్ని పెంపొందించి పటిష్టం చేయడానికి, నిరంతర కృషి జరుపవలసి వుంటుందని, వారుగ్రహించారు. ఉదాహరణకి, భారత జాతీయ కాంగ్రెసు, దేశంలో వివిధప్రాంతాలలో చురుకైన జాతీయవాదులమధ్య సన్నిహిత స్నేహసంబంధాలను ప్రోత్సహించడంద్వారా ఈవిషయంలో శుభసూచకమైన నాందిప్రస్తావన చేయగలమని ఆశించారు. ఉమ్మడి ఆర్థిక

రాజకీయ కార్యక్రమం ప్రాతిపదికగా, భారత ప్రజలను సమైక్యం చేయాలనే ఉద్దేశ్యంతో, మొట్టమొదటి జాతీయవాదుల ఆర్థిక రాజకీయ కోర్కెలను రూపొందించారు.

## సామ్రాజ్యవాదం ఆర్థిక విమర్శన

సామ్రాజ్యవాద ఆర్థిక విమర్శనే మొట్టమొదటి జాతీయవాదులు నిర్వహించిన రాజకీయ కృషిలో అతిముఖ్యభాగమని చెప్పవచ్చు. సమకాలీన ఆర్థిక పీడన మూడు రూపాలను, అంటే వర్తకం, పరిశ్రమలు, ఆర్థిక రూపాలను, శీరుగమనించారు. భారత ఆర్థిక వ్యవస్థను, బ్రిటిష్ ఆర్థికవ్యవస్థకు లోబడి వుండేటట్లు చేయడమే, బ్రిటిష్ ఆర్థిక సామ్రాజ్యవాదం సారాంశమని, వీరు, స్పష్టంగా అర్థంచేసుకున్నారు. వలస ఆర్థిక వ్యవస్థ మూలస్వరూపాలను, అంటే, భారతదేశాన్ని ముడిసరుకులు సప్లయిచేసే దేశంగా మార్చివేయడం, బ్రిటిష్ ఉత్పత్తులకు ఒక మార్కెట్‌గా చేయడం, విదేశ పెట్టుబడికి ఒకరంగంగా చేయడం, - వీటిని భారతదేశంలో అభివృద్ధి చేయడానికి బ్రిటిష్‌వారు చేసిన ప్రయత్నాలను వీరు తీవ్రంగా ప్రతిఘటించారు. ఈ వలస స్వరూపం ఆధారంగా దాదాపు ముఖ్యఅధికార ఆర్థిక విధానాలన్నింటికి వ్యతిరేకంగా శక్తివంతమైన ఆలజడిని వీరు, ప్రారంభించారు. అంతేకాకుండా, ఆర్థికజీవితం ప్రతిరంగంలోనూ, ఇంగ్లండుపై భారతదేశం ఆర్థికంగా ఆధారపడి వుండటాన్ని తగ్గించాలనీ, అసలు పూర్తిగా నిలిపివేయాలనీ వీరు, ప్రచారంచేశారు.

భారతదేశంలో పెరిగిపోతూవున్న పేదరికంగురించి, మొదటి జాతీయవాదులు అదేపనిగా వ్రాస్తూవచ్చారు; ప్రసంగించారు. భారతదేశాన్ని బ్రిటన్ ఆర్థికంగా పీడించుకు తినడాన్ని దీనితో ముడిపెట్టారు. దాదాభాయి నౌరోజీ దీనిని గురించి వ్రాస్తూ "భారతీయులు వట్టి బానిసలు. వీరు అమెరికన్ బానిసలకంటే అధ్వానం. ఎందువల్లనంటే, బానిసలు తనసొత్తు కాబట్టి యజమానులు వారి గురించి కనీసం జాగ్రత్త తీసుకుంటారు. బ్రిటిష్ పాలన, శాశ్వతంగా, ఎక్కువవుతూ, ప్రతిరోజు ఎక్కువవుతోన్న విదేశ దండయాత్ర. ఇది క్రమేపీ అయినా, దేశాన్ని పూర్తిగా నాశనం చేస్తోంది" అని వ్రాశారు.

భారత పరిశ్రమలను ప్రోత్సహించే మార్గంగా, స్వదేశీభావాన్ని కూడా మొదటి జాతీయవాదులు ప్రజారంజకం చేశారు. అనేక స్వదేశీ దుకాణాలను తెరిచారు. గణేష్ వాసుదేవ్ జోషి, చేతితో వడికిన ఖాదీ ధరించి 1817 లో, ఇంపీరియల్ దర్బార్‌కు

హాజరయ్యారు. 1896 లో, మహారాష్ట్రలో శక్తివంతమైన స్వదేశీ ఉద్యమాన్ని ఏర్పాటు చేశారు. ఈ ఉద్యమంలో విద్యార్థులు బహిరంగంగా, విదేశ వస్త్రాలను దగ్ధం చేశారు.

1875 నుంచి 1880 వరకూ, దిగుమతులమీద సుంకాలను రద్దుచేయాలనీ, 1894 లోనూ, 1896 లోనూ, ప్రత్తి ఎక్సయిజు సుంకాలు విధించినందుకు వ్యతిరేకంగానూ, జాతీయ వాదులు, దేశమంతటా శక్తివంతమైన అలజడిని ఏర్పాటుచేశారు. ఈ అలజడి దేశమంతటా జాతీయ భావాలను పురికొల్పడంలోనూ, భారతదేశంలో బ్రిటిష్ పాలన వాస్తవ లక్ష్యాలు, ఉద్దేశాల గురించి, ప్రజలకు తెలియజెయ్యడంలోనూ, అతిముఖ్య పాత్ర నిర్వహించింది. 1896 జనవరి 28 వ తేదీన, పూనా నుంచి వెలువడే దికేసరి అన్నపత్రిక యిలా వ్రాసింది. "యూరోపియన్ల గ్రాసంకోసం ముఖ్యంగా రిజర్వుచేయ బడిన సువిశాల పచ్చిక మైదానంగా భారతదేశాన్ని బాదిస్తున్నారు." అని వ్రాసింది. భారత జాతీయ కాంగ్రెస్ మాజీ అధ్యక్షులు పి. ఆనందాచార్లు. విదేశీయుల దండయాత్రల నుంచి, శక్తివంతమైన బ్రిటిష్ దేశం భారతదేశానికి రక్షణ కల్పించినప్పటికీ, ఇంగ్లీషు–భారత ప్రయోజనాలమధ్య వైరుధ్య మేర్పడిన విషయాలలో, భారతదేశానికి రక్షణ లేదు. "కంచే చేనుమేసినట్టు" అని తమిళలోకోక్తి ఒకటి వుంది" అని అన్నారు,

భారమయిన భూమి శిస్తును తగ్గించాలని, మొదటి జాతీయవాదులు పట్టువిడువకుండా అలజడి జరిపారు. ప్రభుత్వ ఆధిపత్యం క్రిందవున్న వ్యవసాయ బ్యాంకులనుంచి కర్షకులకు, చౌకగా ఋణాలు సమకూర్చాలనీ, భారీ సేద్యపునీటి సౌకర్యాలను కల్పించాలనీ, వీరు ప్రభుత్వాన్ని కోరారు. కొంతమంది బ్రిటిష్ కొనసాగించ దలచిన మధ్య యుగపు భూకామందుల పెత్తందారి సంబంధాలను విమర్శించారు కూడా. తోటల కార్మికుల పని పరిస్తితులను మెరుగు పరచాలని కూడా వీరు అలజడి జరిపారు. అప్పుడున్న పన్నులు – వ్యయస్వరూపంలో పూర్తిమార్పు రావాలని కూడా, వీరు కోరారు. అప్పటి పన్నుల పద్ధతి వల్ల పేదవారి మీద భారం ఎక్కువవుతోందనీ, ధనికులకు ముఖ్యంగా విదేశీయులకు అసలు భారమే లేదనీ, వీరు పేర్కొన్నారు. అందువల్ల, వీరు పేదలకూ, దిగువ మధ్యతరగతి వర్గాలకూ భారంగా వుండే ఉప్పుపన్నునూ, యితర పన్నులనూ రద్దుచేయాలని గట్టిగా కోరారు. భారతీయుల అభివృద్ధి సంక్షేమాన్ని ప్రోత్సహించడానికి బదులు, అప్పటి వ్యయస్వరూపాన్ని బ్రిటన్ ఇంపీరియల్ అవసరాలకు అనుగుణంగా వుండేటట్టు చేశారు. ఆసియా - ఆఫ్రికాలలో బ్రిటిష్ ఆధిపత్యాన్ని కాపాడుతూ వుండటానికి, సైన్యంపై విపరీతమైన వ్యయాన్ని, వీరు ఖండించారు. దేశపు ఆర్థికాభివృద్ధి స్థాయికి భిన్నంగా, సివిల్ సర్వీస్ ఉద్యోగులకు అధిక జీతాలను యిస్తూ వ్యయం చేయడాన్ని కూడా వీరు, విమర్శించారు. తయారయిన సరు

కుల దిగుమతినీ, ముడిసరుకుల ఎగుమతిని ప్రోత్సహించడంకోసం, విదేశ వర్తకాన్నీ, రైల్వే అభివృద్ధినీ ప్రోత్సహించే అధికారుల విధానాన్ని కూడా వీరు, ఘాటుగా విమర్శించారు. వర్తక – రవాణా విధానాలను అంతరంగిక ఆర్థికాభివృద్ధికి అనుగుణంగా రూపొందించాలని వీరు అన్నారు.

సామ్రాజ్యవాద వ్యతిరేక విమర్శలో జాతీయవాదులు, దేశం నుంచి సంపత్తిని పంపివేస్తున్నారన్న విమర్శను, అతిశక్తివంతమైన ఆయుధాల్లో ఒకటిగా వుపయోగించారు. భారతదేశపు పెట్టుబడి సంపదలో ఎక్కువభాగాన్ని, దేశంనుంచి వెలుపలికి పంపివేయడమో లేక ఋణాలమీద వడ్డీల రూపంలోనో భారతదేశంలో బ్రిటిష్ పెట్టుబడి మీద వచ్చిన ఆదాయాలరూపంలోనో భారతదేశంలో పనిచేస్తూవున్న పౌర, సైనిక సిబ్బంది జీతాలు, పింఛన్ల రూపంలోనో, ఏకపక్షంగా బ్రిటన్‌కి తరలిస్తున్నారని జాతీయవాదులు పేర్కొన్నారు.

భారతదేశాన్ని విదేశీయులు ఆర్థికంగా పీడించుకు తినడం సంపదను దేశం నుంచి పంపివేయడం ద్వారా స్పష్టంగా కండ్లకు కట్టినట్టు కనుపిస్తోంది. సంపత్తిని దేశంనుంచి పంపివేయడం విమర్శించడం ద్వారా, మొదటి జాతీయవాదులు, సామ్రాజ్య వాదుల ఆర్థిక పరమోద్దేశాన్ని ప్రశ్నించినట్టయింది. వలస పీడన గురించి సామాన్య మానవుడు తెలుసుకోడానికి కూడా యిది ఒక చిహ్నంగా వుపయోగపడింది.

బ్రిటిష్ పాలనవల్ల, భారతదేశానికి ప్రాణ – ఆస్థి భద్రతలు లభించాయని ఆరోజుల్లో అంటూవుండేవారు. ఈ వాదాన్ని ప్రశ్నిస్తూ దాదాభాయి నౌరోజీ యిలా అన్నారు.

"భారతదేశంలో ప్రాణ ఆస్థి భద్రతలు వున్నాయనడం వట్టి ఊహామాత్రమే. నిజానికి యిటువంటి దేదీలేదు. ఒక విధంగా చూసినట్టయితే ప్రాణ, ఆస్థి భద్రత వుందని చెప్పవచ్చు. ఉదాహరణకు, పరస్పర దౌర్జన్యాలుగానీ, స్థానిక నియంతల దౌర్జన్యాలుగానీ, లేకుండా ప్రజలు భద్రతతో వున్నారు. అయితే ఇంగ్లండు అర్థం చేసుకున్న ప్రకారం, ఆస్థి భద్రత అన్నది లేనేలేదు; ఫలితంగా ప్రాణభద్రత కూడా లేదు. భారతదేశపు ఆస్థికి భద్రతలేదు. ఇహ భద్రతతో ఉన్నదల్లా, ఇంగ్లండు సురక్షితంగా, భద్రతతో వుంది.

భారతదేశంనుంచి తీసుకువెళ్ళడానికి, ప్రస్తుతరేటు ప్రకారం సాలీనా 30 కోట్ల పౌండ్లు లేక 40 కోట్ల పౌండ్లు, భద్రతగాతీసుకొని వెడుతోంది. అందువల్ల, భారతదేశానికి తన ఆస్తి – ప్రాణభద్రత లేదనిస్పష్టంగా చెప్పగలను. భారతదేశంలో కోట్లాదిమందికి, జీవితమంటే అర్థకడుపునిండటం,లేక ఆకలి, లేక క్షామం, వ్యాధులు" అనిపేర్కొన్నారు.

తాము రావడంవల్ల, దేశంలో శాంతిభద్రతలను సమర్థంగా కాపాడటం జరుగుతోందని చెప్పడానికికూడా బ్రిటిష్‌వారు ప్రయత్నించారు. దీనినిఖండిస్తూ దాదాభాయి, —

"వీపుమీద కొట్టాలని వేడుకుంటున్నానే గాని పొట్టమీద కొట్టవద్దని అర్థిస్తున్నాను. అని భారతీయ లోకోక్తి ఒకటివుంది. దేశీయ నియంత్రక్రింద. ఒక్కొక్కప్పుడు ప్రజలు, వీపుమీదకొంత దౌర్జన్యానికి లోనయినప్పటికీ, తాముఉత్పత్తి చేసినదానిని ప్రజలు తమవద్దవుంచుకొని, అనుభవించేవారు. బ్రిటిష్-భారత నియంత్రక్రింద మానవునికి ప్రశాంతతవుంది; దౌర్జన్యంలేదు. అతనిసంపత్తిని. కంటికి కనుపించకుండా గొడవ లేకుండా, దేశంనుంచి తీసుకొని వెళ్ళడం జరుగుతోంది. అతను, శాంతిలో ఆకలితో అల్లాడిపోతూ, శాంతిభద్రతలతో శాంతిలోనే మరణిస్తాడు" అనిఅన్నారు.

ముక్తసరిగా చెప్పాలంటే, ఆర్థిక సమస్యలమీద అలజడివల్ల దేశమంతటా, భారత దేశాన్ని పీడించుకు తినడమే బ్రిటిష్‌పాలన ఉద్దేశ్యంఅనీ, పేదరికానికి దారితీస్తోందనీ, ఆర్థికంగా వెనుకబడిన తనానికే, అభివృద్ధిలో వెనుకబడిన తనానికే దారి తీస్తోందనీ, ఒక అభిప్రాయం ప్రబలింది. బ్రిటిష్ పరిపాలనవల్ల కలిగే ఏ పరోక్ష ప్రయోజనాల కన్నా, చెడుగులే ఎక్కువగా వున్నాయి.

## పాలనా సంస్కరణలు

ఆయా పాలనా చర్యలను మొదటి జాతీయవాదులు నిర్భయంగా విమర్శించారు, లంచగొండితనం, అసమర్థత, దమన నీతితోకూడుకున్న పాలనావ్యవస్థను సంస్కరించ డానికి నిర్విరామంగా పనిచేశారు. పాలనా సర్వీసుల్లో పైగ్రేడులను భారతీయకరణ చేయాలని అలజడి జరపడం, పాలనా సంస్కరణలలో అతిముఖ్యమయినది. ఆర్థిక, రాజకీయ, నైతిక కారణాలవల్ల, దీనిని గట్టిగాకోరారు. ఆర్థికంగా యూరోపియన్లకి యిచ్చిన విపరీతమైన జీతాలవల్ల, భారత ఆర్థిక సంపత్తిమీద భారం ఎక్కువయింది; వీటిలో ఎక్కువభాగం జీతాలను బ్రిటన్‌కు ఎగుమతి చేయటంవల్ల, సంపత్తిని దేశంనుంచి పంపివేయడానికి దోహదమయింది. రాజకీయంగా, యూరోపియన్ ప్రభుత్వ ఉద్యోగులు, భారతీయుల అవసరాలను విస్మరించారు. ముఖ్యంగా భారతీయ పెట్టుబడిదార్లను కాదని యూరోపియన్ పెట్టుబడిదార్లను బలపరిచారు. నైతికంగా, భారతీయుల ప్రవర్తనను సంకుచితంచేసి, ఉన్నత భారతీయుణ్ణి, తన స్వదేశంలోనే శాశ్వతంగా హీన స్థానానికి దిగనార్చివేసింది. ఇదేసమయంలో మొదటి జాతీయవాదులు, తక్కువజీతాలు తెచ్చుకునే క్రిందితరగతి ప్రభుత్వోద్యోగులకు ఎక్కువ జీతాలివ్వాలని అలజడి చేశారు.

అట్టడుగుననున్న ఉద్యోగులకు అతితక్కువ జీతాలు యివ్వడంవల్లనే, క్రిందిస్థాయిలలో అసమర్థత, లంచగొండితనం పెరిగిపోయాయని వీరు విశ్వసించారు.

మొదటి జాతీయవాదులు సామాన్య ప్రజానీకంపట్ల పోలీసుల దమన, నియంతృత్వ ప్రవర్తనకు వ్యతిరేకంగానూ, ప్రభుత్వ ఏజెంట్ల ప్రవర్తనకు వ్యతిరేకంగానూ ఎల్లప్పుడు ఆలజడి జరిపారు. జాతీయవాదుల పత్రికలు ప్రతిరోజు, యిటువంటి నియంతృత్వ ఉదాహరణలు అనేకం ప్రజలదృష్టికి తీసుకొచ్చేవారు. న్యాయశాఖను, పాలనా శాఖ నుంచి వేరుచేయాలని, జాతీయవాదులు గట్టిగా కోరారు. ఆవిధంగా చేసినపుడు. పోలీసులు అధికార్ల చర్యలనుంచి ప్రజలకు కొంత రక్షణ కలుగుతుందని భావించారు. న్యాయ నిర్వహణ పద్ధతిలో జాప్యాన్ని, ఎక్కువ ఖర్చులను వీరు విమర్శించారు. ఒక యూరో పియన్‌తో ఒక భారతీయునికి క్రిమినల్ వివాదం ఏర్పడినపుడల్లా న్యాయాన్ని ప్రక్క దారిన పట్టించడాన్ని వీరు ఖండించారు. న్యాయంముందు అందరు సమానమన్న సూత్రాన్ని యూరోపియన్లకు కూడా వర్తింపచేయాలని వీరు గట్టిగా కోరారు. ప్రజలను నిరాయుధులను చేసే విధానాన్ని వీరు ప్రతిఘటించారు. ఆయుధాలు ధరించేహక్కు ప్రజలందరికి వుందని వాదించారు. భారతదేశపు పొరుగు వారికి వ్యతిరేకంగా దురాక్రమణ పూరితమైన విదేశాంగ విధానాన్ని, వీరు ప్రతిఘటించారు. బర్మాను కబళించే విధానాన్నీ, ఆఫ్ఘనిస్థాన్‌మీద దండయాత్ర జరపడాన్నీ, వాయవ్య భారతావనిలో ఆదిమవాసులను అణచివేయడాన్నీ, వీరు నిరశించారు.

భారతదేశంలో సంక్షేమసేవల తక్కువస్థాయిని మొదటిజాతీయవాదులు విమర్శించారు. దేశసంక్షేమ కార్యకలాపాలను ప్రభుత్వం చేపట్టి, అభివృద్ధి పరచాలని కోరారు. ముఖ్యంగా, సామాన్య ప్రజానీకంలో విద్యావ్యాప్తికోసం కృషిజరప వలసిన అవసర ముందని నొక్కిచెప్పారు. సాంకేతిక — ఉన్నతవిద్యకు యింకా ఎక్కువ సౌకర్యాలుండాలనీ, వైద్య, ఆరోగ్య సౌకర్యాలను విస్తరించాలనికూడా వీరు కోరారు. ముఖ్యంగా, భారతీయ పరిశ్రమలనూ వ్యవసాయాన్నీ అభివృద్ధి చేయడానికి పటిష్ఠమయిన పాలనా చర్యలు తీసుకోవాలని, వీరు, గట్టిగా కోరినట్లు, యింతకిముందే తెలుసుకున్నాం.

దక్షిణాఫ్రికా, మలయా, మారిషస్, ఫిజీ, వెస్టుఇండీస్, బ్రిటిష్ గయానావంటి బ్రిటిష్ వలసలకు వలసవెళ్ళిన భారతీయ కార్మికుల కష్టాలను తీర్చడానికికూడా, జాతీయ వాదుల నాయకులు చర్యలు తీసుకున్నారు. ఈదేశాలలో వీరిపట్ల తీవ్రమైన జాతివిచక్షణ, యితర రకాల పీడనలను అమలు జరిపేవారు. అనేక సందర్భాలలో వీరి స్థితి, బానిసలకు ఏవిధంగానూ తీసిపోయేదికాదు. 1893 తర్వాత దక్షిణాఫ్రికాలో, మోహన్‌దాస్

కరమ్‌చంద్ గాంధీ ప్రారంభించిన మానవహక్కుల ప్రజాసమరానికి, జాతీయవాదులు, పూర్తి అండనిచ్చారు.

భారతనాయకులు, తోటల కార్మికుల కష్టాలను తీర్చడానికికూడా కంకణం కట్టుకున్నారు. విదేశ తోటల యజమానులిస్తూవున్న అతి తక్కువ వేతనాలతో, తోటలకార్మికులు, దాదాపు బానిసల్లాగా బ్రతుకుతూ వుండేవారు. అయితే యిదే సమయంలో, నిర్దాక్షిణ్య పీడనకు లోనవుతూవున్న భారత ఫ్యాక్టరి, గనికార్మికులను బలపరుస్తూ, వీరు, అలజడి ఏదీ జరుపలేదు. ఈవిషయంలో భారతనాయకులు, భారత పెట్టుబడిదార్ల ప్రయోజనాలకు ప్రాధాన్యమిచ్చారు. విదేశీయుల ఆధిపత్యాన్ని తొలగించినట్టయితే, భారత పెట్టుబడిదార్లే కార్మికుల స్తితిగతులను మెరుగు పరచగలరని, వీరు, భావించి వుండవచ్చు.

## పౌరహక్కుల రక్షణ

మొదటి నుంచి రాజకీయ చైతన్యం గల భారతీయులను ఆధునిక పౌరహక్కులు, — అంటే వాక్ స్వాతంత్ర్యము, పత్రికా స్వాతంత్ర్యము, భావనాస్వాతంత్ర్యము, సమావేశ స్వాతంత్ర్యము, ఆకర్షించాయి. దీని ఫలితంగా వీటిని తగ్గించటానికి ప్రభుత్వం ఎప్పుడు ప్రయత్నించినా, ఈ పౌరహక్కులను కాపాడుకోడానికి గట్టిగా పోరాడేవారు. భారతీయ వార్తాపత్రికలను పరిమితం చేయటానికి 1878 లో ఆమోదించిన భాషాపత్రికల చట్టాన్ని 1880 లో దీనిని తిరిగి రద్దుచేసే వరకూ, తీవ్రంగా ప్రతిఘటించారు. ఇదే మోస్తరుగా, అధికార రహస్యాలను కాపాడేమిషమీద వార్తాపత్రికల విమర్శన అణచివేయడం కోసం 1890 లో అధికారులు చేసిన ప్రయత్నాలను తీవ్రంగా ప్రతిఘటించారు.

బ్రిటిష్ భారతప్రభుత్వం పట్ల అవిధేయతను వ్యాప్తంచేస్తున్నారన్న ఆరోపణ మీద బి. బి. తిలక్‌నీ, మరికొంతమంది నాయకులనూ, పత్రికాసంపాదకులనూ అరెస్టుచేయటం ఈ సందర్భంగా జరిగిన హఠాత్సంఘటన. ప్రముఖ జాతీయవాదుల నాయకుడయిన తిలక్‌కు, అతి కిరాతకంగా 18 నెలలు కఠిన జైలు శిక్ష విధించారు, ఇద్దరు పూనా నాయకులయిన శాతూ సోదరులను, విచారణలేకుండా దేశంనుంచి పంపివేశారు. అనేకమంది యితర వార్తాపత్రికా సంపాదకులకు, యిదేమోస్తరు శిక్షలు విధించారు. జాతీయవాద పత్రికలు, రాజకీయ సంఘాలు పౌర స్వేచ్ఛల మీద జరిగిన ఈ దాడిని ఎదుర్కొని, దేశమంతటా నిరసన ఉద్యమాన్ని ఏర్పాటు చేశాయి. హఠాత్తుగా తిలక్ ప్రజా

రంజకమైన అఖిలభారత నాయకుడయ్యాడు. ప్రజలు, ఆయనకు లోకమాన్యుడన్న బిరుదు నిచ్చారు.

వాక్ స్వాతంత్ర్యాన్నీ, పత్రికా స్వాతంత్ర్యాన్నీ అణచివేయటానికి, పోలీసుల అధికారాలను ఎక్కువచేయటానికి, ప్రభుత్వం అప్పుడు కొత్త చట్టాలను చేసింది. జాతీయ వాదుల కార్యకర్తలపై యిప్పుడు గుండాలు, యితరరౌడీలమీద మోస్తరుగానే చర్య తీసుకోవచ్చు. ఈ చట్టాలను ప్రతిఘటిస్తూ దేశమంతటా అలజడి జరిగింది. వాస్తవంగా యిప్పటినుంచి పౌరస్వేచ్ఛల పరిరక్షణకోసం జరిగే సమరం, స్వాతంత్ర్య సమరంలో విడదీయటానికి వీలులేని సమరంకావాలి.

### రాజ్యాంగ సంస్కరణలు – స్వపరిపాలనా ప్రభుత్వము:

భారతదేశం చిట్టచివరికి, ప్రజాస్వామిక స్వపరిపాలనా ప్రభుత్వ లక్ష్యాన్ని చేరుకోవాలని ఆరంభం నుంచి కూడా మొదటి జాతీయ వాదులు విశ్వసించారు. అయితే ఈ లక్ష్యాన్ని వెంటనే నెరవేర్చాలని వారు పట్టుబట్టలేదు. దీనికి బదులు వారు క్రమేపీ స్వాతంత్ర్యం వైపు పురోగమింప చేయాలని సూచించారు. వీరి తక్షణ రాజకీయ కోర్కెలు పరిమితంగా వున్నాయి. ప్రారంభంగా అప్పుడున్న శాసన సమితులను విస్తృత పరిచి, సంస్కరించటం ద్వారా భారతదేశానికి ప్రభుత్వంలో యింకా ఎక్కువ వాటా యివ్వాలని వారు అన్నారు. 1861 ఇండియా కౌన్సిల్సు చట్టం ద్వారా కొద్ది మంది అనధికారులను, ఈ కౌన్సిల్సుకి నామినేట్ చేయటానికి ఏర్పాటు జరిగింది. ఈ అనధికార ప్రభుత్వ నామినీలు, మామూలుగా అధికారుల అడుగుజాడల్లో నడిచే జమీందార్లు పెద్దవ్యాపారులయి వుండేవారు. ఉదాహరణకు 1888లో వీరు అమ్మకం పన్నులో పెరుగుదలను ఎంతమాత్రము తటపటాయించకుండా బలపరిచారు. కాంగ్రెస్ చర్చావేదికలలో వీరిని "గిల్‌డెడ్‌షామ్స్" "మెగ్నిఫిసెంట్ నాన్‌ఎంటిటీస్" అని వెటకారంగా వర్ణించేవారు. సమితుల అధికారాలను విస్తృతం చేయాలనీ, బడ్జెట్ గురించి చర్చజరిపి, దైనందిన పాలనావ్యవహారాలను ప్రశ్నించి విమర్శించటానికి సభ్యుల అధికారాలను ఎక్కువ చేయాలని, జాతీయ వాదులు గట్టిగా కోరారు. ముఖ్యంగా ప్రజలచే ఎన్నికయిన ప్రతినిధులకు, సమితులలో సభ్యత్వమివ్వాలని, వీరు గట్టిగా కోరారు.

ప్రజల ఒత్తిడి వల్ల, ప్రభుత్వం పాత నిబంధనలను సవరించి, 1892 నూతన ఇండియన్ కౌన్సిల్సు చట్టాన్ని ఆమోదించింది. ఈ చట్టం అనధికార సభ్యులసంఖ్యను ఎక్కువ చేసింది. వీరిలో కొద్ది మందిని మాత్రం పరోక్షంగా ఎన్నుకొంటారు. బడ్జెటు

మీద ప్రసంగించే హక్కు కూడా సభ్యులకు యిచ్చారు. అయితే దానిమీద ఓటుచేసే హక్కు యివ్వలేదు. ఇటువంటి స్వల్ప సంస్కరణవల్ల భారతీయులు పూర్తిగా అసంతృప్తి చెందారు. తమ కోర్కెలను వీరు వెక్కిరించినట్టు వీరు భావించారు. కౌన్సిలులో ఎన్నికయిన అనధికార సభ్యుల మెజారిటీ వుండాలనీ ప్రజాధనంపై అనధికార భారతీయుల కంట్రోలు వుండాలనీ వీరు ఆలజడి జరిపారు. ప్రాతినిధ్యం లేకుండా పన్నులు వేయకూడదన్న నినాదాన్ని లేవతీశారు. ఇదేసమయంలో తమ ప్రజాస్వామిక కోర్కెల ప్రాతిపదికను వీరు విస్తృత పరచలేకపోయారు. సామాన్య ప్రజానీకానికి గానీ, మహిళలకుగానీ, ఓటింగ్ హక్కు వుండాలని గట్టిగా కోరలేదు; వీరికోరికవల్ల మధ్య తరగతి, ఎగువ తరగతి వర్గాలకు మాత్రమే ప్రయోజనం కలుగుతుందన్నది సుస్పష్టం.

శతాబ్దం ప్రారంభంలో మొదటి జాతీయవాదులు తమ రాజకీయ లక్ష్యాలవైపు పెద్ద ముందడుగు వేశారు. వీరి కోర్కె యిహ స్వల్ప సంస్కరణలకు పరిమితం కాలేదు. ఇప్పుడు వీరు శాసనాలు చేయడం మీదా, ఆర్థిక వనరుల మీదా, స్వపరిపాలనగల ఆస్ట్రేలియా, కెనడా వలసల నమూనా మోస్తరుగా సంపూర్ణ స్వపరిపాలనా ప్రభుత్వం కావాలని గట్టిగా కోరారు. వ్యవస్థలో మార్పు రావాలనీ వీరు గట్టి పట్టు పట్టారు. ఉదాహరణకు 1904 లో దాదాభాయి నౌరోజి 1905 లో కాంగ్రెసుకు తమ అధ్యక్షోపన్యాసంలో గోపాలకృష్ణ గోఖలే ఈ కోరికను వ్యక్తపరిచారు. తమ కోర్కెను నొక్కి చెపుతూ 1906 కలకత్తా కాంగ్రెసు సమావేశంలో "స్వరాజ్య" అన్నమాటను వుపయోగించిన మొట్టమొదటి భారతీయుడు దాదాభాయి నౌరోజీ. దీనిమూలంగా మొదటి జాతీయ వాదులకూ, ఆ తర్వాతి జాతీయ వాదులకూ మధ్య మూల విభేదం, జాతీయవాదుల రాజకీయ లక్ష్యపు నిర్వచనానికి సంబంధించినది కాదని తేలిపోయింది. వాస్తవమైన విభేదం అంగీకరించిన లక్ష్యాలను సాధించటానికి సమరం ఏ పద్ధతుల్లో జరపాలి. ఈ సమరానికి ప్రాతిపదిక అయిన సాంఘిక వర్గాలు — బృందాల స్వభావం ఎలావుండాలి అన్న విషయంలోనే వుంది. అంటే, విభేదం, లక్ష్యాల విషయంలోకాక, వీటిని వాస్తవంగా, ఏ విధంగా సాధించడం, అన్న విషయంలోనే వుంది.

## రాజకీయ కృషి పద్ధతులు

మొదటి జాతీయ వాదుల రాజకీయ కృషి పద్ధతులవల్లనే, వీరికి మాడరేట్లు అన్న బిరుదు వచ్చింది. ఈ పద్ధతులు క్రమబద్ధమైన రాజకీయ పురోభివృద్ధికి రాజ్యాంగ బద్ధమైన ఆలజడిగా పేర్కొనవచ్చు. ఆధునిక రాజకీయాల గురించి ప్రజలకు తెలయ

జేసి, జాతీయ రాజకీయ చైతన్యాన్ని కలిగించి రాజకీయ సమస్యల మీద సమైక్య ప్రజాభిప్రాయాన్ని ప్రోత్సహించటమే తమ ముఖ్య కర్తవ్యమని, వీరు విశ్వసించారు. ఈ లక్ష్య సాధనకోసం, వీరు అనేక పద్ధతులను అవలంభించారు. వీరు, సమావేశాలు జరిపేవారు. ఈ సమావేశాలలో, ప్రముఖ రాజకీయ, మేధా సంపన్నులు మాట్లాడేవారు. ప్రజల కోర్కెల ప్రకారం, తీర్మానాలను ఆమోదించే వారు. పత్రికల ద్వారా జాతీయవాదులు, ప్రభుత్వాన్ని ప్రతిరోజు విమర్శించేవారు. వీరు, అనేక వినతి పత్రాలనూ, పిటిషన్లనూ, ఉన్నత ప్రభుత్వ అధికారులకూ, బ్రిటిష్ పార్లమెంటుకూ పంపేవారు. ఈ వినతి పత్రాల పిటిషన్లలో యదార్థాలను పేర్కొని, వాటికి వాదోపవాదాలను కూడా తెలియచేసేవారు. ఈ పిటిషన్లను, డాంబికంగా ప్రభుత్వానికి పంపినప్పటికీ, భారత ప్రజలకు వీటిగురించి తెలియచేయటమే అసలు లక్ష్యం. ఉదాహరణకు; 1891 లో పూనాసార్వజనిక సభ జాగ్రత్తగా తయారు చేసిన వినతి పత్రానికి ప్రభుత్వం, రెండు వాక్యాలలో సమాధానమిచ్చినందుకు, యువగోఖలే నిస్పృహ వ్యక్తపరిచారు. దీనిని జస్టిస్ రనడె యిలా సమాధాన మిచ్చారు.

"మా దేశపు చరిత్రలో మాకున్న స్థానాన్ని మీరు గ్రహించడంలేదు. ఈవినతి పత్రాలను మామూలుగా ప్రభుత్వపేరుమీద పంపుతున్నాము. వాస్తవానికి అవి, ప్రజలను సంబోధించి పంపినవి. ఎందువల్లనంటే ఈ విషయాలలో ఎలా ఆలోచించాలో ప్రజలు తెలుసుకోగలరు. ఇతర ఫలితాలేవీ ఎదురుచూడకుండా ఈ కృషిని అనేక సంవత్సరాలు నిర్వహించాలి. ఎందువల్లనంటే యిటువంటి రాజకీయాలు ఈదేశానికి పూర్తిగా కొత్తవి" అని వ్రాశారు.

మొదటి జాతీయవాదుల రాజకీయకృషి రెండో లక్ష్యమేమిటంటే, బ్రిటిష్ ప్రభుత్వమూ, బ్రిటిష్ ప్రజాభిప్రాయమూ తాము కోరిన మార్పులను ప్రవేశపెట్టేటట్టు వారిపై ప్రభావం కలిగించడం. భారతదేశంలో వాస్తవ పరిస్థితుల గురించి బ్రిటిష్ వారికి తెలియదని జాతీయ వాదులు అందువల్ల మొదట విశ్వసించారు. వారు, వినతిపత్రాలూ పిటిషన్ల ద్వారానూ, బ్రిటన్‌లో వాస్తవమైన రాజకీయ ప్రచారం జరపడం ద్వారానూ బ్రిటిష్ ప్రజలకూ రాజకీయ నాయకులకూ కనువిప్పు కలిగించాలని పూనుకున్నారు. ప్రముఖ భారతనాయకుల ప్రతినిధి వర్గాలను బ్రిటన్‌కు పంపారు. 1889లో జాతీయ కాంగ్రెసు బ్రిటిష్ సంఘాన్ని స్థాపించారు. 1890లో ఈ సంఘం "ఇండియా" అన్న పత్రికను ప్రారంభించింది. దాదాభాయి నౌరోజీ తమ జీవితంలోనూ, ఆదాయంలోనూ ఎక్కువ భాగాన్ని, బ్రిటిష్ ప్రజలు - రాజకీయ నాయకుల మధ్య ప్రచారకృషిని నిర్వహిస్తూ, బ్రిటన్‌లో గడిపారు.

మొదట జాతీయవాదులు, న్యాయసమ్మతమైన ఆలజడిలోనే విశ్వాసం పెట్టుకున్నప్పటికీ, పత్రికలద్వారాతప్ప దేశమంతటా ఎడతెరిపిలేని ఆలజడిని వీరు జరపలేకపోయారు. డబ్బులేకపోవడమే, దీనికి కారణం. వీరికి ఎల్లప్పుడు డబ్బు కొఱతగా వుండేది. భాగ్యవంతులయిన భారతీయ వ్యాపారులు, పారిశ్రామిక వేత్తలు, జమీందార్లు, జాతీయ ఉద్యమానికి ఎటువంటి ఆర్థిక సహాయమూ యివ్వలేదు. రాజకీయ నాయకులు చాలా మంది , తమస్వంత ఆర్జనమీదే ఆధారపడి వుండవలసి వచ్చేది; వీరి ఆర్జన మామూలుగా బహుస్వల్పంగా వుండేది. ఉదాహరణకు, సురేంద్రనాథ్ బెనర్జీ, గోపాలకృష్ణ గోఖలె, అతిస్వల్పమైన అధ్యాపక ఆర్జన మీద జీవించేవారు; తిలక్, న్యాయశాస్త్ర విద్యార్థులకు ప్రయివేటు కోచింగ్‌క్లాస్ పెట్టుకొని జీవించేవాడు. డబ్బులేకపోవడం వల్లనే మొదటి జాతీయవాద నాయకులలో రెండు స్వతంత్ర వృత్తులయిన న్యాయవాదులు, జర్నలిష్టులు ఆధిక్యతతో వుండేవారు.

## పామరజనం పాత్ర

మొదటి జాతీయవాదుల ఉద్యమం ప్రాథమిక బలహీనతకు సంకుచిత సాంఘిక ప్రాతిపదికే కారణం. ఈ ఉద్యమం యింకా ప్రజల హర్షాన్ని పొందలేదు. వీరి పలుకుబడి ముఖ్యంగా పట్టణాలలో విద్యావంతులైన భారతీయులకు మాత్రమే పరిమితమయి వుండేది. ముఖ్యంగా నాయకులు, న్యాయవాదులు, డాక్టర్లు, జర్నలిష్టులు, అధ్యాపకులు, కొద్దిమంది వర్తకులు, భూకామందులు వంటి వృత్తివర్గాలకు మాత్రమే పరిమితమయివుండేది.

నాయకులకు పామరజనంలో రాజకీయ విశ్వాసంలేదు. భారతప్రజలకు శీలమనేది లేదనీ, ఆధునిక రాజకీయాలలో పాల్గొనేశక్తిలేదనీ, ఆనాటి అతి శక్తివంతమైన సామ్రాజ్యవాదశక్తికి వ్యతిరేకంగా విజయవంతమైన సమరం జరిపేస్థోమత లేదనీ, వారు భావించారు. క్రియాత్మకమైన రాజకీయసమరం ప్రారంభించటానికి, మార్గంలోగల యిబ్బందుల గురించి వర్ణిస్తూ గోఖలే. "దేశంలో అంతులేని విభజనలూ, ఉపవిభజనలు వుండటం, జనాభాలో ఎక్కువమంది అజ్ఞానంలోవుంటూ పాతభావాలకూ నమ్మకాలకూ విడువకుండా కట్టుబడివుండటం. మార్పులకన్నిటికి వ్యతిరేకం; మార్పంటే ఏమిటోఅర్థం చేసికోజాలరు" అనిపేర్కొన్నారు. మాడరేటు నాయకులు ఈవిషయంలో గొప్పపొరపాటు చేశారు. వీరు, పామరజనం సాంఘిక, సాంస్కృతిక, రాజకీయ వెనుకబడిన తనాన్ని మాత్రమే చూడగలిగారు. అయితే వీరు, సుదీర్ఘమైన సామ్రాజ్యవాద వ్యతిరేకసమరం

జరిపేవీరోచిత లక్షణాలు, త్యాగము పామరజనానికి మాత్రమే వున్నాయనీ, రాజకీయ కోర్కెలను బలపరచడానికి వాస్తవమైన శక్తిని పామరజనం మాత్రమే యివ్వగలరనీ, వీరిసాంస్కృతిక, రాజకీయ వెనుకబడిన తనాన్ని, సమరంలో మాత్రమే తొలగించగలరనీ, వీరు గ్రహించలేదు. సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా శక్తివంతమైన ప్రజాసమరాన్ని. భారత సమాజంలో భిన్నవర్గాలను ఒకేజాతిగా రూపొందించినపుడు మాత్రమే ప్రారంభించడం సాధ్యమని వీరు విశ్వసించారు. అయితే వాస్తవంగా ఇటువంటి సమరం సందర్భంగా మాత్రమే భారతజాతి ఒకటి ఏర్పడగలదు. పామరజనానికి దూరమయిపోయే ఈవైఖరిని అవలంబించిన ఫలితంగా, జాతీయవాదం ప్రారంభ ఘట్టంలో, సామాన్య ప్రజానీకానికి అతిబలహీనమయిన పాత్రనుమాత్రమే యివ్వడం జరిగింది. ఇది రాజకీయ స్తబ్దతకు కూడాదారితీసింది. పామరజనం అండలేక పోవడంవల్ల, విదేశపరిపాలకులను సవాలు చేయడానికి యింకాసరియైన అదనురాలేదని వారు భావించారు. ఒకవేళ ఈ విధంగా చేసినట్టయితే అదనురాక పూర్వమే అణచివేయ బడటం జరుగుతోంది. గోఖలే యిలావ్రాశారు "ప్రభుత్వానికున్న విశేష నిగూఢశక్తిని మీరు గ్రహించడంలేదు. మీరు సూచించినట్లుగా కాంగ్రెసు, ఏదైనా చేయ తలపెట్టినట్టయితే, దానిని ఐదు నిముషాలలో అణచి వేయడానికి, ప్రభుత్వానికి యిబ్బంది ఏదీ వుండదు," అనివ్రాశారు. తర్వాతి జాతీయవాదులకూ,మాడరేట్లకూ ముఖ్యమైనభేదం, ఈవిషయంలోనే.

భారత ప్రజల సమరశక్తిలో విశ్వాసం వున్నందువల్ల సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా శక్తివంతమైన ప్రజాసమరాన్ని జరపాలని, వీరు ఉద్బోధించారు. ప్రభుత్వం అణచివేయడంవల్ల ఈ ఉద్యమం విఫలంకాదనీ, ప్రజలు అనేక విషయాలు తెలుసుకొనడంవల్ల, సామ్రాజ్యవాదాన్ని పడగొట్టాలనే దృఢనిశ్చయం వారిలో మరికొంత పటిష్టమవుతుందనీ, వీరు, విశ్వసించారు.

మొదటి జాతీయవాద ఉద్యమం, సంకుచిత సాంఘిక ప్రాతిపదికమీద ఆధారపడినది కనుక, తమతోచేరిన సాంఘిక వర్గాలు బృందాల సంకుచిత ప్రయోజనాలకోసమే ఈ ఉద్యమం జరిగిందని నిర్ణయించుకోరాదు. దీని కార్యక్రమము, విధానాలు అన్ని వర్గాల భారతప్రజల కోర్కెలను తీర్చడానికి ఉద్దేశించబడ్డాయి ; వలస పీడనకు వ్యతిరేకంగా దేశవ్యాప్త ప్రయోజనాలను ప్రతిబింబించాయి. అయినప్పటికీ. సామ్రాజ్యవాద వ్యతిరేకసమరంలో ప్రజలందరిని కూడగట్టుకు రాలేకపోయినందువల్ల, రాజుకు విధేయతతో వుండాలని చెబుతూ, సామ్రాజ్యవాదంతో తప్పనిసరిగా సమాధాన పడవలసి వచ్చింది.

## అధికారుల వైఖరి

మొట్టమొదటినుంచి ప్రభుత్వం, జాతీయవాద శక్తులు పెంపొందటానికి, వ్యతిరేకంగా వుంది. వలస విధానాలను విమర్శించడంద్వారా జాతీయ చైతన్యాన్ని రేకెత్తించడానికి ప్రయత్నించి నందువల్ల, 1878లో భారత పత్రికలమీద. ప్రభుత్వం విరుచుకు పడింది. భారత జాతీయ కాంగ్రెసును స్థాపించడం, డఫరిన్‌కి అనుమానాలు కలిగించింది.

"ప్రభుత్వ విధానానికి సంబంధించిన పనులు, పద్దులను తయారుచేయడం, వాటిని మంజూరు చేయడం అసంభవం కావచ్చు" అని వ్రాశారు. కాంగ్రెసు, రాజకీయ వ్యవహారాల * కన్నా సాంఘిక వ్యవహారాలకు అంకితం కావాలని హోమ్‌కి సూచిస్తూ ఈ ఉద్యమాన్ని మళ్ళించడానికి ఆయన ప్రయత్నించారు. అయితే కాంగ్రెసు నాయకులు మార్పుచేయడానికి నిరాకరించారు. అయినప్పటికీ బ్రిటిష్ అధికారులు బాహాటమైన శతృత్వ వైఖరిని అవలంబించలేదు.

జాతీయకాంగ్రెసు, రాజకీయచైతన్యంగల కొద్దిమంది భారతీయులతో సిద్ధాంత చర్చలు జరపడంతో కాలాన్ని గడుపుతుందని, వీరు భావించారు. జాతీయనాయకుల్లో తెలివయిన వారికి శాసన సమితిలో స్థానాలు యివ్వడం ద్వారానూ న్యాయశాఖ, యితర శాఖల్లో పెద్దజీతాల ఉద్యోగాలను యివ్వడం ద్వారానూ వీరిని తృప్తిపరచడానికి కూడా వారుసిద్ధ మయ్యారు.

అయితే జాతీయ కాంగ్రెసు, యితర జాతీయ సంస్థలు, వ్యక్తులు, వార్తాపత్రికలు ఇటువంటి పరిమిత పాత్రకు కట్టుబడి వుండజాలరని, త్వరలో విదితమయి పోయింది. వార్తాపత్రికలు ప్రజాదరణ పొందాయి; కాంగ్రెసు ప్రజారంజక మయిన కరపత్రాలను, భారతీయ భాషల్లో ప్రచురించడం మొదలుపెట్టింది. జాతీయవాదుల సందేశాన్ని, ప్రజాబాహుళ్య ప్రచార సాధనాలద్వారా అందజేయడం మొదలు పెట్టారు. సామాన్య ప్రజానీకంలో రాజకీయ చైతన్యం వ్యాప్తి చెందడాన్ని బ్రిటన్ సహించలేక పోయింది.

---

* కాంగ్రెసు, డఫరిన్ సలహాపై సాంఘిక వ్యవహారాలనుంచి, దృష్టిమళ్ళించి రాజకీయ వ్యవహారాలకు ప్రాధాన్యమిచ్చిందన్న అభిప్రాయాన్ని సరిదిద్ది తీరాలి. ఈ తప్పుడు అభిప్రాయాన్ని మొట్టమొదట డబ్లియు. సి. బెనర్జీ, 1898 లో ఒక పుస్తకానికి పీఠికరాస్తూ పేర్కొన్నాడు. అప్పటినుంచి యిదే అభిప్రాయాన్ని యితర రచయితలుకూడా ఉదహరించారు. అసలు యదార్థం, తగ్గిపోతూవున్న బెనర్జీ జ్ఞాపకశక్తికి విరుద్ధంగా వున్నట్లు డఫరిన్ వ్యక్తిగత పత్రాలవల్ల తెలుస్తోంది.

ఇదికేవలం దేశద్రోహం. జాతీయ వాదుల ఆర్థిక అలజడి, సామ్రాజ్యవాదం వాస్తవ ఆధిపత్య స్వభావాన్ని బట్టబయలు చేసింది. భారత విదేశాంగ మంత్రి జార్జి హామిల్టన్, 1900 ల్లో దాదాభాయి నౌరోజికి యిలా ఫిర్యాదు చేశారు.

"బ్రిటిష్ పాలనను హృదయ పూర్వకంగా బలపరుస్తున్నట్టు మీరే స్వయంగా ప్రకటించారు. ఆపాలనవల్ల తలఎత్తే పరిస్థితులనూ కలిగే ఫలితాలను మీరే గర్హిస్తునట్టు ప్రకటిస్తున్నారు" అని. అంతకిముందు డఫరిన్ 1886 లో జాతీయ వాదుల పత్రికల పాత్ర గురించి యిలావ్రాశారు. "ఈ వార్తా పత్రికలను చదివిన వారందరికీ, మనమంతా మానవాళికి, ముఖ్యంగా భారతదేశానికి శత్రువులమన్న ప్రగాఢభావం కలుగుతుందన టంలో ఎటువంటి సందేహములేదు" అని వ్రాశారు.

బ్రిటిష్ అధికారులు యిప్పుడిహ బాహాటంగా జాతీయ కాంగ్రెసును, యితర జాతీయ ప్రతినిధులను ఖండించడం మొదలుపెట్టారు. జాతీయవాదులను 'అవిధేయ బాబులు', 'దేశద్రోహ బ్రాహ్మణులు', 'దౌర్జన్యకరమైన దుండగులు' అని అన్నారు. కాంగ్రెసును "దేశద్రోహుల కర్మాగారమనీ" కాంగ్రెసు వ్యక్తులను పదవుల్లో నిరాశ పొందిన అభ్యర్థులనీ, తమకుతామే ప్రాతినిధ్యం వహించే "అసంతృప్తి చెందిన న్యాయ వాదులనీ" వర్ణించారు. 1887లో డఫరిన్ ఒక బహిరంగ సమావేశంలో జాతీయ కాంగ్రెసును విమర్శించాడు ; కొద్దిమంది ప్రజలకు మాత్రమే యిది ప్రాతినిధ్యం వహిస్తోం దని ఎగతాళి చేశాడు. కాంగ్రెసు నాయకులకు దేశద్రోహ ద్వంద్వ శీలముందని జార్జి హామీల్టన్, ఆరోపించారు. బ్రిటిష్ పాలన చెడుగులను బైటికి తెచ్చినందుకు దాదాభాయి నౌరోజిమీద ఆయన ఎంత మండిపడ్డాడంటే ఆ మహానాయకుణ్ణి బాహాటంగా తిట్టడం మొదలు పెట్టాడు. ఇంగ్లండులో నివసించినందువల్లా, రాడికల్ - సోషలిష్టు బ్రిటిష్ నాయకులతో కలిసిమెలసి తిరగడంవల్లా, "యింతకిముందు ఆయనకున్న తెలివితేటలు, సమయస్ఫూర్తి అంతమయ్యాయని ప్రకటించాడు. వైస్రాయ్ కర్జన్ 1900ల్లో యిలా ప్రకటించాడు. "కాంగ్రెసు తప్పటడుగులువేస్తూ పడిపోబోతోంది. భారతదేశంలో నేను వుండగా, యిది శాంతియుతంగా అంతరించి పోవడానికి తోడ్పడాలన్నదే నా కోరిక" అని ప్రకటించాడు. కాంగ్రెసు "అపరిశుభ్రమయినది" అని ఆయన వర్ణించాడు. కొంతమంది బ్రిటిష్ ప్రజలు, కాంగ్రెసు రష్యన్ బంగారం స్వీకరిస్తోందని ఆరోపించారు.

అంతకంతకి పటిష్ఠమవుతోన్న జాతీయ ఉద్యమానికి వ్యతిరేకంగా బ్రిటిష్ అధికారులు, విభజించి - పాలించు" అన్న విధానాన్ని మరికొంత కట్టుదిట్టం చేశారు. భారత

ప్రజల ఐక్యత పెరగడంవల్ల తమ పరిపాలనకు పెద్దముప్పు ఏర్పడిందని వారు గ్రహించారు.

జార్జి హామిల్‌టన్ 1897లో వైస్‌రాయ్ ఎల్జిన్‌కి యిలా వ్రాశారు. "మన పరిపాలనకు వ్యతిరేకంగా స్థానిక ప్రజలు, జాతులు, మతాలలో పెరిగిపోతూవున్న సమైక్యత, మనభవిష్యత్తు గురించి నాకు భయాన్ని కలగజేస్తోంది" అని వ్రాశారు. అందువల్ల బ్రిటిష్ అధికారులు, కాంగ్రెసు వ్యతిరేక ఉద్యమం ప్రారంభించ వలసిందిగా, బ్రిటిష్ అనుకూల వ్యక్తులయిన సయ్యద్ అహమ్మద్ ఖాన్‌నీ, రాజా శివప్రసాద్‌నీ, యితరులనూ ప్రోత్సహించారు. హిందువులు ముస్లింల మధ్య విద్వేషాన్ని రేకెత్తించడానికి కూడా వారు ప్రయత్నించారు. ప్రభుత్వ సర్వీసుల్లో ఉద్యోగాల సమస్యమీద విద్యావంతులయిన భారతీయుల్లో మత వైరుధ్యాలనుకూడా వీరు రెచ్చగొట్టారు. 1857లో తిరుగుబాటు జరిగిన వెంటనే, వారు, ముస్లిం ఉన్నత వర్గాలను అణగద్రొక్కి హిందూ మధ్యతరగతి - ఉన్నత వర్గాలను బలపరచగా, 1870 తర్వాత, ముస్లిం ఉన్నత వర్గాలనూ మధ్య తరగతి వర్గాలను జాతీయ ఉద్యమానికి వ్యతిరేకంగా ప్రోత్సహించారు. హిందీ – ఉర్దూ భాషా వివాదాన్ని, మత విద్వేష భావాలను; ప్రోత్సహించడానికి ఉపయోగించు కున్నారు. సనాతన హిందువులు ప్రారంభించిన గోసంరక్షణ ఉద్యమాన్నికూడా, దీనికే ఉపయోగించుకున్నారు.

భారత విదేశాంగ మంత్రి కింబర్లి, 1893 ఆగష్టు 25 వ తేదీన వైస్‌రాయి లాన్స్‌డౌన్‌కి యిలా వ్రాశారు. "ఈ ఉద్యమం హిందువులు – మహమ్మదీయుల సన్నిహిత సంబంధాన్ని అసంభవం చేస్తూవున్నందువల్ల భారత ప్రజల సమైక్యతకు కాంగ్రెసు ప్రారంభించిన అలజడిని కూలంకషంగా నాశనం చేస్తుంది." "విభజించి పరిపాలించు" అన్న విధానం, హిందూ-ముస్లిం విభేదాలకు మాత్రమే పరిమితం కాలేదు. పారంపరిక భూకామందులను నూతన మేధావులకు వ్యతిరేకంగానూ, ఒక రాష్ట్రానికి వ్యతిరేకంగా మరొక రాష్ట్రాన్నీ, ఒక కులానికి వ్యతిరేకంగా మరొక కులాన్నీ, ఒక వర్గానికి వ్యతిరేకంగా మరొక వర్గాన్నీ పురికొల్పే ప్రయత్నం జరిగింది. సనాతనులు లేక మాడరేటు వర్గాలపట్ల యింకా ఎక్కువ స్నేహవైఖరిని ప్రదర్శించడంద్వారా, జాతీయ వాదులలో చీలిక తేవడానికి కూడా ప్రయత్నాలు జరిగాయి. 1870 సంవత్సరాలలోనూ, 1880 సంవత్సరాలలోనూ, బ్రిటిష్ భారత సంఘంవంటి ప్రాచీన సంఘాలకు చెందిన నాయకులను తృప్తిపరిచి రేడికల్ కాంగ్రెసు నాయకులకు వ్యతిరేకం చేయడానికి ప్రయత్నాలు జరిగాయి. 1890 సంవత్సరాలలో అదివరకటి రేడికల్సు అయిన డబ్లియు. సి. బొనర్జి, జస్టిస్ రణడె, గోఖలేలను, దాదాభాయి నౌరోజి, సురేంద్రనాథ్ బెనర్జి వంటి తీవ్రవాద

నాయకులనుంచి వేరు చేయడానికి ప్రయత్నాలు జరిగాయి. 1905 తర్వాత, కాంగ్రెసులో మితవాదులకూ అతివాదులకూ మధ్య విభేదాలొచ్చినపుడు, చీలిక తేవడానికి బ్రిటిష్ పరిపాలకులు గట్టి ప్రయత్నం చేశారు.

బ్రిటిష్ అధికారులు కూడా, ముల్లంగిబెత్తం విధానాన్ని అవలంబించారు. ఒక ప్రక్క భ్రమ కలిగించే సౌకర్యాలు, మరొక ప్రక్క జాతీయత పెరగకుండా అణచి వేయడానికి నిర్దాక్షిణ్యమైన దమన విధానాన్ని అవలంబించారు. జాతీయ వాదుల్లో మిత వాద వర్గాలను, సివిల్ సర్వీసుల్లో చేరే గరిష్ఠ వయః పరిమితిలో కొన్ని సౌకర్యాలు కలగజేయడంద్వారానూ, ఇతర ప్రభుత్వ సర్వీసుల్లో భారతీయులకు ఎక్కువ ప్రవేశం యివ్వడం ద్వారానూ, స్థానిక పురపాలనా ప్రభుత్వాలను విస్తృతపరచడంద్వారానూ, 1892 లో ఇండియన్ కౌన్సిల్సు చట్టాన్ని ఆమోదించడం ద్వారానూ తృప్తిపరచడానికి ప్రయత్నించారు. ఇదే సమయంలో బలహీన వర్గాలను బెదిరించడానికి దమన విధానాన్ని అవలంబించారు. వైస్‌రాయ్ ఎల్జిన్, 1898 లో భారతీయులను బాహాటంగా బెదిరిస్తూ ఒక ప్రకటన చేశారు. "భారతదేశాన్ని బలంతో జయించాం. బలంతోనే, దానిని, అధీనంలో వుంచుకోవాలి" అని. పశ్చిమ భారత దేశంలో తిలక్‌నీ, యితర పత్రికా సంపాదకులను అరెస్టు చేయడం ద్వారా జాతీయ వాదుల మీద శక్తివంతమైన దాడిని, యిదివరకే ప్రారంభించారు. 1898 లో పత్రికల స్వేచ్ఛనూ, వాక్ స్వేచ్ఛను అరి కడుతూనూ, పోలీసులు, మేజిస్ట్రేట్ల అధికారాలను ఎక్కువ చేస్తూనూ చట్టాలను ఆమోదించారు.

విద్యావ్యాప్తే జాతీయ భావం పెంపొందటానికి ముఖ్య కారణమని బ్రిటిష్ అధికారులు విశ్వసించారు. దీనిమీద యింకా ఎక్కువ ప్రభుత్వ కంట్రోలును విధించటానికీ, దాని ఆధునిక లిబరల్ స్వభావాన్ని మార్చడానికీ పథకాలను అమలు జరిపారు. జార్జి హామిల్ టన్, 1899 లో వైస్‌రాయ్‌కి, ఈ పథకాలను సూచించారు. "మొట్టమొదట ప్రభుత్వం, విద్య, దాని వ్యవస్థ, పాఠ్య పుస్తకాలమీద యింకా ఎక్కువ కంట్రోలును వుపయోగిం చాలని ఆయన తెలియ జేశారు. స్కూళ్ళు - కళాశాలలను ప్రభుత్వం తణిఖీ చేసే పద్ధతిద్వారా అధ్యాపకులమీద పటిష్టమయిన కంట్రోలును వుంచడానికి 1903 లో విద్యాచట్టాన్ని, ఆమోదించారు. రెండోది. మత ధర్మసంస్థలు నడిపే ప్రయివేటు కళాశాలలను ప్రోత్సహించాలని ప్రభుత్వం నిర్ణయించింది. హేతువాద, ప్రజాస్వామిక, జాతీయ భావాల వ్యాప్తికి దారితీసిన ఆధునిక లౌకిక విద్యకు బదులు మత - నైతిక శిక్షణ ప్రాతిపదికగా గల పద్ధతిని ప్రవేశపెట్ట తలపెట్టారు. భారతదేశంలోని మతాలనూ, భారతీయ సంస్కృతినీ ఉజ్వలింప చేయడమే ప్రాతిపదిక అయినప్పటికీ, ఈ కొత్త

పద్ధతి, అభివృద్ధి నిరోధకమయినది. యువజనుల్లో ముందుచూపు, అధునిక భావం కలిగించకపోవడమే దీనికి కారణం. 19 వ శతాబ్దం అంతమయ్యేటప్పటికి ఈ విధానం, బ్రిటిష్ సామ్రాజ్యవాదం, పురోగామి స్వభావాన్ని పోగొట్టుకుందనీ, సాంఘిక, మేధా అభివృద్ధి నిరోధక వర్గాలతోనూ, నశించిపోయే శక్తులతోనూ చేతులు కలపడానికి సిద్ధంగా వుందనీ, విదితం చేసింది. రివైవలిజం, కన్‌జెర్విటిజం వీటికి ఎటువంటి అభ్యంతరమూ లేకపోయింది. సాంఘిక, సాంస్కృతిక కన్‌జెర్విటిజం సామ్రాజ్యవాద పరిపాలనలో చోటు యివ్వవచ్చు. అయితే అన్నింటికన్నా ముఖ్యంగా వీరు, అధునిక భావాల వ్యాప్తికి భయపడ్డారు.

## విమర్శనాత్మక అంచనా

అదిలో జాతీయవాదులు, వాస్తవమైన విజయం సాధించలేకపోయారని, ఆతర్వాత విమర్శకులు పేర్కొన్నారు. వీరు ఏ సంస్కరణల కోసం అలజడి జరిపారో వాటిలో కొద్దివాటిని మాత్రమే ప్రవేశపెట్టారు. పరిపాలకులు వీరిని అలక్ష్యంతో చూశారు; వీరి రాజకీయాలను అవహేళన చేశారు. లజ్‌పత్‌రాయ్, తర్వాత యిలా వ్రాశారు. "ప్రత్యేక సౌకర్యాలకోసమూ, కష్టనిష్ఠురాల పరిష్కారం కోసమూ, 20 ఏండ్లకు పైగా వృధా అలజడి జరిపిన తర్వాత, వారికి అన్నం బదులు రాళ్ళు లభించాయి." అని వ్రాశారు. వాస్తవంగా చెప్పాలంటే, ప్రభుత్వం యింకా ఉదారంగా వుండటానికి బదులు, అభివృద్ధి నిరోధకంగానూ, యింకా అణగద్రొక్కేదిగానూ తయారయింది. అంతే కాకుండా, అదిలో జాతీయ ఉద్యమం, సామాన్య ప్రజలలో వ్రేళ్ళు పాతుకోలేకపోయింది. ఎన్నో ఆశలతో దీనిలో చేరినవారు కూడా, భ్రమపడ్డామని భావించడం మొదలుపెట్టారు. దీని రాజకీయాలు మందంగా, చురుకులేకుండా ఉన్నాయనీ. మనస్ఫూర్తిగా జరుగుతున్నట్లులేవనీ దీని విమర్శకులు అవహేళనచేశారు. దీని పద్ధతులు, ప్రార్థనలద్వారా, పిటిషన్లద్వారా ప్రాధేయపడుతూ వున్నట్టుగా వున్నాయనీ, వీరు అన్నారు. కొద్దిమంది తప్ప అదిలో చాలామంది జాతీయవాదులు ఎటువంటి వ్యక్తిగత త్యాగాలు చేయలేదనీ, వ్యక్తిగతంగా ఎటువంటి బాధలకూ గురికాలేదనీ వీరు అన్నారు. అంతేకాకుండా వీరి కార్యక్రమం, పెట్టుబడిదారి విధానమన్న సంకుచిత హద్దులకు మాత్రమే పరిమితమయింది. పెట్టుబడిదారి విధాన పద్ధతిలో తప్ప, భారతదేశపు అభివృద్ధిని వీరు ఊహించలేదు. ఇది, సామాన్య ప్రజానీకాన్ని ఆకర్షించలేక పోయింది; రాజకీయ చర్య తీసుకునే చైతన్యాన్ని వారిలోకలిగించలేక పోయింది.

అయితే జాతీయ ఉద్యమం ఆదిలో విఫలమయిందని విమర్శకులు అనటం సరి కాదు. వీరు సాధించిన వాస్తవ విజయాలు అతిస్వల్పమైనవే. వీరి రాజకీయ ఆలో చనలకూ, దృక్పథాలకూ, 20 వ శతాబ్దం ప్రారంభానికి, కాలదోషం పట్టిందని అనటం నిజమే. బ్రిటిష్ పాలన స్వభావంలో మార్పులు రావడమే దీనికి కారణం. వీరు, అఖిల భారత రాజ్యాంగ అలజడిని కూడా జరుపలేకపోయారు. వీరు, యువజనులను ఆకర్షించలేక పోయారు. వీరి వ్యవస్థగానీ, ప్రచారంగానీ, సామాన్య ప్రజానీకాన్ని కదపలేకపోయాయి. 1905 సంవత్సరం నాటికి, రాజకీయంగా వారి శక్తికి తగినట్టు వృద్ధి పొందారు. అంతకు మించి వారు ముందుకు పోలేక పోయారు.

అయితే చారిత్రకంగా చూసినట్లయితే ఆధునిక జాతీయ వాదుల రాజకీయ చరిత్ర అంత నిరుత్సాహకరంగా లేదు. కాగా, వీరు తలపెట్టిన కృషిలో ఇబ్బందులను దృష్టిలో వుంచుకున్నట్టయితే, ఇది నిజంగా ఉజ్వలమైనది. యధార్థానికి స్థూలదృష్టితో చూసిన ట్టయితే, వీరు సాధించిన విజయాలవల్లనే, ఆ తర్వాత వీరు, జాతీయ ఉద్యమం చివరి ఘట్టాలను చేరుకొని, వీరి విధానం చారిత్రకంగా పాతపడినదిగా, తయారయింది. ఈ విధంగా, ఆధునిక జాతీయవాదులు ఈనాటి పురోగామి బలానికి, ప్రాతినిధ్యం వహిం చారు. భారత రాజకీయాలలో కచ్చితమైన మార్పును, వీరు, సాధ్యం చేశారు.

విస్తృత రాజకీయ చైతన్యాన్ని కలిగించటంలోనూ, మధ్యతరగతి క్రింది తరగతి భారతీయుల్లోనూ, మేధావుల్లోనూ, తామంతా ఒకే ఉమ్మడి జాతికి, — భారతజాతికి చెందినవారమన్న భావాన్ని కలిగించడంలోనూ, వీరు కృతకృత్యులయ్యారు. ఉమ్మడి రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక ప్రయోజనాల సంబంధాల గురించీ, సామ్రాజ్యవాదంలో ఉమ్మడి శత్రువు వున్నాడన్న విషయం గురించీ, భారత ప్రజలు తెలుసుకునేటట్టు చేయడంద్వారా ఒకే ఉమ్మడి జాతిగా రూపొందేటట్టు చేయడానికి వీరు తోడ్పడ్డారు. ప్రజాస్వామ్యం, పౌరస్వేచ్ఛ అన్న భావాలను వీరు ప్రజారంజకం చేశారు. జాతీయ కాంగ్రెసునూ, యితర ప్రజా, జాతీయ సంఘాలనూ నిర్మిస్తూ వున్నపుడు భారతీయులకు, ప్రజాస్వామ్యం గురించి, వాస్తవ విషయాలు తెలిశాయి. అప్పట్లో పరిపాలకులు భారతీయులు, దాతృత్వ నియంతృత్వానికీ లేక ఓరియంటల్ నియంతృ త్వానికి మాత్రమే అర్హులని చర్విత చర్వణం చేస్తూవుండేవారు. అంతేకాకుండా, ఆధు నిక రాజకీయ కళలో, అనేకమంది జాతీయ రాజకీయ కార్యకర్తలకు శిక్షణయిచ్చారు. ఆధునిక రాజకీయ సూత్రాలు, భావాలు గురించి, ప్రజలు తెలుసుకున్నారు.

అతి ముఖ్యమయిన విషయమేమిటంటే, భారతదేశంలో బ్రిటిష్‌సామ్రాజ్యవాదం నిజ స్వరూపాన్ని నిర్దాక్షిణ్యంగా బట్టబయలు చేయడంలో వీరు, అద్భుత/కృషి నిర్వహిం

చారు. ప్రతిముఖ్య ఆర్థిక సమస్యను దేశపు రాజకీయ పరాధీన ప్రతిపత్తితో ముడి పెట్టారు. అందువల్ల రాజకీయాలలోనూ, రాజకీయ పద్ధతులలోనూ వీరు, సమతూకంలో వున్నప్పటికీ, భారతదేశపు అతిముఖ్య రాజకీయ – ఆర్థిక వాస్తవికత అయిన— ఆర్థిక పీడనకోసం భారతదేశాన్ని ఒక విదేశం పరిపాలిస్తోందన్న విషయాన్ని వెలికి తెచ్చారు. ఏ పాలక వర్గమైనా ప్రజలు ప్రభుత్వం దాతృత్వ స్వభావంలో విశ్వాసం కలిగి వున్నంత కాలంమాత్రమే లేదా ప్రభుత్వం పట్ల సుముఖత వున్నంత కాలం మాత్రమే రాజకీయ భద్రత కలిగి ఉంటుంది. ఇది, పాలక వర్గాన్ని న్యాయసమ్మతం చేస్తుంది, యిదే, దీనికి నైతిక పునాది. మొట్టమొదటి జాతీయవాదులు జరిపిన ఆర్థిక అలజడి, బ్రిటిష్ పాలనకు సంబంధించిన ఈ నైతిక పునాదిని ఊపివేసింది. దాతృత్వ స్వభావంలో, – సత్ ఫలితాలలోనూ, సద్ భావాలలోనూ ప్రజల విశ్వాసం అడుగంటేటట్టు చేసింది. మేధావుల్లో అశాంతి ప్రబలిన ఈ కాలంలో మూల కర్తవ్యాన్ని నిర్వహించి నట్టయితే, బ్రిటిష్ సామ్రాజ్యవాదం లక్షణాలను పూర్తిగా బట్టబయలు చేయడం, తప్పని సరిగా రాజకీయరంగానికి విస్తరిస్తుంది. సమరము, దాని సాంఘిక పునాదిని విస్తృత పరచడమూ, సాంఘిక, ఆర్థిక, రాజకీయ లక్ష్యాలను అధునాతనం చేయడం, సామాన్య ప్రజానీకం అండదండలు సంపాదించడం, ప్రజా ఉద్యమాలను ఏర్పాటు చేయడం, తర్వాత తప్పని సరిగా అమలు జరిగి తీరుతాయి. ఒక్కసారి ముఖ్య సమస్యలను స్పష్టీక రించినట్టయితే, రాజకీయ సమరానికి చెందిన శక్తులు – ఎత్తులలో పొరపాట్లను ఈ సమస్యల దృష్ట్యా ఎల్లప్పుడు సరిదిద్దుకోవచ్చు. తమ స్వంత రాజకీయ కృషికి సంబం ధించిన ఈ ముఖ్య, ప్రాథమిక స్వభావాన్ని, మొట్టమొదటి జాతీయవాదులు పూర్తిగా గుర్తించారు. ఉదాహరణకు, 1905 జనవరి 12 వతేదీన డి. యి. వాచాకు వ్రాసిన లేఖలో దాదాభాయి నౌరోజీ, – "కాంగ్రెస్ మందకొడిగా వుందనీ, పురోభివృద్ధి లేని దనీ యువతరం వారు భావించినందువల్ల కాంగ్రెసులో కలిగిన అసంతృప్తి, ఆదుర్దా, దీని ముఖ్య ఫలితాలని చెప్పవచ్చు. శాంతియుత మయిన దయినా సరే - దౌర్జన్యపూరిత మయిన దయినా సరే, అవసరమయిన విప్లవాన్ని తీసుకురావడం, దాని పరిణా మాన్ని, ప్రగతిని సూచిస్తుంది. ఈ విప్లవ స్వభావం, బ్రిటిష్ ప్రభుత్వం విజ్ఞత మీద, లేక అవివేకంమీద, బ్రిటిష్ ప్రజల చర్య మీద ఆధారపడి వుంటుంది." అని వ్రాశారు.

1858 మొదలు 1905 వరకూ, భారత జాతీయతా బీజాలను నాటారు. మొట్ట మొదటి జాతీయ వాదులు, ఈ బీజాలను, బాగాలోతుగా నాటారు. నమ్మకాలనూ, ఆవేశాలనూ విస్మరించాని విజ్ఞప్తులు చేయడం తమ జాతీయతకు ప్రాతిపదిక

చేయడంకన్నా, లేక, స్వాతంత్ర్యమూ – స్వేచ్ఛ హక్కుల గురించి ఊహించడం కన్నా, లేక, గతంగురించి సంస్కరణలకు వ్యతిరేకమయిన విజ్ఞప్తులు చేయడంకన్నా, వీరు, తమ జాతీయత భావాన్ని, ఆధునిక సామ్రాజ్య వాద క్లిష్ట యంత్రాంగాన్నీ, భారత ప్రజల ప్రయోజనాలకు, బ్రిటిష్ పాలనకూ మధ్యఉన్న ప్రధానమైన వైరుధ్యాన్నీ విశదీకరించి విమర్శించే పటిష్టమైన సాధనంగా ఉపయోగించారు. దీని ఫలితంగా, వీరు, ఉమ్మడి రాజకీయ – ఆర్థిక కార్యక్రమాన్ని రూపొందించారు. ఇది, భిన్నవర్గాల ప్రజలను విభజించడంకన్నా, సమైక్యం చేసింది. ఆ తర్వాత భారతప్రజలు ఈ కార్యక్రమాన్ని బలపరచి, శక్తివంతమైన సమరాలను జరపడానికి వీలయింది.

అందువల్ల, వీరికి అనేక పరాజయాలు కలిగి నప్పటికీ, మొట్టమొదటి జాతీయతా వాదులు, జాతీయ ఉద్యమం వృద్ధి చెందడానికి గట్టి పునాదులు వేశారు. నవ భారతావని నిర్మాతలలో వీరికి, ఉన్నత స్థానం యివ్వాలి. భారత జాతీయతా వాద పితామహుల పాత్ర గురించి అంచనా వేస్తూ గొప్ప మితవాదులలో ఆఖరి వాడయిన గోపాలకృష్ణ గోఖలే యిలా వ్రాశారు. "దేశ పురోభివృద్ధి ఘట్టంలో మనం ఉన్నామన్న విషయాన్ని మరచిపోకూడదు. ఈ ఘట్టంలో మన విజయాలు చిన్నవిగా వుంటాయి; మన నిరాశలు తరచుగా, పరీక్షించేవిగా వుంటాయి. ఈ సమరంలో మనకు విధికృతంగా లభించినపాత్ర ఇదే. మనపాత్ర ముగిసినపుడు మనబాధ్యత అంతమవుతుంది. దీనిని మనం, భావి తరాలవారికి, విజయాలు సాధిస్తూ భారతదేశానికి సేవ చేయడానికి అందజేస్తున్నాం. అయితే ఈ తరం వారమయిన, మనం, ముఖ్యంగా పరాజయాలద్వారా దేశసేవ చేయడంతో తృప్తి పడాలి. కష్టతరమే అయినప్పటికీ ఈ పరాజయాలనుంచే శక్తి లభిస్తుంది; ఆ శక్తే చిట్టచివరికి మహత్తర లక్ష్యాలను సాధిస్తుంది" అని వ్రాశారు.

# III వీర జాతీయతా యుగం

పంథొమ్మిదవ శతాబ్దం రెండో అర్థ భాగం చివరిలో ప్రజలలో రాజకీయ చైతన్యం, క్రమేపీ పెరుగుతూ వచ్చింది. అయినప్పటికీ నాయకులకు, బ్రిటిష్ పరిపాలకులు ఎటు వంటి ప్రత్యేక సౌకర్యాలు యివ్వలేదు. ఇదే సమయంలో వలస పాలకులు దేశాన్ని పీడించుకు తినడం కొనసాగింది.

వర్తక - వాణిజ్యాలలో సరియైన అవకాశాలు లేకపోవడంవల్ల విద్యావంతులయిన మధ్య తరగతి యువజనులు అంతకంతకి ఎక్కువగా ప్రభుత్వ ఉద్యోగాలలోనూ, న్యాయవృత్తిలోనూ చేరడం మొదలు పెట్టారు. కొంతమంది ఔత్సాహికులు జర్నలిజం వృత్తి నవలంబించడం మొదలు పెట్టారు. ప్రభుత్వ ఉద్యోగాలలో అవకాశాలు చాలా పరిమితంగా వుండేవి. ఉదాహరణకు, 1903 లో 16 వేలమంది భారతీయులు మాత్రమే నెలకు 75 రూపాయలకన్న ఎక్కువ జీతాలు వచ్చే ఉద్యోగాలు చేస్తూవుండేవారు. న్యాయవృత్తిలో అనేకమంది విఫలమవుతూ వుండేవారు; ఆ రోజుల్లో జర్నలిజం ఒక చిన్న చాలిచాలని వృత్తిగా వుంటూవుండేది అసలు సమస్య అనేకమంది పట్టభద్రులు నిరుద్యోగులుగా వుండటం కాదు. పరీక్షల్లో ఉత్తీర్ణులు కాకపోవడంవల్ల, ఎంతో నష్ట మవుతూ వుండేది. ఉపాధి దొరకని యిటువంటి యువజనుల్లో నిరాశ ఎక్కువగా వుంటూవుండేది.

శతాబ్దం ఆరంభంలో సార్వత్రిక అసంతృప్తి, గ్రామపెద్దలకూ, కర్షకులకూ, కార్మి కులకూ విస్తరించింది. అందువల్ల సంస్కరణలు కావాలని ప్రభుత్వంతో వాదిస్తూ వున్న మితవాద నాయకులకు ప్రజల్లో పలుకుబడి తగ్గిపోతూ వుందనటంలో ఆశ్చర్య మేదీలేదు. తప్పని సరిగా జరగవలసిందే జరిగింది.

ఈ పరిస్థితివల్ల అనేకమంది కొత్త నాయకులు పైకి వచ్చారు. వీరు తమ కోర్కె లను యింకా పటిష్టం చేశారు; ఇంకా వీరోచితమైన జాతీయతా భావం కావాలని వీరు విశ్వసించారు. వీరినే తీవ్రవాదులు అని అంటూ వుండేవారు. మితవాద నాయకులను ముఖ్యంగా మేధావులు, పట్టణ ప్రాంతాల మధ్య తరగతి ప్రజలు బలపరచినప్పటికీ, కొత్తగా పైకి వచ్చిన నాయకులను మధ్యతరగతి కన్న క్రింది వర్గాలవారూ, విద్యార్థులు, కార్మికులు - కర్షకులలో ఒక వర్గమూకూడా బలపరిచారు,

ఆరంభంలో, బెంగాల్‌లో రాజ్ నారాయిణ్‌బోస్, బంకిం చంద్ర చట్టర్జీ, మహా రాష్ట్రలో విష్ణుశాస్త్రి, చిప్‌లుంకర్‌వంటి మేధావులు వీరికి నాయకత్వం వహించారు. మాతృభూమిని ఉద్దేశించిన దేశభక్తి గీతాన్ని బంకిం, వందేమాతరంతో ప్రారంభించాడు. ఇదే ఆ తర్వాత దేశభక్తికీ, ఆత్మత్యాగానికీ హృదయాలను కదిపివేసే పిలుపు అయింది.

అంతేకాకుండా జాతీయ ఉద్యమం ప్రారంభ ఘట్టంలో సాధించిన అనుభవం, నాయకులకు ఒక గౌరవాన్నీ, పరిపక్వతనూ యిచ్చిందని జ్ఞాపక ముంచుకోవాలి. వీరికి ఆత్మ గౌరవమూ, ఆత్మ విశ్వాసము ఎక్కువయ్యాయి. తమను తాము పరి పాలించుకునే శక్తివుందని వీరు భావించారు. తమ దేశపు భవిష్యత్ అభివృద్ధిలో వీరికి ఒక నమ్మక మేర్పడింది. స్వామి వివేకానంద ఒక రాజకీయ నాయకుడుకాదు. అయినప్పటికీ స్వయం శక్తిలో గట్టి విశ్వాసముండవలసిన అవసరముందని ఆయన పదేపదే నొక్కి చెబుతూ వుండేవారు. "ప్రపంచంలో పాపం అనేది వున్నట్టయితే, అది బలహీనం; బలహీనతను దరిచేరనీయరాదు, బలహీనం పాపం, బలహీనం మరణం... ...సత్యానికి ఒక పరీక్ష వుంది...భౌతికంగా, మేధావికంగా, ఆధ్యాత్మి కంగా నిన్ను బలహీనం చేసే దేనినయినా, విషంగా త్రోసిపుచ్చు, దానిలో జీవం లేదు, అది సత్యం కానేరదు" అని ఆయన ప్రకటించారు.

గతించిన ప్రాభవాల గురించి పగటి కలలు కనటానికి వ్యతిరేకంగా బాహాటంగా ధైర్యంతో మాట్లాడిన మొదటివ్యక్తి వివేకానందుడే. భవిష్యత్తును దృఢంగా, దూర దృష్టితో భారత జాతి నిర్మించుకోవాలని ఆయన వాంఛించారు. "ఓ భగవంతుడా, మా మాతృదేశానికి గత యశస్సు గురించి గొప్పలు చెప్పుకోవడం నుంచి ఎప్పుడు ముక్తి లభిస్తుంది?" అని ఆయన ప్రశ్నించారు. ఆయన ఒక మత గురువు అయినప్పటికీ, మతం, ఆకలిగొన్న వారికోసం కాదనీ, మానవ సంక్షేమానికి దోహదం కావాలనీ ఆయన ప్రకటించారు.

ఈ కాలంలో అనేక విదేశాలలో సంఘటనలు కూడా భారత ప్రజలలో వీర జాతీ యతా భావాన్ని రేకెత్తించడానికి తోడ్పడ్డాయి. ముఖ్యంగా, 1868 తర్వాత జపాన్, ఆధునిక, శక్తివంతమైన దేశంగా రూపొందటం భారతీయులలో క్రొత్త ఆశలను చిగురింప చేసింది. వెనుకబడిన ఆసియాదేశం కూడా స్వయం కృషి వల్ల అభివృద్ధి చెంది పశ్చిమ దేశాల తోడ్పాటుగానీ, సహాయంగానీ లేకుండా పటిష్ఠమయిన దేశం కావచ్చునని జపాన్ ఋజువు చేసింది. 50 ఏండ్లలోగా జపాన్ పారిశ్రామిక వంతమైన దేశమయి పటిష్ఠ మయిన సైనిక శక్తి గల దేశంగా రూపొందింది. సార్వత్రిక ప్రాథమిక విద్యను ప్రవేశ పెటింది. సమర్థవంతమైన ఆధునిక పరిపాలక వర్గాన్ని ఏర్పాటు చేసింది. ఇది, భారత

దేశం అనుసరించ తగిన ఒక ఉదాహరణ. ఇదేమోస్తరుగా 1896 లో ఇథియో పియా చేతుల్లో ఇటలీ ఓడిపోవడం, 1905 లో రష్యామీద జపాన్ గెలవటం, ఇతర ప్రజల కన్నా తాము ఉచ్ఛమయిన వారమన్న తెల్లవారి వాదనలన్నీ ఒట్టి అబద్ధాలని ఋజువుచేశాయి.

ఐర్లండ్, రష్యా, ఈజిప్టు, టర్కీ, చైనా ప్రజలు స్వేచ్ఛకోసం జరిపిన పోరాటాలు. తన సిద్ధాంతాలకోసం బాధలకు గురికావడానికి సిద్ధమైన సమైక్యజాతి, అతిశక్తివంత మైన ప్రభుత్వానికికూడా వ్యతిరేకంగా పోరాటం జరపవచ్చునని, భారత ప్రజలకు ఋజువు చేసింది.

తీవ్రవాదులలో చెప్పుకోతగ్గ గొప్పనాయకుడు బాలగంగాధర తిలక్. ఆ తర్వాత ఈయన్ను లోకమాన్య తిలక్ అని పిలిచేవారు. తిలక్ 1866లో జన్మించారు. బొంబాయి విశ్వవిద్యాలయంనుంచి ఆయన పట్టభద్రులయ్యారు. దేశసేవకోసం ఆయన జీవితాన్నంత టినీ అంకితం చేశారు. జర్నలిజంలో ఆయనకున్న చాతుర్యాన్నంతటినీ తమ రాజకీయ ఆశయాలు, లక్ష్యాలకు అనుగుణంగా ప్రజాభిప్రాయాన్ని కూడగట్టుకు రావడానికి చక్కగా వుపయోగించారు. సి. జి. అగర్కార్‌తో కలిసి ఆయన రెండు వార్తాపత్రికలను, ఇంగ్లీషులో మరాతా అన్న ఒక పత్రికనూ, మరాఠీలో కేసరి అన్న మరో పత్రికను స్థాపించారు.

1889 నుంచి ఆయనే స్వయంగా కేసరి పత్రికకు సంపాదకులుగా పనిచేశారు. జాతీయవాదుల కోర్కెలను ఈ పత్రిక గట్టిగా బలపరిచింది. ప్రజలు, నిర్భయంతో, నిస్వార్థంగా, గర్వంతో ఆత్మవిశ్వాసంతో వుండాలని కోరుతూ తిలక్ వ్రాసేవారు; ప్రసంగించేవారు. సంప్రదాయ సిద్ధమైన గణేష్ ఉత్సవాలలో ఆయన పాల్గొనేవారు; సామాన్య ప్రజానీకంలో జాతీయ భావాలను పాతుకునేటట్టు చేయడంకోసం ఆయన శివాజీ ఉత్సవాలను ఏర్పాటు చేసేవారు.

అనావృష్టివల్లా లేక క్షామాలవల్లా లేక ఈతి బాధలవల్లా తమపంటలు నాశన మయి నపుడు భూమిశిస్తులు చెల్లించకూడదని మహారాష్ట్రలో కర్షకులకు మొట్టమొదట సలహా యిచ్చాడు తిలక్. భారత మిల్లు వస్త్రాలమీద వైస్రాయ్ ఎల్‌జిన్ ఎక్సయిజు సుంకం విధించినపుడు, స్వదేశీ వస్తువులను వాడాలనీ, బ్రిటిష్ వస్తువులను బహిష్కరించాలనీ ఆయన కోరారు.

బ్రిటిష్ అధికారులకు యిది కలవరం కలిగించింది. 1897 లో ఆయన్ను అరెస్టు చేశారు; ప్రభుత్వానికి వ్యతిరేకంగా విద్వేషాన్నీ, అవిధేయతనూ ప్రచారం చేస్తున్నాడని ఆయనమీద ఆరోపించారు. ఆయన ధైర్యంతో చెలించకుండా నిలబడ్డాడు. క్షమాపణ

చెప్పుకోడానికి ఆయన నిరాకరించాడు; 18 నెలల కఠిన నరకాన్ని సగర్వంగా ఆమోదించాడు. ఈయన ఉదాహరణ, త్యాగము అందరికీ గగుర్పాటు కలిగించాయి. నూతన జాతీయతాభావానికి ఆయన సజీవ చిహ్నమయ్యారు.

లోకమాన్య తిలక్‌తోడు, బిపిన్ చంద్రపాల్, అరొబిందొఘోష్, లాలాలజ్‌పత్ రాయ్ వంటినాయకులు, ఈ వీరజాతీయతా భావాన్ని ప్రధానంగా ప్రచారం చేశారు. వీరి కార్యక్రమానికి మూడు ముఖ్య అంశాలుండేవి. మొదట, భారతీయులే తమ స్వాతంత్ర్యంకోసం గట్టి కృషిచేసి దానిని సంపాదించాలనీ, విదేశపాలనక్రింద తామువున్న అధోగతినుంచి పైకి రావడానికి దృఢనిశ్చయంతో ప్రయత్నించాలనీ, వీరు భావించారు. ఈ లక్ష్య సాధనలో ఎంత త్యాగమయినా చేయాలి; ఎన్ని బాధలకయినా లోనుగావాలి. అందువల్ల ధైర్యంతో, ఆత్మ విశ్వాసంతో, త్యాగనిరతితో కృషిచేయాలని వీరు వాదించారు. రెండోది, భారత దేశానికి "దాతృత్వ మార్గదర్శకతం" విదేశీయుల సహాయము కావాలనడం పూర్తిగా అబద్ధమని వీరు ఖండించారు. విదేశీయుల పాలనను వీరు ద్వేషించారు; స్వరాజ్యం లేక సంపూర్ణ స్వాతంత్ర్యం అన్న లక్ష్యంకోసమే పోరాటం జరపాలని వీరు దృఢంగా ప్రకటించారు. ఆఖరుది, పామరజన శక్తిలో వీరికి పూర్తివిశ్వాసముండేది; ప్రజాశక్తిద్వారా స్వాతంత్ర్యాన్ని సాధించడానికి వీరు సిద్ధమయ్యారు.

## బెంగాల్ విభజన, బెంగాలి వైఖరి

కర్జన్, రంగంలో ప్రవేశించేటప్పటికి తీవ్రవాదులలో చిగురిస్తూవున్న భావాలకు ఒక నిర్దిష్ట స్వరూపం యివ్వడం జరిగింది. ఆయన విధానమే యిది పెరిగి పెద్దదయి పటిష్టం కావడానికి దారితీసింది. ప్రజల చిరకాల ఆదర్శాలయిన స్థానిక స్వపరిపాలనా ప్రభుత్వము, విద్యా స్వపరి పాలనా ప్రతిపత్తి. పత్రికాస్వాతంత్ర్యం అన్న ఆదర్శాల మీద ఆయన దాడి జరిపాడు. కలకత్తా కార్పొరేషన్‌లో భారతీయుల సంఖ్యను ఆయన తగ్గించివేశారు. విద్యాసంస్కరణలు అన్న పేరుమీద భారతీయ విశ్వవిద్యాలయాల మీద అధికార అదుపును, కర్జన్, ఎక్కువచేశాడు. ఆయన నియమించిన విశ్వవిద్యాలయ విచారణ సంఘం రెండోగ్రేడు కళాశాలలనూ, న్యాయశాస్త్ర తరగతులనూ రద్దు చేయాలనీ, జీతం ఎక్కువ చేయాలనీ, సెనెటర్ల నియామకాలనూ, సంఖ్యనూ తగ్గించాలనీ, విద్యాశాఖ మీద అదుపును కట్టుదిట్టం చేయాలనీ, అనుబంధం మీద విస్తృత అధికారాలుండాలనీ శిఫార్సు చేసింది. న్యాయ శాస్త్ర తరగతులనూ, సెకండ్‌గ్రేడు కళాశాలలనూ రద్దుచేయడమూ అంటే వీటిని నడిపి, వీటిలో అధ్యాపకులుగా పనిచేసే భారతీయులకు

ఉపాధి కలిగించడమేకాక, ఉన్నత విద్యనభ్యసించడానికీ, న్యాయవాదవృత్తిలో ప్రవేశించ డానికీ భారతీయులకున్న అవకాశాలను ఇంకా తగ్గించడమన్నమాటఅర్థం. జీతం ఎక్కువ చేయడంవల్ల గుమాస్తా, ఉపాధ్యాయ ఉద్యోగాలకు పేదవారు వెళ్ళే అవకాశాలు లేకుండా చేయడమే. మితవాదులు ఈ బిల్లును ప్రతిఘటించారు ; అయినా కర్జన్, సౌకర్యాలేవీ కలగజేయలేదు. జాతీయవిద్య కావాలన్న కోరిక ఎక్కువయింది.

దమన అధికారులను ప్రజలు విమర్శించకుండా వారికి రక్షణ కల్పించడం కోసం భారత అధికార రహస్యాల సవరణ చట్టాన్ని ఆయన ఉద్దేశించారు. లిటన్ విధానాన్ని కొనసాగించడమే యిది. దీనితో పత్రికలు యింతకి ముందుకన్నా ఎక్కువగా జాతీయతా భావాన్ని అలవరుచుకున్నాయి. విదేశ యాత్రలకోసం, ఢిల్లీ దర్బార్కీ, టిబెటిన్ యాత్రకూ భారతీయ డబ్బును, ఆయన, విస్తారంగా ఖర్చుచేశాడు. భూమి శిస్తును తగ్గించడానికి ఆయన నిరాకరించాడు. చిట్టచివరికి బెంగాల్ విభజన వచ్చింది. పెద్ద రాష్ట్రం పరిపాలనా సౌలభ్యంకోసం, యిది చేశామని గొప్పలు చెప్పుకున్నప్పటికీ, రేడికల్ బెంగాలీ జాతీయ వాదులను అణచివేయడమే దీని ఉద్దేశ్యం. పరిపాలనా సౌలభ్యమూ, అస్సాం అభివృద్ధి ఈ పథకం ముఖ్య లక్ష్యాలు. అయితే రాజకీయాలు యిందులో ప్రవేశించాయి. " కలకత్తా విధ్వంసక ప్రభావంనుంచి " తూర్పు జిల్లాలకు విముక్తి కలిగించాలనీ, " ముస్లింలకు న్యాయం చేకూర్చాలనీ " అధికారులు అంటూ వుండేవారు. తీవ్రవాదుల అగ్నిజ్వాలలకు ఆయువు పట్టులయిన బకర్గంజ్, ఫరీద్పూర్ లను తూర్పు బెంగాల్కు బదిలీ చేయాలని వీరు అనుకున్నారు.

విస్తృత ఆక్షేపణలు వెలువడ్డాయి. ఇది అవివేకమయిన పథకమని కాంగ్రెస్ తెలియ జేసింది. రెండు ప్రత్యామ్నాయాలను సూచించారు. బెంగాల్ని గవర్నర్క్రింద వుంచాలి లేదా బెంగాలీ భాష మాట్లాడే వారిని విభజించకుండా హిందీ, ఒరియాభాషలు మాట్లాడే ప్రజలను వేరుచేయాలి. బెంగాలీ బాబులు చెప్పే వట్టి కల్లమాటలని, ఈ ఆక్షేపణలను కర్జన్ తిరస్కరించారు. విభజన రాజకీయంగా వాంఛనీయమని యిది ఋజువు చేసింది. ప్రభుత్వం దీనికి అంగీకరించి నట్టయితే భారతదేశం తూర్పు భాగంలో మరింత కల్లోలానికి దారితీసినట్టవుతుంది,

1904 ఫిబ్రవరిలో తూర్పుబెంగాల్ సందర్శించి నప్పుడు, ఆయన, మొదటి పథ కాన్ని విస్తృత పరిచాడు. బెంగాల్ యిప్పుడు మొత్తం 15 జిల్లాలను కోల్పోతుంది; దాని జనాభా 5 కోట్ల 40 లక్షలు తగ్గిపోతుంది. రిస్లీ యిలా వ్రాశాడు. "సమైక్య బెంగాల్ అతి శక్తివంతమైనది. విభజింపబడిన బెంగాల్ అనేకవైపుల లాగుతుంది. ... చీలదీయడం ద్వారా మన పాలనకు పటిష్టమయిన వ్యతిరేకులను బలహీనం

చేయడమే మన ముఖ్యలక్షణాలలో ఒకటి. ఆ తర్వాత లార్డుహార్డింజ్ దీనిని ఒప్పు కున్నారు. "బెంగాలీల మీద దెబ్బతీయాలన్న లక్ష్యానికి అత్యధిక ప్రాధాన్యమివ్వడం జరిగింది." అన్ని వర్గాల బెంగాలీ ప్రజలు — జమీందార్లు, న్యాయవాదులు, వ్యాపారులు, పట్టణంలోని పేదవారూ, కార్మికులు, విద్యార్థులు, — వీరందరూ సమైక్యమై అధికా రుల పన్నాగాలను తీవ్రంగా ఆక్షేపించారు. ఉద్రేకపూరితులయిన స్వాభిమానులైన ప్రజల భావాలను దురుసుగా అణచివేయడం జరిగింది.

## విభజన వ్యతిరేక ఉద్యమం

కర్జన్‌కి, విదేశాంగ మంత్రి అయిష్ట సమ్మతి లభించింది, 1905 జూలైలో ఈ పథకాన్ని ప్రచురించారు. తాను నిర్మూలించదలచిన సమైక్యతను సాధించడం జరిగిం దని ఆయన తెలుసుకున్నాడు. విభజన వ్యతిరేక ఉద్యమాన్ని అన్ని వర్గాల బెంగాలీ ప్రజలు, జాతీయ నాయకులందరూ బలపరిచారు. సురేంద్రనాథ్ బెనర్జీ వంటి మిత వాదులు ప్రారంభఘట్టంలో చొరవ తీసుకున్నారు. అయితే బిపిన్ చంద్రపాల్, అశ్వనీ కుమార్ దత్తా, అరొబిందో ఘోష్ వంటి తీవ్రవాద వర్గాలు త్వరలో అదుపు సంపా దించారు. గ్రామ ప్రాంతాలకు కూడా లోపించినప్పటికీ, యిది ముఖ్యంగా పట్టణ ఉద్యమం.

1905 ఆగస్టు 7 వ తేదీన కలకత్తా టవున్ హాలులో బ్రహ్మాండమైన సమా వేశం జరిగినప్పుడు బ్రిటిష్ వస్తువులను బహిష్కరించాలన్న తీర్మానాన్ని ఆమోదిం చారు. విభజనను అమలు పరిచిన అక్టోబరు 16 వ తేదీన జాతీయ సంతాప దినంగా పరిగణించాలని కోరారు. సార్వత్రిక హర్తాళ్ జరిగింది. ప్రజలు ఉపవాసంజరిపి, పాదరక్షలు లేకుండా, నినాదాలు చేస్తూ, దేశభక్తిగీతాలను పాడుతూ, గంగా స్నానా లకు వెళ్ళారు. బెంగాలీల సౌభ్రాత్ర సూచనగా హిందువులు, ముస్లింలు, పరస్పరం ఒకరి మణికట్టుకు మరొకరు రాఖీలు కట్టుకున్నారు.

ప్రజల కోపతాపాలను, రవీంద్రనాథ్ తమ స్వదేశీ గేయాల ద్వారా వ్యక్తపరి చారు. ఈ గేయాల్లోని ప్రతి చరణమూ విభజించబోతూవున్న మాతృ భూమిపట్ల ప్రజలపట్లా ప్రేమను వ్యక్తం చేసింది. బెంగాలీలందరూ ఒకే త్రాటి మీద నిలబడి ప్రతిఘటనకూ, బాధలకూ, త్యాగానికీ సిద్ధమయ్యారు. బరిసల్, మైమెన్‌సింగ్ వంటి శివారు జిల్లాలు దేశభక్తి జ్వాలలతో ఆవరింప బడ్డాయి. బెనారస్ మహాసభకు అధ్యక్షత వహిస్తూ గోఖలే విభజన గురించి ప్రస్తావించారు. "ఇది క్రూరమైన

తప్పిదం. అధికార దర్పంగల ప్రస్తుత పాలనా వ్యవస్థ హీన లక్షణాలకు ఒక పూర్తి ఉదాహరణ. ప్రజాభిప్రాయాన్ని పూర్తిగా పెడచెవిని పెట్టడానికీ గొప్ప మేధాశక్తి ముందు తమ అవివేకాన్ని కప్పిపుచ్చుకోడానికి తలబిరుసుగా నటించటానికీ, ప్రజల చిరకాల వాంఛలను నిర్లక్ష్యం చేయడానికీ, పాలింపబడేవారి సేవల ప్రయోజనానికి అసలు ప్రాధాన్య మివ్వకపోడానికీ యిది ఒక పెద్ద ఉదాహరణ."

స్వదేశీ — బహిష్కరణ భావాలు 1905 లో ప్రజల భావాలనుంచి పుట్టాయి. ఇవి క్రొత్తవేమీ కావు. అమెరికన్లు, ఐరిష్ ప్రజలు, చైనీయులు వీటిని యింతకి ముందు అనుసరించారు. భారత పరిశ్రమను అభివృద్ధి పరచడానికి ముఖ్యమైన ఆర్థిక చర్యగా స్వదేశీ వినాదాన్ని మహారాష్ట్రకు చెందిన గోపాలరావు దేష్‌ముఖ్, జి. వి. జోషి, ఎమ్. జి. రనడే. బెంగాలులో టాగూర్ కుటుంబానికి చెందిన రాజ్‌నారాయణ్, బోస్, నబగోపాల్ మైత్ర ప్రబోధించారు. ఇదేమోస్తరుగా, బ్రిటిష్ ప్రజలమీద ఆర్థిక ఒత్తిడిని తీసుకురావడం కోసం 1870 సంవత్సరాలలో బోలానాధ్ చంద్ర, బహిష్కరణను ప్రచారం చేశారు. 1896 పెద్ద బహిష్కరణ ఉద్యమానికి తిలక్, నాయకత్వం వహించారు. స్వదేశీ, బహిష్కరణలకు సన్నిహిత సంబంధంవుందని గ్రహించారు. ఒకటి లేకుండా మరొకటి విజయవంతం కానేరదు.

ఈ పాత భావాలకు, విభజన వ్యతిరేక ఉద్యమంనుంచి క్రొత్త ప్రోత్సాహం లభించింది. అయితే, యిది, మితవాదులకూ — తీవ్రవాదులకూ మధ్య విభేధాలను కూడా బహిరంగం చేసింది. బొంబాయి మితవాదులు స్వదేశీని హర్షించి నప్పటికీ, సార్వత్రిక రాజకీయ ఆయుధంగా బహిష్కరణను వ్యతిరేకించారు. గోఖలే. "బహిష్కరణ" జోలికి పోలేదు. "మరొకరిని గాయపరచ డానికి పగసాధించే వాంఛ," "మనలో మనకే అనవసరమయిన వైషమ్యాన్ని పెంచేది" — అని ఆయన భావించారు. బహిష్కరణ, తక్షణ అన్యాయాన్ని ప్రతిఘటించడానికి ఒక ప్రత్యేక చర్య అని, సురేంద్రనాధ్ బెనర్జీ భావించారు. విభజనను రద్దు చేసినపుడు దీనిని ఉపయోగించరని ఆయన ఆశించారు. లజ్‌పత్‌రాయ్ ప్రాథమిక సూత్రవాదాన్ని లేవతీశారు. బ్రిటిష్‌వారి ఆదాయానికి ముప్పు ఏర్పడినపుడే భారతీయుల కష్టనిష్ఠురాలపట్ల వారిదృష్టిని కేంద్రీకరింప చేయ వచ్చునని ఆయన అన్నారు. బహిష్కరణలో అనేక సాధక బాధకాలున్నాయని తిలక్, పాల్, అరబిందో, భావించారు. మేన్‌చెస్టర్‌కు యిది ఆర్థిక ఒత్తిడి, సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా రాజకీయ అలజడికి ఇది ఒక ఆయుధం, స్వరాజ్య సాధనకు స్వయం సంమృద్ధిలో యిది ఒక శిక్షణ.

ప్రస్తుతానికి విభేదాలను విస్మరించారు. విభజన వ్యతిరేక అలజడి స్వదేశీ ఉద్యమంగా మారింది. చెదురు మదురుగా వున్న పిరికి శక్తులు సమైక్యమై శక్తి ఉత్సాహాలతో పని చేయడానికి యిది తోడ్పడింది. బెంగాల్‌లో సంఘటనలు, బ్రిటిష్ ప్రజల న్యాయబుద్ధిలో విశ్వాసాన్నీ, విజ్ఞాపన పత్రాలు, సమావేశాలు, వార్తా పత్రిక వ్యాసాల ద్వారా పరిమిత పద్ధతిలో రాజ్యాంగ బద్ధమైన అలజడి జరపడం వల్ల విజయం సాధించ వచ్చుననన్న విశ్వాసాన్నీ, అనేక మంది కాంగ్రెస్ నాయకులలో పటాపంచలు చేశాయి. స్వదేశీ ఉద్యమం, కులమత వివక్షతలు లేకుండా నూతన వర్గాల ప్రజలను రాజకీయాలలోనికి తీసుకొచ్చింది. పత్రికలు, నిర్భయంగా వాస్తవాన్ని చాటాలనీ, విద్యార్థులు తిరుగుబాటు జరపాలనీ, హిందూ – ముస్లింలు సహకరించాలనీ, ప్రతి ఒక్కరూ తమ రాజకీయ ఆర్థిక పరిస్థితిని ప్రతిబింబింప చేయడానికి భయాన్ని వదులుకోవాలనీ, అధికారులను ధిక్కరించి లాఠీచార్జీని, జైలు శిక్షనూ, ఉరిని కూడా దేశసేవకోపం గౌరవప్రదమయినదిగా భావించాలని స్వదేశీ ఉద్యమం ప్రబోధించింది.

బెంగాల్ విభజనకూ, ప్రభుత్వం అనురిస్తోందన్న దమన చర్యలకూ వ్యతిరేకంగా బెనారెస్ కాంగ్రెస్ తీవ్రమైన ఆక్షేపణను తెల్పింది. బెంగాల్. స్వదేశీ ఉద్యమాన్నీ, బహిష్కరణనూ అనుసరించాలని వీరు తెలియ జేశారు. అయితే యావద్ భారత దేశమూ బహిష్కరణను అనుసరించడాన్ని, వీరు, బలపరచలేదు. అయితే లజ్‌పత్ రాయ్, బెంగాల్ ఉదాహరణను యితర రాష్ట్రాలు కూడా అనుసరించాలనీ కోరారు. స్వదేశీ, బహిష్కరణ, జాతీయ విద్య మూలలక్ష్యం స్వరాజ్య సాధనేనని తిలక్ ఉద్ఘాటించారు. బెంగాల్ అంతటా అనేక వేల బహిరంగ సమావేశాలలోనూ, భారత దేశంలోని ప్రధాన నగరాలూ పట్టణాలూ దాదాపు అన్నింటిలోనూ బహిష్కరణ – స్వదేశీ ఉద్యమాలను అమలు జరపాలని పిలుపుయిచ్చారు. దీనిలో రెండు ముఖ్య విషయాలున్నాయి. ఒక ప్రక్క బ్రిటిష్ వస్తువులను బహిరంగస్థలాలలో తగుల బెట్టారు; వీటిని అమ్మే దుకాణాల ముందు పికెటింగ్ జరిపారు. మరో ప్రక్క స్వదేశీ వస్తువుల ఉత్పత్తికి అమ్మకానికి తీవ్ర ఉద్యమాన్ని ప్రారంభించారు. మిఠాయిలు మొదలయిన తీపి పదార్థాలను తయారుచేసే వారు విదేశ చక్కెరను ఉపయోగించబోమనీ, రజకులు, విదేశవస్త్రాలను చలువచేయబోమనీ, పూజారులు, విదేశ వస్తువులతో పూజలుచేయబోమనీ, ప్రతిన బట్టారు. దక్కాన్ - బెంగాల్ మహిళలు విదేశగాజులనూ, గాజుపాత్రలనూ విసర్జించారు. విద్యార్థులు, విదేశ కాగితాన్ని ఉపయోగించడానికి నిరాకరించారు. బ్రిటిష్ ఉత్పత్తులను అమ్మేవారి పోషకులుగా వుంద

టానికి డాక్టర్లు న్యాయవాదులూ కూడా నిరాకరించారు. సంప్రదాయసిద్ధమైన సాంఘిక బహిష్కరణతో పికెటింగ్ జరిపారు. బరిసల్ వంటి కొన్నిచోట్ల వర్తకులు స్వచ్ఛం దంగా నాశనం చేయడానికి ఉప్పు-వస్త్రం యిచ్చారు. దీనివల్ల వీరు ప్రతీకార చర్య లను తీసుకునే పోలీసుల ఆగ్రహానికి గురికావలసి వచ్చింది.

సత్ఫలితాల గురించి చెప్పాలి అంటే, ఈఉద్యమం కుటీర పరిశ్రమలకూ వివిధ రకాల పెద్ద వ్యవస్థలకు కూడా ప్రోత్సాహ మిచ్చింది, స్వదేశీ జవుళి మిల్లులూ, అగ్గిపెట్టెలు సబ్బుల ఫ్యాక్టరీలు, పింగాణీ సామాగ్రి, తోళ్ళను పదునుచేసే ఫ్యాక్టరీలు ప్రతిచోట వెలిశాయి. ఆచార్య పి. సి. రే. తమస్వంత బెంగాల్ కెమికల్ స్వదేశీ స్టోరు ఏర్పాటు చేశారు. అతి త్వరలో యిది ప్రసిద్ధి చెందింది. గురుదేవ్ ఠాగూర్ స్వయంగా స్వదేశీ దుకాణం ఏర్పాటు చేయడంలో తోడ్పడ్డారు. ప్రభుత్వ సహాయన్నీ—విదేశ సహాయాన్నీ నిరాకరించిన తాతా ఇనుము—ఉక్కు కంపెనీ పెట్టుబడినంతా మూడునెలల్లో భారతీయులు విరాళాల ద్వారా యిచ్చారు. బ్యాంకులనూ, భీమా కంపెనీలనూ, స్థాపించ డానికి పెద్ద జమీందార్లు, వర్తకులు రాజకీయ నాయకులతో చేతులు కలిపారు. నౌకాయాన సంస్థలు కూడా వెలిశాయి.

స్వదేశీ ఉద్యమం సాంస్కృతిక రంగంలో కొత్త పోకడలను కూడా ప్రోత్స హించింది. దేశభక్తి ఆదర్శవాదంతో నిండిన కొత్తరకం జాతీయ పద్య - గద్య కవిత, జర్నలిజం ఉద్భవించాయి. ఆకాలంలో రవీంద్ర నాథ్ ఠాగూర్, రజనీకాంత్ సేన్, ముకుంద దాస్‌వంటి కవులు కూర్చిన దేశభక్తి గీతాలు అప్పటి సమయానికి మాత్రమే కాక, శాశ్వతమైన సారస్వత ప్రాముఖ్యం గలవిగా రూపొందాయి. ఈనాటికికూడా బెంగాల్‌లో వీటిని పాడుతూ వుంటారు. స్వదేశీ - జాతీయ ఉద్యమాల ఫలితంగా ఆవిర్భవించిన రాజకీయ జర్నలిజం. స్వాతంత్ర్యము, స్వేచ్ఛ, స్వయం సమృద్ధి గురించి కొన్ని ప్రమాణ గ్రంథాలను తయారు చేసింది.

తిలక్ పశ్చిమ భారతదేశానికి బహిష్కరణ - స్వదేశీ ఉద్యమాలను పరివ్యాప్తం చేశారు. పూనాలో ఆయన, విదేశవస్త్రాలను పెద్ద మంటవేసి తగుల బెట్టారు. స్వదేశీ వస్తు ప్రచారిణీ సభ అధిపతిగా ఆయన, సహకార, దుకాణాలను తెరిచారు. సరస మయిన రేట్లకు ధోవతులను సప్లయి చేయవలసిందిగా, ఆయన, బొంబాయి, మిల్లు యజమానులను ఉద్బోధించారు. పూనాలో స్వదేశీ చేనేత కంపెనీ ఒకటి ఏర్పాటు చేశారు.

విదేశ చక్కెర ఉపయోగానికి వ్యతిరేకంగా పంజాబ్‌లో పెద్ద అలజడి బయలు దేరింది. విదేశ పంచదారను దిగుమతి చేసుకోవడం వల్ల దేశవాళి చక్కెర ఉత్పత్తి,

చెఱకు ఉత్పత్తి తగ్గిపోయాయి. రావల్ పిండి వర్తకులు, దీని వ్యాపారాన్ని జరప బోమని ప్రతిన బట్టారు. ముల్తాన్ బ్రాహ్మణ పూజారులు యిది వున్న దేవాలయ పూజా ప్రసాదాల నన్నిటినీ నిషేధించారు. ఈ ఉద్యమం హరిద్వార్, ఢిల్లీ, కాంగడా జమ్మూలకు వ్యాప్తిచెందింది. ఢిల్లీలో స్వదేశీ ఉద్యమాన్ని, సయ్యద్ హైదర్‌రజా అత్యంత శక్తి ఉత్సాహాలతో నడిపారు. మద్రాసు రాష్ట్రం కోరమండల్ తీరంలో తూత్తుక్కుడి దగ్గర చిదంబరంపిళ్ళై స్వదేశీ స్టీమ్ నేవిగేషన్ కంపెనీని స్థాపించారు.

## వీర జాతీయతా ఉద్యమం అభివృద్ధి

స్వదేశీభావం, ప్రజలు జాతీయ రీతుల్లో విద్య నభ్యసించాలని ప్రబోధించింది. 1898 లో డాన్ పత్రిక సంపాదకులు సతీష్ చంద్రముఖర్జీ, జాతీయ విద్యా పథకాన్ని తయారు చేశారు. బ్రిటిష్ విద్యా పద్ధతిని జాతీయ వ్యతిరేకంగా భావించారు. విదేశ విజ్ఞానాన్ని జీవం లేకుండా నెమరువేసుకుంటున్నారని వీరు తెలియజేశారు. ఈ విజ్ఞానానికి భారతీయ పరిస్థితులు సంస్కృతితో సంబంధమేదీలేదు. బోధనాభాష ఇంగ్లీషు కావడంవల్ల అధ్యయనంలో సంతోషం నశించింది, స్వేచ్ఛాభావనను నిరుత్సాహ పరిచింది, సృజనాత్మక రచనలను అరికట్టింది. శాంతినికేతన్‌ను స్థాపించడం ద్వారా రవీంద్రనాథ్ టాగూర్ మార్గాన్ని చూపించారు. కర్జన్ చేసిన భారత విశ్వ విద్యాలయాల చట్టమూ, రాజకీయ ప్రదర్శనల్లో విద్యార్థులు పాల్గొనడాన్ని నిషేధిస్తూ జిల్లా మేజిస్ట్రేట్లకు కేర్లీపంపిన ఆదేశమూ జాతీయ విద్యాసమితి ఏర్పాటుని ప్రోత్సహించాయి. బెంగాల్ జాతీయ కళాశాలను 1906 లో స్థాపించారు; అరొబిందొ, దీనికి ప్రిన్సిపాల్. పాఠ్యఅంశాలలో శాస్త్ర - సాంకేతిక విషయాలకు తగిన స్థానమిచ్చారు. అయితే భారతీయ విషయాలకు ఎక్కువ ప్రాధాన్యమీయటం జరిగింది. భారతీయ శాస్త్రజ్ఞులనూ, చరిత్రకారులనూ, పారిశ్రామిక వేత్తలనూ రూపొందించటమే దీనిలక్ష్యం; అయితే దేశభక్తిని ప్రోత్సహించడానికి ఎక్కువ ప్రాముఖ్య మిచ్చారు. స్వేచ్ఛవర్థిల్లే సాంస్కృతిక క్షేత్రాన్ని ఇది తయారు చేయాలి. స్థానిక భారతీయ భాష ప్రధాన బోధనా భాషగా వుండాలి. అంత వరకూ అశ్రద్ధ చేసిన సాంకేతిక విద్యకు, బెంగాల్ సాంకేతిక విద్యాసంస్థ, ప్రాధాన్య మిచ్చింది. ఉన్నత పద్ధతులను నేర్చుకోడానికి విద్యార్థులను స్కాలర్ షిప్పుల మీద జపాన్‌కు పంపారు. దేశమంతటా వందలాది జాతీయ పాఠశాలలు వెలిశాయి.

గ్రామాల సాంఘిక - ఆర్థిక పునరుజ్జీవనానికి ఆధారమయిన ఆత్మశక్తిని వృద్ధి చేసుకోవాలని టాగూర్ ఉద్బోధించారు. నామ సూత్రులు వంటి కుల వివక్షతలను రద్దు

చేయడానికీ, యింకా బాల్య వివాహాలూ, వరకట్నాలూ, తప్ప త్రాగడంవంటి చెడుగులను నిర్మూలించడానికి బరిసల్‌లో అశ్వనీ కుమార్ దత్తా వాస్తవచర్యలకు పూనుకున్నప్పటికీ, మొత్తం తీవ్రవాదులు, రాజకీయ స్వాతంత్ర్యం అతి ముఖ్యమైనదిగా భావించారు. తిలక్ కేసరి పత్రికలో వ్రాస్తూ, "మన జాతి ఒక వృక్షం వంటిది. దీని అసలు మాను స్వరాజ్యం; కొమ్మలు స్వదేశీ, బహిష్కరణలు" అని పేర్కొన్నారు. స్వదేశీ వాస్తవంగా స్వరాజ్యకు దారితీసింది. అందువల్ల ఈ ఉద్యమాన్ని విభజన వ్యతిరేక అలజడి నుంచి విదేశపాలనకు చెందిన అన్ని రూపాలకు వ్యతిరేకమయిన సహకార నిరాకరణ ఉద్యమంగా విస్తృత పరచాలి. అంటే దీని అర్థం, బ్రిటిష్ వస్తువులనూ, పాఠశాలలనూ బహిష్కరించడం మాత్రమేనని కాదు; న్యాయస్థానాలనూ, పురపాలక సమితులనూ, శాసన సమితులనూ, ఒక్క ముక్కలో చెప్పాలంటే ప్రభుత్వంతో సంబధం వున్న వాటి నన్నింటినీ బహిష్కరించాలని అర్థం. బ్రిటిష్ ప్రతిష్ఠను వ్రేళ్ళతో పెకిలించి వేయడంతో దాని మోజును అడుగంటింప చేయవలసివుండె. బ్రిటిష్ అధికారులు భారత ప్రజలను అణద్రొక్కకుండా చేయడానికి బ్రిటిష్ వాణిజ్యానికి తోడ్పడటానికి ఒక పద్ధతి ప్రకారం నిరాకరించడం ద్వారా - పరిపాలనను స్తంభింప చేయాలి.

బహుముఖ సమరం జరపటానికి తీవ్రవాదులు కాంగ్రెసును ఆకట్టుకు రావడానికి ముందు, కర్షకులనూ కార్మికులనూ, వారు, ఈ ఉద్యమంలోకి తీసుకురావాలి. స్వదేశీ సందేశం పామరజనానికి అందటం మొదలయింది; ఇది వారి సంక్షేమానికీ, సౌభాగ్యానికీ ప్రత్యక్షంగా సంబంధించింది కాబట్టి సిద్ధాంత – ఆదర్శ రాజకీయ సూత్రాలకన్నా యిది వారికి బాగా నచ్చింది. తీవ్రవాదులు, కౌలు చెల్లించని ఉద్యమాన్ని కర్షకులు లేక పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా కార్మికులు సమ్మె జరపాలని కోరివున్నట్టయితే, వీరు యింకా అమితోత్సాహాన్ని కనబరిచి ఉండేవారు. ఇది జరగక పోయినప్పటికీ కర్షకులు — కార్మికుల పాత్ర చెప్పుకోతగినది. బీహారులో చెంపారన్ నీలిమందు రైతులు తిరుగుబాటు జరిపారు. అస్సాం - మైమెన్ సింగ్‌లలో అల్లర్లు జరిగాయి. బరిసల్ ముస్లిం కర్షకుల అలజడికి అశ్వనీ కుమార్‌దత్తా, నాయకత్వం వహించారు. బెంగాలులో జరిగిన సమ్మెల పరంపరలో ఈస్టుఇండియా రైల్వే, క్లయివ్ జనపనార మిల్లులూ, ఇనుప మిల్లులూ, ముద్రణాలయాలు పాల్గొన్నాయి. కలకత్తారేవు, కొద్దికాలం స్తంభించి పోయింది. బొంబాయి కార్మికులకు తిలక్ విజ్ఞప్తి చేయడంవల్ల, ఆయన అరెస్టు అయిన తర్వాత, సార్వత్రిక సమ్మె జరిగింది. చిదంబరం పిళ్ళై తూత్తుకుడి కోరల్ మిల్లు సమ్మె ఏర్పాటు చేశారు.

అయితే పోరాటభారం, దేశపు యువజనుల మీద పడింది. సంధ్య, జుగాంతర్, కేసరి, పంజాబీ వంటి రేడికల్ పత్రికలవల్ల ఉత్తేజం పొందిన యువజనులు, రంగం

లోకి దిగారు. విద్యార్థులు, గుమాస్తాలూ, ఉపాధ్యాయులు పాల్గొనడంపై కొంత నిరుత్సాహం కలిగింది. బెంగాలులో ప్రతిపట్టణం లోనూ, జాతీయ వలంటీర్ బృందాలను ఏర్పాటుచేశారు. నీలి తలపాగాలూ, ఎఱ్ఱ చొక్కాలూ ధరించి, వీరు, ప్రభుత్వ పాఠశాలలు, కళాశాలలు, ఆఫీసులు వదిలి పెట్టి, వేలాదిమంది వందేమాతరం అని నినాదాలు చేస్తూ, జాతీయ గీతాలను పాడుతూ, దుకాణాలముందు పికెటింగ్ జరిపారు. ఉద్యమంలో ఎక్కువగా పాల్గొన్న పాఠశాలలకూ, ప్రభుత్వ గ్రాంటులు నిలిపివేశారు; విశ్వవిద్యాలయ అనుబంధాన్ని రద్దుచేశారు. వీటి విద్యార్థులకు స్కాలర్ షిప్పులు లేకుండా చేశారు; ప్రభుత్వ ఉద్యోగాలు లేకుండా చేశారు. తూర్పు బెంగాలులోనూ, అస్సాంలోనూ ప్రజలను హడలగొట్టేపరిపాలన ప్రారంభమయింది. విద్యార్థులకు జరిమానా విధించి, వారిని బహిష్కరించి, చావమోదారు. కలకత్తా ఇంగ్లీషు ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటు కింగ్సుఫోర్డు, 14 ఏండ్ల బాలుణ్ణి బెత్తంతో బాగా కొట్టాలని ఉత్తర్వులివ్వడం, విదేశాంగమంత్రి మోర్లేకు, కలవరం కలిగించింది. అమరావతి నుంచి కొల్హాపూర్ వరకూ అనేకమంది బాలురకు, యిదే దుర్గతి పట్టింది. దమన విధానం కోపోద్రేకాలకు దారితీసింది; ఈ కోపోద్రేకాలు, దౌర్జన్యకరమైన కార్యకలాపాలలో పాల్గొనడానికి దారితీశాయి.

ప్రారంభంలో, ముస్లింలు విరివిగా పాల్గొన్నారు. మహిళలు పర్దా వదిలిపెట్టి మొట్టమొదటిసారిగా ఊరేగింపులూ, పికెటింగ్‌లలో పాల్గొన్నారు. పాట్నాకు చెందిన లియాఖత్ హసన్, బహిష్కరణ జరపాలని ఓంప్రథమంగా సూచించారు. ఈయన ఆధ్వర్యంక్రింద ఈస్టు ఇండియా రైల్వే సమ్మె జరిగింది. ఈయన ఉర్దూ కరపత్రాలు వాహాబీ రీతిలో ముస్లిం విశ్వాసాలను రేకెత్తించాయి. బరిసల్ మహాసభకు అబ్దుల్ రసూల్ అధ్యక్షత వహించారు; అయితే దీనిని పోలీసులు, అతి కిరాతకంగా లాఠీచార్జి చేసి, విచ్ఛిన్నం చేశారు. జమీందారు-న్యాయవాది అయిన అబ్దుల్ హలీం గజ్‌నవీ స్వదేశీ పరిశ్రమలను ప్రారంభించి, బ్రిటిష్ తోలుసామగ్రి బహిష్కరణ ఉద్యమానికి నాయకత్వం వహించారు. అబ్దుల్ కలాం ఆజాద్, అరొబిందోను కలుసుకొని, బెంగాల్‌కు వెలుపల విప్లవ కృషిని విస్తరించడానికి తోడ్పడ్డారు. కొంతమంది తీవ్రవాదులు అవివేకంతో, హిందూమత చిహ్నాలకు మరీ ఎక్కువ ప్రాధాన్యమిచ్చి, వళ్ళు తెలియని ఆవేశంతో ముస్లింలను వేరుచేశారు. కాని సురేంద్రనాథ్ బెనర్జీ, అశ్వనీ కుమార్ దత్తా, రవీంద్రనాథ్ ఠాగూర్ వంటి నాయకులు హిందూ - ముస్లిం ఐక్యతను పునరుద్ఘాటించారు.

ప్రభుత్వ దమన విధానం, ముఖ్యంగా బరిసల్ మహాసభ ప్రతినిధుల మీద అతి కిరాతకంగా జరిపిన హింసాత్మకదాడి, సమరాన్ని కొనసాగించాలన్న తీవ్రవాదుల

దృఢనిశ్చయాన్ని పటిష్ఠం చేసింది. 1906 కలకత్తా కాంగ్రెస్‌లో, దాదాభాయి నౌరోజి కాంగ్రెసు లక్ష్యం, "యునైటెడ్ కింగ్‌డమ్‌లో మోస్తరుగాగాని, వలసల్లో మోస్తరుగా గాని స్వపరిపాలనా ప్రభుత్వం లేక స్వరాజ్యం" అని ప్రకటించడం ద్వారా తీవ్రవాదుల భావాలను బలపరిచారు. తీవ్రవాదులు స్వరాజ్యకు తమ స్వంత అర్థ వివరణ చెప్పేవారు. లజ్‌పత్‌రాయినీ, పంజాబ్‌కు చెందిన అజిత్‌సింగునూ దేశం నుంచి పంపివేసి, దేశద్రోహ వ్యాసాలు ప్రచురించాయన్న ఆరోపణల మీద సంధ్య, వందేమాతరం పత్రికల మీద కేసులు పెట్టడంతో ఉద్యమం తీవ్రరూపందాల్చింది. అగ్ని జ్వాలలు గ్రక్కే సంధ్య పత్రికల సంపాదకులు బ్రహ్మబాంధవ్ ఉపాధ్యాయ, విచారణ జరుగుతూ వున్నప్పుడు మరణించారు. బిపిన్ చంద్రపాల్ జైలులో వున్నారు. లజ్‌పత్ రాయ్‌ని విడుదలచేసి సంస్కరణల గురించి సంభాషణలు జరిపినప్పటికీ ఉద్రేకాలు తగ్గలేదు. కాంగ్రెస్ సమావేశ స్థలాన్ని పూనానుంచి సూరత్‌కు మార్చి, అధ్యక్ష పదవికి తిలక్ అభ్యర్థిత్వాన్ని రాస్ బిహారి ఘోష్‌కు అనుకూలంగా త్రోసి వేయడంతో, రేడికల్ పక్షానికి చెందిన తిలక్ అరొబిందో, పోటీ చెయ్యాలని నిర్ణయించారు. బహిష్కరణ గురించిన తీర్మానం నెగ్గకుండా చేయడానికి మితవాదులు చేసిన ప్రయత్నం, ఆఖరి ప్రయత్నంగా ఋజువయింది. సూరత్ కాంగ్రెస్ అరాచకంతో విచ్ఛిన్నమయింది. జాతీయవాదుల రెండు వైరుధ్య శిబిరాలుగా విడిపోవడంవల్ల, ఉద్యమం బలహీనమయింది.

సామరస్య పూరితమైన సహకారాన్ని సంపాదించాలని తిలక్, అప్పటికీ కోరినప్పటికీ, అరొబిందో, రష్యన్ పద్ధతి హింసాత్మక ప్రతిఘటన సాగించాలని నిర్ణయించారు. ముజఫర్‌పూర్‌లో జరిగిన బాంబుదాడులు, మానిక్ తలాలో దౌర్జన్యవాదుల స్థావరాన్ని కనుగొనడం, ఈయన భావాలను స్పష్టం చేశాయి. తిలక్, కేసరి పత్రికలో, దీనికి నైతిక అండనిచ్చారు. "పరిపాలనను రష్యనీకరణ చేసినట్టయితే ప్రజలు రష్యన్ పద్ధతులను అవలంబించాలని" ఆయన వ్రాశారు. ఆరేళ్ళ శిక్షవేసి, ఈయన్ను మాండలేకు పంపివేశారు. కాల్ పత్రికా సంపాదకులు పరంజిపేకు 19 నెలల జైలు శిక్ష విధించారు. 9 మంది బెంగాలీ నాయకులను, దేశంనుంచి పంపివేశారు. మద్రాసుకు చెందిన చిదంబరం పిళ్ళైనీ ఆంధ్రకు చెందిన హరిసర్వోత్తమరావును, జైలులో పెట్టారు. ప్రభుత్వం పత్రికలనన్నింటినీ సెన్సార్ చేసింది, బహిరంగ సమావేశాలను నిషేధించింది, విప్లవ సంఘాలమీద కేసులు పెట్టింది. అరొవిందో పుదుచ్చేరికి పారిపోయి రాజకీయాలనూ, జాతీయ ఉద్యమాన్ని వదులుకొని మతానికి ప్రాధాన్య మివ్వాలని నిర్ణయించుకోవడంతో, బహిరంగ ఉద్యమం అంతమయింది.

వీర జాతీయవాదులు, జాతీయ ఉద్యమ చరిత్రలో ఒక ఉజ్వల అధ్యాయాన్ని తెరిచారు. వీరు, తమ లక్ష్యాలను స్పష్టం చేశారు; ప్రజలకు ఆత్మ విశ్వాసాన్నీ స్వశక్తి మీద ఆధారపడటాన్నీ నేర్పారు; క్రింది మధ్యతరగతి ప్రజలనూ, విద్యార్థులనూ, యువజనులనూ, మహిళలనూ, చేర్చుకొని ఉద్యమానికి ఒక సాంఘిక పునాదిని ఏర్పాటు చేశారు. కొత్త పద్ధతుల్లో రాజకీయ వ్యవస్థలను ఏర్పాటు చేయడం, రాజకీయ సమరాలను కొత్త పద్దతుల్లో జరపడం ప్రవేశపెట్టారు. అయితే యిదే సమయంలో కొన్ని పాత బలహీనతలు వదలలేదు. పామరజనంలో ఎక్కువమంది, కార్మికులు, కర్షకులు జాతీయ రాజకీయాల ప్రధాన ప్రవాహానికి వెలుపలే వున్నారు. ప్రజా సమరాలను ఏర్పాటు చేయడానికి గొప్ప కృషి జరుగుతోందని వీర ప్రసంగాలు జరిగినప్పటికీ, మొత్తంమీద యిటువంటి సమరాలు అసలు లేవనే చెప్పాలి. శాసనోల్లంఘన, సహాయ నిరాకరణ వట్టి భావాలుగా వుండిపోయాయి. పటిష్ఠమయిన రాజకీయ సమర పద్ధతులను కనిపెట్టే లక్ష్యం సఫలం కాలేదు, దేశానికి పటిష్ఠమయిన జాతీయ వ్యవస్థ ఏదీ లేక పోయింది. అంతేకాకుండా పెట్టుబడిదారి విధానం సరిహద్దులను దాటలేకపోయారు. సాంఘిక - ఆర్థికాభివృద్ధి యింకా యిప్పటికీ పెట్టుబడిదారి విధానానికి లోబడివుందని తిలక్, యింకా యితరులు గ్రహించారు. చిట్టచివరిది, ప్రారంభ మితవాద జాతీయ వాదుల మోస్తరుగా కాకుండా వీర జాతీయవాదులు, భారత దేశంలో బహుమతాలు, కులాలు, ప్రాంతాలు వున్నాయన్న ప్రాముఖ్యాన్ని గుర్తించలేదు. వీరి, సామ్రాజ్యవాద వ్యతిరేకత, జాతీయ పటిష్టతలో ఒక పెద్ద ముందడుగే అయినప్పటికీ, వీరు, దీనికి కలగజేసిన పైతరగతి కులాలు - హిందూ భావం జాతీయ సమైక్యత పరిణామాన్ని బలహీనంచేసి, ఆ తర్వాత సంవత్సరాలలో మత వైషమ్యాలకు దోహదమయింది.

## విప్లవ దౌర్జన్యవాదం తలఎత్తి పెంపొందటం

జాతీయ ఉద్యమాన్ని పట్టుదలతో సమగ్రంగా అమలు జరుపుతూవున్నప్పటికీ బెంగాల్ విభజనను రద్దుచేయలేదు. దీనికి బదులు ప్రభుత్వం యింతకి ముందుకన్నా ఎక్కువ దమన నీతికి పాల్పడింది. ఈ రెండు యదార్థాలు తిరుగుబాటు తత్వంతోవున్న అసహన యువజనుల భావాలపై వెంటనే గొప్ప ప్రభావాన్ని కలిగించాయి. తీవ్రవాదుల వర్గానికి నాయకులయిన తిలక్, అంతకిముందే, అంటే, బెంగాల్ విభజన ఉద్యమానికి ముందే తన యువ అనుచరుల్లో కొంతమంది భావాలను ఎంతగా రేకెత్తించాడంటే వారు, వ్యక్తిగత హింసా చర్యలకుకూడా సిద్ధమయ్యారు.

1897 లోనే ఇద్దరు సోదరులు, — పూనా పట్టణపు దామోదర్, బాలకృష్ణ చాపికర్, ప్రజలకు నచ్చని యిద్దరు బ్రిటిష్ అధికారులను హత్య చేశారు. ఆ తర్వాత అరొవిందోఘోష్ వాస్తవంగా కొన్ని విప్లవ కార్యకలాపాలకు పథకాలు వేశారు. బెంగాల్ విభజన తర్వాత జరిగిన సంఘటనలు అనేక యువభారతీయుల్లో విప్లవ భావాలను ప్రేరేపించాయి. బాంబులనూ, పిస్తోళ్ళనూ వీరు ఉపయోగించారు: వ్యక్తిగత దౌర్జన్య చర్యలు జరిపారు. రాజ్యాంగబద్ధమైన ఆలజడిలోనూ, శాసనోల్లంఘన లోనూ కూడా వారికి విశ్వాసం పోయింది. బ్రిటిష్ వారిని బలం వుపయోగించి పడ గొట్టాలని వారు భావించారు. బరిసల్ మహాసభను పోలీసులు విచ్ఛిన్నం చేసిన తర్వాత 1906 ఏప్రిల్ 22 వ తేదీన జుగంతర్ పత్రిక తన సంపాదకీయంలో వీరి భావాలను ప్రతిబింబింప చేసింది. "దీని పరిష్కారం ప్రజల చేతుల్లోనేవుంది. భారతదేశంలో నివశిస్తున్న 30 కోట్లమంది ప్రజలు ఈ దమన విధానాన్ని అంతం చేయడానికి తమ 30 కోట్ల చేతులను ఉపయోగించాలి. బలాన్ని బలంతోనే అంతం చేయాలి" అని ఈ పత్రిక వ్రాసింది.

అయితే, ఈ యువ దౌర్జన్య వాదులు యావద్ దేశపు సామాన్య ప్రజానీకం పాల్గొనే దౌర్జన్యం ప్రాతిపదికగా గల విప్లవాన్ని ఏర్పాటు చేయడానికి ఎటువంటి పథకమూ తయారు చేయలేదు. ఐరిష్ దౌర్జన్య వాదుల అడుగుజాడల్లోనూ, రష్యన్ నోష లిస్టుల అడుగుజాడల్లోనూ నడుస్తూ వీరు, భారత వ్యతిరేక వైఖరివల్లగానీ, దమన చర్యలవల్లగానీ ప్రజా వ్యతిరేకమయిన అధికారులను హత్య చేయడానికి పూను కున్నారు. పరిపాలకుల గుండెల్లో భయాన్ని ప్రేరేపించి, ప్రజలలో రాజకీయ చైతన్యం కలిగించి, చిట్టచివరికి బ్రిటిష్ వారిని భారతదేశం నుంచి తరిమి వేయాలన్నదే వీరి తలంపు. పథక రచన, వ్యవస్థ, వ్యక్తులను భర్తీ చేసుకోవడం, శిక్షణ - వీటిని రహస్యంగా, అజ్ఞాత కార్యకలాపాలుగా జరపాలి. అనేక రహస్య సంఘాలను, ముఖ్యంగా బెంగాల్‌లోనూ, మహారాష్ట్రలోనూ నెలకొల్పారు. వీటిలో కొన్ని శరీర వ్యాయామ క్లబ్బులు లేక సంఘాలు అన్న ముసుగుతో పని చేశాయి. వీటిలో కలకత్తా-ఢాకాల అనుశీలన్ సమితులు, కలకత్తా జుగాంతర్, మహారాష్ట్రలో సావర్‌కార్ సోదరులు ప్రారంభించిన మిత్రకుల, ప్రఖ్యాతి వహించాయి. వి. డి. సావర్‌కార్ విదేశాలకు వెళ్ళినపుడు ఆయన అగ్ర సోదరుడు గణేష్ అభినవభారత్ సంఘాన్ని ప్రారంభించారు. త్వరలో దీనికి పశ్చిమ భారత దేశమంతటా అనేక శాఖలు ఏర్పడ్డాయి.

అప్పుడు ముజఫర్‌పూర్ జిల్లా జడ్జిగావున్న కింగ్స్ ఫోర్డును హత్య చేయడానికి, ఇద్దరు యువకులు - కుదిరంబోస్, ప్రఫుల్లచాకీ ప్రయత్నం చేయడంతో ప్రజల దృష్టి

విప్లవ దౌర్జన్యకర కలాపాలమీద పడింది. అయితే బాంబువల్ల అమాయకులయిన యిద్దరు మహిళలు మరణించారు. కుదిరంని పట్టుకున్నారు; ప్రపుల్ల, లొంగిపోవడం కన్నా మరణించడం మంచిదని ఆత్మహత్య చేసుకున్నాడు. అలీపూర్‌లో అరొవిందోకి ఆయన సోదరుడు బరీన్, యింకా యితరులకీ వ్యతిరేకంగా కుట్రకేసు ఒకటి ప్రారంభమయింది. అయితే జైలు ప్రాంగణంలోనే విప్లవ దౌర్జన్యవాదులు అప్రూవర్‌ని చంపివేయడంవల్ల ఈ కేసుకు అంతరాయం కలిగింది. దరియాప్తు జరుపుతూవున్న అధికారులనూ, ప్రాసిక్యూషన్‌ను కూడా ఒకరి తర్వాత ఒకరిని హత్య చేశారు. అరొవిందోను నిర్దోషి అని వదిలిపెట్టినప్పటికీ ఆయన సోదరుడు బరీన్‌తో సహా మరో నలుగురిని అండమాన్ దీవులకు పంపివేశారు; ఇతరులు అనేకమందికి దీర్ఘకాల జైలు శిక్షలు విధించారు. కుదిరంని ఉరితీశారు; అప్రూవర్‌ను చంపిన ప్రత్యేక బసునూ, కనైదత్తానూకూడా ఉరి తీశారు.

మహారాష్ట్రలో. నాసిక్, బొంబాయి, పూనా బాంబుల ఉత్పత్తికి కేంద్రాలయ్యాయి. వినాయక్ సావర్‌కార్, లండన్‌నుంచి కొన్ని పిస్తోళ్ళను పంపారు. వైస్‌రాయ్‌ని హత్య చేయడానికి ప్రయత్నం జరిగింది. నాసిక్ జిల్లా మేజిస్ట్రేట్ జాక్సన్‌మీద పిస్టోలు విందులో కాల్పులు జరిపారు. ఇది జరగడానికి ముందే, యువభారతీయులను దేశం నుంచి అమానుషంగా పంపివేస్తూ వున్నందుకూ ఉరితీసివేస్తూ వుండటానికీ నిరసనగా, లండన్‌లోని ఇండియా ఆఫీసు అధికారి కర్జన్ - విల్లేని. ఎమ్.ఎల్. దింగ్రా, చంపి వేశారు. ఈయన్ను ఉరితీశారు. మరణించేముందు ఆయన, "భారతదేశంలో నేర్చుకోవలసిన పాఠమల్లా ఎలామరణించడం; దీనిని బోధించడానికి స్వయంగా మరణించడ మొక్కటే మార్గం" అని వ్రాశారు.

మద్రాసు రాష్ట్రంలో బిపిన్ చంద్రపాల్ చేసిన బ్రహ్మాండమైన ప్రసంగాలకూ, ప్రజలు, రెచ్చిపోయారు. చిదంబరం పిళ్ళై బహిరంగంగా, సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలని ప్రసంగించారు. ఈయన్ను అరెస్టు చేయడంవల్ల, తూత్తుక్కుడిలోనూ, తిరునల్వేలిలోనూ తీవ్రమైన కొట్లాటలు జరిగాయి; అదుపు తప్పిన గుంపుమీద పోలీసులు కాల్పులు జరిపారు. తిరునల్వేలిలో కాల్పులకు ఉత్తర్వులిచ్చిన ఆష్‌ని, భారత్ మాత సంఘానికి చెందిన వాంచి అయ్యర్, హత్యచేశారు. పారిపోడానికి వీలులేక తనకు తానే కాల్చుకున్నాడు.

పంజాబ్ రహస్య సంస్థలు అనేక క్షామాలను తట్టుకొని, భూమిశిస్తూ, నీటి తీరువా రేట్లు ఎక్కువయినా బ్రతక గలిగాయి. కాలువ కాలనీలలో స్థిరపడినవారు, యాజమాన్య హక్కులమీద నిర్బంధాలు విధిస్తారని అపోహపడ్డారు. బేగార్ పద్ధతి కోపోద్రేకాలను

కలిగించింది. బెంగాల్‌లో జరిగిన సంఘటనలు పంజాబీలను మరికొంత రెచ్చగొట్టాయి. 1857 తిరుగుబాటు 58వ వార్షికోత్సవాలు దగ్గర పడుతున్నాయి. శిఖ్ పటాలాలు తిరుగుబాటు జరపాలని పదేపదే ప్రసంగాలు చేయడం జరిగింది. లాహోర్‌లో యూరోపియన్ల మీద దాడులు జరిగాయి. లజ్‌పత్‌రాయ్ పంజాబీ పత్రికమీద కేసు పెట్టినందుకు రావల్‌పిండిలో కొట్లాటలు చెలరేగాయి. అజిత్‌సింగ్ ఈ ఉద్యమానికి జీవంగా పనిచేశారు. ఈయనకు ఆగాహైదర్, సయ్యద్ హైదర్‌రజా, తోడ్పడ్డారు. లజ్‌పత్ రాయ్‌నీ, అజిత్‌సింగునూ దేశంనుంచి పంపివేయడంవల్ల కొంత కాలం గొడవ తగ్గింది. అయితే లాల్‌చంద్ ఫాలక్, భాయి పరమానంద్, కిషన్‌సింగ్, యితరులు, ఈ ఉద్యమాన్ని కొనసాగించారు. ఢిల్లీలో ఉద్యమానికి, దినానాథ్, అమీన్‌చంద్, యితరులు నాయకత్వం వహించారు.

బెంగాల్‌లో తయారుచేసిన ఒక బాంబును 1912 డిసెంబరు 23వ తేదీన, వైస్‌రాయ్ లార్డ్ హార్డింజ్, ఢిల్లీలో ప్రవేశిస్తూ వుండగా, ఆయనమీద విసిరారు. దమననీతి, సంస్కరణల విధానమూ ప్రయోజనం లేనివని నిరూపించడానికి, ఈ చర్య తీసుకున్నారు. రాస్ బిహారి విడుదల చేసిన లిబర్టీ కరపత్రాలు, జుగంతర్ కరపత్రాలు, విప్లవ పత్రికల సంప్రదాయాలను కొనసాగించాయి.

కొంతమంది దౌర్జన్య విప్లవ వాదులు విదేశాలకువెళ్ళి యూరోప్‌లో కేంద్రాలను స్థాపించారు. బ్రిటన్‌కు స్నేహితులుకాని దేశాలనుంచి సహాయాన్ని సంపాదించడానికీ, ఆయుధాలను సేకరించి, భారతదేశంలోని తమ సహచరులకు రహస్యంగా పంపడానికీ, వీరు పథకాలు వేశారు. శ్యాంజీకృష్ణవర్మ, వి. డి. కృష్ణవర్మ, వి. డి. సావర్‌కార్, హర్‌దయాళ్, లండన్ వెళ్ళారు. యూరోప్‌లో మెడామ్‌కామా, అజిత్‌సింగ్, పేరు వహించారు.

దౌర్జన్యవాదులు, మన స్వాతంత్ర్య ఉద్యమం చరిత్రకు రసవత్తరమైన, ఉత్తేజ పూరితమైన అధ్యాయాన్ని చేర్చారు. అన్నిటికీ తెగించి చేసిన చర్యలూ, సాహసోపేతమయిన పథకాలు, ఏమాత్రం చలించకుండా అనుకున్న వాటిని చేయడం, మరణాన్ని సైతం లేఖ్ఖచేయక పోవడం, ప్రజలు వీరిని చిరస్థాయిగా జ్ఞాపక ముంచుకునేటట్టు చేశాయి. వీరి ఆదర్శం ఎంత ఉదాత్తమైన దయినప్పటికీ, వీరు ఎన్నో బాధలకు గురి అయినప్పటికీ, వీరి ప్రయత్నాలు విఫలం కాక తప్పలేదు. వ్యక్తిగత దౌర్జన్య చర్యలు ఎంత వీరోచితంగా వున్నప్పటికీ, ప్రజానీకాన్ని సమీకరించ లేకపోయాయి ; ఉచ్ఛస్థితిలోవున్న సామ్రాజ్యవాదం, వీరిని సులభంగా అదుపులో పెట్టగలిగింది. కుట్ర కేసుల పరంపర, కఠినమైన జరిమానాలు, కఠినమైన చట్టాలు వీరివెన్నెముకను విరుగ

గొట్టాయి. నేరాలను రెచ్చగొట్టే వార్తాపత్రికల చట్టమూ, క్రిమినల్ శాసనం సవరణ చట్టం, ప్రేలుడు పదార్థాలచట్టం. భారత పత్రికల చట్టం. పరిపాలకులకు అదనపు ఆయుధాలుగా పనిచేశాయి. రెండోది, దౌర్జన్య వాదులు ఎక్కువగా ఉమ్మడి పథకమేదీ లేకుండా, కేంద్రనాయకత్వం లేకుండా వైరుధ్య లక్ష్యాలకోసం పనిచేశారు. మూడోది, ప్రజలలో వీరికి గట్టి పునాదిలేదు. వీరివి రహస్య సంస్థలు గనుక ప్రజలు వీరిలో విశ్వాస ముంచలేకపోయారు. సమితులలో కర్షకులు - కార్మికులతో సంబంధంలేని మధ్యతరగతి మేధావులు సభ్యులుగా వుండేవారన్న విషయాన్ని గుర్తుంచుకోవాలి. మితవాదులు బాహాటంగా వీరిని త్యజించారు ; అనేకమంది తీవ్రవాదులు వీరిని ఆమోదించడానికి యిష్టపడలేదు.

అయితే యింతటి మహోత్తర త్యాగం ఎప్పుడూ పూర్తిగా వృధా పోదు. " మన వ్యక్తిత్వ గౌరవాన్ని మనకు మళ్ళీ ఇచ్చింది వీరే " అని దేశప్రజలు మృతవీరులను సంస్మరించుకున్నారు.

## మార్లే - మింటో సంస్కరణలు

వీర జాతీయవాదులు, విప్లవవాదులు ప్రభుత్వం తాత్కాలికంగా, రాజీపద్యాల గురించి ఆలోచించేటట్టు ఒత్తిడి తేగలిగారు. తీవ్రమైన దమన చర్యలతోపాటు, ప్రభుత్వం, ముస్లిం-వేర్పాటు ధోరణిని ప్రోత్సహించడానికీ, మితవాదులను తీవ్రవాదులనుంచి రాజ్యాంగ సంస్కరణల ద్వారా వేరు చేయడానికీ, ప్రయత్నించింది. " విభజించి పాలించు " అన్న పాచికను వేయాలని మింటో నిర్ణయించాడు. ఆగాఖాన్ నాయకత్వం క్రింద ముస్లిం నాయకుల ప్రతినిధి వర్గమొకటి 1905 అక్టోబరు ఒకటో తేదీన సిమ్లాలో ఆయన్ను కలుసుకొని, మత ప్రాతిపదికమీద ఓటర్లకు ప్రాధాన్య మిస్తామని హామీ యివ్వవలసిందిగా కోరారు. 1909 లో చిట్టచివరికి మార్లే-మింటో సంస్కరణలను ప్రకటించినపుడు, వీటి అంశాలు కొద్దిమందిని మాత్రమే సంతోష పరిచాయి.

గవర్నర్ జనరల్ కార్యవర్గ సమితిలోనూ ప్రతిరాష్ట్ర కార్యవర్గ సమితిలోనూ ఒక భారతీయుణ్ణి సభ్యుడుగా నియమిస్తారు. ఇంపీరియల్, రాష్ట్ర శాసన సమితుల సంఖ్యను పెంచినప్పటికీ, వీటి స్వభావం మాత్రం మారలేదు. కేంద్రంలో అధికార మెజారిటీని నిలబెట్టారు. కేంద్రంలో మొత్తం 60మంది సభ్యులలోనూ 27 మందిని, కొద్దిమంది ఓటర్లు ఎన్నుకుంటారు. రాష్ట్ర శాసన సభల్లో అనధికారులు యిప్పుడు మెజారిటీలో వున్నప్పటికీ నామినేటెడ్ సభ్యులు మామూలుగా అధి

కారులతో కలిసి ఎన్నికయిన వారికి వ్యతిరేకంగా ఓటుచేసేవారు. కేంద్రశాసన సభకు మూడు ముఖ్యరకాల ఓటర్లు వుండేవారు. (1) సాధారణం, రాష్ట్రశాసన సమితుల అనధికార సభ్యులు యిందులో వుండేవారు. (2) వర్గం, ముస్లింలు, భూకామందుల వంటివారు. (3) ప్రత్యేకం, విశ్వవిద్యాలయాలు, వాణిజ్య మండలులు వంటివి. రాష్ట్ర సమితుల్లో ఎక్కువమంది అనధికార సభ్యులను, స్థానిక సంస్థలు, భూకామందులు, వర్తకులు, విశ్వవిద్యాలయ బృందాలు ఎన్నుకుంటాయి. ముస్లింలకూ, భూకామందులకూ, యూరోపియన్ పెట్టుబడిదార్లకు రిజర్వుడు సీట్లు వుండేవి. మహిళలకు ఓటులేదు. గవర్నర్లు, గవర్నర్ జనరల్, ఏ వ్యక్తినయినా రాజకీయంగా వాంఛనీయం కాని వ్యక్తి అని తొలగించవచ్చు.

శాసన సభల అధికారాలు పరిమితం. ప్రశ్న అడిగిన సభ్యుడు మాత్రమే అనుబంధ ప్రశ్న అడుగవచ్చు. ప్రజలకు శ్రద్ధగల సైన్యం, సంస్థానాలవంటి అంశాల గురించి చర్చ జరపకూడదు. తీర్మానాలు ప్రతిపాదించ కూడదు. బడ్జెట్‌లో వేరు వేరు అంశాలమీద చర్చ, ఓటింగ్ జరగవచ్చు. అయితే మొత్తం బడ్జెటుమీద తీర్మానానికిగానీ, ఓటింగ్‌కుగానీ, అనుమతి యివ్వరు.

మితవాదులు రాజీపడటానికి సుముఖంగా వున్నారు, కాని, మార్లే తమను మోస గించాడని వీరు భావించారు. పార్లమెంటరీ పద్ధతి ప్రభుత్వం ప్రవేశ పెట్టడానికి సంస్క రణలను ఎన్నడూ ఉద్దేశించ లేదని ఆయన చెప్పారు. అనర్హతల విషయంలో నిరంకుశ అధికారాలు, కొద్దిమందికి ఓటింగ్‌హక్కు వుండటం, కేంద్రంలో అధికారులకు మెజారిటీ వుండటం, రాష్ట్రాలలో అనధికారుల మెజారిటీవుంచి మోసగించడం, చర్చమీద పరిమితులు, బడ్జెటుమీద ప్రభావాన్ని కలగ జేయడంలో పరిమిత అధికారము, మిత వాదులకు భ్రమ కలిగించాయి. వీరు ఎందుకు పనికిరాని ప్రతిపక్షంగా మాత్రమే వుండ గలరు. కాంగ్రెసు, ఒక పార్టీగా, మత ప్రాతిపదికమీద ఓటర్లను ఆమోదించలేదు. కాంగ్రెసు వ్యక్తులలో ఎక్కువ మందికి మితవాదుల వైఖరిలో విశ్వాసం పోయింది. తీవ్రవాదులు, పలుకుబడి క్రమేపీ అంతరించి పోతూవున్న మితవాదులమీద భీకరమైన రాజకీయ దాడి జరిపారు. ముస్లిం చీలిక తత్వాన్ని ప్రోత్సహించడంవల్ల, భారత ప్రజలందరినీ, మతం, కులం, భాషతో ప్రమేయం లేకుండా సమైక్యంచేసి, విస్తృత ప్రాతిపదికమీద జాతీయ ఉద్యమాన్ని ఏర్పాటుచేసే లక్ష్యం, యింకా కష్టమయిపోయింది. జాతీయవాదులను చీలదీసి, భారతీయులలో ఐక్యత పటిష్ఠం కాకుండా అరికట్టడమే సంస్క రణల ముఖ్యలక్ష్యం.

లార్డు హార్డింజ్, 1911 లో బెంగాల్ విభజనను రద్దుచేసి భారతప్రజాభిప్రాయాన్ని తృప్తిపరచడానికి ప్రయత్నించాడు. బెంగాల్ నుంచి బీహార్, ఒరిస్సాలను వేరు చేశారు. అస్సాంని వేరే రాష్ట్రం చేశారు. ఇదే సమయంలో రాజధానిని ఢిల్లీకి బదలాయించారు.

విభజనను రద్దుచేయడం, బెంగాలీ ప్రజలను కొంతవరకూ చల్లబరిచి నప్పటికీ అశాంతికి ముఖ్యకారణాన్ని తొలగించడానికి ప్రయత్నం జరగలేదు. 1910 పత్రికల చట్టం, లేక 1908 క్రిమినల్ శాసనం సవరణ చట్టం క్రింద ప్రత్యేక తీర్పుసంఘాలు వంటి దమనశాసనచర్యలు వీర జాతీయత అభివృద్ధిని అరికట్టగలవని అనుకోడానికి వీలులేకపోయింది.

## మతవిద్వేషం తలఎత్తి పెంపొందటం

19 వ శతాబ్దం రెండో అర్థభాగంలో భారత జాతీయతాభావం పెంపొంది అభివృద్ధి చెందింది. ఈ ప్రారంభఘట్టంలో, ముస్లింలలో రాజకీయ చైతన్యం వెనుకబడివుంది. హిందువులలోనూ పార్శీ క్రింది మధ్యతరగతి ప్రజల్లోనూ జాతీయ భావాలు పరివ్యాప్తి చెందాయి. అయితే ఇదే సాంఘిక వర్గానికి చెందిన ముస్లిం ప్రజలలో ప్రబలినంత మేరకు యివి పరివ్యాప్తం కాలేదు.

బ్రిటిష్ వారు రాకపూర్వము, భారతగడ్డమీద విదేశ ప్రభుత్వాన్ని క్రమేపీ ఏర్పాటు చేయకపూర్వమూ, హిందూముస్లిం ప్రజానీకం, మత పోకడలు కొన్ని ప్రత్యేకంగానూ విరుద్ధంగానూ వున్నప్పటికీ, మొత్తం మీద విద్వేషం లేకుండా కలిసికట్టుగా జీవించారని చెప్పవచ్చు. సమాజంలో తరగతి వారిగా విభజనలుండేవి. ధనికులు — పేదవారు వుండేవారు; విద్యావంతులు, అవిద్యావంతులు వుండేవారు; పరిపాలకులు, పరిపాలితులు వుండేవారు. ఈ తరగతులలోనూ, వర్గాలలోనూ హిందువులు, ముస్లింలు కూడా వుండేవారు. మొగల్ హయాంలోకూడా యిది యిదేవిధంగా వుండేది. 1857 తిరుగుబాటులోకూడా హిందువులు — ముస్లింలు చేయి చేయి కలిపి పోరాటం జరిపారు. వీరి కోపాన్ని, ఉమ్మడి శత్రువయిన విదేశపాలకుల మీద తీర్చుకున్నారు. యావద్ భారత దేశము వీరి చేతుల్లో ఒకే మోస్తరుగా బాధలకు గురిఅయింది.

తిరుగుబాటును అణచివేసిన తరువాత బ్రిటిష్ వారు ముఖ్యంగా ముస్లింల మీద విరుచుకు పడ్డారు. తిరుగుబాటుకు ముస్లింలు నాయకత్వం వహించారనీ, దీనికి ముఖ్యంగా

వీరే బాధ్యులనీ బ్రిటిష్ నిర్ధారించుకున్నారు. ఒక్క ఢిల్లీలోనే తిరుగుబాటు జరిగి నపుడూ, ఆ తర్వాత కొద్దికాలంలోనూ 27 వేల మంది ముస్లింలకు మరణశిక్ష విధించినట్లు అంచనా. అనేక సంవత్సరాల వరకూ ముస్లింలంటే బ్రిటిష్ వారు అను మానంతో చూస్తూవుండేవారు.

అయితే జాతీయ ఉద్యమం తలఎత్తడంతో బ్రిటిష్ వైఖరి మారింది. 1870 సంవ త్సరాలలో వైఖరిలో ఈ మార్పు యింకా స్పష్టంగా కనుపించింది. రాజకీయ కార ణాల వల్ల, మిగతా విషయాల మోస్తరుగానే, వైఖరిలో ఈ మార్పుకు బ్రిటన్ ప్రయ త్నించింది. తమ ప్రయోజనాలను కాపాడుకోడానికి బ్రిటన్ అనుసరించిన ప్రారంభిం చిన కొత్త ఎత్తుల ఫలితమే యివి. జాతీయ ఉద్యమం విస్తరించి పటిష్ఠమయ్యే కొద్దీ యిది ప్రజలను సమైక్యం చేసి సామ్రాజ్యానికి తీవ్రముప్పుగా ఏర్పడవచ్చునన్న సమస్య ఏర్పడింది. సమైక్యమయిన ప్రజలను ఎక్కువకాలం దాస్యం క్రింద వుంచ డానికి వీలులేదు. అందువల్ల దమన నీతి, అదుపుకు కఠినచర్య తీసుకోవడం మాత్రమే కాక, సాధ్యమయితే ఉవ్వెత్తుగా వస్తూవున్న జాతీయతా కెరటాన్ని పూర్తిగా అరికట్టి ప్రజలలో అనైక్యతనూ, కొట్లాటలనూ పరస్పరపోటీని ప్రోత్సహించడానికి సాయ శక్తులా ప్రయత్నించాలని బ్రిటిష్ వారు నిర్ణయించారు. విభజించి పాలించు అన్న విధా నాన్ని అనుసరించడం వీరు ప్రారంభించారు. భిన్న మతాల పేరుమీద ప్రజలను విభ జించి, భారత రాజకీయాలలో మరి, విచ్ఛిన్నకర పోకడలను ప్రోత్సహించాలని వీరు నిశ్చయించారు. ముస్లిం అల్పసంఖ్యాక వర్గాల హక్కులను బలపరుస్తున్నామని వీరు తెలియ జేశారు. ముస్లింలనూ, జమీందార్లనూ, భూకామందులనూ, విద్యావంతు లయిన మధ్యతరగతి ప్రజలను తమవైపుకు త్రిప్పుకోడానికి సకల విధాలా ప్రయ త్నించారు. ఇతర రకాల చీలికలను ప్రవేశపెట్టి పటిష్ఠంచేయడానికి కూడా ప్రయత్నిం చారు. బెంగాలీ ఆధిపత్యం గురించి మాట్లాడుతూ వీరు రాష్ట్రీయ తత్వాన్ని ప్రోత్స హించడానికి ప్రయత్నించారు. భారత సమాజంలో కులస్వరూపాన్ని అదనుగా తీసు కొని బ్రాహ్మణేతరులను బ్రాహ్మణులకు వ్యతిరేకంగానూ, తక్కువ జాతులను అగ్ర జాతులకు వ్యతిరేకంగానూ ప్రేరేపించడానికి ప్రయత్నించారు. న్యాయస్థానాలలో ఉర్దూకు బదులు హిందీనీ ప్రవేశపెట్టాలన్న ఉద్యమానికి తోడ్పడటం ద్వారా, ఉత్తరప్రదేశ్ బీహార్‌లలో హిందువులు – ముస్లింల మధ్య సాంఘిక – మత వైషమ్యాలను ప్రోత్స హించారు. ఈ విధంగా భారత సమాజంలో భిన్నమతాల న్యాయ సమ్మతమైన కోర్కె లనుకూడా అదనుగా తీసుకొని భారతీయులలో అనైక్యతను ఏర్పరచడానికి బ్రిటిష్ వారు ప్రయత్నించారు. భారత సాంఘిక స్వరూపం అతిక్లిష్టమయినది. అనేక అంత

రంగిక సాంఘిక సాంస్కృతిక సమస్యల విషయంలో మంచి, చెడు, పెనవేసుకు పోయివున్నాయి. వీటిని జాగ్రత్తగా, ఓర్పుతో వేరుచేయాలి. ఈక్లిష్ట స్వరూపాన్ని పరాయిదేశాల పరిపాలకులు తమ స్వార్థ ప్రయోజనాలకు వుపయోగించుకున్నారు.

ముస్లిం మతతత్వం తలఎత్తడానికి సయ్యద్ అహమ్మద్‌ఖాన్ పేరుతో సన్నిహిత సంబంధం వుంది. ఆయన విద్యావేత్తగా - సాంఘిక సంస్కర్తగా జీవితాన్ని ప్రారంభించారు. ఖురాన్ సూక్తులను ఆధునిక భావాలకు అనుగుణంచేసి, నేవానిరతికి గల ప్రాధాన్యాన్ని ఉద్ఘాటించడానికి ఆయన ప్రయత్నించారు. ఈ విషయంలో ఆయన వైఖరి, ఈయనకూ సనాతన ఇస్లాం నాయకులకూ మధ్య తీవ్ర సంఘర్షణకు దారితీసింది. ఈ ఘట్టంలో, హిందువులకూ - ముస్లింలకూ మధ్య సన్నిహిత సహకార ముండాలని సయ్యద్ అహమ్మద్ విశ్వసించారు. అలీగఢ్‌లో మహమ్మెడన్ ఆంగ్లో ఓరియంటల్ కళాశాలను ఏర్పాటుచేయడానికి హిందువులు — ముస్లింలు ఇరు వైపులనుంచి ఈయనకు విరాళాలు లభించాయి. అయితే భారత జాతీయ కాంగ్రెస్ తలఎత్తడంతో ముస్లింల స్థానం గురించి, ముఖ్యంగా తమను బలపరుస్తూవున్న అనేక మంది ముస్లిం జమీందార్ల స్థానం గురించి సయ్యద్ అహమ్మద్‌కు అపోహలు ఏర్పడ్డాయి. తెరవెనుక నుంచి బ్రిటిష్ వారు కూడా దీనిని ప్రేరేపించారు. సయ్యద్ అహమ్మద్ ఖాన్ యిప్పుడిహ, హిందువులు — ముస్లింల ప్రయోజనాలు భిన్నమయిన వనీ పరస్పర విరుద్ధమయినవనీ, ప్రకటించారు. బ్రిటిష్ వారికి, ఆయన, పూర్తిగా విధేయులై పోయారు. 1885 లో భారత కాంగ్రెసును స్థాపించినపుడు, ఆయన, దానిని ప్రతిఘటించారు. బెనారస్‌కు చెందిన రాజా శివప్రసాదుతో కలిసి బ్రిటిష్ వారికి విధేయతను ప్రమాణం చేస్తూ వ్యతిరేక ఉద్యమమొకటి ఏర్పాటు చేశారు. బ్రిటిష్‌వారు వైదొలగి నట్టయితే హిందూ అత్యధిక సంఖ్యాకులు ఆధిపత్యం చెలాయించి ముస్లిం అల్పసంఖ్యాకులకు అన్యాయం చేస్తారని ఆయన తన అనుచరులకు బోధించారు. భారత జాతీయ కాంగ్రెసులో చేరవద్దని ఆయన ముస్లింలకు సలహాయిచ్చారు; అయితే బదురుద్దీన్ తయాబ్జీవంటి యితర ముస్లిం నాయకులు, నూతన జాతీయ సంస్థలో చేరవలసిందిగా వారికి విజ్ఞప్తి చేశారు.

సయ్యద్ అహమ్మద్ ఖాన్‌వంటి ముస్లిం నాయకుల అభిప్రాయాలు యదార్థవిరుద్ధం అశాస్త్రీయం, హేతువాద విరుద్ధం. హిందువులకూ - ముస్లింలకూ తమ భిన్న మతాలలో విశ్వాసం వున్నప్పటికీ, వారికి ఉమ్మడి ఆర్థిక — రాజకీయ ప్రయోజనాలు ఉన్నాయి. సాంఘికంగా, సాంస్కృతికంగా కూడా హిందువులు — ముస్లింల సామాన్య ప్రజానీకం ఉన్నత వర్గాలు, ఉమ్మడి జీవిత మార్గాలను అనుసరిస్తున్నారు. ఉదాహరణకు ఒక

బెంగాలీ ముస్లిం, ఒక బెంగాలీ హిందూకు, ఒక బెంగాలీ ముస్లిం ఒక పంజాబీ ముస్లిం కన్నా ఉమ్మడి విషయాలు ఏన్నో ఉన్నాయి. ఇంకా ముఖ్యమయిన విషయ మేమిటంటే పరిపాలకులు, హిందువులనూ ముస్లింలను, ఒకే మోస్తరుగా అణగ ద్రొక్కి పీడించుకు తింటున్నారు. ఈ సయ్యద్ అహమ్మద్ ఖానే 1884 లో యిలా అన్నారు.

"మీరు ఒకే భూమిలో నివసించడం లేదా? మిమ్మల్ని ఒకే భూమిలో దహనం చేసి ఖననం చేయటం లేదా? మీరు ఒకే భూమిలో సంచరిస్తూ ఒకే గడ్డమీద నివసిం చటం లేదా? హిందువులు, మహమ్మదీయులు అన్నమాటలు మత విభేదాలను సూచింప డానికే అన్న విషయం గుర్తుంచుకోండి. కాకపోయినట్లయితే అందరు వ్యక్తులు, హిందు వులు కానీ, మహమ్మదీయులు కానీ, క్రైస్తవులు కానీ, ఈ దేశంలో నివసిస్తూ ఉన్న వారందరూ, ఈ ప్రత్యేక విషయంలో, ఒకే ఒక జాతికి చెందినవారు. ఈ భిన్న వర్గాలను ఒకే జాతి అని వర్ణించి నపుడు, వీరిలో ప్రతి ఒక్కరూ, సమైక్యంగా అందరూ, అందరికి ఉమ్మడిగా వున్న దేశ శ్రేయస్సుకోసం పాటుబడాలి" అని వ్రాశారు.

దీనిని బట్టి ముస్లిం వర్గాలలో మత ప్రాతిపదిక మీద కొత్త పద్ధతుల్లో ఆలోచిం చడం ఎలా పెంపొందిందో తెలుసుకోవచ్చు. విద్య, వర్తకం పరిశ్రమలలో హిందు వుల కన్నా ముస్లింలు కొంతవరకు వెనుకబడి ఉండటమే దీనికి కారణం. ముస్లిం ఉన్నత వర్గాలలో ముఖ్యంగా జమీందార్లు, దొరలు వుండేవారు. 19 వ శతాబ్దం మొదటి 70 సంవత్సరాలలోనూ, ముస్లిం ఉన్నతవర్గాలు, బ్రిటిష్ వ్యతిరేకులు, సనా తనులు, ఆధునిక విద్యకు వ్యతిరేకం కాబట్టి, దేశంలో విద్యావంతులయిన ముస్లింల సంఖ్య బహుస్వల్పంగా వుండేది. దీని ఫలితంగా, విజ్ఞానశాస్త్రం, ప్రజాస్వామ్యాలకూ, జాతీయతకూ ప్రాధాన్యమిచ్చే ఆధునిక పశ్చిమ దేశాల భావన, ముస్లిం మేధావులలో పరివ్యాప్తం చెందలేదు; వీరు, పాత పద్ధతిలో, వెనుకబడి వుండేవారు. ఆతర్వాత సయ్యద్ అహమ్మద్‌ఖాన్, నవాబ్ అబ్దుల్‌లతీఫ్, బదురుద్దీన్ తయాబ్జీ, యితరులు కృషి చేయడం వల్ల, ముస్లింలలో ఆధునిక విద్యా వ్యాప్తి చెందింది. అయితే ముస్లింలలో విద్యావంతుల నిష్పత్తి హిందువులు, పార్శీలు, క్రైస్తవులలో కన్న చాలా తక్కువగా వుండేది. ఇదే మోస్తరుగా, ముస్లింలు కూడా వర్తకం, పరిశ్రమల అభివృద్ధిలో చర్యఏదీ తీసుకోలేదు. ముస్లింలలో విద్యావంతులు, వాణిజ్య, పారిశ్రామిక నిపుణులు కొద్దిమంది ఉండటంచేత ముస్లిం పామరజనం మీద అభివృద్ధి నిరోధక పెద్ద భూకామందులు తమ పలుకుబడిని కలిగి ఉండటానికి దోహదమైంది. హిందువులుగానీ, ముస్లింలుగానీ, భూకామందులూ,

జమీందార్లూ, స్వప్రయోజనాలకోసం బ్రిటిష్ పరిపాలనను బలపరిచారని, యింతకి ముందు తెలుసుకున్నాం. అయితే హిందువులలో నవ్యమేధావులు, వృద్ధిలోకివస్తూన్న వాణిజ్య పారిశ్రామిక వేత్తల వర్గం, భూకామందులను, నాయకత్వం నుంచి త్రోసి వేశారు. దురదృష్టవశాత్తూ ముస్లింలకు సంబంధించినంత వరకూ దీనికి వ్యతిరేకంగా వుండేది.

ముస్లింలు విద్యలో వెనుకబడి వుండటంవల్ల మరొక దుష్ఫలితం కూడా కలిగింది. ప్రభుత్వ సర్వీసుల్లో గానీ, వృత్తుల్లో గానీ ప్రవేశించాలి అంటే ఆధునిక విద్య అవసరం కాబట్టి, ఈ విషయంలో ముస్లింలు. ముస్లిమేతరుల కంటే వెనుకబడి వుండేవారు కూడా. అంతే కాకుండా 1858 తర్వాత, ప్రభుత్వం ముస్లింలకు వ్యతిరేకంగా బుద్ధి పూర్వకంగా వివక్షణ చూపింది. 1857 తిరుగు బాటుకు వీరే ముఖ్యంగా బాధ్యులని ప్రభుత్వం భావించింది. ముస్లింలలో ఆధునిక విద్యావ్యాప్తి చెందినపుడు విద్యావంతులయిన ముస్లింలకు, వర్తకం లోనూ, వృత్తుల్లోనూ అవకాశా లేవీ లభించలేదు. వారు తప్పని సరిగా ప్రభుత్వ ఉద్యోగాల కోసం ఎదురు చూడవలసి వచ్చింది. ఏది ఎలావున్నా, భారతదేశం వెనుక బడిన కాలనీకనుక ప్రజలకు ఉపాధి అవకాశాలు అతి తక్కువగా వుండేవి. ఈపరిస్థితుల్లో, విద్యావంతులయిన ముస్లింలను విద్యావంతులయిన హిందువుల మీదికి రెచ్చగొట్టడం, బ్రిటిష్ అధికారులకూ, వారికి విధేయులయిన ముస్లిం నాయకులకూ సులభంగా వుండేది. ప్రభుత్వ సర్వీసుల విషయంలో ముస్లింలకు ప్రత్యేక సౌకర్యం కలుగ జేయాలని, సయ్యద్ అహమ్మద్ ఖాన్, యితరులు గట్టిగా కోరారు. విద్యావంతు లయిన ముస్లింలు బ్రిటిష్ వారికి విధేయతతో వున్నట్టయితే బ్రిటిష్‌వారు. వీరికి, ప్రభుత్వ ఉద్యోగాలలోనూ, యితర విషయాలలోనూ ప్రత్యేక పక్షపాతం చూపుతారని వారు ప్రకటించారు. కొంతమంది విధేయులయిన హిందువులు, పార్శీలుకూడా యిదే విధంగా వాదించడానికి ప్రయత్నించారు; కాని వీరిసంఖ్య బహు స్వల్పంగా వుండేది. దీని ఫలితంగా దేశం మొత్తంమీద స్వతంత్ర, జాతీయవాద న్యాయవాదులు, జర్నలిస్టులు, విద్యార్థులు, వర్తకులు, పారిశ్రామిక వేత్తలు రాజకీయ నాయకులవుతూ వుండగా, ముస్లింల్లో విధేయులైన భూకామందులు పింఛను తీసుకున్న ప్రభుత్వోద్యోగులు రాజకీయ అభిప్రాయంపై యింకా ప్రభావాన్ని కలిగి వుండేవారు. ఒక్క బొంబాయి రాష్ట్రంలో మాత్రమే ముస్లింలు బాగా పెందలాడే వాణిజ్యానికీ, విద్యకు అలవాటు పడ్డారు. అక్కడ, జాతీయ కాంగ్రెసులో బదురుద్దీన్ తయాబ్‌జీ, ఆర్. ఎమ్. సయాని, ఎ. భీమ్‌జీ, యువ న్యాయవాది మహమ్మదాలి

జిన్నా వంటి మేధావులయిన ముస్లింలు సభ్యులుగా వుండేవారు. అంతే కాకుండా బెంగాల్, ఉత్తరప్రదేశ్, పంజాబ్‌లలో కూడా ఆధునిక భావాలు వ్యాప్తి చెందటంవల్ల, నాయకత్వంలో, విధేయులయిన వర్గాల గుత్తాధిపత్యాన్ని విడగొట్టి ముస్లింలలో జాతీయ ఊహలు ప్రబలాయి. జవహర్‌లాల్ నెహ్రూ వ్రాసిన భారతదర్శిని పుస్తకంనుంచి కొన్ని మాటలను ఉటంకించడం ద్వారా ఈ సమస్య సారాంశాన్ని తెలియ జెయ్యవచ్చు.

"హిందూ, ముస్లిం మధ్యతరగతులు అభివృద్ధి కావడంలో ఒక తరము లేక అంతకన్న ఎక్కువ తేడావుంది. ఈ తేడా అనేక రంగాలలో, - రాజకీయ, ఆర్థిక, యితర రంగాలలో కనుపిస్తూనే వుంది. ఇలా వెనుకబడి వుండటం వల్లనే ముస్లింలలో ఒక భీతి మనస్తత్వం కలుగుతోంది",

ఈకాలంలో మత తత్వ ధోరణిలో ఆలోచన పెరగడానికి మరో ముఖ్య కారణం వుంది. భారత చరిత్రను, మొట్టమొదట, బ్రిటిష్ చరిత్రకారులు వ్రాస్తున్నారు; అయితే ఆతర్వాత భారత చరిత్రకారులు దురదృష్టవశాత్తు వారి అడుగుజాడల్లో నడిచి, ఏవిధంగా బోధించారంటే, యిది మతవిద్వేష భావాలను రేకెత్తించి పెంపొందించింది. ఉదాహరణకు ప్రాచీన కాలాన్ని హిందూ యుగమనీ, మధ్య కాలాన్ని ముస్లిం యుగమనీ పేర్కొన్నారు. మధ్య యుగంలో టర్కులు, ఆఫ్ఘన్లు, మొఘల్ వంశాలు పరిపాలించాయి. వీరిపాలన స్వరూప స్వభావాల గురించి విశదం చేయడానికి బదులు, వీరందరినీ కట్టగట్టి ముస్లింలనీ, వీరి కాలాన్ని ముస్లిం యుగమనీ పేర్కొన్నారు. ముస్లిం పాలన గురించి చెప్పాము అంటే పరిపాలకులంతా ముస్లింలనీ, హిందువులంతా పరిపాలింపబడిన వారనీ అర్థం. అయితే అసలు యదార్థ మేమిటంటే పరిపాలకులయిన దొరలు, అధిపతులు, జమీందార్లూ, వారు హిందువులయినా, ముస్లింలయినా, హిందూ ముస్లిం పామరజనాన్ని ఒకే రకంగా చూశారు. అంటే తమ స్వలాభంకోసం ఈ క్షుద్రజీవులను ఉపయోగించుకో వచ్చునన్న ఒకే రకమయిన నిర్లక్ష్యమూ, హేయ భావంతో చూశారు. ముస్లిం పామరజనం, హిందూ పామరజనం మోస్తరుగానే పేదవారు, పన్నులవల్ల అణగారి పోయారు.

ప్రాచీన మధ్య యుగాలలో, భారత దేశంలో రాజకీయాలు, మిగతా చోట్ల రాజ కీయాల మోస్తరుగానే వున్నాయని ఈ చరిత్రకారులు గ్రహించలేదు. పరిపాలకుల ఆర్థిక రాజకీయ ప్రయోజనాలకు అనుగుణంగా వీరు నడిచారు కాని మత కారణాల వల్లకాదు. పరిపాలకులు వారి ప్రత్యర్థులు కూడా పామరజనాన్ని తికమకపెట్టి, తమ వాస్తవ లక్ష్యాలను కప్పిపుచ్చుకోడానికి మతాన్ని ఉపయోగించుకున్నారనటంలో ఎటు

వంటి సందేహము లేదు. అయితే ఈ లక్ష్యాలు కులమత పరమైనవని అర్థంకాదు. బ్రిటిష్ చరిత్రకారులు, మత చరిత్రకారులు, భారత సమగ్ర సంస్కృతికి ప్రాధాన్య మివ్వలేదు. భారతదేశపు సాంస్కృతిక స్వరూపం భిన్నంగా వుండేదనటం నిస్సందేహం; అయితే ఉమ్మడిగా వుండే అంశం కూడా వుంది. అతి ముఖ్యమైన విషయ మేమిటంటే ఈ భిన్నత్వం వర్గాల వారీగానూ, ప్రాంతం వారీగానూ వుండేది. హిందూ సంస్కృతి, ముస్లిం సంస్కృతి ఒకదాని కొకటి భిన్నమైనవి. అసత్య అభిప్రాయాన్ని ప్రవేశపెట్టడం ద్వారా, చరిత్రను మతపరమైన దృష్టితో చూడడం ప్రారంభమై చీలిక పోకడలను ఉద్భవింపచేయడానికి దారితీసింది. మత సంస్కరణ ఉద్యమం కూడా యిదేమోస్తరు ప్రభావాన్ని కలిగించింది.

ఈ ఉద్యమాలు హేతువాద విరుద్ధ. సంస్కరణల వ్యతిరేక భావాలను ప్రతిఘటించి, హేతువాద మానవతా భావాలను వ్యాప్తిచేసి, 19 శతాబ్దం మతవిశ్వాసాలు, అలవాట్లనుంచి అవినీతి వర్గాలను తొలగించి, భారత ప్రజలలో యింకా ఎక్కువ ఆత్మగౌరవాన్ని పెంపొందించడం ద్వారా గొప్పగా దోహదమయ్యాయి. ఇదే సమయంలో వీటిలో అనేకం. హిందువులు, ముస్లింలు, శిఖులు, పార్శీల్లో చీలిక తేచ్చేరిచేందుకు అగ్రకులాల హిందువులను, తక్కువకులాల హిందువుల నుంచి వేరు చేయడానికి, ప్రయత్నించాయి. బహుమతాలు గల దేశంలో మతానికి అత్యధిక ప్రాధాన్యమిచ్చినట్టయితే, అది చీలికకు దారితీస్తుంది. అంతే కాకుండా సంస్కరణలు మత, రాత్త్విక సాంస్కృతిక సంప్రదాయానికి ఏకపక్ష ప్రాధాన్యమిస్తాయి. ఈ అంశాలు అందరి ప్రజల ఉమ్మడి సంప్రదాయం కాదు. కాగా అన్ని వర్గాల ప్రజలు సమాన పాత్ర నిర్వహించిన కళ, శిల్పం, సారస్వతం, సంగీతం, శాస్త్ర - సాంకేతిక విషయాలకు తగినంత ప్రాధాన్య మివ్వలేదు. దీనికి తోడు హిందూ సంస్కర్తలు, ప్రాచీన యుగంవల్లనే భారతదేశపు గతం ఉజ్వలంగా వుందని ఎల్లప్పుడు పొగిడేవారు. విశాల దృక్పథంగల స్వామి వివేకానంద వంటి వ్యక్తికూడా, భారతీయ తత్వం గురించీ లేక భారతదేశపు గత విజయాల గురించి, ఈ అర్థంలోనే మాట్లాడారు. ఇదేమోస్తరుగా అనేకమంది ముస్లిం సంస్కర్తలు పశ్చిమ ఆసియా సంప్రదాయాల గురించీ, గర్వకారణమయిన సంఘటనల గురించీ తెలుసుకోడానికి వారి చరిత్ర చదివారు. ఈ విధంగా సంస్కర్తల కార్యకలాపాలు రెండు వేర్వేరు ప్రజలన్న భావాన్ని సృష్టించడానికి ప్రోది చేశాయి. అంతే కాకుండా మత సంస్కరణ ఉద్యమాలు కొన్ని తమ కార్యకలాపాలను, క్రియాత్మకమైన సంస్కరణకు పరిమితం చేయలేదు. ఇతర మతాల మీద కూడా వీరు మత యుద్ధాలు ప్రారంభించి, తద్వారా 20 శతాబ్దంలో మత విద్వేషం పెరుగుదలకు దోహదమయ్యారు.

రాజకీయాలలో మతదృక్పథం అశాస్త్రీయమయినది, హేతువాద వ్యతిరేక మయినది, కాని అల్పసంఖ్యాక వర్గం బహుళ బాధలకు గురికావచ్చునన్న భయంతో యిది పని చేసింది. ఇటువంటి పరిస్థితులలో, తమ దృక్పథము, ప్రవర్తన ద్వారా తమ అధిక సంఖ్యను, అల్ప సంఖ్యాక వర్గాన్ని గాయపరచడానికి ఉపయోగించ బోమని అల్ప సంఖ్యాక వర్గాలకు నచ్చచెప్పవలసిన బాధ్యత మతవర్గ అధిక సంఖ్యాకులకు వుంది. తమ మతము, సాంఘిక, సాంస్కృతిక సంప్రదాయాలు సురక్షితంగా వుంటాయని అల్పసంఖ్యాక మత వర్గ సభ్యులకు నచ్చచెప్పడమే కాక ఆర్థిక రాజకీయ విషయాలలో నిర్ణయాలను కేవలం మతప్రమేయంలేని లౌకిక కారణాల వల్లే చేస్తారు కాని, ఈనిర్ణయాలకు మతం ఒక కారణంగా వుండదని, వారు గ్రహించేటట్లు చేయాలి. మొట్టమొదటి జాతీయవాదులు సరిగ్గా ఈ పనినే చేశారు. ప్రజల ఉమ్మడి జాతీయ, ఆర్థిక, రాజకీయ ప్రయోజనాలు ప్రాతిపదికగా వారిని సమైక్యం చేసి, ఒకే జాతిగా రూపొందించడానికి వీరు ప్రయత్నించారు. ప్రజల మత సాంఘిక జీవితంతో జోక్యం వుండదని వీరు, హామీ యిచ్చారు. ముస్లిం ప్రతినిధుల్లో అధిక సంఖ్యాకులు ముస్లింలకు హానికరమని భావించిన ఏ ప్రతిపాదనను బలపరచబోమనీ 1889 లో అంగీకరించడానికికూడా భారత జాతీయ కాంగ్రెసు సిద్ధమయింది. అంటే, మొట్టమొదటి జాతీయవాదులు, రాజకీయాలకు మతం - కులం ప్రాతిపదిక కాకూడదని బోధించడం ద్వారా ప్రజల రాజకీయ దృక్పధాన్ని ఆధునికం చేయడానికి ప్రయత్నించారన్నమాట.

దురదృష్టవశాత్తు ఆ తర్వాతి నాయకులు కొంతమంది వివేకవంతమైన ఈ లౌకిక రాజకీయ సూత్రాలను తు.చ తప్పకుండా అనుసరించలేదు. వీరజాతీయ వాదులు జాతీయ ఉద్యమానికి గొప్పప్రోత్సాహ మిచ్చారు; ప్రజలు శక్తి ఉత్సాహాలతో ముందడుగు వేసేటట్టు చేశారు. అయితే వీరి చర్యలు కొన్ని మతతత్వ పునరుజ్జీవనానికి దారి తీసి, జాతీయ ఐక్యత వృద్ధిలో ఒక అడుగు వెనక్కు వేయించాయని అంగీకరించక తప్పదు. ప్రజల ఉద్వేగాన్ని లేవతీయడంలో వీరి ప్రచారము, పబ్లిసిటి బాగా పనిచేశాయి; అయితే వీటికి కచ్చితమయిన మతవాసన హిందూ రంగు వున్నాయి. ప్రాచీన భారత సంప్రదాయం ప్రత్యేకత, మధ్యయుగం భారత సంస్కృతి మీద కనబడుతోందని వీరు ఉద్ఘాటించారు. భారత జాతికి హిందువులు, భారత సంస్కృతికి హిందూ మతము ప్రతిబింబాలనీ, ఇది ఆర్యుల సంప్రదాయమనీ చెప్పడం వీరు మొదలు పెట్టారు. ఉదాహరణకు, తిలక్ ఏర్పాటు చేసిన శివాజి, గణపతి ఉత్సవాలు. భారత దేశాన్ని మాతృదేవతగానూ, జాతీయతను మతంగానూ, అరొవిందొ నిగూఢ మయిన అర్థంతో, ఆధ్యాత్మిక భావనతో వర్ణించడమూ. దౌర్జన్యవాదులు కాళీ దేవతముందు

తీసుకున్న ప్రమాణాలు, విభజన వ్యతిరేక ఉద్యమం శుభస్కరంగా ప్రారంభం కావాలని పవిత్ర గంగాస్నానలు చేయడం, - యివన్నీ ప్రతిచోట భారతీయులందరికీ నచ్చి ఉండక పోవచ్చు. వీటిలో బలవత్తరమయిన మత పరమైన మొగ్గు అదికూడ అగ్ర కులాల హిందువుల వైపు మొగ్గు కనిపిస్తూ వుంది. స్వచ్ఛమయిన రాజకీయ ఉద్యమం చుట్టు సమీకృతమవుతూవున్న ఈ మత వాతావరణాన్ని మామూలు లౌకిక భావాలు గల భారతీయులు ఆమోదించక పోగా ముస్లింలు, మరి కొంతమంది యితర మత పెద్దలు, విగ్రహారాధన, మతకాండ జరపడం, తమ విశ్వాసాలకూ భావాలకూ వ్యతిరేకంగా భావించారనడంలో సందేహంలేదు. ఇదే మోస్తరుగా ప్రాచీన యుగాన్నీ, మతాన్నీ విమర్శించకుండా ప్రస్తుతించడం, సరిగ్గా ప్రాచీన కాలంలో వృద్ధిచెందిన అతి వినాశనకర కుల పీడన క్రింద శతాబ్దాల తరబడి బాధలకు లోనయిన తక్కువ కులం భారతీయులకు, అంగీకారం కాలేదు. అంతేకాకుండా శివాజీనీ, ప్రతాప్‌నీ జాతీయ వీరులుగా చేయడానికి ప్రయత్నించినట్టయితే, మొఘల్ పరిపాలకులు జాతీయ వ్యతిరేకులయిన పరాయివారనీ, "విదేశీయులనీ" అర్థ మొస్తుంది. అయితే వాస్తవానికి మొదటివారు ఎంత భారతీయులో, రెండో వారుకూడా అంతే భారతీయులు. అంతే కాకుండా వీరంతా పాలక వర్గాలకు చెందినవారు. వారి పరస్పర ఇబ్బందులను, వారి ప్రత్యేక చారిత్రక పరిస్తితుల దృష్ట్యా రాజకీయ యిబ్బందులుగా భావించాలి. ప్రతాప్‌నీ, శివాజీనీ "జాతీయ" వీరులుగా భావించడమూ, అక్బర్‌నీ, ఔరంగజేబ్‌నీ విదేశీయులుగా భావించడమూ, గత చరిత్రలోకి, ఆధునిక మత ఉద్దేశాలను చొప్పించడమే అవుతుంది. ఇది చెడు చరిత్ర మాత్రమేకాక, జాతీయ ఐక్యతకు గొడ్డలి పెట్టువంటిదవుతుంది.

వీరజాతీయ వాదులు, ముస్లిం వ్యతిరేకులనీ, ముఖ్యంగా మతోన్మాదులనీ దీని అర్థం కాదు. కాగా వీరిలో చాలామంది, ముఖ్యంగా, తిలక్, హిందూ - ముస్లిం ఐక్యతకోసం ఎంతో పాటుబడ్డారు. వీరిలో అనేకమంది ఆధునిక అభ్యుదయ భావాలు కలిగి వుండేవారు. దౌర్జన్య వాదులుకూడా, యూరోప్ దేశాలలోని యిదేమోస్తరు దౌర్జన్య వాదుల నుంచి ఉత్తేజం పొందేవారు. దౌర్జన్య కరమైన విప్లవంద్వారా మాత్రమే, ఆర్థిక విమోచన, రాజకీయ స్వాతంత్ర్యము సాధించవచ్చునని యూరోప్ దేశాల దౌర్జన్య వాదులు విశ్వసించేవారు. అయితే నిజం చెప్పాలంటే వీరజాతీయవాదుల రాజకీయకృషిలోనూ, భావాలలోనూ, కొంతహిందూరంగు కనుపిస్తూ వుండేది. వీరి అంతిమ లక్ష్యాలు మాత్రం లౌకికంగా వుంచేవుండవచ్చు. కాని పైకి వారి ప్రవర్తనమాత్రం లౌకికంగా వుండేది కాదు. బ్రిటిష్‌వారు, బ్రిటిష్ అనుకూల ప్రచారకులు, ఈ యదార్థాన్ని తెలివిగా అదనుగా

తీసుకున్నారు. దీని ఫలితంగా అనేకమంది విద్యావంతులయిన ముస్లింలు జాతీయ ఉద్యమానికి దూరంగా వుండటమో, లేక వ్యతిరేకులుగా మారిపోవటమో జరగటంవల్ల, చీలిక దృక్పథానికి సులభంగా లోనయ్యారు. అయినప్పటికీ కూడా న్యాయవాది అబ్దుల్ రసూల్, హజరత్ మోహానివంటి పురోగామి ముస్లిం మేధావులు అనేకమంది, స్వదేశీ ఉద్యమంలో చేరారు; మహమ్మదల్లీజిన్నా, జాతీయ కాంగ్రెసు ప్రముఖ యువ నాయకుల్లో ఒకరయ్యారు.

వలస ఆధిపత్యంక్రింద, అభివృద్ధిలో వెనుకబడిన పేదదేశంలో, ఉపాధి అవకాశాలు, ముఖ్యంగా విద్యావంతులలో పరిమితం. అందువల్ల దేశంలో, అప్పుడు, అందుబాటులో వున్న పరిమిత వుద్యోగాలకు తీవ్రమైన పోటీ వుండేది. దూరదృష్టి గల భారతీయులు దేశపు ఆర్థిక, రాజకీయ సముద్ధరణకోసం కృషిచేసేవారు. అయితే స్వప్రయోజన పరులయిన భారతీయులు, బ్రిటిష్‌వారు కూడా పరిస్థితిని అదనుగా తీసుకొని వర్గ, మత, కుల, ప్రాంతీయ భావాలను రేకెత్తించడానికి ప్రయత్నించారు. అన్ని వర్గాలకూ, బృందాలకూ సీట్లను, ఉద్యోగాలనూ కేటాయించాలని కోరేవారు. సంకుచిత భావాలు గల, దూరదృష్టిలేని ముస్లింలు, హిందువులు కూడా, జాతీయతను విభజించడానికి వీలున్నట్లూ, అనేక వర్గాలుగా వుండవచ్చుననీ, సామ్రాజ్య వాదానికీ, స్వప్రయోజకులకూ వ్యతిరేకంగా ఉమ్మడి సమరం జరపడం ద్వారాకాక ఇతరవిధాల ఆర్థిక సంక్షేమాన్ని ప్రోత్సహించ వచ్చుననీ, తమ స్వంత జాతీయతా భావాల గురించి మాట్లాడేవారు.

ఢాకానవాబు, నవాబ్ మోసిన్–ఉల్–ముల్క్, ఆగాఖాన్ నాయకత్వం క్రింద 1906లో అఖిల భారత ముస్లింలీగ్ ఏర్పాటు కావడంతో, మత సిద్ధాంతానికి ఒక నిర్దిష్ట స్వరూపం యివ్వడం జరిగింది. విద్యావంతులయిన ముస్లింలలో ఒక వర్గం స్వప్రయోజనాలు, ముస్లిం జమీందార్లు పైతరగతుల అభివృద్ధి నిరోధక స్వప్రయోజనాలు, దురదృష్ట కరమైన ఈ వెనుకంజకు కారణం. లీగ్, బెంగాల్ విభజనను బలపరిచింది; ప్రత్యేక రక్షణలు కావాలనీ, వేరే నియోజక వర్గాలు కావాలనీ గట్టిగా కోరింది. బ్రిటిష్‌వారు, ఇటువంటి అవకాశం కోసమే ఎదురు చూస్తున్నారు. దీనిని పూర్తిగా వుపయోగించుకొని, ముస్లింల "ప్రత్యేక ప్రయోజనాలను" కాపాడుతామని ప్రకటించారు. కాంగ్రెసు జాతీయ, ప్రజాస్వామిక కోరికను ప్రతి ఒక్కదానిని ప్రతిఘటిస్తామని, లీగ్, విధేయతతో ప్రకటించింది. బెంగాల్‌లో విధేయులయిన లీగ్ నాయకులు పెద్ద జమీందార్లు; వీరు బయటినుంచి బెంగాల్ వచ్చినవారు; వీరు బెంగాలీలు కాదు. దీని ఫలితంగా బెంగాలీ ముస్లిం కౌలుదార్లపట్ల వీరికి సానుభూతి లేదు.

ముస్లింల ప్రయోజనాలు మిగతా దేశంవారికి భిన్నమయిన వనీ, వేరయినవనీ లీగ్ చేస్తూవున్న వాదనలో మొదటినుంచి వున్న అసలు అబద్ధం, అనేకమంది విద్యావంతులయిన ఆధునిక భావాలుగల ముస్లిం యువకులకు తెలుసు. రేడికల్, జాతీయవాదుల భావాలు వీరిని ఆకర్షించాయి; ముస్లిం లందరి అభిప్రాయాలకూ, ప్రయోజనాలకూ, లీగ్ ప్రాతినిధ్యం వహిస్తోందన్న భావాన్ని, వీరు, ఖండించారు. సరిగ్గా యిదే సమయంలో జాతీయ, వీర అహరార్ ఉద్యమాన్ని మౌలానా మహమ్మదలీ, హకీం అజ్‌మల్‌ఖాన్, మజారుల్‌హక్ వంటినాయకులు, ప్రారంభించారు. ఇదే మోస్తరుగా, దేశభక్తిగల సనాతన ముస్లిం పండితులు మత తత్వంతో ఆలోచించడం విస్మరించి, జాతీయ రాజకీయాలలో పాల్గొనడం మొదలు పెట్టారు. వీరిలో ప్రముఖులు మౌలానా అబ్దుల్ కలాం ఆజాద్.

ప్రస్తుత శతాబ్దం రెండో దశాబ్దం మొదటి కొద్ది సంవత్సరాలలోను టర్కీ, మొదట, ఇటలీతోనూ, ఆ తర్వాత బాల్కన్ రాజ్యాలతోనూ యుద్ధాలు చేయవలసి వచ్చింది. అప్పట్లో టర్కీ, ముస్లిం దేశాలన్నింటిలోకీ, శక్తి వంతంగావుంది. ముస్లింలకు పవిత్రమైన చాలా స్థలాలు టర్కీ సామ్రాజ్యంలో వుండేవి. 1857 వరకూ భారత ముస్లింలు మొఘల్ చక్రవర్తిని ఇమాంగా గుర్తించారు. అంటే, రాజకీయ-మత పెద్దగా గుర్తించారన్నమాట. మొఘల్ చక్రవర్తిని తొలగించిన తర్వాత, అట్టోమన్ సామ్రాజ్యంమీద రష్యా ఒత్తిడి ఎక్కువవుతూ వున్నందువల్ల, టర్కీని కాపాడాలనీ, ముస్లింలను బలపరిచే వారుగా పేరుపొందాలనీ, బ్రిటిష్‌వారు నిర్ణయించారు. అందువల్ల, వారు, పేన్ ఇస్లామిక్ ఉద్యమం పెరుగుదలను ప్రోత్సహించారు. అంటే దీని అర్థం, టర్కీ సుల్తాన్‌ను ముస్లిం లందరి కాలిఫ్‌గా ఆమోదించడం. మొదటి ప్రపంచయుద్ధ సమయంలో టర్కీ భద్రత, సంక్షేమానికి బ్రిటన్‌వల్ల ముప్పు ఏర్పడినపుడు,, భారతీయులు తీవ్రంగా విమర్శించారు. ముస్లింలలో బ్రిటిష్ వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక భావాలు బయలుదేరాయి. దీని ఫలితంగా భారతదేశంలోని రేడికల్ యువ ముస్లింలు, సామ్రాజ్యవాద వ్యతిరేకులయిన జాతీయవాదులతో చేతులు కలిపారు. 1912 మొదలు 1924 వరకూ విధేయులయిన ముస్లింలీగ్‌వారి పలుకుబడి నంతా జాతీయవాద యువ ముస్లింలు పోగొట్టారు.

ఈ పరిణామాలకు వ్యతిరేకమయిన దృశ్యంకూడా వుంది. కిలాఫత్ సమస్యమీద అలజడి, విద్యావంతులయిన వీర జాతీయ ముస్లింలలో, రాజకీయాలనుంచి రేడికల్ లౌకిక వైఖరినుంచి వ్యతిరేక భావాన్ని కలిగించింది. బ్రిటిష్ సామ్రాజ్యవాదం, ప్రజల ఆర్థిక, రాజకీయ ప్రయోజనాలను నాశనం చేసిందన్న కారణంమీద, దానిమీద సమరం జరప

దానికి బదులు వీరు, కాలిఫాకీ, టర్కీలో పవిత్ర స్థలాలకూ ముప్పు ఏర్పడినందువల్ల సమరం జరిపారు. అంతేకాకుండా వీరి మనస్సులను మార్చిన వీరులు, మిథ్యా సాంస్కృతిక సంప్రదాయాలూ ప్రాచీన, మధ్యకాలపు భారత చరిత్రకు కాక, పశ్చిమ ఆసియా చరిత్రకు సంబంధించినవి. ఈ విధంగా మత విశ్వాసాలే వీరి రాజకీయ అనుకూల వైఖరికి దారి తీశాయి. దీర్ఘకాలంలో ఈ వైఖరి జాతీయతాభావం పెరుగుదలకు ప్రతిబంధకమయింది. ఎందువల్లనంటే ముస్లింలలో యిది, రాజకీయ – ఆర్థిక సమస్యలపట్ల, శాస్త్రీయమైన, లౌకిక వైఖరిని ప్రోత్సహించలేదు.

భారత జాతీయ కాంగ్రెసును వ్యతిరేకించే మత ఉద్యమంగానీ, సంస్థకానీ ఏదీ, ఈ కాలంలో తలఎత్తక పోయినప్పటికీ, హిందూమత భావాలు విరివిగా తలఎత్తాయి. హిందూమత సంస్థఏదీ తలఎత్తక పోవడానికి కారణం, హిందూమత పోకడలు జాతీయవాదుల స్థూలపోకడలో మాత్రమే కనుపించాయి. కాగా ముస్లిం మతపోకడ జాతీయవాదుల ప్రవాహానికి వెలుపల పనిచేయవలసి వచ్చింది. కొంతమంది నాయకులు హిందూ జాతీయత గురించి ముస్లింలు విదేశీయులనీ, హిందువుల ప్రయోజనాలను కాపాడాలనీ, శాసన సభల్లోనూ, సర్వీసుల్లోనూ "హిందూ" వాటాసీట్లు కావాలనీ, మాట్లాడటం మొదలు పెట్టారు. ఈ విధంగా, ముస్లిం, హిందూ మత తత్వాలు పరస్పర వ్యతిరేకంగా పనిచేశాయి.

## మొదటి ప్రపంచ యుద్ధపు కాలం

1914లో జర్మనీ మీద గ్రేట్‌బ్రిటన్ యుద్ధాన్ని ప్రకటించడంతో, భారతదేశాన్ని రంగంలోకి దించినట్టయింది. యుద్ధ ప్రకటన చేయడానికి ముందుగానీ, ముఖ్యంగా బ్రిటిష్ సామ్రాజ్యవాదుల ప్రయోజనాలను కాపాడుకోడానికి భారత ప్రజలనూ, భారత సాధన సంపత్తులనూ వినియోగించడానికి ప్రభుత్వం పూనుకున్నప్పుడుగానీ, భారతీయులతో సంప్రదించలేదు. భారతదేశం, స్వచ్ఛందంగా కాకపోయినా, ఎంతో తోడ్పడింది. పదిలక్షలమందికి పైగా భారతీయులను, ఫ్రాన్సునుంచి చైనావరకూ, వివిధ యుద్ధరంగ స్థలాలకు పంపించారు. ప్రతి పదిమందిలోనూ ఒకరు మరణించారు. యుద్ధానికి మొత్తం ఖర్చు 12 కోట్ల 70 లక్షల పౌండ్లకు పైగా అయింది. భారతదేశపు జాతీయ ఋణం 30 శాతం పెరిగింది. ఇందులో ఎక్కువభాగాన్ని ప్రజలమీద విధించారు.

## మొదటి జాతీయ వాదుల వైఖరి

మొదట్లో భారత నాయకులు బ్రిటన్‌పట్ల తమ సానుభూతినీ, అండనూ ప్రకటించారు. అయితే బ్రిటన్‌కి అనుకూలంగా వాస్తవమైన ప్రజాభిప్రాయం వుందనుకోవడం పొరపాటు. మితవాదులు, తీవ్రవాదులుకూడా జర్మన్ విజయాలపట్ల సంతృప్తి చెందారు. భారతదేశపు విధేయతకు మూల్యంగా రాజకీయ సంస్కరణలు ప్రవేశపెట్టాలని, కాంగ్రెసు గట్టిగా కోరింది. "ప్రభుత్వానికిచెందిన రాజనీతిజ్ఞుల పలుకుబడిద్వారా స్వరాజ్యకు అర్హత సంపాదించడానికి" గాంధీజీ, సైనికులను భర్తీ చేసుకోడానికి క్రియాత్మకంగా తోడ్పడ్డారు. 1918 లో గాంధీజీ, "సాధ్యమయినంత త్వరలో హోమ్ రూల్ యిస్తే తప్ప, భారత ప్రజలు సంతృప్తి చెందరని" తెలియజేశారు.

అయితే మిత్రదేశాలు ప్రకటించిన ఉన్నత యుద్ధ లక్ష్యాలు అనేకమందిని మభ్యపెట్టాయి. "మిత్ర దేశాలు స్వాతంత్ర్యంకోసమే పోరాడుతున్నాయని" లాయడ్ జార్జి అన్నారు. అధ్యక్షులు విల్సన్ '14 అంశాలు' ఈ ఉన్నత ఆదర్శాలనే బలపరిచాయి. అందువల్ల భారతీయులలో చాలామంది, వలసలకోసమూ, మార్కెట్లకోసమూ సామ్రాజ్యవాద దేశాలు యుద్ధం జరుపుతూవున్నాయని తెలుసుకోలేకపోయారు. భారతదేశపు సహకారాన్ని సంస్కరణలు ప్రవేశపెట్టడంద్వారా గుర్తిస్తామని సూచించలేదు. ప్రభుత్వం, సంస్కరణలను ప్రకటించడంలో కాలయాపన చేసినట్టయితే మితవాదుల పలుకుబడి వ్యతిరేకమవుతుందని సురేంద్రనాథ్ బెనర్జీ సూచించాడు.

ఫిరోజ్‌షా మెహతా, జి. కె. ఘోకలె మరణము, తిలక్, మాండలేనుంచి తిరిగి రావడం, ఈ రెండు యదార్థాలు మితవాదులనూ, అతివాదులనూ సన్నిహితం చేశాయి. శ్రీమతి అనీబిసెంట్ సలహామీద 1915 లో బొంబాయి కాంగ్రెసు తీవ్రవాదుల సభ్యత్వానికి అవకాశమిచ్చింది. భారత సంస్కృతిపట్ల ఆమెకుగల గౌరవము, సాంఘిక - విద్యా ప్రోజెక్టులకు అంకితం కావడం, బ్రిటిష్ కామన్వెల్తుకు లోబడి పూర్తి స్వపరిపాలనా ప్రభుత్వానికి కట్టుబడి వుంటామని ప్రకటించడం, - యివన్నీ రాజకీయాల్లో ఆమెను ఒక ప్రముఖ వ్యక్తిగా చేశాయి. ఐరిష్ తిరుగుబాటువల్ల ఉత్తేజం పొందిన ఆమె, 1916 సెప్టెంబరులో హోమ్ రూల్ లీగ్‌ను ప్రారంభించింది. థియోసాఫికల్ సొసైటీ సాధన సంపత్తులను ఆమె సద్వినియోగం చేశారు. ఐరిష్ జాతీయవాదుల ఎత్తులను ఉపయోగించడంవల్ల, కొద్ది రోజుల్లో దేశమంతటా ఈ లీగ్ శాఖలు ఏర్పడ్డాయి. తిలక్ తమ స్వంత హోమ్ రూల్ లీగ్‌తో, దీనిలో చేరారు. ఆయన గంభీర ప్రసంగాలు, ఉద్రేకపూరితమయిన వ్యాసాలు, దేశభక్తినీ, నిర్భీతినీ, త్యాగాన్నీ, ఘరోసారి ఉద్ఘాటించాయి. తను కార్యకలాపాలను, ఈయన, మహారాష్ట్ర, మధ్య

రాష్ట్రాలకు పరిమితం చేశారు. శ్రీమతి బిసెంట్ తమ అనుచరుల తోడ్పాటుతో ఈ ఉద్యమాన్ని మిగతా దేశంలో చక్కగా ఏర్పాటు చేసింది. యుద్ధంవల్ల భారమైన పన్నులు, విపరీతమయిన ధరలు, పేదవర్గాల ప్రజలకు ఎక్కువ బాధలు కలిగాయి. హోమ్ రూల్ విజ్ఞప్తిని వీరు బలపరిచారు. అనేకమంది మహిళలు కూడా దీనిని బలపరిచారు.

## దేశంలోనూ విదేశాలలోనూ విప్లవ ఉద్యమాలు

యుద్ధ ప్రేరేపణ ఈ విధంగా కాంగ్రెసును పునరుజ్జీవింప చేస్తూవుండగా, విప్లవవాదులు, జర్మనీ సహాయంతో పరిస్థితిని అదనుగా తీసుకోడానికి ప్రయత్నించాలని నిర్ణయించారు. ప్రభుత్వ దమన చర్యలు వీరిని కొంత విచ్ఛిన్నం చేశాయి. అయితే 1912 నుంచి మరోసారి తమ బలాన్ని చూపించడానికి వీరు సన్నిహితం కావడం మొదలు పెట్టారు. విదేశాలలోని భారత విప్లవవాదులు మన స్వాతంత్ర్య సమరానికి ఒక నూతన శక్తినిచ్చారు. కేవలం జైలు శిక్షనూ లేక మరణాన్నీ తప్పించుకోడానికి విదేశాలకు పారిపోయిన వ్యక్తులుకారు వీరు. భారతదేశపు వాదాన్ని ప్రచారం చేయడానికీ, దేశంలో విప్లవాన్ని పటిష్ఠం చేయడానికి ఆయుధాలనూ, డబ్బునూ సమీకరించడానికీ, యూరొప్, అమెరికా, మధ్యప్రాచ్యం, ఆగ్నేయ ఆసియాలలో కేంద్రాలను ఏర్పాటు చేయడంకోసం వీరిలో ఎక్కువ మందిని ఒక పథకంతో పంపారు. భారతీయ విద్యార్థులనుంచీ, వర్తకులనుంచీ, వలసపోయిన కార్మికులనుంచీ కొత్త వారిని తమ ఉద్యమంలోకి చేర్చుకున్నారు. వీరు ఎక్కడికి వెళ్ళినా అభ్యుదయ లేక సోషలిష్టు ఉద్యమాల అండను సంపాదించారు. యుద్ధం ప్రారంభం కావడంతో, విదేశాలలో వున్న భారతీయ సైనిక విభాగాలతోనూ, యుద్ధ ఖైదీలతోనూ, బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా వున్న యితరులతోనూ సంబంధాలను పెట్టుకోడానికి వీరు ప్రయత్నించారు. జర్మనీ సహకారంతో భారత విప్లవవాద సంస్థలకు సిబ్బందినీ, నిధులనూ, ఆయుధాలనూ సప్లయి చేయడానికి పథకాలు వేశారు. జర్మన్ల చేతుల్లో సాధనాలుగా వుండాలన్న ఉద్దేశ్యం వీరికి లేదు.

సావర్ కార్‌ని అరెస్టుచేసి, పారిపోడానికి విఫల ప్రయత్నం జరిగిన తర్వాత లండన్ విప్లవవాదులు ఎక్కడి వారక్కడ సర్దుకున్నారు. వీరేంద్రనాథ్ చటోపాధ్యాయ పారిస్‌కి వెళ్ళారు; అక్కడినుంచి జర్మనీ వెళ్ళారు. జర్మన్ విదేశాంగ కార్యాలయానికి అనుబంధంగా బెర్లిన్‌లో వున్న భారతీయులతో ఒక సంఘాన్ని ఏర్పాటు చేశారు. దీనిని ఆతర్వాత భారత స్వతంత్ర సంఘం అని పిలిచేవారు. వీరేంద్రనాథ్ దీనికి

కార్యదర్శి అయ్యారు. వీరు, బాగ్దాద్, ఇస్తాంబుల్, పెర్షియా, కాబూల్‌లకు ప్రతినిధి వర్గాలను పంపారు. భారత సైనిక విభాగాలతోనూ, భారత యుద్ధ ఖైదీలతోనూ కలిసి వీరు పనిచేశారు. రాజా మహేంద్రప్రతాప్‌ని, మౌలానా బర్కతుల్లా, మౌలానా ఒబైదుల్లాలతో కాబూల్‌కు పంపారు. అక్కడ వారు తాత్కాలిక భారత ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశారు.

ఇలావుండగా హర్‌దయాళ్, అమెరికా చేరుకున్నారు. అక్కడ తారక్ నాథ్‌దాస్, పశ్చిమ తీరంలో స్థిరపడిన భారత వలస దార్లలలో విప్లవ సందేశాన్ని యింతకి ముందునుంచే పరివ్యాప్తం చేస్తున్నారు. కఠినమైన అమెరికన్ వలస చట్టాలవల్ల వారిలో ద్వేషభావం పెరుగుతోంది. 1857 తిరుగుబాటుకు జ్ఞాపక చిహ్నంగా 1913 నవంబరు ఒకటో తేదీనుంచి ప్రారంభించిన వారపత్రిక 'ఘద్ర్' పేరున ఒక పార్టీని ఏర్పాటు చేశారు. సైనికుల్లో పనిచేయడం, అధికారులను హత్యచేయడం, విప్లవ, సామ్రాజ్యవాద వ్యతిరేక సారసత్వాన్ని ప్రచురించడం, ఆయుధాలను సంపాదించడం మున్నగునవి ఈపార్టీ కార్యక్రమాలు. శాన్‌ఫ్రాన్సిస్కో దీనికేంద్ర కార్యాలయమయింది. అమెరికా తీరంలోనూ, దూర ప్రాచ్యంలోనూ శాఖలను ఏర్పాటు చేశారు. బ్రిటిష్ వలస లన్నింటిలోనూ ఒకేసారి తిరుగుబాటు తేవాలన్నదే అసలు అభిప్రాయం. ఘదర్ పత్రిక యిలా ప్రచురించింది. "ధైర్యంగల సైనికులు కావాలి ... భారత దేశంలో తిరుగుబాటును లేవతీయడానికి ... జీతం - మరణం; ప్రతిఫలం — అమరత్వం; పింఛను — స్వేచ్ఛ; యుద్ధరంగం— భారతదేశం".

కొమగటమారు సంఘటన, ఘదర్‌పార్టీ కార్య కలాపాలకు తోడ్పడింది. వలస వెళ్ళేవారిని కెనడాకు తీసు కెళ్ళడానికి గురుదీత్ సింగ్‌ఒక నౌకను అద్దెకు తీసుకున్నాడు. అయితే అది అక్కడికి చేరేటప్పటికి, ఎటూతేలని స్థితిలో రెండునెలలు నానా యిబ్బందులు పడిన తర్వాత, ప్రయాణీకులు, తప్పని సరిగా తిరిగి వెళ్ళిపోవలసి వచ్చింది. చిట్టచివరికి కొమగటమారు కలకత్తా రేవుచేరి లంగరు వేసేటప్పటికి, ప్రయాణీకులు, తమకోసం ప్రత్యేకంగా కేటాయించి సిద్ధంగా వుంచిన రైలులో ఎక్కడానికి నిరాకరించారు. అతర్వాత కొట్లాటలు జరిగాయి; ఈ కొట్లాటల్లో 20 మొదలు 40 మందివరకు మరణించారు; అనేకమంది గాయపడ్డారు. 'తోషమరు' కు కూడా, యిదేగతి పట్టింది. విదేశాలలో వున్న పంజాబీలు, ఈవార్తలు విన్న వెంటనే భగ్గున మండిపడి, వెంటనే భారతదేశానికి తిరిగివచ్చి, బాధలకు గురిఅయిన వారితో కలసి, బ్రిటిష్ పరిపాలనకు వ్యతిరేకంగా తీవ్రమైన సాయుధ ఉద్యమం ప్రారంభించారు. జర్మన్ ఆయుధాలను సంపాదించలేక, వీరు, బెంగాల్ విప్లవవాదులను కలుసుకున్నారు.

బెంగాల్ దౌర్జన్య వాదులలో జతీంద్రనాథ్ ముఖర్జీ, రాస్ బిహారి బోస్, నరేంద్ర నాథ్ భట్టాచార్య వంటి నూతన నాయకులు వెలిశారు. భారత సైన్యాలను లోబరుచుకొనడం, పేషావర్‌నుంచి చిట్టగాంగ్ వరకూ ఒకేసారి పోలీసుల స్థావరాల మీదా, ఖజానాలమీదా దాడి జరపడం, జర్మన్ ఆయుధాలతో చిట్టచివరికి యుద్ధం ప్రకటించడం, — వీరి పథకంలోని ముఖ్యఅంశాలు. దురదృష్ట వశాత్తు 1915 ఫిబ్రవరి 21 వ. తేదీన జరగవలసిన తిరుగుబాటు, విద్రోహంవల్ల, విఫలమయింది. కుట్రలో అతిముఖ్య సభ్యుడయిన వి. జి. పింగళెని, మీరట్ సమీపంలో ఒంటెల బిడారుదగ్గర, బాంబులతో సహా అరెస్టుచేశారు. తిరుగుబాటు జరిపిన పటాలాలను తొలగించారు. కుట్రదారులలో చాలామందిని ఉరితీయడమో, అండమాన్ దీవులకు పంపివేయడమో జరిగింది. రాస్ బిహారి బోస్, జపాన్‌కి పారిపోయారు.

జతీన్ ముఖర్జీ, పెద్దపథకాన్ని వేసుకోవడంవల్ల, చెదురుమదురుగా హత్యలుచేసే చర్యలను వదులుకున్నారు. రోడా అండ్ కంపెనీకి వెళ్ళవలసి వున్న మౌసర్ పిస్తోళ్ళు అపారంగా లభ్యమయ్యాయి. జర్మన్ ఆయుధాలను దించడానికి వేచివున్న ఐదుగురు బెంగాలీ దౌర్జన్య వాదులకూ, సాయుధ పోలీసుల పటాలానికీమధ్య, బలసోర్‌దగ్గర బురేబాలం నదిగట్లమీద చిరస్మరణీయమైన యుద్ధం జరిగింది. ఈ యుద్ధంలో ఒక కందకం నుంచి వీరోచితంగా పోరాడుతూ వున్నప్పుడు తగిలిన గాయాలవల్ల జతీంద్ర నాథ్, మరణించారు.

భారతీయ నాయకులమధ్య సమన్వయం లేకపోవడంవల్లా; భారతీయ విప్లవాదులకూ, బెర్లిన్ సంఘానికీ, ఘదర్ పార్టీకీ మధ్య కమ్యూనికేషన్లు లేకపోవడంవల్లా యుద్ధ సమయంలో విప్లవ ఉద్యమాలు విఫలమయ్యాయి. మొట్టమొదటినుంచి అపోహలతోవున్న ప్రభుత్వం, ఆయుధాల సప్లయిని అరికట్టడానికి చర్యలు తీసుకోవాలని అమెరికా అధికారులకు నచ్చచెప్పడానికి ప్రయత్నించింది. యుద్ధంలో, జర్మనీకి వ్యతిరేకంగా, అమెరికా, మిత్రదేశాలలో చేరిపోవడంతో, అమెరికాలో ఎటువంటి కార్యకలాప మయినా అసంభవ మయింది. శాన్‌ఫ్రాన్సిస్కోలో ఘదర్ నాయకుల విచారణ జరిగింది. దీనితో అమెరికాలో, ఒక స్థావరంగా, యిహ విప్లవ కార్యకలాపాలు జరిపే అవకాశాలన్నీ అంతరించాయి.

## లక్నో ఒడంబడిక

ప్రభుత్వం తప్పనిసరిగా ఒక నూతన దృక్కోణంనుంచి చూడవలసిన పరిస్థితులు ఏర్పడినపుడు, 1916లో కాంగ్రెసుకూ, ముస్లింలీగ్‌కూ మధ్య లక్నోలో జరిగిన ఒడం

బడిక, ఒక మార్గాన్ని చూపింది. 1908 దరిమిలా లక్నో కాంగ్రెసు, మొట్టమొదటి సమైక్య కాంగ్రెసు. అంతరంగిక పరిపాలన అలజడి దీనిలో ఒకపోరాట భావాన్ని ప్రవేశపెట్టింది. మౌలానా ఆజాద్, అన్సారి, అజ్మల్‌ఖాన్‌వంటి ముస్లింనాయకులతో, అంగీకారాన్ని సాధించారు. అంతవరకూ భూకామందుల నాయకత్వం క్రిందవున్న, లీగ్, అలీగడ్ వర్గం పరిమిత రాజకీయ దృక్పధాన్ని అధిగమించి, యింకా ఎక్కువవీర వైఖరిని అవలంబించింది. ఆజాద్ పత్రిక అల్ - హిలాల్‌నూ. మహమ్మదల్లీ పత్రిక కామ్‌రేడ్‌నూ అణచివేసి, వాటిపై నిర్బంధం విధించిన తర్వాత ముస్లిం నాయకులలోని జాతీయ వాదులు కాంగ్రెసుతో సహకారానికి సిద్ధమయ్యారు. దీని ఫలితమే లక్నో ఒడంబడిక.

కాంగ్రెసునూ, ముస్లింలీగ్‌నూ సన్నిహితం చేయడంలో, తిలక్, అతిముఖ్యపాత్ర నిర్వహించారు. హిందూ - ముస్లిం ఐకమత్యంద్వారా మాత్రమే విజయాన్ని సాధించవచ్చునని ఆయన గ్రహించారు. సమైక్య జాతీయవాద సంస్థకన్నా తీవ్రవాదుల వ్యవస్థ పటిష్టంగా వుండజాలదు. ఐకమత్యాన్ని సాధించాలన్న ఆతురతతో, ఆయన, ప్రత్యేక నియోజక వర్గాల సూత్రాన్నీ, ముస్లిం అల్పసంఖ్యాకులకు ప్రాధాన్యమివ్వాలన్న సూత్రాన్నీకూడా ఆమోదించారు. శాసనసభలలో ముస్లింసభ్యుల సంఖ్యను రాష్ట్రంవారిగా కచ్చితంగా పేర్కొన్నారు. ఇంపీరియల్ శాసన సమితిలో వీరిసంఖ్య మూడోవంతు వుండాలి. ఒక మతానికి చెందిన ముప్పాతికమంది సభ్యులు ఏచర్య నయినా ప్రతిఘటించి నట్లయితే ఏశాసనసభ దానిమీద చర్చ జరపడానికి వీలులేదు. దీనికి ప్రత్యామ్నాయంగా, కాంగ్రెసు — లీగ్, భారతీయ సమితిని రద్దుచేయాలనీ, కేంద్ర, రాష్ట్ర శాసనమండలి సభ్యులలో ఐదింట నాలుగోవంతు మంది సభ్యులను ఎన్నుకోవాలనీ, రాష్ట్రవ్యవహారాలలో జోక్యం కలిగించుకో బోమని హామీయివ్వాలనీ, రక్షణ - విదేశాంగ విధానాలు మినహా కేంద్ర ప్రభుత్వంమీద పూర్తిఅదుపు వుండాలనీ, సంయుక్తంగా, గట్టిగాకోరారు. హిందూ — ముస్లిం ఐకమత్యాన్ని సాధించడంలో లక్నో ఒడంబడిక, ఒకముఖ్యమయిన పెద్ద ముందడుగు. విద్యావంతులయిన ధనికహిందువులకూ, విద్యావంతులయిన ధనిక ముస్లింలకూ మధ్య అధికారానికి సంబంధించిన ఒడంబడిక యిది, అని గాంధీజీ అన్నారు. హిందూ - ముస్లిం సామాన్య ప్రజానీకానికి యిది వర్తించదు. హిందువులు-ముస్లింల వేరు వేరు ప్రయోజనాలన్న తప్పుడు అభిప్రాయానికి యిదియింకా ప్రాధాన్యమిచ్చింది ; అందువల్ల హిందువులు - ముస్లింలు వేరువేరుగా రాజకీయంగా వున్నట్లు అర్థమయింది. హిందువులు - ముస్లింలు వేరువేరు మత వర్గాలన్న తప్పుడు అభిప్రాయమే దీనికి ప్రాతిపదిక. మత ప్రమేయం లేని లౌకిక విధానం పెంపొందటానికి యిది అనుగుణంగా లేదు. భవిష్యత్తులో మత విద్వేషాలకు, యిది అవకాశమిచ్చింది.

భారతీయ ఐకమత్యానికి, మూలప్రాతిపదిక విషయంలోనే సమాధాన పడినందువల్ల మొత్తం స్వరూపం బీటలు పడేవరకూ యింకా ఎక్కువ కన్సెషన్లకు దారితీయక మానదు.

అయితే ప్రస్తుతానికి, దేశంలోని రెండు పెద్ద రాజకీయ పార్టీలు సమైక్యంగా చేసిన నిర్దుష్ట కోరికను ప్రభుత్వం ఎదుర్కోవలసి వచ్చింది. నాయకులలో యువతరం వారిని ఆకర్షించిన హోమ్ రూల్ లీగుల అలజడిని కూడా ప్రభుత్వం ఎదుర్కోవలసి వచ్చింది. దేశంలోనూ, విదేశాలలోనూ విప్లవ ఉద్యమాలను కూడా లెఖ్ఖలోకి తీసుకోకతప్పదు. ప్రభుత్వం మళ్ళీ మరోసారి సంస్కరణలు, దమన నీతి ద్వంద్వ విధానాన్ని ప్రదర్శించింది. సంస్కరణల గురించి ఒక ప్రకటన చేయాలని వైస్రాయ్ చెంమ్స్ఫర్డ్, విదేశాంగ మంత్రిమీద ఒత్తిడితేగా, నూతన ప్రవాహాన్ని అరికట్టడానికి ఒక ఆనకట్టను కడతామని దేశీయాంగమంత్రి తెలియజేశారు. హోమ్ రూల్ లీగ్లను అణచివేశారు. శ్రీమతి బిసెంట్ను అరెస్టు చేశారు. కాంగ్రెసు, వైస్రాయ్కి ఆక్షేపణ తెల్పింది. 1917 లో కలకత్తా కాంగ్రెసుకు అధ్యక్షురాలుగా శ్రీమతి బిసెంటును ఎన్నుకుంది. శాసనోల్లంఘన జరగాలని మద్రాసులో చేసిన సూచనను, కాంగ్రెసు బుట్టదాఖలు చేసినప్పటికీ, హోమ్ రూలు కోరికను పూర్తిగా బలపరిచింది. త్వరలో పూర్తి స్వపరిపాలనా ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాలనీ, కాంగ్రెసు - లీగ్ పథకాన్ని సంస్కరణలలో మొదటి ఘట్టంగా అమలు జరపాలనీ వీరు కోరారు.

## అధికారులవైఖరి : దమన నీతి: సంస్కరణ హామీ

ప్రభుత్వ వైఖరిని 1917 ఆగష్టు 20 తేదీన పార్లమెంటులో విదేశాంగ మంత్రి, మాంటేగూ ప్రకటించారు. ఈయన చాలా ఆలస్యంగా సూచనలను చేయడంవల్ల, వీటికి ప్రాధాన్యం లేక పోయింది. భారతీయ సంస్కరణలకూ, భారతదేశంలో బాధ్యతాయుతమైన ప్రభుత్వాన్ని సాధించడానికీ, మాంటేగూ, మొట్టమొదట ఒక లక్ష్యాన్ని నిర్ణయించారనడం మాత్రం వాస్తవం. అయితే దీనిని క్రమేపీ, అభ్యుదయకరంగా, పాలకవర్గంలో ప్రతి శాఖలోనూ భారతీయులకు ఎక్కువ సంబంధం కలగజేస్తూ, స్వపరిపాలనా సంస్థలను జాగ్రత్తగా అభివృద్ధి పరుస్తూ, అమలులోకి తేవాలి. అంటే దీని అర్థం, సంస్కరణలు ఘట్టాలవారిగా అమలు జరగాలి. ప్రతి ఘట్టం వ్యవధిని, స్వభావాన్నీ, బ్రిటిష్ ప్రభుత్వం నిర్ణయించాలి. భారతదేశం ఎంతమేరకు ఏ రూపంలో సహకరిస్తుంది ? అన్న విషయము బాధ్యతలను నిర్వర్తించడంలో భారతదేశపు శక్తిని

బ్రిటిష్‌వారు వేసే అంచనా ప్రాతిపదికగా, ఈ నిర్ణయం ఆధారపడి వుంటుంది. అంటే ఆచరణలో క్రియాత్మకమైన అధికారం, బ్రిటిష్ ప్రయోజనాలకు అనుకూలంగా బ్రిటిష్ వారి చేతుల్లోనే వుండాలి. మితవాద జాతీయవాదుల అభిప్రాయాన్ని సమాధానపరిచి, వీర జాతీయవాదులనుంచి వీరిని వేరు చేయడంకోసమనే, ఈ సంస్కరణలను ఉద్దేశించారు.

సంస్కరణలు చేస్తామని వాగ్దానాలు చేస్తూనే, ప్రభుత్వం, సామ్రాజ్యవాద వ్యతిరేక సమర శక్తులను అణచివేయడానికి సన్నద్ధమయింది. క్రిమినల్ శాసనం సవరణ చట్టంవల్ల కుట్రను, క్రిమినల్ నేరం చేశారు. ప్రభుత్వం, ప్రత్యేక తీర్పు సంఘాల ద్వారా విచారణ జరిపి, మరణ శిక్షలు విధించడానికి వీలయింది. కేవలం అనుమానం మీద ప్రజలను నిరవధికంగా నిర్బంధంలో వుంచేవారు. డిటెన్యూలను క్రూరంగా హింసించేవారు. జాతీయవాదుల కోర్కెలను తృప్తిపరచడానికీ, జాతీయవాద ఉద్యమాన్ని మభ్య పెట్టడానికీ సంస్కరణలు చేస్తామని హామీ యిచ్చేవారు. పరిపాలింపబడే వారి మీద పరిపాలకులు గట్టిపట్టును కొనసాగిస్తూ వుండటానికి దమన విధానం అమలులో వుండేది. ఏ చర్యలద్వారా నయినాసరే, ఏది ఏమయినా సరే, సామ్రాజ్య వాదాన్ని కొనసాగిస్తూనే వుండాలి.

# IV స్వరాజ్య సమరం

## కల్లోల ఉధృతం : యుద్ధ ప్రభావం

యుద్ధం జరుగుతూవున్న సంవత్సరాలలో భారత జాతీయతాభావం పరిపక్వం చెందింది. ఉద్యమం ఉధృతమై ఒకవిధంగా యింకా శక్తివంతమయింది. యుద్ధకృషికి భారతదేశం దోహదం కావడాన్ని బ్రిటిష్ ప్రభుత్వం కొంతవరకూ శ్లాఘించింది. భారతదేశానికి పూర్తి స్వపరిపాలనా ప్రభుత్వం కాకపోయినా, కొన్ని ముఖ్య సంస్కరణలను ప్రసాదిస్తారని ఆశించడానికి తగిన హేతువు ఏర్పడింది. జాతీయవాదులు ఎదురుచూసే ధోరణిలో వున్నారు. అయితే వీరి ఆశలు అడియాస లయినట్లయితే తిరిగి సమరం జరవడానికి సిద్ధమయ్యారు.

ఆర్థిక రంగంలోకూడా పరిమిత ఆశాభావం కనుపించింది. యుద్ధం జరుగుతూ వున్నపుడు విదేశ దిగుమతులు దాదాపు పూర్తిగా నిలిచిపోయాయి. అయితే బ్రిటన్ యుద్ధ అవసరాలు ఎక్కువయ్యాయి. వీటిలో కొన్ని అవసరాలను ఉత్పత్తి ఎక్కువ చేయడంద్వారా భారతదేశం పరిష్కరించ వలసి వచ్చింది. దీని ఫలితంగా భారత వర్తక పరిశ్రమలు కొంతవరకూ సౌభాగ్యవంత మయ్యాయి. ప్రోత్సాహమూ, అవకాశమూ యిచ్చినట్లయితే ఎటువంటి ప్రగతిని సాధించ వచ్చునో దీనివల్ల, భారతదేశం తెలుసుకో గలిగింది. అధిక లాభాలనూ, అభ్యుదయాన్నీ యిది, భారత పారిశ్రామిక వేత్తలకు రుచి చూపింది. 1916లో పారిశ్రామిక విచారణా సంఘాన్ని ఏర్పాటు చేశారు. పారిశ్రామికాభివృద్ధిలో ప్రభుత్వం యింకా క్రియాత్మకమైన పాత్ర నిర్వహించాలనీ, ముందడుగు వేయడంలో తోడ్పడటానికి తగిన పాలనా యంత్రాంగాన్ని ఏర్పాటు చేయాలనీ ఈ సంఘం సిఫార్సు చేసింది. పారిశ్రామిక విధానంలో పెద్దమార్పులు జరుగుతాయని భారత పెట్టుబడిదార్లు ఎదురు చూశారు.

ఈ ఆశలు, ఎదురు చూడటాలతో పాటు భయాలు, అనుమానాలుకూడా వుండేవి. తయారయిన సరుకుల ధరలు విపరీతంగా పెరిగిపోయాయి ; అయితే వ్యవసాయ ఉత్పత్తుల ధరలు పెరగలేదు. ఉక్కు-జనుపు వస్త్రాలలో విపరీతమైన లాభాలను ఆర్జించారు ; భారతీయుల ఉపాధి అవకాశాలు ఎక్కువయ్యాయి, అయితే ఈ లాభాలు

వాస్తవంగా సామాన్య ప్రజానీకానికి అందలేదు. భారతదేశంలో సామగ్రి - సరుకు కొనడానికి ఇండియన్ మ్యూనిషన్సు బోర్డు, చర్యలు ప్రారంభించింది. అయితే భారత దేశంలో యంత్రాలు తయారుచేసే పరిశ్రమలు లేనందువల్ల భారత పెట్టుబడి దార్లు పరిస్థితిని పూర్తిగా సద్వినియోగం చేసుకోలేక పోయారు. యుద్ధసమయం కంట్రోళ్ళ వల్లా, నౌకా రవాణా సౌకర్యాలు లేకపోవడం వల్లా, ఎగుమతులు దెబ్బతిన్నాయి. యుద్ధం ఆఖరిరోజుల్లో ఉత్పత్తివెనుకబడింది. మూసివేతలు, నిరుద్యోగం ప్రబలింది. ఈలోగా నిత్యావసరం సరుకుల ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. 1914 – 1920 మధ్యలో కలకత్తాలో టోకు ధరల సూచిక వందశాతానికి పైగా పెరిగింది, ఆహారధాన్యాల ధరలు 93శాతం పెరిగాయి. ఇతర ప్రాంతాలలోకూడా పరిస్థితి యిదేవిధంగావుంది. ఇవన్నీ సామాన్య ప్రజలకు ఎన్నో యిబ్బందులు కలగజేశాయి. కర్షకులు, భారమయిన కౌలు పన్నులతో అంగలార్చారు. భవిష్యత్తు గురించి సార్వత్రిక ఆదుర్దా బయలుదేరింది. పారిశ్రామిక వేత్తలు రక్షణ కావాలనీ, ప్రభుత్వ సహాయం కావాలనీ కోరారు. విజయం సాధించిన బ్రిటన్ భారత ఆర్థిక వ్యవస్థ కోర్కెలను మన్నిస్తుందా ?

వెంటనే యుద్ధం ఆగిపోయింది. ఆర్థిక పరిస్థితి మరీ అధ్వాన మయింది. మొదట ధరలు పెరిగిపోయాయి. విదేశ సరుకులను మళ్ళీ దిగుమతి చేసుకోవడం మొదలు పెట్టారు. భారీ ఎత్తులో విదేశ పెట్టుబడులు పెట్టడం ఆరంభమయింది. ఆర్థిక కార్య కలాపాలు మందకొడిగా సాగడం ఆరంభ మయింది. భారతీయ పరిశ్రమలకు అపార నష్టాలొచ్చాయి ; మూసివేయవలసిన పరిస్థితికూడా ఏర్పడింది.

రాజకీయ రంగంలోకూడా పరిస్థితి ఎంతో భ్రమ కలిగించింది. యుద్ధం జరుగుతూ వున్న సమయంలో, జాతీయతా ఉద్యమానికి ఆసియా - ఆఫ్రికా దేశాలన్నింటిలోనూ గొప్ప ప్రోత్సాహం లభించింది. ప్రజల అండను సంపాదించడానికి బ్రిటన్, అమెరికా, ఫ్రాంన్సు, ఇటలీ, జపాన్ దేశాలన్నీ, ప్రజాస్వామ్యాన్ని కాపాడటానికి యుద్ధం జరుపుతూ వున్నామనీ, అన్నిదేశాలు - ప్రజల స్వయం నిర్ణయ హక్కును బలపరుస్తు న్నామనీ, హామీ యిచ్చాయి. అయితే యుద్ధం అనంతరం వలస రాజ్యాధిపత్యాన్ని అంతం చేయడానికి వీరు, సుముఖత కనబరచలేదు.

1919 లో జరిగిన శాంతి ఒడంబడికలు, మిత్రదేశాల యుద్ధ లక్ష్యాలనూ, అధ్యక్షులు విల్‌సన్ 14 అంశాల పథకాన్నీ నెరవేర్చలేదు. భారతదేశంలో విప్లవ ఉద్యమానికి తోడ్పడటానికి ప్రయత్నించిన జర్మన్లపట్ల కొంత సానుభూతి కనుపించింది. వర్సెయిల్స్ ఒడంబడిక కక్ష తీర్చుకునే పాలనమ ప్రకటించినట్టుగా కనుపించింది, ఓడిపోయిన దేశాల వలసలను విజేతలు పంచుకోవడం, మధ్య యూరొప్ ప్రజలకు స్వయం

నిర్ణయ హక్కు లేకుండా చేయడం, జర్మన్లపై విధించిన యుద్ధనష్ట పరిహారాల అపారభారం, టర్కిష్ సామ్రాజ్యాన్ని చూసిన వైఖరి, భారతీయులకు విభ్రాంతి కలిగించింది. యుద్ధకాలంలో లాయడ్ జార్జి యిచ్చిన వాగ్దానం ప్రకారం అటోమన్ సామ్రాజ్యాన్ని విడగొట్టాలని మిత్ర రాజ్యాలు నిర్ణయించాయి. మిత్ర రాజ్యాల అండతో గ్రీక్, ఇటాలియన్ సైన్యాలను టర్కీలో దించడంతో అటోమన్ సామ్రాజ్యమూ కేలిఫా వినాశనానికి నాంది ప్రస్తావన జరిగినట్టయింది. ముస్లింలలో అనేక వర్గాలు కేలిఫాను, తమ మత నాయకునిగా భావించేవారు. కేలిఫా స్థానం ఏమాత్రం బలహీనమయినా సామ్రాజ్యవాదుల ఆధిపత్యం క్రిందవున్న ఇతర దేశాల ముస్లిం స్థానానికి వ్యతిరేక ఫలితం కలుగుతుందనీ, వీరు భావించారు. దీని ఫలితంగా కిలాఫత్ ఉద్యమం ప్రారంభమయింది.

భారతదేశంలో, హోమ్‌రూల్ అలజడి, కిలాఫత్ ఉద్యమం చెలరేగడం ప్రారంభమవుతూ వున్న సమయంలో 1917 నవంబరులో రష్యాలో జారిస్టు విప్లవం ప్రారంభమయింది; బోల్షివిక్‌లు, ప్రపంచంలో మొట్టమొదటి సోషలిస్టు రాజ్యాన్ని స్థాపించారు. మిత్ర రాజ్యాలు, తాము చెప్పిన సూక్తులకు వ్యతిరేకంగా చేసినప్పటికీ, సోవియట్ రష్యా, ఆసియాలో తమ సామ్రాజ్యవాద హక్కులను ఏకపక్షంగా త్యజించడంద్వారా గొప్ప సద్భావాన్ని కలిగించింది. జారిస్టు వలసలకు స్వయం నిర్ణయాధికార హక్కును మంజూరు చేశాడు. యు. ఎస్. ఎస్. ఆర్ లోని ఆసియా జాతులకు సమాన ప్రతిపత్తి యిచ్చాడు. విప్లవం, సామాన్య ప్రజల అశేష బలాన్నీ, శక్తినీ నిరూపించింది; వీరు సామ్రాజ్యవాద దేశాల జోక్యాన్నీ, అంతర్యుద్ధం ఛాయలనూ విజయవంతంగా ఎదుర్కొ గలిగారు. ప్రతిచోట వలస ప్రజల హృదయాలను వీరు చూరగొన్నారు. యుద్ధంనుంచి తిరిగి వస్తోన్న సైనికులనుంచి, మారుమూల ప్రాంతాలలోవున్న గ్రామ ప్రజలు గాథలను విన్నారు. భూములులేనివారికి భూములను పంచిపెడుతూ, లెనిన్ జారీచేసిన భూముల ఉత్తర్వులు, మేధావులకు ఉత్తేజం కలిగించాయి. ఢిల్లీ కాంగ్రెసు, భారత దేశానికిగల స్వయం నిర్ణయాధికారాన్ని మాత్రమేకాక, భారత ప్రజల హక్కుల గురించి ఒక ప్రకటన చేయాలని కూడా కోరారు.

సిన్‌ఫెన్ పార్టీ, ఐరిష్ రిపబ్లిక్ ప్రకటన చేయడం మరికొంత ప్రోత్సాహాన్నిచ్చింది. మైకేల్ కోలిన్సు ఐరిష్ గెరిల్లాలు బ్రిటిష్‌వారిమీద భీకర పోరాటం సాగించారు. బ్రిటిష్‌వారి దమన చర్యలు, రౌలత్ బిల్లులను భారతీయులకు గుర్తుకు తెచ్చాయి. ఈజిప్టులో జగులుల్‌పాషా నేషనలిస్టు పార్టీ యుద్ధ సమయంలో, బ్రహ్మాండంగా వృద్ధిచెందింది. 1919 లో జగులుల్‌పాషాను దేశంనుంచి పంపివేసిన దరిమిలా తీవ్ర

మైన తిరుగుబాటు జరిగింది; అయితే బ్రిటిష్ సైన్యం దీనిని అతి క్రూరంగా అణచి వేసింది. 1920 మార్చిలో ఈజిప్టు స్వాతంత్ర్యాన్ని ప్రకటించారు. సరిగ్గా అదే సమయంలో టర్కీ ముస్తఫా కామెల్‌పాషా మిత్రదేశాల ఆక్రమణకు వ్యతిరేకంగా యుద్ధాన్ని ప్రకటించి, తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశారు. షాన్‌టుంగ్‌ను తన ఆధీనంలో వుంచుకోవడానికి మిత్రదేశాలు జపాన్‌కి అనుమతి యిచ్చినపుడు, చైనాలో దౌర్జన్యపూరితమైన నిరసన తెల్పారు. షాన్‌టుంగ్ అప్పటివరకూ జర్మన్ కన్‌సెషన్‌గా వుండేది. మేధావులు విద్యార్థులు పాల్గొన్న మే నాల్గవతేదీ ఉద్యమం అతి ముఖ్యపాత్ర నిర్వహించింది. జపాన్ సరుకుల బహిష్కరణ ఉద్యమాన్ని వీరు ప్రారంభించారు. వార్సెయిల్స్ ఒడంబడిక మీద సంతకాలు చేయడానికి చైనీయులు నిరాకరించారు.

కొత్త శక్తులవల్ల నూతన సవాళ్ళు తలఎత్తాయనీ, పామరజనం తోడ్పాటుతో జాతీయ సమరాలకు ప్రారంభోత్సవం జరిగిందనీ రూఢిగా తెలిసినప్పటికీ, అధికార విధానం, వీటిని అరికట్టేదిగా వుంది. 1917 ఆగష్టు 20 తేదీన, మాంటేగూ ప్రకటన చేసిన తర్వాత హోమ్‌రూల్ ఖైదీలను విడుదల చేశారు. సైన్యంలో కమిషండ్ పదవులలో చేరడానికి జాతి నిషేధాన్ని తొలగించారు. విదేశాంగమంత్రి స్వయంగా భారతదేశం సందర్శించడానికి అంగీకరించారు. మాంటేగు మితవాదులను సమాధాన పరచడంలో విజయం సాధించాడుకాని, తీవ్రవాదులను తృప్తిపరచలేక పోయాడు.

సంస్కరణల వాస్తవ పథకం, జాతీయవాదుల కోర్కెలను తీర్చేదిగా లేదు. రాష్ట్రాలలో దయార్కీని, అంటే ద్వంద్వ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడం దీని ముఖ్య లక్ష్యం. తక్కువ ప్రాముఖ్యంగల విద్య, పారిశుధ్యం వంటి శాఖలను రాష్ట్ర శాసనసభ ఎన్నికయిన సభ్యులనుంచి ఎంచుకున్న మంత్రులకు "బదలాయించి" నప్పటికీ, ఆర్థిక, పోలీసు సాధారణ పరిపాలనవంటి ముఖ్యమయిన వాటిని, నిర్వాహక సమితి సభ్యులకు, అంటే భారత ప్రభుత్వానికీ, పార్లమెంటుకూ మాత్రమే బాధ్యులయిన అధికార్లకు "రిజర్వు" చేశారు. గవర్నర్, నిర్వాహక వర్గం రెండు శాఖలకూ అధ్యక్షత వహిస్తారు; అయితే ఎప్పుడూ సంయుక్త సమావేశానికి అధ్యక్షత వహించరు. తమ శాఖల నిర్వహణకు మంత్రులు, శాసన సమితికి బాధ్యత పడవలసి వున్నప్పటికీ, గవర్నర్, వీరి సలహాను అసలు ఆమోదించకపోవచ్చు. కేంద్ర ప్రభుత్వ స్వభావం, గవర్నర్ జనరల్ కార్యవర్గ సమితిలో రెండో భారతీయుణ్ణి చేర్చుకోవడం మినహా, యిదివరకటి మోస్తరుగానే వుంది. పార్లమెంటుకు, యిదివరకటి మోస్తరుగానే బాధ్యత వహించివుంది. కేంద్రంలో రెండు శాసనసభలు వుండాలి. దిగువ సభలో ఎన్నికయిన సభ్యుల మెజారిటీ, ఎగువసభలో అధికారుల మెజారిటీ వుంటుంది.

రాష్ట్ర శాసన సభలను విస్తరిత పరిచారు. విస్తరిత ప్రాతిపదిక మీద ఎన్నికయిన సభ్యుల మెజారిటీని అంగీకరించారు. కొన్ని ఆర్థిక - శాసనాధికారాలను, రాష్ట్రాలకు యిచ్చారు. మిగిలిన అధికారాలను భారత ప్రభుత్వం వుంచుకుంది. పంజాబ్‌లో శిఖులకు ప్రత్యేక నియోజక వర్గాలను విస్తరించారు.

సంస్కరణల్లో ముఖ్యంగా నిరాశ కలిగించే విషయ మేమిటంటే, దీని నిబంధనల ప్రకారం, గవర్నర్ జనరలు, ఆయన కార్యవర్గ సమితి గురించి మాట్లాడే అధికారం శాసనసభకు లేదు. ఇదే సమయంలో కేంద్ర ప్రభుత్వానికి, రాష్ట్రాలమీద, పూర్తి కంట్రోలువుంది. దీనికితోడు ఓటింగ్ హక్కు ఎంత పరిమితంగా వుండేదంటే, దీనిని ప్రజాస్వామిక పద్ధతి అనడానికి వీలులేదు. ఉదాహరణకు 1920 లో దిగువసభకు 9, 09, 874 ఓటర్లు, ఎగువసభకు 17,364 మంది ఓటర్లు మాత్రమే వుండేవారు.

1918 జూలై 8 తేదీన ప్రచురించిన నివేదికవల్ల, మితవాదులకూ, అతివాదులకూ మధ్య సంఘర్షణ ప్రారంభ మయింది. మితవాదులు దీనిని హర్షించినప్పటికీ, తిలక్, " యిది పూర్తిగా అంగీకారం కాదని " ప్రకటించారు. 1918 ఆగష్టులో బొంబాయిలో జరిగిన కాంగ్రెసు ప్రత్యేక సమావేశంలో, " యిది నిరాశా జనకంగానూ, అసంతృప్తి కరంగానూ " వుందని ప్రకటించారు; సంపూర్ణ రాష్ట్ర స్వపరిపాలనా ప్రతిపత్తి కావాలనీ, కేంద్ర ప్రభుత్వానికీ, భారతదేశపు ద్రవ్య స్వాతంత్ర్యానికీ కొంతవరకూ బాధ్యత వుండాలనీ, గట్టిగాకోరారు. సంఖ్యబాగా తగ్గి పోయిన మితవాదులు, సమావేశానికి హాజరు కావడానికి నిరాకరించారు. 1981 నవంబరు కల్లా వీరు. వేరుగా సమావేశమయ్యారు. ఆతర్వాతి సంవత్సరంలో వీరు, భారత జాతీయ విమోచన సమాఖ్య అనే పేరుతో తమస్వంత వ్యవస్థను, వేరుగా ఏర్పాటు చేసుకున్నారు. సురేంద్రనాథ్ బెనర్జీ దీనికి అధ్యక్షులు. అయితే దేశంలో వీరు అప్పటికే ఒక రాజకీయ శక్తిగాలేరు.

సంస్కరణలకు, గాంధీజీ, మొదట్లో సుముఖత కనబరిచారు. అయినా ప్రభుత్వం, కన్‌సెషన్లు, దమన విధానాన్ని అనుసరిస్తూ, సరిగ్గా అదే సమయంలో. కఠినమైన దమన శాసనాన్ని జాతీయవాదులకు యివ్వడం ఒకపెద్ద తప్పిదం చేసినట్టయింది. 1905 మొదలు 1918 వరకూ విప్లవ కార్య కలాపాల గురించి పరిశీలన జరపడానికి రౌలత్‌సంఘాన్ని ఏర్పాటు చేశారు. ఈ సంఘం. విచారణ లేకుండా నిరంకుశంగా అరెస్టుచేయడం, నిర్బంధంలో వుంచడం, ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాలు సాగిస్తున్నారని అనుమానం వున్న వ్యక్తుల సంచారంమీద నిర్బంధాలు విధించడం వంటి కొన్నిచర్యలను సూచించింది. జ్యూరీలేకుండా రాజకీయ కేసులను విచారించే

అధికారాలను జడ్జీలకు యిచ్చారు; అప్పీలు చేసుకోడానికి వీలులేదు. ఆరోపణ చేయ డానికి ఆధారమున్న పత్రం ఏదయినా దగ్గర వున్నట్టయితే శిక్ష విధించేశారు. ఈ ప్రతి పాదనలు గాంధీజీ కండ్లు తెరిపించాయి. "మన హక్కులు నొక్కి వేసే అధికారాలను సివిల్ సర్వీసుకు యిచ్చారనడాన్ని యివి ప్రత్యక్షంగా నిరూపిస్తున్నాయి. ఈ బిల్లులు మనకు ప్రత్యక్ష సవాలుగా భావిస్తున్నాను" అని గాంధీజీ అన్నారు.

## గాంధీజీ రంగంలో అడుగు పెట్టడం

భారత జాతీయ కాంగ్రెసుకు మహాత్మా గాంధీ పోటీలేని నాయకులు కావడం ఆసక్తి కరమైన కథ మోస్తరుగా వుంటుంది. దక్షిణాఫ్రికాలో భారతీయులకోసం ఆయన జరిపిన వీర పోరాటం ప్రపంచ ప్రఖ్యాతి వహించింది. ఈయన కనిపెట్టిన కొత్త పద్ధతి సత్యాగ్రహం, మంచి ఫలితాలనిచ్చింది. ఈయన ప్రవర్తన, నిర్వహణ సామర్థ్యం గురించే కాంగ్రెసు ప్రముఖులకు గొప్ప సదభిప్రాయం ఏర్పడింది. 1915 లో, ఆయన భారతదేశం వచ్చేవరకూ కాంగ్రెసులో ప్రముఖ పాత్ర ఏదీ ఆయన నిర్వహించలేదు; సామాన్య ప్రజానీకానికి ఆయన గురించి ఏమీ తెలియదు. జవహర్‌లాల్ నెహ్రూ వంటి యువజనులకు ఆయన "అందుబాటులో లేని భిన్న రాజకీయేతర వ్యక్తి" గా కనుపించారు.

అయితే ఆయన అందుబాటులో లేనివ్యక్తి అన్న భావం, వరప్రసాదం మోస్తరుగా పనిచేసింది. మితవాదులు, కొంతవరకు అతివాదులు కూడా ఆయన గురించి భ్రమ పడ లేదు. ఆయన నిరాడంబరమైన అలవాట్లు, మహాపురుష లక్షణం, ఇంగ్లీషుకన్నా భారతీయ భాషలను ఎక్కువగా ఉపయోగించడానికి ప్రాధాన్యమివ్వడం, మత గ్రంథాలను ఉపయోగించడం,ప్రజలపై గొప్ప ప్రభావాన్ని కలిగించాయి; ప్రజలు వెంటనే ఈయన్ను విశ్వసించడం మొదలుపెట్టారు. భారత ప్రజల హృదయాలలో గాంధీజీకి శాశ్వత స్థానం ఏర్పడింది; ఈయనకు ఎక్కడలేని శక్తి రావడానికి యిదే కారణం.

దక్షిణాఫ్రికాలో జాతి విచక్షణకు వ్యతిరేకంగా ఆయన జరిపిన సమరంలో క్రియాత్మక మైన సత్యాగ్రహ సిద్ధాంతాన్ని పెంపొందించారు. సత్యం - అహింస దీని ముఖ్య ప్రక్రియలు. ఇది ఆత్మశక్తి లేక ప్రేమశక్తి అని ఆయన నిర్వచనం చేశారు. సత్యం- అహింసల నుంచి పుట్టిన శక్తే యిది. ఏది తప్పు అని భావిస్తాడో, దానికి లొంగడానికి సత్యాగ్రహి నిరాకరిస్తాడు. ఎంత రెచ్చగొట్టినా ఆయన శాంతియుతంగా వుంటాడు. చెడును ప్రతిఘటిస్తాడు, కాని, చెడు చేసేవాడిని ద్వేషించడు. ప్రత్యర్థికి కష్టాలు కలిగించడంద్వారా కాక, తనే బాధలకు లోనుకావడం ద్వారా సత్యాన్ని చాటి చెబుతాడు.

దీని ద్వారా చెడు చేసేవానికి హృదయ పరివర్తన కలుగుతుందని ఆయన ఆశించారు. విజయం సాధించాలి అంటే సత్యాగ్రహి, భయాన్నీ, ద్వేషాన్నీ, అసత్యాన్నీ పూర్తిగా త్యజించాలి. సహాయాన్ని నిరాకరించే వ్యక్తికీ ఈయనకూ తేడా వుంది: ఎందువల్ల నంటే. తాత్కాలిక అవసరాల దృష్ట్యా మాత్రం కాక, ఒకే సూత్రం ఆధారంగా ఆయన దౌర్జన్యాన్ని త్యజించాడు. సహాయ నిరాకరణ బలహీనుల ఆయుధమయితే, సత్యాగ్రహం బలం గలవారి ఆయుధమని ఆయన అన్నారు.

స్వదేశీ ఆయన నినాదం. "అందుబాటులో లేని వాటి స్థానే మన పరిసరాలను ఉపయోగించి సేవచేయడానికి వినియోగించాలన్న భావాన్ని కలిగించడమే దీని లక్ష్యమని" ఆయన నిర్వచనం చేశారు. అందువల్ల ఆయన కాయకష్టానికి ప్రాధాన్యమిచ్చారు: దీనినే ఆయన భుక్తికోసం కష్టపడటం అన్నారు: చరఖాకు ప్రాముఖ్య మిచ్చారు.

సత్యాగ్రహం ఆఫ్రికాలో విజయవంతమయినట్టయితే దీనిని భారతదేశంలో ఎందుకు ప్రయత్నించకూడదు? "బ్రిటిష్ ప్రభుత్వం శక్తివంతమైన ప్రభుత్వ మనడంలో నాకు ఎటువంటి సందేహము లేదు; అయితే సత్యాగ్రహం సర్వ సంజీవని అనడంలో కూడా నాకు ఎటువంటి సందేహం లేదు" అని ఆయన అన్నారు. బీహార్‌లోని చంపారన్‌లోనూ గుజరాత్‌లోని కైరాలోనూ, అహమ్మదాబాదులోనూ ఆయన దీనిని ప్రయోగాత్మకంగా అమలు జరిపి చూశారు.

ఇతర రాజకీయ వేత్తలు, సంస్కరణల గురించి చర్చ జరుపుతూ వుండగా, గాంధీజీ బీహార్‌లో చంపారన్ కర్షకుల పిలుపును మన్నించారు. తింకాతియా పద్ధతి క్రింద కర్షకులు చట్టప్రకారం తమ భూమిలో ఇరవై యింట మూడో వంతులో నీలిమందు మొక్కలను పెంచి, దానిని బ్రిటిష్ తోటల యజమానులకు, వారు నిర్ణయించిన ధరలకు అమ్మాలి. చట్టవిరుద్ధంగా నీలిమందు తయారుచేయాలని తోటల యజమానులు వీరిపై ఒత్తిడి తెచ్చేవారు; దమననీతిని అనుసరించేవారు. జైలులో పెడతామని బెదిరించినప్పటికీ, గాంధీజీ, వీరి కష్టనిష్ఠురాల గురించి క్రమపద్ధతిలో దర్యాప్తు జరిపారు. ఎంతోకాలం నుంచీ బాధలుపడుతూవున్న కర్షకులనుంచి ఎటువంటి తిరుగులేని సాక్ష్యాన్ని ఆయన యిప్పించ గలిగారు అంటే, ప్రభుత్వం ఒక విచారణ సంఘాన్ని నియమించ వలసి వచ్చింది. ఇందులో ఈయన ఒక సభ్యులు. దీని ఫలిత మేమిటి అంటే ఈ పద్ధతిని రద్దుచేయ వలసి వచ్చింది. అనేక శతాబ్దాలనుంచీ స్తబ్దంగా వున్న జాగృత గ్రామాలను చైతన్య వంతం చేయడం జరిగింది. రాజేంద్ర ప్రసాద్, మజహరుల్ హక్, మహాదేవ్ దేశాయి, జె. బి. కృపలాని వంటి యువ జాతీయవాదులు, చంపారన్‌లో ఆయనతో కలిసి పని

చేశారు; ఆయన ఆదర్శవాదమూ, చైతన్యవంతమైన, నిర్భయమైన, క్రియాత్మకమైన, రాజకీయ చర్యలో ప్రాపంచికమైన వైఖరి, వారిని ముగ్ధులను చేశాయి.

గుజరాత్‌లోని కైరా జిల్లాలో యిదేమోస్తరు అవకాశం లభించింది. 1918లో ఆజిల్లాలో పంటలు నాశనమయ్యాయి. అయినప్పటికీ అధికార్లు భూమిశిస్తు పూర్తిగా వసూలు కావాలని పట్టుబట్టారు. గాంధిజీ, కర్షకుల సత్యాగ్రహం ఏర్పాటు చేశారు. భూమిశిస్తు చెల్లించడానికి వారు నిరాకరించారు; ఎటువంటి కష్టాలుపడటాని కయినా సిద్ధమయ్యారు. పన్నుచెల్లించే స్థోమత వున్నవారుకూడా సూత్రంకోసం, బలప్రయోగం చేస్తామనీ, భూములను జప్తుచేస్తామనీ బెదిరించి నప్పటికీ, పన్నుచెల్లించ దానికి నిరాకరించారు. ప్రభుత్వం చిట్టచివరికి తలఒగ్గి, కర్షకులతో ఒక పరిష్కారం కుదుర్చుకోవలసి వచ్చింది. ఈ ఉద్యమంలో ఇందూలాల్ యాజ్ఞిక్, గాంధిజీకి కుడి భుజంగా పనిచేశారు. అహమ్మదాబాదులో ఎంతో పేరుపొంది పటిష్ఠమయిన న్యాయవాదిగా వున్న సర్దార్ వల్లభాయి పటేల్, కైరా సత్యాగ్రహ విజయంవల్ల ఎంతగా ముగ్ధులయ్యారు అంటే, ఆయన గాంధీజీ అతి శక్తివంతమైన అనుచరులలో ప్రముఖులుగా పేరుపొందారు.

1918లో అహమ్మదాబాదు మిల్లుకార్మికుల దృష్టినికూడా ఈయన ఆకర్షించారు. అధికవేతనాలు చెల్లించడానికి నిరాకరించిన మిల్లు యజమానులకు వ్యతిరేకంగా కార్మికులు జరిపిన సమ్మెకు, ఈయన నాయకత్వం వహించారు. కార్మికులు బలహీనమయ్యే సూచనలు కనుపించిన వెంటనే నిరాహార దీక్షకు పూనుకోవడం ద్వారా ఆయన, వారికి శక్తినిచ్చారు. అఖిలభారత కార్మికుల దృష్టిని యిది ఎంతగా ఆకర్షించి అహమ్మదాబాదు మిల్లు కార్మికులనందరినీ ఎంత పటిష్ఠంగా సమైక్యపరచిందంటే, దీని పరిణామాలకు భయపడిన మిల్లు యజమానులు, గాంధీజీ నిరాహార దీక్షకు పూనుకున్న నాలుగోరోజున 35 శాతం వేతనాలను పెంచడానికి అంగీకరించారు.

సత్యాగ్రహంలో ఈ మొదటి ప్రయోగాలు గాంధీజీని పామర జనానికి, గ్రామ ప్రాంతాల కర్షకులకూ, పట్టణప్రాంతాల కార్మికులకూ కూడా అతి సన్నిహితం చేశాయి. జాతీయ ఉద్యమానికి గాంధీజీ ఈ విధంగా ఎంతో దోహదమయ్యారు. మొత్తంమీద దీనికి సమగ్రమైన లక్ష్యాలున్నప్పటికీ, నాయకులకు ఆర్థిక దూరదృష్టి వున్నప్పటికీ, సామాన్య ప్రజానీకం పేదరికము కడగండ్ల గురించి సమాచారం సేకరించడానికి ఎన్నో యిబ్బందులను ఎదుర్కోవలసి వచ్చినప్పటికీ, పామరజనానికి నచ్చచెప్పడానికి ప్రయత్నించినప్పటికీ జాతీయఉద్యమం, మొత్తంమీద, పట్టణ దిగువ మధ్యతరగతి, మధ్యతరగతి మేధావుల ఉద్యమంగా వుండేదని చెప్పవచ్చు. సామాన్య ప్రజానీకం

యిబ్బందులను తీర్చడానికి వీరు గట్టిప్రయత్నం చేయక పోయినప్పటికీ, వాస్తవమైన నాయకత్వాన్ని వీరు వహించారు. గాంధీజీ రంగంలో అడుగు పెట్టేటప్పటికి పామర జనమంతా వెంటనే చురుకుగా ఈ ఉద్యమంలో పాల్గొన్నారు. గ్రామీణ సామాన్య ప్రజానీకంతో పూర్తిగా తాదాత్మ్యం పొందిన నాయకులు బహుశ గాంధీజీ ఒక్కరే కావచ్చు. తనవ్యక్తిగత జీవితాన్ని గ్రామీణులకు సుపరిచిత మయిన పద్ధతుల్లో తీర్చి దిద్దుకున్నాడు; వారికిసులభంగా అర్థమయ్యేభాష మాట్లాడారు. అనతికాలంలో ఆయన భారతదేశం గ్రామసీమల్లో నివశిస్తూవున్న పేదవారికీ, అడుగున పడివున్న అశేష పామరజనానికీ నారాయణుడయ్యాడు; ఈ రీత్యా ఆయన భారతీయులకు వాస్తవమైన ప్రతినిధి అయ్యారు; ఈ యదార్థాన్ని ప్రశ్నించడానికీ, శంకించడానికీ వీలులేదు.

హిందూ – ముస్లిం సమైక్యత, అంటరానితనాన్ని తొలగించడం, మహిళల ప్రతిపత్తిని పెంచడం, – ఈ మూడు సమస్యలు, గాంధీజీ హృదయంలో ఎల్లప్పుడూ మెసలుతూ వుండేవి. అంటరానివారు, అని అనబడుతూ వున్నవారిని హరిజనులని ఆయన అనేవారు. తాను ఊహించిన భారతదేశం గురించి ఒకసారి ఆయన యిలా వ్రాశారు :

" నిరుపేదలు యిది తమదేశమని భావించే భారతదేశంకోసం నేను కృషిచేస్తాను, దేశ పునర్నిర్మాణంలో వారి వాస్తవమైన వాణి వినిపించాలి, ఉన్నత తరగతి, తక్కువ తరగతి ప్రజలు అనేవారులేని భారతదేశంకోసం, అన్ని కుల వర్గాలు పూర్తి సామరస్యంతో జీవించే భారతదేశంకోసం నేను కృషి చేస్తాను. ఇటువంటి భారత దేశంలో అంటరాని తనమన్న కళంకానికి తావుండకూడదు. పురుషులకున్న హక్కులే మహిళలకు కూడా వుంటాయి.... నేను కలలుగనే భారతదేశం యిదే."

భారతీయులంతా ఏకగ్రీవంగా ప్రతిఘటించి నప్పటికీ, రౌలత్ బిల్లులను ఆమోదించడంతో, గాంధీజీ ఓర్పు అంతమయింది. సత్యాగ్రహంతో దీనిని ఎదుర్కోవాలని ఆయన నిర్ణయించారు. ఈసారి యిది, పరిమిత లక్ష్యాలలో స్థానిక ఉద్యమంగా వుండరాదు. సత్యాగ్రహ సభ నొకదానిని ఆయన ప్రారంభించారు ; ఈ దమన చట్టాలను ధిక్కరించడానికి ఒక ప్రతిజ్ఞను రూపొందించారు. 1919 ఏప్రిల్ 6 తేదీన దేశమంతటా సార్వత్రిక హర్తాళ్ జరగాలని ఆయన కోరారు. దీనితోపాటు శాసనోల్లంఘన కూడా జరగాలి. హర్తాళ్ పూర్తిగా విజయవంతమయింది. అయితే ఢిల్లీలో గుంపుమీద పోలీసులు జరిపిన కాల్పులలో అనేకమంది హిందువులు - ముస్లింలు మరణించారు : గాయపడ్డారు. ఢిల్లీ వస్తూవున్న గాంధీజీని దోవలో ఆపివేసి బలవంతాన తిరిగి

బొంబాయికి పంపివేసినపుడు పోలీసులు మళ్ళీ గుంపుమీద దాడి జరిపారు : అనేకచోట్ల కొట్లాటలు జరిగాయి.

ఆ తర్వాత ఏప్రిల్ 13వ తేదీన జలియన్ వాలాబాగ్ విషాదగాథ సంభవించింది. పంజాబ్ ప్రజలు, యుద్ధఋణాలు, గవర్నర్ ఓడయర్ అనుసరించిన కఠిన భర్తీచేసు కునే పద్ధతులపట్ల ఉద్రేక పూరితులయ్యారు. కిలాఫత్ ప్రచారంవల్ల ముస్లింలపై గొప్ప ప్రభావం కలిగింది. ప్రభుత్వం అనవసరంగా భీతిచెంది ప్రధాన నాయకులయిన డాక్టర్ సత్యపాల్‌నీ, డాక్టర్ సైఫుద్దిన్ కిచ్లూనీ అరెస్టు చేయవలసిందిగా ఉత్తర్వు లిచ్చింది. దీని ఫలితంగా అమృతసర్‌లో జనం రెచ్చిపోయారు; అక్కడ పోలీసులు కాల్పులు జరపడం వల్ల కొంతమంది అధికారులు మరణించారు, ఇద్దరు బ్రిటిష్ మహిళలు తీవ్రంగా గాయ పడ్డారు. మరుసటి రోజున ప్రజలు, ఆజ్ఞలను ధిక్కరించి జలియన్‌వాలాబాగ్‌లో సమా వేశ మయినపుడు జనరల్ డయర్ మొత్తం పంజాబ్‌ని హడల గొట్టాలనుకున్నారు. బయటికి వెళ్ళడానికి వీలులేని ఒక పార్కులో సమావేశమయిన నిరాయుధులయిన గుంపుమీద, ముందు హెచ్చరిక లేకుండా కాల్పులు జరపడానికి తను సైనికులకు ఉత్తర్వు లిచ్చాడు. మందుగుండు సామగ్రి అంతా అయిపోయిన తర్వాత, డయర్ ఉపసంహ రించుకునే టప్పటికి, వేయిమంది మరణించారు ; అనేక వేలమంది గాయపడ్డారు. అమృత్‌సర్ హత్యను, మాంటేగూ "నిరోధక హత్య" అని అన్నారు ; దీనితర్వాత గౌరవహీనమయిన ఉత్తర్వులు అనేకం జారీచేయడం జరిగింది. అనేక వారాలు కర్ఫ్యూ విధించారు. ప్రజలను బహిరంగంగా బెత్తాలతో కొట్టారు ; ఇద్దరు బ్రిటిష్ మహిళలపై అత్యా చారాలు జరిగినచోట ప్రజలను మోకాళ్ళమీద నడిపించారు. విద్యార్థులు తమ తరగతులకు వెళ్లడానికి రోజూ పదహారుమైళ్ళు నడవవలసి వచ్చేది. అరెస్టయిన వ్యక్తులను బోనుల్లో వుంచేవారు. డబ్బు చెల్లించే వరకూ నిర్బంధంలో వుంచేవారు ; ఆస్తిని స్వాధీనం చేసుకోవడమో, నాశనం చేయడమో జరిగేది ; ఐక్యత పరిణామాల గురించి తెలియ జెయ్యడానికి హిందువులు - ముస్లింలను జంటలు జంటలుగా చేతులకు బేడీలు వేసేవారు. సైనిక శాసనాన్ని ప్రకటించారు. రవీంద్రనాథ్ ఠాగూర్ ఆక్షేపణ సూచనగా తమ నైట్ హుడ్‌ని విసర్జిస్తూ యిలా ప్రకటించారు.

> "గౌరవ పతకాలు మా సిగ్గును యింకా మెరిసేటట్టు చేస్తున్నాయి. మాకు జరుగు తున్న తలవంపుదృష్ట్యా అసంగతంగా వున్నాయి ; నేను, నాకు సంబంధించి నంత వరకూ ప్రత్యేక గౌరవాలన్నింటినీ విసర్జించి మా దేశీయులకు బాసటగా నిలబడాలని భావిస్తున్నాను. ఎందువల్లనంటే మా దేశీయులు అనామకులని వారిని అమానుషంగా న్యూనత పరుస్తున్నారు."

పంజాబ్ విషాదగాథ గాంధీజీని భారత రాజకీయాలలో అగ్రగామి చేసింది. లార్డు హంటర్ అధ్యక్షతక్రింద ప్రభుత్వం నియమించిన అధికార దరియాప్తు సంఘాన్ని కాంగ్రెసు బహిష్కరించింది. అదివరకటి మితవాద జాతీయులు అనేకమందికూడా యిప్పుడు గాంధీజీ బలగంతో చేరిపోయారు. 1919 లో జరిగిన అమృత్‌సర్ కాంగ్రెసులో దేశప్రజల భావాలు ప్రతిబింబించాయి. మాంట్‌ఫోర్డు సంస్కరణలను తిరస్కరించాలని సి. ఆర్. దాస్ తెలియజేసారు. అయితే తిలక్ యిచ్చిపుచ్చుకునే సహకారం కావాలని అన్నారు. చివరకు రాజీకుదిరింది; అందువల్ల పూర్తి బాధ్యతాయుతమైన ప్రభుత్వాన్ని త్వరలో ఏర్పాటుచేయడానికి సంస్కరణలకోసం కృషిచేయడానికి కాంగ్రెసు అంగీకరించింది. అయితే సి. ఆర్. దాస్ తమ వైఖరిని స్పష్టం చేశారు. "మా రాజకీయ లక్ష్యాన్ని సాధించడానికి తోడ్పడేట్టయితే, ప్రతిబంధకానికి నేను వ్యతిరేకం కాదు" అని ఆయన పేర్కొన్నారు.

గాంధీజీ క్రమేపీ కిలాఫత్ ఉద్యమంలోకి ప్రవేశించారు. ఈ వేదికనుంచే ఆయన ప్రభుత్వంతో సహకరించబోమని ఆతర్వాత ప్రకటించారు. దక్షిణాఫ్రికాలో వున్నప్పటి నుంచీ హిందూ - ముస్లిం ఐక్యతపట్ల ఆయనకు శ్రద్ధవుంది. లక్నో ఒడంబడిక ఐక్యతకు సరియైన ప్రాతిపదిక కాదని ఆయన తెలియజేశారు. అలీ సోదరులతో ఆయన సంబంధం పెట్టుకున్నారు. కిలాఫాత్ కావాలని వీరు కోరడం న్యాయమేనని ఆయన భావించారు. వీరిని అరెస్టు చేసినందుకు ఆక్షేపణ తెల్పారు. టర్కీ సామ్రాజ్యాన్ని విడగొట్టడంవల్ల వర్సెయిల్స్ ఒప్పందం ఈ ఉద్యమం తీవ్రతను ఎక్కువ చేసింది. మిగతాప్రాంతాలలో వాస్తవ అధికారాన్ని సుల్తాన్‌కు లేకుండా చేశారు. బ్రిటన్ తన టర్కిష్ విధానాన్ని మార్చుకునేటట్లు వొత్తిడి తేవాలని భారత ముస్లింలు నిర్ణయించారు. మౌలానా ఆజాద్, హకీం అజ్‌మల్‌ఖాన్, హజరత్ మొహానీ నాయకత్వాన కిలాఫత్ సంఘమొకటి ఏర్పాటు చేశారు. గాంధీజీ దీనికి తోడ్పడటానికి అంగీకరించారు. ఆయనకు కిలాఫత్ ఉద్యమము అంటే "హిందువులనూ, మహమ్మదీయులనూ సమైక్యం చేయడానికి ఒక అవకాశమనీ మరో వందఏండ్ల వరకూ ఇటువంటి అవకాశం కలగకపోవచ్చుననీ భావించారు. హృదయ సమైక్యతే యిది, అని గాంధీజీ అతిసులభమైనదిగా భావించారు. ఆయన "యంగ్ ఇండియాలో" వ్రాస్తూ, "మహమ్మదీయుడు నా సోదరుడని అనుకున్నట్టయితే, అతడు కష్టాల్లో వున్నపుడు సాధ్యమైన సహాయాన్ని చేయడం నావిధి, అయితే అతడికష్టం న్యాయమైనదిగా వుండాలి" అని.

1919 నవంబరులో గాంధీజీని కిలాఫత్ మహాసభ అధ్యక్షులుగా ఎన్నుకున్నారు. మిత్రదేశాల విజయ ఉత్సవాలలో పాల్గొనరాదని ఈ మహాసభ ముస్లింలను ఆదేశించింది.

టర్కీకి న్యాయం చేకూర్చకపోయినట్టయితే బ్రిటిష్ వారిని బహిష్కరిస్తామనీ, వారితో సహకరించబోమనీ బెదిరించింది. కిలాఫత్ ఉద్యమాన్నీ, హిందూ ముస్లిం ఐక్యతనూ బలపరుస్తూ ఆజాద్, అక్రమ్ఖాన్, ఫజుల్ హక్, బెంగాల్‌లో పర్యటించారు. దేవ్‌బంద్ స్కూల్ మౌలానాలు, లక్నో ఉలేమాలు, ఉత్తర భారతావనిలో యిదే మోస్తరుగా పర్యటించారు. అమృత్‌సర్ కాంగ్రెసు, ముస్లింలీగ్ ఈ ఉద్యమానికి పూర్తి మద్దతుయిచ్చాయి. 1920 ప్రారంభంలో హిందూ-ముస్లిం సంయుక్త ప్రతినిధివర్గం వైస్‌రాయ్‌ని కలుసుకుంది. ఆశలు వదులుకోవలసిందిగా ఆయన నిర్మొహమాటంగా చెప్పి వేశారు. ఆతర్వాత ఒక ప్రతినిధివర్గం ఇంగ్లండుకు వెళ్ళింది. టర్కీని, పరాజయం పొందిన క్రైస్తవ దేశాలకన్నా భిన్నంగా చూడజాలమని ప్రధానమంత్రి లాయడ్ జార్జి కచ్చితంగా చెప్పివేశారు. సెవ్‌రీస్ ఒప్పందం షరతులు మే నెల మధ్యలో వెల్లడయ్యాయి. టర్కీకి, కాన్‌స్టాంటినోపిల్ దక్కింది; అయితే పరిమాణంలోనూ, జనాభాలోనూ బాగా తగ్గిపోయింది. కిలాఫత్ సమస్య మీద సత్యాగ్రహ వుద్యమం ప్రారంభించాలని గాంధీజీ నిర్ణయించారు. ఈ సహాయ నిరాకరణ ఉద్యమాన్ని ఆగష్టు ఒకటో తేదీన ప్రారంభించారు.

ఇది జయప్రదం కావాలి అంటే, కాంగ్రెసు అండ అత్యవసరం. కాంగ్రెసుకు నచ్చ చెప్పడానికి గాంధీజీ ఎంతో ప్రయత్నించారు. గాంధీజీ విజ్ఞప్తి మితవాదులనూ అతివాదులనూ ఆకర్షించింది; ఎందువల్లనంటే, మితవాదుల లక్ష్యమయిన సామ్రాజ్యం లోపల స్వరాజ్యాన్నీ, అతివాదుల లక్ష్యమయిన సహాయ నిరాకరణనూ, తెలివిగా సమ్మేళనం చేశారు. విప్లవ దౌర్జన్యవాదులు కూడా ఆయనకు ఒక అవకాశం యివ్వాలని భావించారు. గుజరాత్, బీహార్ కాంగ్రెసు సంఘాలు, దీనిని యింతకుముందే ఆమోదించాయి.

1920 ఆగష్టులో తిలక్ మరణంతో రంగంలో అతిముఖ్య విమర్శకుడు తొలగిపోయాడు. సి. ఆర్. దాస్‌కు కొన్ని స్వంత భావాలున్నాయి; అయినప్పటికీ త్యాగమూ, తెగింపు ప్రదర్శించాలన్న గాంధీజీ విజ్ఞప్తి ఈయన హృదయానికి హత్తుకుంది. 1920 సెప్టెంబరు 4 వ తేదీనుంచి 9 వ తేదీ వరకు జరిగిన ప్రత్యేక కలకత్తా కాంగ్రెసు మంచి చెడుల గురించి క్షుణ్ణంగా చర్చించింది. శాసన సమితులను బహిష్కరించాలని గాంధీజీ ప్రతిపాదించినపుడు, దాస్, ఆయన్ను సవాలు చేశాడు. "ఈ సంస్కరణలు బ్రిటిష్ ప్రభుత్వ బహుమతులు కావు. సంస్కరణలు బ్రిటిష్ ప్రభుత్వం చేతులనుంచి బలవంతంగా తీసుకున్నవి. స్వరాజ్య సాధనకు సమితులు ఒక సాధనం కావాలని భావిస్తున్నాను. మీ చేతుల్లో వున్న ఈ ఆయుధాన్ని సంపూర్ణ స్వరాజ్య సాధనకు వుపయోగించాలని కోరుతున్నాను". తోడ్పడటానికి కాక, ఇబ్బంది కలిగించడానికి సమితిలో చేరుతానని ఆయన చెప్పారు. ఇది లోపలినుంచే ఒక విధమయిన సహాయ నిరాకరణ. పాతకాలల




1921 లో కలకత్తా వీధులలో ఎన్.సి.వో. వలంటీర్ల కవాతు



బొంబాయిలో విదేశ వస్త్రాలను తగులబెట్టటం



మహమ్మదలీ



పి. విజయరాఘవాచారియర్



ఎం.ఎ. అన్‌సారి



సరోజిని నాయుడు



సి. ఆర్. దాస్



మోతీలాల్ నెహ్రూ



మహమ్మదలీజిన్నా



మదన్ మోహన్ మాలవ్యా

బహిష్కరణకు లజపతిరాయ్, వ్యతిరేకం. బిపిన్ చంద్రపాల్, జాగ్రత్తగా ఆయత్తం కావాలని సలహా యిచ్చారు. అయితే మోతీలాల్ నెహ్రూ గాంధీజీని బలపరిచారు. మరో రాజీ అమలు జరిగింది. పాఠశాలలనూ, కోర్టులనూ బహిష్కరించడం క్రమేపీ అమలు జరగాలి. ఎన్నికల అభ్యర్థులు ఉపసంహరించుకోవాలి; ఓటర్లు ఓటు చేయడానికి నిరాకరించాలి. స్వరాజ్య సాధనే వీటి లక్ష్యం. తుది నిర్ణయాన్ని నాగపూర్ కాంగ్రెసు తీసుకోవాలి.

కొత్త సంస్కరణల క్రింద మొట్టమొదటి ఎన్నికలకు ప్రచారం చేయకుండా కాంగ్రెసును ఈ విధంగా అరికట్టడం జరిగింది. నాగపూర్ సమావేశంలో యిది ఒక, జీవంలేని సమస్య అని, దాస్, భావించారు. జలియన్‌వాలాబాగ్ సంఘటన సమయంలో పంజాబ్ గవర్నర్‌గా వుండిన ఓడయర్‌ను నిర్దోషియని విడిచిపెట్టడంవల్లా, పూర్తి బాధ్యతాయుతమైన ప్రభుత్వం కావాలన్న కోరికను మన్నించడానికి బ్రిటిష్‌వారు నిరాకరించడం వల్లా, గాంధీజీ కేసు మరింత పటిష్ఠమయింది. బెంగాలీ బృందం కూడా తమను బలపరచదని, దాస్, గ్రహించాడు. మహమ్మదలీ ఒక రాజీ కుదిర్చాడు. దాస్, సహాయ నిరాకరణ తీర్మానాన్ని ప్రతిపాదించారు; ఒకప్రక్క ప్రభుత్వంతో స్వచ్ఛందంగా సంబంధం పెట్టుకోడాన్ని పూర్తిగా త్యజించడం మొదలు మరోప్రక్క పన్నులు చెల్లించడానికి నిరాకరించడం వరకూ మొత్తం కార్యక్రమాన్ని కాంగ్రెసు నిర్ణయించిన సమయంలో అమలు జరపాలని ఈ తీర్మానంలో పేర్కొన్నారు. సమితులనుంచి రాజీనామా యివ్వడం, న్యాయవాద వృత్తిని త్యజించడం, విద్యను జాతీయం చేయడం, ఆర్థిక బహిష్కరణ, జాతీయ సేవలకు కార్యకర్తలను సన్నద్ధం చేయడం, జాతీయ నిధి ఒకటి యేర్పాటు చేయడం, హిందూ-ముస్లిమ్ సమైక్యత, ఈ కార్యక్రమంలో చర్యలుగా సూచించారు. మాలవ్యా, జిన్నా, స్వరాజ్య లక్ష్యాన్ని ప్రతిఘటించారు. ఎందువల్లనంటే సామ్రాజ్యంతో ఏదైనా సంబంధం వుంచుకునేది లేనిది స్పష్టం చేయలేదు. అయితే ఆ తర్వాతి సంవత్సరంలో వీరత్వ చర్య తీసుకుంటామన్న గాంధీజీ వాగ్దానం నెగ్గింది. రెండు ఓట్లు మాత్రమే ఆయనకు వ్యతిరేకంగా పడ్డాయి.

నాగపూర్ సమావేశం, కాంగ్రెసు సంస్థకు ఒక నూతన నియమావళిని యివ్వడం ద్వారా దాని స్వరూపాన్నే మార్చివేసింది. కాంగ్రెసు, సంఘటిత, క్రియాత్మకమైన రాజకీయ వ్యవస్థగా మారిపోయింది; కార్యవర్గంలో 15 మంది, అఖిల భారత సంఘంలో 350 మంది వుండేవారు, రాష్ట్ర సంఘాలు ఏర్పడ్డాయి, వీటి శాఖలు జిల్లాలు, పట్టణాలు, తాలూకాలు, గ్రామాలలో ఏర్పడ్డాయి. కార్యవర్గం ఏక సంస్థగా, సంవత్సరం పొడవునా పనిచేసేది. దీని నిర్ణయాలు సామాన్యంగా ఏకగ్రీవంగా జరిగేవి. అతిముఖ్యమైన విష

యాల గురించి ఎ.ఐ.సి.సి. చర్చ జరిపేది; కార్యవర్గం నిర్ణయాలను యిది సమీక్షించ వచ్చు; దీనికి కార్యవర్గ నిర్ణయాలను మార్చే అధికారాలుండేవి. రాష్ట్ర సంఘాలను భాష ప్రాతిపదిక మీద పునర్వ్యవస్థీకరించారు; ప్రతి ప్రాంతానికి, అంటే ప్రదేశ్‌కూ ఒకటి చొప్పున వుండేది. ప్రతి గ్రామానికి ఐదుగురు లేక అంతకన్న ఎక్కువమంది కాంగ్రెసు సభ్యులు గల యూనిట్ వుండేది. వీటిపైన సర్కిల్ యూనిట్‌లు తాలూకా యూనిట్‌లు, జిల్లా యూనిట్‌లు, వుండేవి. కాంగ్రెసు వార్షిక సమావేశానికి ప్రతినిధు లను, ప్రతి 50 వేల మందికి ఒక సభ్యుని చొప్పున ఎన్నుకునేవారు. దీనివల్ల కాంగ్రెసు ప్రాతినిధ్య వ్యవస్థ అయింది. సంవత్సరానికి 4 అణాలు మాత్రమే చందా కాబట్టి దీని సభ్యుల సంఖ్య విపరీతంగా పెరిగిపోయింది. ఇదికూడా నిర్బంధం కాదు. కాంగ్రెసు లక్ష్యాన్ని ఆమోదించి, దాని సూత్రాలకు కట్టుబడి వున్నట్టయితే, సభ్యత్వానికి అర్హత పొందవచ్చు. దీనివల్ల పార్టీ, అనేక కోట్ల మంది పేద భారతీయులకు అందుబాటులోకి వచ్చింది. సభ్యత్వ వయోపరిమితిని 18 సంవత్సరాలకు తగ్గించడంతో, దీనిలో యువకుల సంఖ్య కూడా ఎక్కువయింది. కాంగ్రెసులో చేరిన ముస్లింలు, మహిళల సంఖ్య బాగా ఎక్కువయింది. 1923 నాటికి గ్రామాలలో సభ్యుల సంఖ్య పట్టణ ప్రాంతాల సంఖ్యకు రెట్టింపు అయింది. పార్టీ సాంఘిక స్వరూపంలో మాత్రమే కాక, దాని దృక్పథం, విధానాలలో పూర్తి మార్పు వచ్చింది. సభ్యత్వం యిహ ఎంతమాత్రము స్తబ్దంగా వుండే చర్యగా కాక చైతన్యవంతమైన బాధ్యతగల చర్యవంటి దయింది; త్యాగాలు చేయాలని కోరడం జరిగింది. రాజకీయ సాంఘీకీకరణకు కాంగ్రెసు, ఒక సాధనమయింది. నిర్మాణాత్మకమైన ఖాదీ, అస్పృశ్యత నివారణ,మద్యపాన నిషేధం, జాతీయ విద్య వంటి కృషికి పూనుకుంది. హిందీ, యితర భారతీయ భాషలను ఉపయోగించడం వల్ల విద్యా వంతులకూ, సామాన్య ప్రజానీకానికీ మధ్య అడ్డంకి తొలగిపోయింది. తిలక్ స్వరాజ్ నిధి ఒకటి ప్రారంభించారు. ఆరునెలల్లోగా కోటి రూపాయలకు పైగా వసూలయ్యాయి. దీనివల్ల సంస్థ ఆర్థికంగా పటిష్ఠమయింది. ఈ విధంగా పామరజనం అండతో గాంధీజీ నాయకత్వం క్రింద సామ్రాజ్యవాదులతో పోరాటానికి నిశ్చయించిన లౌకిక పార్టీవ్యవస్థ ఒక కొత్త ఆయుధంగా తయారయింది.

కాంగ్రెసు అభ్యర్థులందరూ ఎన్నికలనుంచి ఉపసంహరించుకోవడంవల్ల కోర్టులనూ, విద్యాసంస్థలనూ, విదేశ వస్త్ర, మద్యం దుకాణాలనూ బహిష్కరించారు. "విద్య, ఆగవచ్చు అయితే స్వరాజ్ ఆగజాలదు" అన్నారుదాస్. అనేకమంది విద్యార్థులు పాఠశాలలు, కళా శాలలు వదిలిపెట్టారు. ఉపాధ్యాయులు అనేకమంది రాజీనామా యిచ్చారు. జమియ మిలియ ఇస్లామియ. కాశీ, బీహార్, గుజరాత్ విద్యాపీఠాల వంటి జాతీయ కళాశాలలు ఏర్పాట

య్యాయి. ఆచార్య నరేంద్ర దేవ్, రాజేంద్ర ప్రసాద్, డాక్టర్ జాకిర్ హుస్సేన్, సుభాస్ చంద్రబోస్ ఈ జాతీయ విశ్వవిద్యాలయాలలో అధ్యాపకులుగా పని చేశారు. 1921 సెప్టెంబరు 30 తేదీకల్లా విదేశవస్త్ర పూర్తి బహిష్కరణను సాధించవలసివుంది. శతాబ్దం మొదటి దశాబ్దంలో స్వదేశీ ఉద్యమం రోజుల్లో మోస్తరుగా, పికెటింగ్, బహిరంగంగా వస్త్రాలను తగులబెట్టడం ద్వారా దీనిని సాధించాలి. విద్యార్థులను జాతీయ వలంటీర్లుగా తయారు చేశారు. జాతీయ భావాన్ని పటిష్టం చేయడానికి వీరు ప్రచారం జరిపారు, విరాళాలను వసూలు చేశారు, సహకరించేవారికి వ్యతిరేకంగా ప్రదర్శనలు జరిపారు. వివాదాల తీర్పు న్యాయస్థానాలను నడిపారు, విదేశవస్తువులను అమ్మే దుకాణాల ముందు పికెటింగ్ జరిపారు.

దేశమంతటా, ఇంతకి ముందెన్నడు లేని ఉత్సాహం వెల్లివిరిసింది; పై తరగతుల వారు, క్రింది తరగతులవారు, పురుషులు, మహిళలు, హిందూవులు, ముస్లింలు, సనాతనులు, అధునాతనులు, రేడికల్స్ అందరూ పాల్గొన్నారు. మహిళలు ఘోషా వదలి పెట్టి అనేకమంది సమరంలో చేరారు; తమ ఆభరణాలను తిలక్ నిధికి ఇచ్చారు; సంతోషంగా జైలుకు వెళ్ళారు.

ముస్లింలు సైన్యంలో చేరకూడదని కిలాఫత్ సంఘం ఆదేశించింది. ఇందుకోసం అలీ సోదరులను అరెస్టు చేశారు. భారతీయులెవ్వరూ ప్రభుత్వంలో ఏపనుల్లోనూ చేరకూడదని కాంగ్రెసు అందరినీ కోరింది. ఉద్యమం తీవ్రత ఎక్కువ కావడంతో ఉపాధి లేని కార్మికులు, ఫ్యాక్టరీ కార్మికులు, పట్టణంలోని పేదలు, ఉద్యమంలో చేరారు. పారిశ్రామిక కేంద్రాలలో మాత్రమే కాక, అస్సాంలోని తేయాకు తోటల్లో కూడా పెద్ద సమ్మెలు జరిగాయి.

గ్రామసీమలు, నూతన ఉత్సాహ ఉద్వేగాలతో ఉలికిపోయాయి. పన్నులు చెల్లించడానికి నిరాకరించాలన్న కాంగ్రెసు ఆదేశం పీడిత కర్షకుల హృదయాలను చూరగొన్నది. మేదినీపూరు కర్షకులు యూనియన్ బోర్డు పన్నులను చెల్లించడానికి నిరాకరించారు; బెంగాల్‌లో మొట్టమొదటి సారిగా కర్షకుల యూనియన్లు ప్రారంభమయ్యాయి. గుంటూరుకుచెందిన దుగ్గిరాల గోపాలకృష్ణయ్య నాయకత్వాన జరిగిన అలజడి, అందరికి కనువిప్పు కలిగించింది. మునిసిపల్ పన్నులను చెల్లించాలన్న ఉత్తర్వులను ధిక్కరించి చీరాల ప్రజలందరూ నూతన పట్టణాన్ని నిర్మించుకోవడానికి తరలి వెళ్ళారు. బెజవాడలో ప్రత్యామ్నాయ సమితి నొకదాన్ని ఏర్పాటు చేశారు. పెద్ద నాదిపాడు గ్రామీణ అధికారులందరూ రాజీనామా యిచ్చారు; 95 శాతం మంది పన్నులు చెల్లించడానికి నిరాకరించారు. గుంటూరు, కృష్ణా, గోదావరి జిల్లాలలో పన్నులు చెల్లించకూడదని నిష్ఠ

యించారు. పల్నాడులో పచ్చిక బీళ్ళ రుసుము చెల్లించడానికి నిరాకరించారు. ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు సంఘం ఈ చర్యల నన్నింటినీ బలపరిచింది. అహమ్మదాబాదు కాంగ్రెసు సంఘం, ఖాదీ, అహింస, హిందూ - ముస్లిం ఐక్యతవంటి షరతులను పాటించినట్లయితే ఉద్యమాన్ని కొనసాగించడానికి అధికార మిచ్చింది. రైతుల సంత కాలు సేకరించాలన్న గాంధీజీ షరతును గుంటూరు పాటించింది. ఉత్తర ప్రదేశ్‌లో రాయ్‌బెరిలీ, ఫయిజాబాద్ కౌలుదార్లు చట్ట వ్యతిరేకమయిన సెస్సు చెల్లించడానికి నిరాక రించారు. వీరికి, జమీందార్లకూ, పోలీసులకూ మధ్య ఘర్షణ జరిగింది. న్యాయస్థానాలను నెలకొల్పి, అరెస్టయిన వారిని విడిపించడానికి ప్రయత్నాలు జరిగాయి. సరిగ్గా యిదే సమయంలో జాతీయ రాజకీయాలలో ప్రవేశించిన జవహర్‌లాల్ నెహ్రూపై ఈ సంఘ టనలు ఎంతో ప్రభావాన్ని కలిగించాయి. కొన్ని ముఖ్య బొగ్గు గనులలో సమ్మెలు జరిగాయి. బీహార్‌లో చోటానాగపూర్ ఆదివాసుల తానాభగత్ ఉద్యమం, చౌకీదారీ పన్నులనూ అద్దెలనూ చెల్లించమని బెదిరించింది. ఒరిస్సాలో కనికరాజ్ కౌలుదార్లు అబ్‌వాబ్‌లు చెల్లించడానికి నిరాకరించారు. పంజాబ్‌లో అకాలీ ఉద్యమం గురుద్వారాల నిర్వహణలో లంచగొండితనాన్ని నిర్మూలించడానికి ప్రయత్నించింది. పవిత్ర దేవాల యాల కంట్రోలు సాధించడం, రాజకీయ స్వాతంత్ర్య సాధనలో మొదటి అడుగుగా భావించారు. మలబార్‌లో మాప్పిల్లాలు, స్థానిక జమీందార్లకూ, వడ్డీ వ్యాపారులకూ వ్యతిరేకంగా ఒక ఉద్యమం ప్రారంభించారు. అయితే దురదృష్ట వశాత్తు దీనికి మత స్వరూప మివ్వడం జరిగింది. భారతదేశపు గ్రామసీమల్లో అపారమైన నిగూఢ శక్తి వుందనీ దీనిని సరిగా సద్వినియోగానికి తెచ్చినట్లయితే శక్తివంతమైన రాజ్‌ని పడ గొట్టవచ్చుననీ, నిజానికి వీరు, హఠాత్తుగా గ్రహించారు. బ్రిటిష్ వస్త్రాన్ని కొనడం పడిపోవడం వల్లగానీ, మద్యం అమ్మకాలు పడిపోవడంవల్లగానీ ప్రభుత్వం ఎంత మాత్రమూ అదుర్దా చెందలేదు. కాని, భారతదేశం అన్ని ప్రాంతాలలోనూ సామాన్య ప్రజానీకం చైతన్యవంతం కావడం వారికి నిజంగా అదుర్దా కలిగించింది.

ప్రిన్సు అఫ్‌వేల్సు పర్యటనను బహిష్కరించడంలో, ఈ ఉద్యమం బ్రహ్మాండమైన విజయాన్ని సాధించింది. బొంబాయిలో హర్తాళ్ జరిగింది; సముద్రతీరంలో ఏర్పాటు చేసిన సమావేశంలో గాంధీజీ, విదేశ వస్త్రాలను తగుల బెట్టారు. అయితే గుంపు రెచ్చిపోయి యువరాజుపట్ల విధేయత ప్రదర్శించిన యూరొపియన్లు - పార్శీలమీద దాడి జరిపారు. పోలీసులు కాల్పులు జరిపారు ; కొట్లాటలు జరిగాయి ; వీటిలో 53 మంది మరణించారు. కలకత్తా అంతటా పూర్తి హర్తాళ్ జరిగింది : అయితే పోలీసులకూ, కిలాఫత్ ఉద్యమంవారికీ కొట్లాటలు జరిగాయి.

ప్రభుత్వం కఠినమైన దమన చర్యలు తీసుకోవాలని నిర్ణయించింది. కాంగ్రెసునీ, కిలాఫత్ వాలంటీర్ సంస్థలనూ చట్టవిరుద్ధమైన సంస్థలుగా ప్రకటించారు. బహిరంగ సమావేశాలనూ, ఊరేగింపులనూ నిషేధించారు. వాక్ స్వాతంత్ర్యానికీ, సమావేశ స్వాతంత్ర్యానికీ యిది సవాలు వంటిది ; ఇవి లేకుండా ఏ రాజకీయ ఉద్యమము కొన సాగ జాలదు. దాస్ ఈ సవాలును ఎదుర్కొని, ఉత్తర్వులను ధిక్కరించాలని నిర్ణయించారు. "నా చేతులకు బేడీలు పడినట్టుగా భావిస్తున్నాను ; నా శరీరంమీద ఇనుపగొలుసులు భారంగా వున్నాయి. యావద్ భారతదేశము ఒక పెద్ద జైలువంటిది ; నన్ను జైలులో వుంచినా, వదిలినా ఒకటే : నేను మరణించినా, సజీవంగావున్నా ఫరవాలేదు" అని ఆయన అన్నారు. ఆయన భార్యనూ, కుమారుణ్ణీ అరెస్టుచేసిన తర్వాత వేలాదిమంది వాలంటీర్లుగా చేరడం మొదలుపెట్టారు. కలకత్తా జైళ్ళు కిటకిట లాడిపోయాయి. జైళ్ళు "పవిత్ర యాత్రాస్థలాలుగా మారిపోయాయి." పోలీసులు, వాలంటీర్లమీద యిష్టం వచ్చినట్టు దాడిజరిపి, వారిని కొట్టడం మొదలుపెట్టారు. మూక ఉమ్మడి అరెస్టులకు ఉత్తర్వు లిచ్చారు. ఆతర్వాత కొద్దినెలల్లో దాదాపు 30 వేలమంది జాతీయవాదులను, జైళ్ళలో పెట్టారు. దాస్, స్వయంగా అరెస్టు అయ్యారు; మోతీలాల్ నెహ్రూ, లజ్‌పత్‌రాయ్, గోపబంధుదాస్ జైళ్ళకు వెళ్ళారు.

1921 అంతానికల్లా గాంధీజీ మినహా తతిమ్మా ముఖ్య నాయకులందరూ జైళ్ళకు వెళ్ళారు. ప్రతిరాష్ట్రము కొన్నిషరతులమీద శాసనోల్లంఘన ప్రారంభించడానికి, కార్య వర్గం అనుమతి యిచ్చింది. అయితే మాప్పిళ్లా తిరుగుబాటు, బొంబాయి కొట్లాటలు, గాంధీజీని కలవర పెట్టాయి. "త్వరగా అయినా మెల్లిగా" ముందుకు వెళ్ళాలని ఆయన భావించారు. ఉద్యమాన్ని నగరాలనుంచి గ్రామాలకు మార్చాలని ఆయన నిర్ణయించారు. నగరాలలో అహింస,విఫలమయింది. అహమ్మదాబాదు కాంగ్రెసు, వ్యక్తిగత, లేక మూక ఉమ్మడి శాసనోల్లంఘనకు అనుమతి యిచ్చింది. గాంధీజీ తమ ప్రఖ్యాత అంతిమ తాఖీదును, వైస్‌రాయ్‌కి 1922 ఫిబ్రవరి ఒకటో తేదీన విడుదల చేశారు. "ప్రాథమిక హక్కులయిన వాక్‌స్వాతంత్ర్యము, సమావేశస్వేచ్ఛ, పత్రికా స్వాతంత్ర్యంతో సహా తమ కోర్కెలు అమలు జరిగేటట్టు చేయడానికి కొన్ని అహింసా పద్ధతులు అవలంబించడం మినహా దేశానికి యిప్పుడు గత్యంతరం లేదు" అని పేర్కొన్నారు. దీనిని గాంధీజీ గుజరాత్ లోని ఒక తాలూకా అయిన బార్డోలీలో ప్రయోగించ తలపెట్టారు.

ఇది ప్రారంభంకాక పూర్వమే విఫలమయింది. బార్డోలీలో మూక ఉమ్మడిగా శాసనోల్లంఘన ప్రారంభంకాక పూర్వమే ఉత్తర ప్రదేష్‌లో చేరీచేడాలో మూక దౌర్జన్యం జరిగింది. పోలీసులు బుద్ధిపూర్వకంగా జరిపిన కాల్పులకు సమాధానంగా,

కొంతమంది కర్షకులు ఒక పోలీసు ఠాణాకు నిప్పంటించారు ; ఇరవై యిద్దరు పోలీసులు మరణించారు. కార్యవర్గాన్ని జరూరుగా బార్డోలికి పిలిపించారు; గాంధీజీ పూనికమీద వీరు శాసనోల్లంఘనను విరమించారు ; నిర్మాణాత్మక కార్యక్రమానికి పూనుకున్నారు

బార్డోలి నిర్ణయం అనేకమంది జాతీయ నాయకులకు విభ్రాంతి కలిగించింది. సుభాష్ దీనిని "జాతీయ అవాంతరమని" వర్ణించారు. జవహర్‌లాల్ నెహ్రూ తమ ఆత్మకథలో ఈ నిర్ణయం పట్ల "తమ ఆశ్చర్యాన్ని-దిగ్భ్రాంతిని" వ్యక్తపరిచాడు. ఎమ్. ఎన్. రాయ్, పామరజనం కన్నా, నాయకత్వం బలహీనమయినట్టుగా భావించారు. పామరజనం రాజకీయ చొరవను అణచివేశారనీ, వారిని కఠినమైన పైతరగతి అదుపుక్రింద వుంచారనీ, గాంధీజీపై ఆరోపించారు.

ఈ నిర్ణయాన్ని తమ అనుచరులకు విశదం చేయడానికి గాంధిజీ ఎంతో సతమతం కావలసివచ్చింది. "దీనిని గనుక తాత్కాలికంగా నిల్పివేయకున్నట్టయితే, మనం అహింసాత్మకమైనది కాక, ముఖ్యంగా హింసాత్మక సమరానికి నాయకత్వం వహించి వుండేవారమని" ఆయన, నెహ్రూకు హామీ యిచ్చారు. "యిలా ఉపసంహరించుకోవడం వల్ల మన వాదానికి అండ ఎక్కువవుతుంది. మనం మళ్ళీ మన స్థానానికి చేరుకున్నాం." తమకు సంబంధించినంతవరకూ, బార్డొలాయికి ముందు మూకదౌర్జన్యాల గురించి కావలసినన్ని ఉదాహరణలను ఆయన చూపించగలడు. వీటిని అనేకసార్లు వాయిదా వేయడం మూలంగా, సత్యాగ్రహం అన్న పవిత్ర సూత్రాన్ని బలిపెట్టి స్వరాజ్యను స్వీకరించ జాలమని ఆయన హెచ్చరించారు. సాయుధులయిన ఒక దేశానికి వ్యతిరేకంగా నిరాయుధ సమరానికి నాయకత్వం వహిస్తున్నామని ఆయనకు తెలుసు; దౌర్జన్యం స్వైర విహారం చేసినట్టయితే ఎవరు విజయం సాధిస్తారో కూడా గాంధీజీకి తెలుసు.

## వెనుకకు వెడుతూవున్న అల

కాలిఫ్‌కి అనుకూలంగా సెవ్‌రీస్ ఒడంబడికను సవరించడం ద్వారా, కాంగ్రెసుకూ, కిలాఫత్ ఉద్యమం వారికీ మధ్య చీలిక తేవడానికి లార్డు రీడింగ్ యింతకాలము ప్రయత్నిస్తూ వచ్చాడు. ఉద్యమం క్షీణించడం ప్రారంభమయ్యే వరకూ గాంధీజీని అరెస్టు చేయడం ఆయన, వాయిదా వేశాడు. ఆయన దృష్టిలో బార్డోలి తీర్మానం, "స్పష్టంగా నిర్వచించిన అర్థమయ్యే లక్ష్యాలేవీ ఈ సంస్థకు లేకుండా చేసింది. ఆ క్షణం నుంచీ, క్షీణించిపోవడమూ, ఛిన్నాభిన్నమయిపోవడమూ ఆరంభించింది, ఉత్సాహం నశించింది, పార్టీలో నిరాశ, నిరుత్సాహము ప్రబలాయి". 1922 మార్చి పదో తేదీన

గాంధీజీని అరెస్టు చేశారు. ప్రభుత్వానికి వ్యతిరేకంగా అవిధేయతను పురికొల్పుతున్నారని ఆయనమీద ఆరోపించారు.

గాంధీజీ విచారణ చారిత్రాత్మక మయింది. తమపై ఆరోపించబడిన నిందలు నిజమని ఒప్పుకుంటూనే ఆయన తమ చర్యలకు చెప్పిన సంజాయిషీయే దీనికి కారణం. తాము చేసిన ప్రకటనలో గాంధీజీ బ్రిటిష్ వారిని విధేయతతో బలపరిచి వారిని ప్రశంశించిన తాను భారతదేశంలో బ్రిటిష్ పాలనకు వ్యతిరేకమయి, సమాధాన పడని విమర్శకుడిగా తయారు కావడానికి కారణాలేమిటో విశదం చేశారు.

"బ్రిటిష్ సంబంధంవల్ల భారతదేశం రాజకీయంగా, ఆర్థికంగా యింతకిముందెన్నడు లేనంత విషాద స్తితికి దిగజారిపోయిందన్న అభిప్రాయానికి రావలసివచ్చింది. ఎటువంటి దురాక్రమణనయినా ప్రతిఘటించే శక్తి నిరాయుధమయిన భారతదేశానికి లేదు. భారత దేశం ఎంత పేద దయిపోయిందంటే క్షామాలను ఎదుర్కొనే శక్తి దానికి లేదు. సగం ఆకలితో అలమటిస్తూ వున్న భారత సామాన్య ప్రజానీకం క్రమేపీ నిర్జీవులవుతున్నారని పట్టణవాసులు తెలుసుకోవడంలేదు. విదేశ స్వప్రయోజనకారుడికి పనిచేయడంవల్ల, తమకు లభించే దళారి డబ్బు మూలంగా నీచమయిన సుఖాలను అనుభవిస్తున్నామనీ, పామర జనాన్ని పీల్చి పిప్పిచేసి దళారి డబ్బునూ, లాభాలనూ గడిస్తున్నామనీ, వారికి తెలియడంలేదు. బ్రిటిష్ భారతదేశంలో చట్టప్రకారం ఏర్పడిన ప్రభుత్వం సామాన్య ప్రజానీకాన్ని పీడించుకు తింటోందని, వారు గ్రహించడంలేదు. అనేక గ్రామాలలో మన కండ్లకు కనుపించే అస్తిపంజరాల ద్వారా తేటతెల్లమవుతున్న ఋజువును, కట్టు కథలద్వారా కానీ, సంఖ్యా వివరాలను తారుమారు చేయడంద్వారా కానీ ఎవరు సమర్థించ జాలరు. నా అభిప్రాయంలో చట్టం అమలును, తెలిసో, తెలియకో, విదేశ స్వప్రయోజన కారుడి కోసం, కలుషితం చేశారు. దేశ పాలనలో, ఇంగ్లీషువారు, వారి భారతీయ సహచరులు, నేను వర్ణించడానికి ప్రయత్నించిన నేరాన్ని చేస్తూవున్నారని తెలుసుకోక పోవడం అత్యంత దురదృష్టకరం. ప్రపంచంలో అత్యుత్తమమయిన పాలనాపద్ధతిని అమలు జరుపుతున్నామనీ, భారతదేశం, మెల్లిగా అయినా, నిలకడగా పురోభివృద్ధి చెందులోందనీ అనేకమంది ఇంగ్లీషువారూ, భారతీయ అధికారులూ హృదయపూర్వకంగా విశ్వసించడం నాకు తృప్తి కలిగిస్తోంది. ఒకప్రక్క పటిష్టవంతమైన దౌర్జన్యం, బల ప్రదర్శన, మరోప్రక్క పగతీర్చుకునే శక్తి లేక ఆత్మరక్షణ శక్తి లేకపోవడం, ప్రజలను నిరుపేదలను చేసి, అనుకరించే అలవాటును వారిలో కలిగించింది"

చెడుతో సహాయనిరాకరణ, మంచితో సహకారం ఒక విధి వంటిదని తాము విశ్వ సిస్తూ వున్నామని, ఆయన విశదం చేశారు. "నాకు, కోర్టువారు పెద్ద శిక్ష విధించవచ్చు.

ఎందువల్లనంటే చట్టప్రకారం ప్రత్యక్ష నేరమనుకునేది, నాకు పౌరుడి విద్యుక్త ధర్మంగా కనుపిస్తోంది" అని ఆయన కోర్టును అడిగారు.

ఈ కేసును విచారించిన న్యాయమూర్తి బ్రూం ఫీల్డు, "కోట్లాది మంది మీ దేశ ప్రజల దృష్టిలో మీరు గొప్ప దేశభక్తులనడం యదార్థం. అయితే న్యాయానికి లోబడిన వ్యక్తి, చట్టాన్ని వ్యతిరేకించామని స్వయంగా ఒప్పుకున్నాడు." అంటూ ఆయన గాంధీజీకి ఆరు సంవత్సరాల జైలు శిక్ష విధించాడు. ఇదే మోస్తరు శిక్షను, 1908 లో లోకమాన్య తిలక్‌కు విధించారు.

నాయకులలో చాలమంది జైలులో వుండటం వల్ల మొట్టమొదటి సహాయనిరాకరణం పామరజనం శాసనోల్లంఘన ప్రారంభం కాక పూర్వమే అంతమయింది. ఆ తర్వాత త్వరలోనే కిలాఫత్ సమస్యకు కూడా ప్రాధాన్యం తగ్గిపోయింది. టర్కీలో 1922 నవంబరులో ముస్తఫా కమల్‌పాషా, అధికారంలోకి వచ్చాడు. సుల్తాన్‌కు ఎటువంటి రాజకీయ అధికారాలు లేకుండా చేశారు. టర్కీని ఆధునికం చేసి లౌకిక రాజ్యంగా చేయ డానికి కమల్‌పాషా, పూనుకున్నాడు. కాలిఫేను, రద్దు చేశారు.

కిలాఫత్ ఉద్యమం గురించీ, జాతీయ ఉద్యమాన్ని దీనితో లంకె పెట్టడానికి గాంధీజీ యితర కాంగ్రెసు నాయకులూ ప్రయత్నించిన విధానం గురించీ, భిన్నాభిప్రాయాలకు తావుంది. రాజకీయ ఉద్యమంలోకి, కొంతకాలం పాటే అయినా మతభావాలను ప్రవేశ పెట్టడం వల్ల, ఇది వెనుకంజవేసే చర్యగా వుందనీ ఇది, హిందూ - ముస్లిం ఐక్యతను సాధించలేదనీ కొంతమంది భావించారు. ఈ కారణాలవల్ల కొంతమంది కిలాఫత్ ఉద్యమం పొరపాటయినదని వాదించారు. మరికొంతమంది, ముస్లింల సమస్యలతో జాతీయ నాయకులకు సంబంధం వుందని ముస్లింలకు నమ్మకం కలిగించడానికి, ఈ ఉద్యమం, జాతీయ నాయకులకు ఒక అవకాశమిచ్చిందని భావించారు. దీనికి అనుగుణంగా ఈ అవకాశాన్ని వినియోగించుకోవడం సరైన చర్య అని వీరు అభిప్రాయపడ్డారు.

మొత్తంమీద చెప్పాలంటే, కిలాఫత్ ఉద్యమం, పట్టణ ముస్లింలను జాతీయ ఉద్యమంలోకి తెచ్చింది. ఆ కాలంలో అన్ని వర్గాల ప్రజలలోనూ ఉత్సాహము, బాధ్యత వ్యక్తం కావడానికి, యీ ఉద్యమమే ముఖ్య కారణం. జాతీయ ఉద్యమం, ప్రజలలో ఒక వర్గానికి మాత్రమే సంబంధించిన సమస్య కోసం పోరాడటంలో సూత్రరీత్యా తప్పేదీ లేదనటం కూడా వాస్తవమే. జాతీయ – కిలాఫత్ ఉద్యమాలు రెండింటిలోనూ సామ్రాజ్యవాద వ్యతిరేక భావం ప్రధానంగా వుంది. యావద్దేశం రాజకీయ, ఆర్థిక ప్రయోజనాలను ప్రోత్సహించడానికి సామ్రాజ్యవాదంతో ఉమ్మడి సమరం జరపాలన్న ఈ ఉమ్మడి భావాన్ని ఉపయోగించినట్లయితే, అందులో పొరపాటు ఏదీ లేదు. టర్కీలో

లౌకిక, సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రభుత్వం అమలులోకి రావడాన్ని జాతీయ నాయకులు హర్షించినప్పటికీ, దేశంలో దమన చర్యలూ, టర్కీలో పరిణామాలు, రెండు ఏకమయి, ఈ తుది లక్ష్యాల సాధనలో ఈ ఉద్యమం విజయవంతం కాకుండా చేశాయి.

మొట్టమొదటి సహాయ నిరాకరణ ఉద్యమం పూర్తిగా విఫలమయిందని భావించడం కూడా పొరపాటు అవుతుంది. ఆర్థిక సమస్యల గురించి పామరజనంలో చైతన్యం కలిగించడానికీ, సామ్రాజ్యవాదమనే రాజకీయ సమస్యను గుర్తించడానికీ, యిది దోహదమయింది. ఆధునిక భావాలు లేని గ్రామీణులు కూడా తమ సమస్యలను తీర్చడానికి స్వరాజ్ ఒక్కటే శరణ్యమని భావించారు. జాతీయ సమరంలో పాల్గొనడంలో కొత్త స్వేచ్ఛ లభించినట్టుగా వీరు భావించారు. రాజ్ అంటే భయం పోయింది. సామాన్య ప్రజలు, పురుషులు, మహిళలు, ధనికులు, పేదలు, ప్రభుత్వాన్ని ధిక్కరించడంలో కష్టాలనూ, శిక్షలనూ భరించే శక్తినీ, సుముఖతనూ ప్రదర్శించారు. అస్పృశ్యత మద్యపానం వంటి సాంఘిక చెడుగులను గుర్తించడం ఎక్కువైంది. ఖాదీకి ప్రాధాన్యమివ్వడం, గ్రామీణ అవసరాల వాస్తవికతను గుర్తించినట్టయింది. విదేశ పరిపాలకులనూ ప్రభుత్వాన్నీ ధిక్కరించే ప్రయత్నంలో గడించిన అనుభవం వల్ల, వీరిలో ఆత్మవిశ్వాసం, ఆత్మగౌరవమన్న కొత్త భావాలు ఉదయించాయి; తిరోముహమన్న తలవంపు తుడిచిపెట్టుకు పోయింది. సత్యాగ్రహ శక్తి దీనిలోనే వుందని గాంధీజీకి తెలుసు. ఇది విఫలమయినా పెద్దగా పోయిందేదీ లేదు; ఎందువల్లనంటే యిది తాత్కాలికమయినది. గాంధీజీ స్వయంగా యిలా విశదం చేశారు. "1920 లో ప్రారంభమయిన పోరాటం, చివరి వరకు జరిగే పోరాటం; అది ఒక నెల పట్టినా, ఒక సంవత్సరం పట్టినా లేక అనేక నెలలు అనేక సంవత్సరాలు పట్టినా సరే".

## స్వరాజ్య వాదులు

ప్రజానీకం శాసనోల్లంఘన ఉద్యమాన్ని విరమించినపుడు, అందరిలోనూ నిరాశ బయలుదేరింది; దీనివల్ల జాతీయవాద సమరంలో ఉత్సాహం హఠాత్తుగా తగ్గిపోయింది. అనేకమంది నిస్పృహ చెందారు; సత్యాగ్రహ సామర్థ్యం గురించి ప్రశ్నలు అడగడం మొదలు పెట్టారు. కోట్లాదిమంది ప్రజలను అహింసాతత్వంలో శిక్షణ యివ్వడం సాధ్యమా? ఇది సాధ్యమైనప్పటికీ, యిది ఎంత కాలం పడుతుంది? అనేకమంది నాయకులు జైలులో వుండటంవల్ల, సభ్యులలో క్రమశిక్షణ క్షీణించింది.

సరిగ్గా ఈ ఘట్టంలో సి. ఆర్. దాస్, మోతిలాల్ నెహ్రూ నూతన మార్గాన్ని చూపించారు. సార్వత్రిక ప్రజా శాసనోల్లంఘన ఉద్యమాన్ని ప్రారంభించటానికి దేశం యింకా సిద్ధంగా లేదని శాసనోల్లంఘన దరియాప్తు సంఘం నివేదించినపుడూ, నిర్మాణాత్మక కార్యక్రమాన్ని కొంతమంది మాత్రమే బలపరిచినపుడు, శాసన సభలను బహిష్కరించడానికి బదులు, సహాయ నిరాకరణను, సమితులలో అమలు జరపాలని, సి. ఆర్. దాస్, మోతిలాల్ నెహ్రూ సూచించారు. సంస్కరణలు అమలు జరగకుండా చూడటానికి సమితులలో ప్రవేశించాలని, వీరు సూచించారు. కొంతమంది కాంగ్రెసు వ్యక్తులు దీనిని బలపరిచారు. అయితే రాజగోపాలాచారి, రాజేంద్రప్రసాద్, వల్లభాయి పటేల్‌వంటి సనాతన గాంధేయులు బహిష్కరణను అమలు జరుపుతూ వుండాలని అన్నారు. ఈ రెండు పక్షాలనూ మార్పులను బలపరిచేవారు, మార్పులను వ్యతిరేకించే వారు, అని పిలిచేవారు. 1922 డిసెంబరులో గయలో జరిగిన కాంగ్రెసులో ఈ సమస్య ప్రస్తావనకు వచ్చింది. అధ్యక్షులు సి. ఆర్. దాస్ సమితుల్లో ప్రవేశించాలని గట్టిగా వాదించినప్పటికీ, రాజాజీ వర్గం నెగ్గింది. సి. ఆర్. దాస్ రాజీనామా యిచ్చారు. మోతిలాల్ నెహ్రూ, విఠల్‌భాయి పటేల్, మాలవ్యా, జయకర్, కాంగ్రెసులోనే కొత్త పార్టీ ఏర్పాటు చేశారు. దీనికి కాంగ్రెసు - కిలాఫత్ స్వరాజ్‌పార్టీ అని పేరు పెట్టారు. దీనికి సి. ఆర్. దాస్ అధ్యక్షులు, మోతిలాల్ నెహ్రూ కార్యదర్శులలో ఒకరు. ఈ కొత్త పార్టీ, అహింస, సహాయ నిరాకరణవంటి ముఖ్య సూత్రాలను దృష్టిలో వుంచుకుంది. రాజ్యాంగాన్ని రూపొందించే హక్కు వుందని గట్టిగా కోరాలని, వీరు తలపెట్టారు. దీనిని నిరాకరించినట్టయితే, "సమానంగా ఎడతెరిపిలేకుండా, పట్టు విడువకుండా వుండే అవరోధ విధానాన్ని అవలంబించాలనీ, శాసన సభలు, సమితులద్వారా ప్రభుత్వం పనిచేయడం అసంభవం చేయాలనీ" వీరు తలపెట్టారు. సి. ఆర్. దాస్ ఆలోచనాశక్తి, ఉద్రేకపూరిత స్వభావము, మోతీలాల్ నెహ్రూ నిష్పక్షపాత దృఢమైన వైఖరికి వ్యతిరేకమయ్యాయి. 1923 నవంబరులో జరిగిన ఎన్నికల్లో వీరు పోటీ చేశారు; సన్నాహాలకు వ్యవధి లేకపోయినప్పటికీ లిబరల్స్‌ను ఓడించారు. మధ్య రాష్ట్రంలో వీరికి అత్యధిక సంఖ్యాక బలం లభించింది. బెంగాల్ సమితిలో అతి పెద్ద పార్టీగానూ, యునైటెడ్ ప్రోవెన్సు - అస్సాంలలో రెండో పెద్ద పార్టీగానూ, గెలిచారు; మిగతా రాష్ట్రాలలో వీరు ఎక్కువ సీట్లు గెల్చుకోలేకపోయారు. కేంద్ర శాసన సభలో నూట ఒక్క సీట్లలోనూ 42 సీట్లు సంపాదించారు.

అయితే మార్పులకు వ్యతిరేకులయిన వారికి, స్వరాజ్యవాదుల వైఖరి సరియైనదన్న నమ్మకం కుదరలేదు. రెండు వర్గాలమధ్యా భీకరమైన రాజకీయ వాగ్వాదం చెలరేగింది.

అయితే రెండు వర్గాలు గాంధీజీకి, కాంగ్రెసుకు విధేయతతో వున్నాయి. రెండు వర్గాలు సామ్రాజ్యవాద వ్యతిరేకం, భావనలోనూ, విశ్వాసంలోనూ వాస్తవమైన జాతీయత భావాన్ని ప్రదర్శించాయి. సమితుల ప్రవేశ సమస్య విషయంలో విభేదాలున్నప్పటికీ పరస్పర గౌరవాన్ని నిలబెట్టుకున్నారు; పార్టీ ఐక్యతకు ముప్పు ఏర్పడలేదు.

కేంద్రశాసన సభలో స్వరాజ్యవాదులు నేషన లిస్టుపార్టీ అనేపేరుతో సంకీర్ణ పార్టీ ఏర్పరి చారు. ; దీనిలో 30 మంది మితవాదులు, ముస్లిం సభ్యులు వుండేవారు. రాష్ట్ర సమితుల్లో వీరు యిదే మోస్తరు ఏర్పాట్లు చేశారు. రాజకీయ ఖైదీలనందరినీ విడుదల చేయాలనీ, దమన చట్టాలను రద్దుచేయాలనీ, రాష్ట్రస్వపరిపాలనా స్వేచ్ఛ యివ్వాలనీ, సమితులకు ప్రభుత్వంమీద పూర్తి అదుపువుండే పథకాన్ని తయారుచేయడానికి రౌండు టేబిల్ మహాసభను తక్షణమే ఏర్పాటు చేయాలనీ వీరుకోరారు. ప్రభుత్వం వీటికి అంగీకరించడానికి నిరాకరించినట్టయితే సప్లయిలకు ఓటుచేయడానికి నిరాకరించడంద్వారా పరిపాలనను స్తంభింప చేస్తామని వీరు బెదిరించారు.

ప్రారంభంలో, మితవాదులు హిందు - ముస్లిం మతవాదులు. కేంద్ర శాసనసభలో, డిటెన్యూలను విడుదల చేయాలనీ రాజకీయ ఖైదీలను విడిచిపెట్టాలనీ, దమన చట్టాలను రద్దుచేయాలనీ శిఫార్సుచేసే తీర్మానాలను ప్రతిపాదించడంలో స్వరాజ్యవాదులతో సహక రించారు. 1925 మార్చిలో, గుజరాత్‌కు చెందిన ప్రముఖ జాతీయవాది విఠల్‌భాయి పటేల్, కేంద్రశాసన సభకు అధ్యక్షుడుగా ఎన్నికయ్యేటట్టు చేయడంలో విజయం సాధించారు.

అయితే స్వరాజ్య వాదులు ఎక్కువ ఏదీ సాధించలేక పోయారు ; 1926 మార్చిలో కేంద్రశాసన సభనుంచి నిష్క్రమించాలని నిశ్చయించారు. "సహకరిస్తామన్న కోరికను తిరస్కరించడం జరిగింది. మా లక్ష్యాన్ని సాధించడానికి మేము యితర మార్గాల గురించి ఆలోచించవలసిన సమయం ఆసన్న మయింది" అని మోతీలాల్ అన్నారు.

బ్రిటన్‌లో, 1923లో అధికారంలోకి వచ్చిన లేబర్‌ప్రభుత్వం, కొద్దికాలం మాత్రమే వుంది; అధికారంలో వున్నప్పుడుకూడా, దానికి, భారతదేశం విషయంలో నిర్దుష్ట మయిన పథకాలేవీలేవు. బాల్డ్‌విన్‌క్రింద కన్‌జర్‌వేటివ్‌లు అధికారానికి వచ్చినపుడు' ఇండియా ఆఫీసులో, లార్డు బిర్కెన్ హెడ్‌ను నియమించారు. మిగతా మంత్రివర్గాల మోస్తరుగానే ఆయనకూడా మాంటేగూ - చెమ్సుఫర్డు సంస్కరణలు, చాలా కోర్కెలను తీర్చాయనీ మరికొంత కాలంవరకూ యింకా కొన్ని సంస్కరణలను మంజూరు చేయడం అవివేక మవుతుందనీ ఆయన భావించారు. డొమీనియన్ ప్రతిపత్తికి భారతదేశం ఎప్పటి కయినా ఎలాగో అర్హత సంపాదిస్తుందన్న విషయాన్ని ఆయన వూహించలేక పోయాడు.

1919 చట్టంలో సూచించిన మోస్తరుగా పదేళ్ళ తర్వాత పరిస్థితిని పునః పరిశీలించాలన్న సూత్రానికి కట్టుబడి వుండాలని ఆయన భావించారు.

ఇలావుండగా, రాజకీయ స్తబ్ధతనూ నిరాశనూ అదనుగా తీసుకొని, దేశంలో మత తత్వం తలఎత్తడం మొదలు పెట్టింది. మతతత్వగాలి స్వరాజ్య వాదులకుకూడా సోకింది. మదన్‌మోహన్ మాలవ్యా, లాలాలజ్‌పత్‌రాయ్, ఎన్. సి. కేల్‌కర్‌లతో సహా కొంత మంది సభ్యులు "రెస్‌పాన్‌సి విస్టులు" అన్న వర్గంగా ఏర్పడి, ప్రభుత్వంతో సహకరిస్తామని ప్రకటించారు. హిందువుల ప్రయోజనాలను ఈవిధంగా కాపాడుతున్నామని, వీరు వాదించారు. మోతీలాల్, దాస్, ముస్లిం అనుకూలురని వీరు ఆరోపించారు. సరిగ్గా ఆసమయంలో 1925 జూన్‌లో సి. ఆర్. దాస్, హఠాత్తుగా మరణించడం విచారకరం.

1917లో ప్రారంభమయిన ముస్లింలీగ్, హిందూమహాసభ, మళ్ళీ తలఎత్తాయి. ఢిల్లీ, లక్నో, అలహాబాద్, జబల్‌పూర్, నాగపూర్‌లలో మత కొట్లాటలు చెలరేగాయి.

ఆరోగ్య కారణాలవల్ల 1924 ఫిబ్రవరి 5వ తేదీన విడుదల చేయబడిన గాంధిజీ, మత కొట్లాటల్లో విదితమయిన అమానుషత్వానికి నిష్కృతిగా ఆ ఏడు సెప్టెంబరులో 21 రోజులు నిరాహార దీక్షకు పూనుకొని మత విద్వేషం పెచ్చుపెరిగిపోకుండా అరికట్టడానికి ప్రయత్నించారు. అయితే దీనివల్ల ప్రయోజనం లేకపోయింది.

గాంధీజీ జరిపిన నిరాహారదీక్ష సమైక్యతా మహాసభకు దారితీసింది. అయితే సామరస్యాన్ని పునస్థాపించలేక పోయింది. ఆతర్వాత రెండేళ్ళలో మతతత్వం యింకా వికృత ఆకారంలో విజృంభించింది. 1925 లో 16 కొట్లాటలకు పైగా జరిగాయి. 1926 లో కలకత్తాలో జరిగిన కొట్లాటలు అతి భీకరమైనవి. కొట్లాటలు యిప్పుడు పెద్దపట్టణాలనుంచి చిన్నపట్టణాలకు విస్తరించాయి. 1922 – 1927 మధ్య 112 మతకొట్లాటలు జరిగినట్టు సైమన్ విచారణాసంఘం పేర్కొంది. వీటిలో దాదాపు 450 మంది మరణించారు; 5 వేలమంది గాయపడ్డారు. 1927 నిరాశాజనకమయిన సంవత్సరం. మత రాజకీయాలకు దూరంగా వుంటామని అన్నిరాజకీయపార్టీల వాగ్దానాలను స్వీకరించడానికి మోతీలాల్, ఆజాద్ చేసిన ప్రయత్నాలు సఫలం కాలేదు. పెచ్చు పెరిగిపోతూవున్న ఈ దౌర్జన్యాలలో గాంధీజీకి నిస్సహాయులమన్న భావం కలిగింది; విషాదంగా ఆయన యిలా వ్రాశారు. "నా ఆశలన్నీ ప్రార్థనలోనే వున్నాయి, ప్రార్థనకు సమాధానంకోసం ఆశపెట్టుకున్నాను"

## కొత్త ఘట్టం ఆవిర్భావం

1928 నాటికి బ్రిటిష్ సామ్రాజ్యవాద వ్యతిరేక సమరం కొత్త ఘట్టంలో ప్రవేశించింది. అంతకిముందు ఐదేండ్లలోనూ బ్రిటిష్ ప్రభుత్వం సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమాన్ని, రాజకీయ దమన విధానాన్ని ఎక్కువచేయడంతో ఎదుర్కొంది. సహాయ నిరాకరణ ఉద్యమాన్ని విరమించాలన్న నిర్ణయం జరిగిన తర్వాత కాంగ్రెసులో స్వరాజ్ పార్టీకి, "నిర్మాణాత్మక కార్యకర్తలకూ" మధ్య ఉద్రిక్తతలు పెరిగాయి. సమితులను బహిష్కరించాలన్న అసలు నిర్ణయంలో మార్పులు చేయాలని నిర్మాణాత్మక కార్యకర్తలు కోరారు. హిందువులలో పవిత్ర ఉద్యమాలు, సంఘటన్, సుద్ది ఉద్యమాలు ముస్లింలలో తంజీమ్, తబ్లిగ్ ఉద్యమాలు, మతమార్పునీ, మళ్ళీ మార్పునూ సూచించాయి. ఇది మత తీవ్రవాదులలో విపరీతంగా ఎక్కువయ్యాయి. మత సామరస్యాన్ని పునస్థాపించడంలో యివి తోడ్పడలేదు. అవిశ్వాసమూ, అపోహ పెరిగాయి.

భారతదేశం భిన్న ప్రాంతాలలో కార్మికవర్గం చీలిపోయింది; అభివృద్ధి చెందిన, వెనుకబడిన వర్గాలుగా విభజింపబడ్డాయి. సోషలిస్టు ఆదర్శాల గురించి యువజనులకు తెలుసు; ఇవి యు. ఎస్. ఎస్. ఆర్, నుంచి వ్యాప్తి చెందుతున్నాయి. 1927 లో యు. ఎస్. ఎస్. ఆర్, పదవ వార్షికోత్సవాన్ని జరుపుకుంది. అంకితమయిన రాజకీయ కార్మికుల చిన్న బృందాలు, కమ్యూనిజంగురించి కొన్ని పట్టణాలలో, ముఖ్యంగా మహారాష్ట్ర, తూర్పు ఉత్తరప్రదేశ్‌లలో పారిశ్రామిక కార్మికులకూ, గ్రామాలలోని కర్షకులకూ, ముఖ్యంగా పంజాబ్ కర్షకులకూ, తమ స్వంత అర్థాన్ని చెప్పడం మొదలు పెట్టారు. మధ్యతరగతి ప్రజలు ఎక్కువగా వున్నారనుకుంటూ వున్న కాంగ్రెసు, (దీనిని వీరు మధ్యతరగతి ప్రజల పురోగామి పార్టీ అని భావించారు) సామాన్య జనానికి సంబంధించిన మానవ, సాంఘిక, ఆర్థిక సమస్యలను, పారిశ్రామిక పని పరిస్థితులు, భూమి పంపిణీ వంటి సమస్యలను తమ స్వంత శాసన సంస్కరణలతో ముడిపెట్టాలి. కాంగ్రెసు కన్నా ఇంకా రాడికల్‌గా వుండే రాజకీయ కార్యక్రమాన్ని ఆమోదించాలని కూడా వీరు భావించారు.

కాగా, రాజకీయ వర్గాలు కొన్నికూడా కార్మిక వర్గంతోనూ, పేద కర్షకులతోనూ సంబంధాలను ఏర్పాటు చేసుకోవడం ప్రారంభించాయి. ఈ బృందాలు ముఖ్యంగా మత ప్రయోజనాలకు ప్రాధాన్యమిచ్చి, ముస్లిం పేద కర్షకులు, పట్టణ కార్మికులు, హిందువులలో తక్కువ కులాల వారిని తమ పలుకుబడిక్రిందికి తెచ్చుకోడానికి ప్రయత్నించారు. వీరు కొన్ని ప్రత్యేక సౌకర్యాలనూ - హక్కులనూ కోరారు. శాసన సమితుల్లో రాజకీయ

ప్రాతినిధ్యం కావాలనీ, విద్యకు సాంఘిక సంక్షేమ సౌకర్యాలకు ప్రత్యేక ప్రవేశ మివ్వాలని కోరారు. ప్రజాస్వామిక సమాజంలో తమను సమానులుగా చూడాలనికూడా వీరు కోరారు. "అంటరాని వారి"లోనూ, యితర దళితవర్గాలలోనూ, తూర్పు బెంగాల్‌లో నామ శూద్రులు అనబడే వ్యవసాయదారుల వర్గాలలోనూ ముఖ్యంగా ఈ పోకడ కనుపించింది. ప్రభుత్వంతో ప్రత్యక్ష సంప్రదింపులు జరిపే పద్ధతులను వీరు అవలంబించారు. ప్రభుత్వం ఎల్లప్పుడూ "విభజించి పాలించు" అన్న విధానాన్ని అవలంబించేది. ఇహ చివరికి మద్రాసులో బ్రాహ్మణేతరుల ప్రయోజనాలకు కాపాడుతున్నామని చెప్పుకుంటున్న జస్టిసు పార్టీ, కాంగ్రెసుని ప్రతిఘటించింది. కాంగ్రెసు, బ్రాహ్మణుల ఆధిపత్యం క్రింద వుందని వీరు వాదిస్తూవుండేవారు.

హిందూమతంలో మతవిద్వేష పోకడలను అరికట్టడాకి అస్పృశ్యతను అంతంచేయాలని గాంధీజీ, ఆయన అనుచరులూ తలపెట్టిరి. ముఖ్యంగా బొంబాయిలో కమ్యూనిష్టు ఉద్యమం చీలిక పోకడలను అంతంచేసి, కార్మికుల నందరినీ ఒకే వర్గంగా తయారు చేయడానికి మతతత్వం నుంచి కార్మికులను వేరుచేయడానికి ప్రయత్నించింది. అయి 1920 సంవత్సరాలలో సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమంలో రాజకీయ విభేదాలు, అనేక వర్గాలలో పెరిగిపోతూవున్న మతభావాలు ప్రభుత్వానికి లోబడివున్న కాంగ్రెసేతర రాజకీయవర్గాలకు పలురకాలుగా ఆశపెట్టడం. — వీటన్నిటివల్ల, సమాజం భిన్న వర్గాలుగా, మతాలుగా విడిపోయే పోకడలకు దారితీసింది; ఈ పోకడలు జాతీయ ఉద్యమాన్ని బలహీనం చేశాయి.

అయితే 1927 నవంబరులో ఐక్యతకు ఒక నూతన ప్రాతిపదిక ఏర్పడింది. లండన్ నుంచి బ్రిటిష్ మంత్రి మండలి, మరికొన్ని సంస్కరణలు అమలు జరపడానికి, పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని విస్తరించడానికి భారతదేశం అర్హత పొందే స్థితిలో వుందా? అన్న విషయాన్ని సమీక్షించడానికి రెండేళ్ళు ముందుగానే రాయల్ కమీషన్‌ను నియమించాలని నిర్ణయించినట్టు ప్రకటించారు. బ్రిటిష్ రాజకీయవేత్త సర్ జాన్ సైమన్ దీనికి అధ్యక్షులు. అందువల్ల దీనిని మామూలుగా సైమన్ కమిషన్ అని పిలిచేవారు. దీని లోని ఏడుగురు యితర సభ్యులలోనూ ఒక్క భారతీయుడు కూడా లేడు. ఈ ప్రతిపాదన వీరిని తృప్తి పరచి, జాతీయ ఉద్యమాన్ని అదుపులో వుంచుతుందన్న సామ్రాజ్యవాదుల ఆశలు, ఈ ప్రకటన జరిగిన వెంటనే వ్యక్తమయిన కోపోద్రేకాలతో, పటాపంచలయ్యాయి. 1927 మద్రాసు సమావేశం కాంగ్రెసు అధ్యక్షులయిన ఎమ్. ఏ. అన్సారి, ఈ కమిషన్ దరియాప్తు పనిని కాంగ్రెసు బహిష్కరించాలని, ప్రకటించారు. "భారతప్రజలు తమ రాజ్యాంగాన్ని, (అన్ని వర్గాలకూ

ప్రమేయం వున్న) రౌండుటేబిల్ మహాసభద్వారా గానీ, పార్లమెంటు మహాసభ ద్వారాగాని నిర్ణయించుకోదానికి అర్హులు. ఈ కమిషన్‌ను నియమించడంద్వారా ఈవాద నకు ఆధారం లేకుండా పోయింది. స్వరాజ్యకు గానీ, కొద్దిపాటి బాధ్యతాయుతమైన ప్రభుత్వానికి గానీ మేము అర్హులమా? అన్న దరియాప్తులో మేము పార్టీలుగా వుండజాలము. ఇహ మూడోకారణం (బహిష్కరణకు) కమిషన్ లో భారతీయులు లేకుండా బుద్ధి పూర్వకంగా చేయడం భారత ఆత్మగౌరవానికి నిస్సందేహమయిన ధిక్కారణగా భావిస్తున్నాము."

కాంగ్రెసు, మొదటి, రెండవ కారణాలకు ప్రాధాన్యమివ్వగా, మూడవ కారణమయిన భారత ప్రజల ఆత్మగౌరవానికి ధిక్కారణ అన్నది, తేజ్ బహదూర్ సప్రూవంటి లిబరల్సుకు బాగా నచ్చింది. ప్రభుత్వంతో ఎక్కువగా సహకరించడం ద్వారా పార్లమెంటరీ వ్యవస్థనూ, సంప్రదాయాన్నీ యీయన అనుసరిస్తూ వుండేవారు. అందువల్ల కాంగ్రెస్, లిబరల్ ఫెడరేషన్, మొదట్లో ముస్లింలీగ్ కూడా, సైమన్ కమిషన్‌ను బహిష్కరించాలని నిర్ణయించాయి. "తిరిగి వెళ్ళిపో, సైమన్" అన్న కాంగ్రెసు నినాదం, ఈ కమిషన్ ఎక్కడికి వెళ్ళినా, ఎదురయింది. జాతీయ సమరంలో ఐక్యతకు యిది ఒక బంధంగా వుపకరించింది; సాంఘిక ఐక్యతకూ, రాజకీయ కార్యక్రమాల సారూప్యతకూ కాకపోయినా, సామ్రాజ్య వాద విధాన ఉమ్మడి ప్రతిఘటనకు ఉపకరించింది. 1928 ఫిబ్రవరి 3 వ తేదీన ఈ కమిషన్ బొంబాయిలో అడుగు పెట్టినపుడు, "తిరిగి వెళ్ళిపో, సైమన్" అన్న నినాదాలు వ్రాసిన పతాకాలతోనూ, నల్ల జెండాలతోనూ బ్రహ్మాండమైన ఊరేగింపు జరిగింది. చేపాటి యిసుక దిన్నెలమీద 50 వేలమంది సాయంత్రం జరిపిన సమావేశంలో, వివిధ పార్టీలు కేబినెట్ నిర్ణయాన్ని ఖండించాయి. కొత్త ఢిల్లీలో, బ్రిటిష్ వారు నామినేటు చేసిన కౌన్సిల్ ఆఫ్‌స్టేట్‌లో అత్యధికులు మాత్రమే, సహకరించడానికి అంగీకరించారు.

ఈ లోగా జాతీయ సమరంలో కార్మికులు పాల్గొనడం, ట్రేడ్ యూనియన్ ఉద్యమాన్ని పటిష్టం చేయడం ద్వారానూ, కార్మికవర్గం పరిస్థితులను మెరుగు పరచడం ద్వారానూ, ఎక్కువయింది. 1927 లో బొంబాయిలో కార్మికులు, కర్షకులు, కనీస భూకమతాల చట్టం ముసాయిదాను అధికారులు తాత్కాలికంగా నిలిపివేసేటట్టు చేయగలిగారు. భాగ్యవంతులయిన కర్షకులు వుంచుకోవలసిన భూమిని ఎక్కువ చేయడానికి అనుమతించడం ద్వారా, స్థానిక పేద కర్షకులు యింకా నిరుపేదలు కావడానికి ఈ చట్టం అనుమతి యిచ్చేది. లండన్‌లో ప్రధాన కార్యాలయమున్న బ్రిటిష్ ప్రయివేటు వర్తకుల సంస్థ — బెంగాల్ నాగపూర్ రైల్వే కంపెనీలో, ఖరగ్‌పూర్ రైలింజన్ల

మరమ్మత్తు నిర్వహణ కార్ఖానాలో (ఇందులో వివిధ కులమత వర్గాలవారు వున్నారు) కార్మికులు, కంపెనీ అధికారులు యిస్తున్న తక్కువ వేతనాలకూ నిరంకుశ చర్యలకూ నిరసనగా సార్వత్రిక సమ్మె జరిపారు. జవహరిలాల్ నెహ్రూ, వృద్ధిలోకి వస్తూవున్న ట్రేడ్ యూనియన్ ఆర్గనైజరు, కార్మిక నాయకులు వి. వి. గిరి వంటి అనేక మంది జాతీయ నాయకులు, ఈ సమ్మెను బలపరిచారు. ఆ సమయంలో వామ పక్ష భారత యువజనుల అండవున్న జవహరిలాల్ నెహ్రూ, ఫాజిజం, సామ్రాజ్యవాద వ్యతిరేక సమరం లీగ్ సభ్యులయ్యారు; ఈ లీగ్‌ని యూరొప్‌లో ఏర్పాటు చేశారు. మాస్కోలో యు. ఎస్. ఎస్. ఆర్ ఏర్పాటు చేసిన మూడవ అంతర్జాతీయ ప్రపంచ కార్మిక సంస్థపట్ల యిది సానుభూతితో వుండేది.

సోషలిస్టు భావాలను బలపరిచే వామపక్ష కార్మికులు, నాయకులు, సైమన్ కమిషన్ బహిష్కరణ పట్ల సానుభూతి చూపారు. 1928 లోనూ, 1929 లోనూ, జరిగిన వొక ఉద్యమం, కార్మికులు పాల్గొనడం వల్ల పటిష్టమయింది. "తిరిగివెళ్ళిపో, సైమన్" అలజడి, విద్యార్థుల సమాఖ్య ఏర్పాటుకు దారితీసింది. ఈ సంఘం మొదట, కళాశాల విద్యార్థులలో జాతీయతా భావాలనూ, సోషలిస్టు చైతన్యాన్నీ కలిగించింది.

నాయకుల స్థాయిలో, బహిష్కరణ, భారతరాజ్యాంగానికి పథకాలను రూపొందించే ప్రత్యామ్నాయ ప్రయత్నానికి దారితీసింది. 1927 లో మద్రాసు కాంగ్రెసులో జవహరిలాల్ నెహ్రూ ప్రతిపాదించి సుభాస్‌బోస్ వర్గం బలపరిచిన తీర్మానాన్ని ఆమోదించారు. పూర్ణ స్వరాజ్ లేక భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం సంపాదించడమే కాంగ్రెసు అంతిమ లక్ష్యమని ఈ తీర్మానం. అయితే, "భారత మహా ప్రజలలో సార్వత్రిక అంగీకారం ఎక్కువగా వుండేటట్టుచేసే రాజ్యాంగాన్ని తయారుజేయాలన్న" భారత విదేశాంగమంత్రి లార్డు బిర్కిన్‌హెడ్ స్వరాజ్ పార్టీకి సూచించిన సవాలునుకూడా ఎదుర్కొన్నారు. అంటే దీని అర్థం, సామ్రాజ్యానికి లోబడి బ్రిటిష్ ప్రభుత్వం ఆమోదించిన నూతన వ్యవస్థను ఏర్పాటు చేయాలని. కాంగ్రెసు కార్యవర్గము, అఖిల భారత లిబరల్ ఫెడరేషన్, ముస్లింలీగ్, యితర సంస్థలు, చివరికి 1928 ఆగస్టులో లక్నోలో సమావేశమయ్యాయి. ఈ అఖిల పక్ష సమావేశంలో ప్రముఖ స్వరాజిస్టు నాయకులు మోతీలాల్ నెహ్రూ అధ్యక్షతక్రింద ఏర్పాటయిన సంఘం తయారుచేసిన ముసాయిదా రాజ్యాంగాన్ని, వీరు ఆమోదించారు.

మోతీలాల్ నెహ్రూ నివేదిక - సమాధానానికి రాని జిన్నా వైఖరి ప్రారంభం;

ఈ నివేదికలో బాధ్యతాయుతమైన ప్రభుత్వానికి ఏర్పాటువుంది. అంటే, బ్రిటిష్ భారతదేశంలో అప్పుడు సర్వోన్నతంగా వున్న పాలకవర్గం కన్నా ప్రజలు ఎన్నుకున్న శాసనసభ సర్వాధికారాలు కలిగివుండాలి. ఇందులో రెండు సభలుండే సర్వంసహాధికార పార్లమెంటు వుండాలి. దీనికి, బ్రిటిష్ సామ్రాజ్యంలోవుండే కెనడా, ఆస్ట్రేలియాలవంటి డొమినియన్ పార్లమెంటులకుండే స్వపరిపాలనాధికారాలు వుండాలి. ఒక మనిషికి ఒక ఓటు అన్న సూత్రం ప్రాతిపదికగా రాష్ట్ర సమితులు ఎన్నిక చేసుకున్న 2 వందలమంది సభ్యులు సెనెట్‌లో వుండాలి. ప్రతినిధుల సభలో వయోజన ఓటింగ్‌పద్ధతిమీద ఎన్నికయిన 5 వందలమంది సభ్యులు వుండాలి. బెంగాల్‌లోని ముస్లింలకూ, వాయవ్య సరిహద్దు ముస్లిమేతరులకు మినహా మతవర్గాలకు పార్లమెంటులో ప్రత్యేక ప్రాతినిధ్యం వుండరాదు. రాష్ట్ర సమితుల్లో, జనాభాప్రాతిపదికగా, అల్ప సంఖ్యాక వర్గాలకు సీట్లను ప్రత్యేకంగా కేటాయిస్తారు. ముస్లింలు అధిక సంఖ్యాకులుగావున్న పంజాబ్ - బెంగాల్‌లకు దీనిని మినహాయిస్తారు. ఈరెండు ప్రాంతాలలో సీట్ల ప్రత్యేకింపు వుండదు. వయోజన ఓటింగ్ ప్రాతిపదికగా ప్రతినిధులను ఎన్నుకుంటారు.

మోతీలాల్‌నెహ్రూ నివేదిక, 1928 లో పాత కాలపు కాంగ్రెసు నాయకుల పాతభావాలను ప్రతిబింబిస్తోంది. యువతరంవారి పూర్ణస్వరాజ్ కోరికను ఆమోదిస్తూనే సామ్రాజ్యంలో డొమీనియన్ ప్రతిపత్తి అని, అర్థం చెప్పారు. వీటి సమగ్రతలో ప్రజాస్వామిక లౌకిక సూత్రాలను ఆమోదించడానికి కూడా వీరు సిద్ధంగాలేరు. మత తత్వ సమస్యను ప్రత్యక్షంగా సమాధాన పడని పద్ధతిలో పరిష్కరించడానికికూడా వీరు ప్రయత్నించలేదు. కేంద్రపార్లమెంటు స్థాయిలోనూ, రాష్ట్ర సమితుల స్థాయిలోనూ పౌరులందరి విషయంలో సమానప్రాతినిధ్య సూత్రానికి కొన్ని మినహాయింపులు కల్పించారు. వాస్తవంగా చెప్పాలంటే కాంగ్రెసులో చేరకుండా, తమ అల్పసంఖ్యాక ప్రయోజనాలను కాపాడటానికి రక్షణగా, అధిక సంఖ్యాకులయిన హిందువులను విశ్వసించడానికి రక్షణగా, ప్రత్యేక ప్రాతినిధ్య ప్రతిపాదనలు మాత్రమే జాతీయ ముస్లింలను తృప్తిపరిచి వుండేవి.

ఇంకా తీవ్రవాదులయిన ముస్లింలీగ్‌తో చీలిక 1928 డిసెంబరులో ఏర్పడింది. కాంగ్రెసు సమావేశం జరిగిన సమయంలో, కలకత్తాలో అఖిలపార్టీ మహాసభ నెహ్రూ నివేదికను ధృవపరచడానికి సమావేశమయింది. 1921 వరకు కాంగ్రెసు నాయకులుగా వుంటూ, యిప్పుడు ప్రముఖమత నాయకులయిన మహమ్మదల్లీజిన్నా, పార్లమెంటులోనూ, బెంగాల్ - పంజాబ్ రాష్ట్ర సమితిల్లోనూ ముస్లింలకు యింకా ఎక్కువ ప్రాతినిధ్య మివ్వాలని గట్టిగాకోరారు. ఈ రాష్ట్రాలలో అత్యధిక సంఖ్యలోవున్న ప్రత్యేక సౌకర్యాలులేని

ముస్లింలు, శాసనాధికారాలను ఉపయోగించుకోవడంద్వారా విద్య, ఉపాధి అవకాశాలు, సాంఘిక సంక్షేమం వినియోగంలో, పంజాబ్ – బెంగాల్ ముస్లిం అధిక సంఖ్యాకులు యితరులకు దీటుగా వుండేటట్టు చేయాలని ఆయన భావించారు. ఈయన్ను ఎక్కువ విధేయులయిన ఆగాఖాన్, సర్ మహమ్మద్ షాఫీ వంటి ముస్లిం రాజకీయవేత్తలు బలపరిచారు. వీరు, నూతన విద్యావంతులయిన వృత్తి వర్గానికీ, భూకామందులకూ, వర్తకులకు ప్రాతినిధ్యం వహించారు. ఇదేమోస్తరు వర్గాలకు చెందిన పురోగామి హిందూవర్గాలనుంచి స్థానిక అధికారాన్ని చేజిక్కించుకోడానికి ఆదుర్దాపడుతూ వుండేవారు. కాంగ్రెసుకు చెందిన డాక్టర్ అన్సారీ, ఉత్తరప్రదేష్ భూకామందు అయిన మహమ్మూదాబాదు మహారాజా, బీహార్న్యాయామూర్తి సర్ అలీఇమామ్వంటి అనేకమంది యితరముస్లిం రాజకీయవేత్తలు సలహాయిచ్చిన మోస్తరుగా ప్రజాస్వామిక సూత్రాల కన్సెషన్లు యివ్వడానికి సిద్ధపడలేదు అఖిలపక్ష మహాసభ, ఈ కోర్కెలను తిరస్కరించింది. హిందూమతోన్మాదులుకూడా బింకమయ్యారు. శిఖుమతవాదులుకూడా, పంజాబ్లో భాషాప్రయుక్త మత అల్పసంఖ్యాక వర్గంగా తమకు ప్రత్యేక ప్రాతినిధ్య మివ్వాలని యిప్పుడుగట్టిగా కోరారు. జిన్నా, శిఖు మతవాదులుకూడా, నెహ్రూ నివేదిక మీద "సార్వత్రిక అంగీకార అవకాశాలకు వీలులేకుండా", మహాసభనుంచి ఉపసంహరించుకున్నారు.

ఈ పరిణామాలు డొమీనియన్ ప్రతిపత్తిభావం విమర్శనను పటిష్టంచేశారు. వీటిని జవహరిలాల్ నెహ్రూ, సుభాస్బోస్ ఉద్ఘాటించేవారు. వీరిద్దరు వామపక్ష యువజనులకు ప్రాతినిధ్యంవహిస్తూ, కాంగ్రెసుకు సాధారణ కార్యదర్శులుగా వుండేవారు. పూర్ణస్వరాజ్ గురించి మద్రాసు తీర్మానాన్ని కాంగ్రెసు అమలు జరిపేటట్టు చేయడానికి, వీరు, పూనుకున్నారు. మోతీలాల్ నెహ్రూ అధ్యక్షత వహించిన కలకత్తా కాంగ్రెసు సమావేశంలో నెహ్రూ నివేదికను బలపరిచే తీర్మానంలో ఒక క్లాజును చేర్చారు. "కాంగ్రెసు పేరుమీద సంపూర్ణ స్వాతంత్ర్యం కోసం జరిగే ప్రచారంలో ఈ తీర్మానంలో ఏదీ కూడా జోక్యం కలిగించుకోకూడదని" ఈ క్లాజు. బ్రిటిష్ ప్రభుత్వం 1929 చివరినాటికి నెహ్రూ నివేదికను ఆమోదించకున్నట్టయితే ఈసారి లాహోర్లో కాంగ్రెసు జరిపే సమావేశంలో నూతన శాసనోల్లంఘన ఉద్యమానికి ఆదేశమివ్వాలని కూడా కలకత్తా కాంగ్రెసు నిర్ణయించింది.

రాజీద్వారా విభేదాలను పరిష్కరించారు. పార్టీ ఐక్యతను పటిష్టం చేశారు. సంఘర్షణలను సామరస్యంతో పరిష్కరించుకోవాలని కోరే గాంధీజీ దీనికి ముఖ్య కారణం. రాజకీయాలనుంచి విరమించుకుని ఆరేళ్ళపాటు అహమదాబాదులో గడిపిన గాంధీజీ కాంగ్రెసు

ప్రధాన నాయకులుగా మళ్ళీ తయారయ్యారు. తమ తండ్రి తర్వాత లాహోర్ సమావేశానికి జవహరిలాల్ నెహ్రూ అధ్యక్షులు కావడానికి ఈయన ఏర్పాట్లుచేశారు.

లాహోర్ సమావేశం, కాంగ్రెసు, పూర్ణ స్వరాజ్, సంపూర్ణ స్వాతంత్ర్యానికి తిరుగు లేకుండా, కట్టుబడి వుండేటట్లు చేసింది. కామన్వెల్తుకు లోబడి డొమీనియన్ ప్రతిపత్తి యిహ ఎంతమాత్రమూ ఆమోదకరం కాదు. సంస్కరణలతో చెరలాటాలాడే - "ఎల్లప్పుడూ మరీ కొద్ది - ఎల్లప్పుడూ మరీ ఆలస్యం" - అంతమయింది.

1929 డిసెంబరు 31 వ తేదీన, గడియారం అర్ధరాత్రి గంటలు కొడుతూ నూతన సంవత్సరం ఆవిర్భవిస్తూ వుండగా అశేష ప్రజానీకం, రావీనది ఒడ్డుమీద జవహరిలాల్ నెహ్రూ త్రివర్ణ జాతీయ పతాకను ఆవిష్కరించడం చూశారు: "బ్రిటిష్ పాలనకు" యిహ ఎంతమాత్రము తలఒగ్గినా అది మానవుడి పట్లా, భగవంతునిపట్ల కూడా గొప్ప నేరమవుతుంది" అని ఆయన ప్రకటించడం విన్నారు.

అందరిలోనూ నూతన ఆశలు చిగురించాయి, నూతన ఉత్సాహం వెల్లివిరిసింది. స్వేచ్ఛకోసం సంకుల సమరం జరపాలన్న ప్రజల కృతనిశ్చయం సర్వత్రా స్పష్టమయింది.

# V స్వేచ్ఛా సూచనలు

1930 సంవత్సరాలలో స్వాతంత్ర్య సమరం అనేక అడుగులు ముందుకు వేసింది. ఈ దశాబ్దం రెండో సహాయ నిరాకరణ ఉద్యమంతో ప్రారంభమయింది. రెండో ప్రపంచ యుద్ధం ప్రారంభంతోనూ, రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రివర్గాలు, తన అనుమతి లేకుండా భారతదేశాన్ని యుద్ధంలోకి ఈడ్చినందుకు నిరసనగానూ రాజీనామా యివ్వడంతో ఈ దశాబ్దం ముగిసింది. ఈ పదేండ్లలోనూ జాతీయ ఉద్యమం గతిని తెలుసుకోడానికి ముందు 1920 సంవత్సరాల ముగింపులో విప్లవ దౌర్జన్యవాదులు కార్య కలాపాలు మళ్ళీ తలఎత్తడం గురించీ, 1930 మొదటి సంవత్సరాల వరకూ యివి జరుగుతూనే వుండటంగురించీ, మనం గమనించ వలసివుంది. సరిగ్గా యిదేసమయం లోనే కార్మిక ఉద్యమం పటిష్టమయింది. సోషలిస్టు - కమ్యూనిష్టు భావాలు దేశపు రాజకీయ ఆలోచనలో ఒకస్థానాన్ని సంపాదించాయి. ఇవన్నీ 1930 సంవత్సరాలలో రాజకీయ పరిణామాలపై ప్రభావాన్ని కలిగించాయి.

ఒక్క 1928 సంవత్సరంలోనే భారతదేశంలో 203 సమ్మెలు జరిగాయి : వీటిలో 505,000 కార్మికులు పాల్గొన్నారు. దక్షిణ మహారాష్ట్రలోనూ, బొంబాయిలో జవుళి పరిశ్రమ విప్లవ గిరనీ కాంగార్ యూనియన్లలోనూ సభ్యత్వం బాగా పెరిగిపోయింది. విప్లవం కావాలనికోరే యూనియన్లను, దక్షిణ భారత, మద్రాసు, దక్షిణ మహారాష్ట్ర రైల్వేల కార్మికులు ప్రారంభించారు. కమ్యూనిష్టు పత్రికలయిన కీర్తి, మజ్దూర్, కిసాన్, స్పార్క్, క్రాంతి వంటివి, పట్టణాలలో వ్యాపించాయి. యువజనుల లీగ్‌లను స్థాపించారు. ఇవి, ఎగువ మధ్యతరగతి స్వరాజ్య కాంగ్రెసు నాయకుల పట్ల సానుభూతి గల క్రింది మధ్యతరగతి విద్యార్థులలో జనరంజక మయ్యాయి. అయితే సోషలిజంకోసం సమరం జరపడానికి, క్రమశిక్షణతో వీరు ఆయత్తం కాలేదు. పట్టణ కార్మికవర్గంలో ఎక్కువమందికి ప్రాతినిధ్యమిచ్చే కార్మిక పార్టీలను వీరు ఏర్పాటు చేయలేదు. సోషలిష్టు ఆదర్శాలు ఆధారంగా మెరుగయిన ప్రమాణాలకోసం అలజడి జరపడానికి వీరికి శిక్షణ యివ్వలేదు సరికదా భారతీయ కార్మికులను అంతర్జాతీయ కార్మికవర్గం ఉద్యమంతో సన్నిహితం చేయడానికి కూడా వీరు చర్యలు తీసుకోలేదు.

కలకత్తా కాంగ్రెసు జరిగినపుడూ, అఖిలపక్ష మహాసభ జరిగినపుడూ, కమ్యూనిష్టులు మొట్టమొదటి అఖిలభారత కార్మిక - కర్షక పార్టీల మహాసభను ఏర్పాటుచేశారు. కార్మిక - కర్షకవర్గం సమరం జరపాలనీ, భూముల యాజమాన్యాన్ని రద్దుచేయాలనీ, "సూత్రప్రాయంగా పరిహారం లేకుండా", పనిరోజులు తగ్గించాలనీ, కనీసవేతనాలు యివ్వాలనీ, పత్రికలకూ, ప్రసంగించడానికీ, ట్రేడ్‌యూనియన్ సంస్థలకూ స్వేచ్ఛ వుండాలనీ, ఈ మహాసభవారు ఉద్ఘాటించారు. డొమీనియన్ ప్రతిపత్తిని, వాంఛనీయ మైన తాత్కాలిక లక్ష్యంగా 1928 లో కాంగ్రెసు ఆమోదించడాన్ని, వీరు, విమర్శించారు.

సైమన్ వ్యతిరేక అలజడిలో చూపిన చొరవ వామపక్షంవైపు మొగ్గు చూపు తోందని, బ్రిటిష్ అధికారవర్గం అభిప్రాయ పడింది. మరో రాయల్ కమిషన్, కార్మిక విషయాల గురించి విట్‌లే కమిషన్‌ను నియమించారు. ఇది భారతదేశం సందర్శించి, కార్మిక సంబంధాలను మెరుగుపరచడానికీ, కార్మిక సంక్షేమాన్ని మెరుగు పరచడానికీ చర్యలను సూచించాలి. వామ పక్షానికి ముఖ్యంగా వీటిద్వారా శక్తివస్తోంది. సోషలిజం, విప్లవం గురించి అస్పష్టంగా మాట్లాడే నాయకులకన్నా తమ సంక్షేమంలో ప్రభుత్వానికి ఎక్కువ శ్రద్ధవుందని కార్మిక వర్గాన్ని మభ్యపెట్టడమే అసలు ఉద్దేశ్యం. అయితే కార్మికుల పట్ల విశ్వాసం చూపలేదు. సంస్కరణల విట్‌లే కమిషన్ 1929 లో భారత దేశం వచ్చినపుడు, అనేక కార్మిక సంస్థలు, దీనిని బహిష్కరించాయి. 1928 లో తమ ప్రయోజనాలకు వ్యతిరేకమయిన తమ కార్యాచరణ స్వేచ్ఛను వాస్తవంగా పరిమితం చేసేదయిన వర్తక వివాదాల బిల్లునూ, ప్రజా భద్రతా చట్టానికి సవరణనూ కేంద్రశాసన సభద్వారా ఆమోదింప చేయడానికి ప్రభుత్వం ప్రయత్నించిన సంగతి వీరు మరిచి పోలేదు. రాష్ట్రాలలో శాంతిభద్రతల పరిస్థితి క్షీణించిందని ప్రభుత్వం భావించినట్లయితే (శాసనసభ కంట్రోలు లేకుండా) సమ్మెలను నిషేధించి, అత్యవసర చర్యలు తీసుకో డానికి ప్రభుత్వానికి అనుమతి యివ్వడమే ఈ శాసనచర్య ఉద్దేశ్యం. భారతదేశంలో వామపక్ష పోకడను బలపరిచే ప్రపంచ సంస్థల అండ, సహాయమూ పొందకుండా, భారత రాజకీయ పార్టీలకు దీనివల్ల యిబ్బంది యింకా ఎక్కువవుతుంది. మోతీలాల్ నెహూృ నాయకత్వాన కేంద్ర శాసనసభ సభ్యులు, ఈ బిల్లులను తిరస్కరించారు.

1929 లో సార్వత్రిక సమ్మె (గిర్నికాంగార్ యూనియన్, రైల్వే కార్మికులు సంయుక్తంగా ఏర్పాటుచేసిన) బొంబాయిలో జరిగింది. 1928 సమ్మెల్లో పాల్గొన్న కార్మికులను బర్తరఫ్ చేసి వారి స్థానంలో పఠాన్ కార్మికులను నియమించినందుకు నిర సనగా, ఈ సార్వత్రిక సమ్మెజరిగింది. ట్రేడ్ యూనియన్ సమైక్యతను నిష్ప

యోజనం చేయడమే ఈ చర్యల లక్ష్యమనీ, దీని ఫలితంగా మిల్లులలో హిందూ — ముస్లిం కొట్లాటలు జరిగాయనీ సమ్మె జరిపిన కార్మికులు వాదించారు. సమ్మె కాన్పూర్ కలకత్తాలకు వ్యాపించింది. ఇది జరిగిన వెంటనే 1929 మార్చి 20 వ తేదీన భారత దేశ మంతటి నుంచి ముప్పయి ముగ్గురు ప్రముఖ కార్మిక నాయకులను, బ్రిటిష్ రాజుకు వ్యతిరేకంగా తిరుగుబాటు జరపడానికి కుట్ర జరిపారన్న ఆరోపణమీద, అరెస్టుచేశారు. వీరిలో ముజఫర్ అహమ్మద్, డాంగే, మిరాజ్‌కర్, పి. సి. జోషి- వీరంతా వున్నారు. వీరంతా ఆ తర్వాత ప్రఖ్యాత కమ్యూనిష్టు లయ్యారు. బొంబాయిలో కమ్యూనిష్టులకు తోడ్పడటానికి పంపిన ఇద్దరు బ్రిటిష్ కమ్యూనిష్టులు బెన్ — బ్రాడ్ లేపీ, ఫిలిప్ స్ప్రాట్‌నీ, కొంతమంది కమ్యూనిష్టేతర రేడికల్సునుకూడా అరెస్టు చేశారు. శాసనసభ అనుమతి నిరాకరించిన రెండు దమన బిల్లులను అమలులో పెట్టడానికి వైస్‌రాయ్ లార్డు ఇర్విన్ ఒక ప్రత్యేక ఆర్డినెన్సు జారీచేశారు. "కుట్రదార్లను" కార్మికవర్గం సమైక్యత పెద్ద పారిశ్రామిక కేంద్రాలకు దూరంగా వున్న మీరట్‌కు తీసుకెళ్ళారు. ఇక్కడ "మీరట్‌కుట్రకేసును" అనేక సంవత్సరాల వరకూ, వాస్తవంగా 1933 వరకూ విచారించారు. చివరికి ఖైదీలలో చాలామంది దోషులని ప్రకటించి అనేక రకాల జైలు శిక్షలను విధించారు. వీరిలో కమ్యూనిష్టులు, తమ ఆదర్శాన్నీ, సామ్రాజ్య వాద వ్యతిరేక వైఖరినీ సమర్థించుకుంటూ కోర్టులో సుదీర్ఘంగా వాదించారు; అయితే దీనిని అణచివేశారు.

ఇటీవల వెల్లడయిన సమాచారం బట్టి ప్రభుత్వం, కుట్రదారుగా జవహరిలాల్ నెహ్రూను కూడా అరెస్టు చేయాలని భావించింది, అయితే యిది అలజడికి దారితీయవచ్చునన్న కారణాన అలా చేయ సాహసించలేదు. మీరట్ డిఫెన్యూలకు న్యాయవాదుల సహాయాన్ని ఏర్పాటుచేయడానికి నెహ్రూ ప్రయత్నించారు. అయితే 1929-31 లో జరిగిన సంఘటనలు కమ్యూనిష్టుల విచారణను, ప్రజల దృష్టినుంచి మరల్చివేశాయి.

అయితే 1929 పొడవునా, సమ్మెలు జరిగాయి. ఎ.ఐ.టి.యు.సి. నాగపూర్ సమావేశంలో, వామపక్ష ట్రేడ్‌యూనియన్ వాదులను, విట్‌లే విచారణ సంఘాన్ని పూర్తిగా బహిష్కరించాలనీ, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఎ.ఐ.టి.యు.సి. ని లీగ్‌తో అనుబంధం చేయాలనీ అన్న కోర్కెలలో కాంగ్రెసు వారు, వీరిని బలపరిచారు. ఈ కోర్కెలకు అనుకూలంగా లేని ఎన్. ఎమ్. జోషీ వర్గం, ఓడిపోయింది. ఎ.ఐ.టి.యు.సి.ని వదలివేసి, యిది అఖిల భారత ట్రేడ్‌యూనియన్ సమాఖ్యను ఏర్పాటు చేసింది. ఈ సంస్థ, విప్లవ లక్ష్యాలనూ, రాజకీయ కోర్కెలను కూడా వదలివేసింది. కార్మికుల ఆర్థిక స్థితిగతులను మెరుగుపరచడానికి కృషి చేస్తానంది. అయితే మామూలుగా చెప్పాలంటే

కార్మిక వర్గంలో ఎక్కువ రేడికల్ వర్గాలు కూడా, భారత జాతీయ కాంగ్రెసు ఏర్పాటు చేసిన జాతీయ ఉద్యమంలో చేరలేదు. జవహరిలాల్ నెహ్రూ తమ ఆత్మకథలో యిలా వ్రాశారు.

"కార్మికులలో పురోగామి వర్గాలు జాతీయ కాంగ్రెసును చూసి సిగ్గుపడ్డారు. దాని నాయకులను వారు విశ్వసించలేదు, దాని ఆదర్శం బూర్జువా పద్ధతుల్లో అభివృద్ధి విరోధకంగా వుందని వారు భావించారు. ఇది కార్మికుల అభిప్రాయం దృష్ట్యా మాత్రమే".

ఈ భిన్నమయిన చీలిక పోకడలు వల్లా, ఒకరు కన్‌సర్‌వేటివ్, మరొకరు రేడికల్ కావడంవల్లా, ప్రభుత్వ దమన విధానంవల్లా 1930 సంవత్సరాల ఆరంభంలో జాతీయ వాదుల ఉద్యమంలో కార్మికులు పాల్గొనడం, బలహీనమయింది.

పంజాబ్, ఉత్తరప్రదేష్, బెంగాల్‌లలో క్రింది మధ్య తరగతి యువజనుల్లో దౌర్జన్య కార్యకలాపాలు మళ్ళీ ప్రారంభ మయ్యాయి. కాంగ్రెసు మితవాద అహింసా తత్వ విధానాలు వీరికి నిరాశ కలిగించాయి. 1925 లో, ఉత్తర ప్రదేష్‌లో ప్రఖ్యాత కాకోరి కుట్రకేసు జరిగింది, బెంగాలీలను కూడా దీవిలో యిరికించారు. దోషులలో ముగ్గురికి, - రాంప్రసాద్ బిస్మిల్, రోషన్‌లాల్, అష్‌ఫకుల్లా, — వీరి ముగ్గురికి మరణ శిక్షలు విధించి వారిని ఉరితీశారు. మిగతా కొంతమంది అనుమానితులు అరెస్టు కాకుండా తప్పించుకు పోయారు. 1928 కల్లా పారిపోయినవారిలో చంద్రశేఖర ఆజాద్ ఒక్కరు మాత్రమే, చిక్కలేదు. ఇప్పుడు ఆయన హిందుస్థాన్ రిపబ్లికన్ సైన్యాన్నిపునర్ వ్యవస్థీక రించడంలోముఖ్యపాత్ర వహించారు. దీని పేరును హిందుస్థాన్ సోషలిష్టు రిపబ్లికన్ అసోసి ఏషన్ అని మార్చారు. భారత సోషలిష్టు రిపబ్లిక్ ఏర్పాటు చేయడమే దీని లక్ష్యం.

అక్టోబరు 30 తేదీన సైమన్ కమీషన్, దరియాప్తు జరపడానికి లాహోర్ చేరు కున్నప్పుడు, ప్రముఖ పంజాబ్ నాయకులు లాలా లజపతిరాయ్ నాయకత్వం క్రింద ప్రదర్శ కులు "తిరిగి వెళ్ళిపో సైమన్" అని నినాదాలు చేశారు. అహింసాత్మక ఊరేగింపును చెదరగొట్టడానికి పోలీసులు ప్రయత్నించారు; ఈ త్రొక్కిడిలో లజ్‌పత్‌రాయ్ గాయ పడ్డారు; ఆ తర్వాత ఆయన మరణించారు. దేశమంతటా కోపోద్రేకాలు పెచ్చుపెరిగి పోయాయి. లాఠీచార్జీ జరిపించిన పోలీసు సూపరింటెండెంటు శాండర్సుని, పంజాబ్ నౌజవాన్ భారత్ సభ నాయకులు, హిందుస్తాన్ సోషలిష్టు రిపబ్లికన్ అసోసియేషన్ సభ్యులు అయిన భగత్‌సింగ్ కాల్చి చంపివేశారు. తమ సహచరులతో ఆయన పారిపో గలిగారు. భగత్‌సింగ్ 1907 లో జన్మించారు. ఈయన ప్రఖ్యాత అజిత్‌సింగ్ దగ్గర బంధువు. 1928 లో నౌజవాన్ భారత్ సభ, పంజాబ్‌లోని కీర్తి కిసాన్ పార్టీతో సంప్ర దించింది కూడా. అక్టోబరులో భగత్‌సింగ్ ఆయన సహచరులు ఢిల్లీలో ఫిరోజ్‌షా

కోట్లా సమీపంలో. హిందుస్థాన్ సోషలిస్టు రిపబ్లిక్ అన్న సంఘాన్ని ఏర్పాటుచేయడానికి (హెచ్.ఎస్.ఆర్.ఎ.) ఒక సమావేశంలో పాల్గొన్నారు. ప్రజా విప్లవ చర్య దేశానికి వలసదాస్యం నుంచి విముక్తి కలిగిస్తుందని ఈ సభ విశ్వసించింది: "ప్రజా విప్లవం ప్రజలకోసమే" అన్న నినాదాన్ని ప్రతిపాదించింది. గ్రామీణులకు రాజకీయాల గురించి వివరించవలసిన అవసరముందనికూడా వీరు విశ్వసించారు; విప్లవ సమరంలో, దౌర్జన్యం మొట్టమొదటి తప్పనిసరి ఘట్టమని కూడా నొక్కిచెప్పారు. వ్యక్తిగత దౌర్జన్య, వీర, త్యాగ చర్యలద్వారా ప్రజానీకాన్ని ప్రేరేపింపచేయడమే వీరి లక్ష్యం. ఈ విశ్వాసాల మీద పనిచేస్తూ, అజ్ఞాతంనుంచి బయటికివచ్చి, భారత ప్రజలకు కనుపించి, తమ చర్య లకు పూర్తి బాధ్యత వహించాలని హెచ్.ఎస్.ఆర్.ఎ. నిర్ణయించింది; 1929 ఏప్రిల్ 8 తేదీన కేంద్ర శాసనసభలో ఆర్థిక సభ్యులు, వర్తక వివాదాల బిల్లునూ, ప్రజా భద్రత సవరణ బిల్లునూ అమలుపరచడానికి ప్రత్యేక ఆర్డినెన్సును జారీచేస్తూ వున్నట్టు ప్రక టించారు. ఈ నియంతృత్వ దమనచర్యకు నిరసనగా భగత్‌సింగ్, బటుకేశ్వర్ దత్, ప్రేక్షకుల గ్యాలరీ నుంచి ఒక బాంబును ప్రభుత్వ సభ్యులమీద విసిరారు. "ఎఱ్ఱ కర పత్రం" అన్న పేరుతో ప్రచురించిన కాపీలను కూడా వీరు అసెంబ్లీ హాలులో వెద చల్లారు. బాంబు పెద్ద శబ్దంచేస్తూ ప్రేలినప్పటికీ హాని కలిగించనందువల్ల, ఎవ్వరూ గాయపడలేదు. ఎవ్వరినయినా చంపాలన్న ఉద్దేశ్యంగానీ, గాయపర్చాలన్న ఉద్దేశ్యం గానీ విప్లవ వాదులకు లేదు. "చెవిటివారికి వినిపింప చేయడమే తమ లక్ష్య"మని వీరు కరపత్రంలో విశదం చేశారు. ఆ తర్వాత వీరు, తమ అరెస్టుకు అంగీకరించారు. కోర్టును ఒక వేదికగా తీసుకొని బహిరంగంగా తమ ఆదర్శాన్ని విశదం చేయవచ్చునని వీరు భావించార్రు. కమ్యూనిస్టులు, మీరట్‌లో యిదే ప్రయత్నాన్ని చేశారు.

కమ్యూనిస్టు కార్మిక వ్యావస్థికులకూ హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లిక్ అసోషి యేషన్ ఆదర్శాలకూ కొన్ని మూల విషయాలలో తేడావుంది. అయినప్పటికీ పద్ధతు ల్లోనూ ఆదర్శంలోనూ అనేక పోలికలు కనుపించాయి. మొత్తంమీద రెండు వర్గాలు బ్రిటిష్ సామ్రాజ్యవాదం కిరాతక దమన విధానము, చీలిక ఎత్తులకు వ్యతిరేకంగా ప్రత్యక్ష సవాలును ప్రజలకు విశదం చేశాయి. పామరజనం కమ్యూనిజాన్ని ఆమో దించడానికి సిద్ధంగా లేరుకాబట్టీ, 1905 ఉద్యమం అప్పటినుంచీ, ప్రత్యేక సౌకర్యాలు - హక్కులు లేని క్రింది మధ్యతరగతి ప్రజలకు దౌర్జన్యవాదులను వీరులుగా పూజించే సంప్రదాయం వున్నందునా, భగత్‌సింగ్, హెచ్. ఎస్. ఆర్. ఎ. ప్రజల హృద యాన్ని చూరగొన్నారు. లాహోర్ కాంగ్రెసు తర్వాత ప్రారంభమయిన శాసనోల్లం ఘన ఉద్యమాన్ని ప్రజలు బలపరిచేటట్టు చేయడంలో తోడ్పడ్డారు. అయితే కాంగ్రెసు

వాస్తవంగా ఐకమత్యంతో లేదు. గాంధీజీకి, ఆయన సన్నిహిత సహచరులు కొంత మందికీ అహింస, ఒక విశ్వసనీయమైన సూత్రం. ఎట్టి పరిస్థితులలోనూ హింసకూ, దౌర్జన్యానికీ వీరు ప్రోత్సాహ మివ్వలేదు. విప్లవ కార్యకలాపాలకు వీరు, పూర్తిగా వ్యతి రేకులు. ఇట్టి పరిస్థితుల్లో, గాంధీజీని, ఆయన నాయకత్వాన్నీ, ఆయన కార్యాచరణ పథకాన్నీ ఉత్తమ మైనదిగా భావించి అది విజయవంత మవుతుందని భావించిన వారు కొంత మంది వున్నారు. ప్రభుత్వంతో పోరాటం సమ ఉజ్జీల మధ్య పోరాటం వంటిది కాదని గ్రహించి వీరు, దౌర్జన్యాన్ని విస్మరించారు. విప్లవ వాదులు తమ స్వంత పద్ధతిలో బ్రిటిష్ పాలనను బలహీనం చేసినా, స్వాతంత్ర్య సమరానికి ప్రజానీకం అండను సంపాదించినా, దౌర్జన్య కార్యకలాపాలు, సామ్రాజ్యవాదాన్ని అంతం చేయడానికి మరో గొడ్డలిపెట్టు వంటివని భావించవచ్చునని, వీరు అనుకున్నారు. రెండురకాల అలజడులు అవసరమని భావించిన వారు కొంతమంది కూడా వున్నారు. ఇదే మోస్తరుగా సోషలిజం విషయంలో కాంగ్రెసులోనే విభేదాలున్నాయి. కొంతమంది చిత్తశుద్ధితో హృదయపూర్వకంగా వామపక్ష భావన కలిగి వుండేవారు. ఇతరులు దీనికి వ్యతిరేకంగా వుండేవారు. గాంధీజీ ఆయన అనుచరులు రాజకీయ - ఆర్థిక కార్యక్రమంలో విశ్వాసం కలిగి వుండేవారు. ఈ కార్యక్రమంలో సూత్రాలైన సంపద కూడబెట్టు కోరాదు - అందరూ సమానమే అన్న సిద్ధాంతాలే కాక కమ్యూనిజం సిద్ధాంతాలు కూడా ఉన్నాయని చెప్పుకున్నారు. అయితే ప్రభుత్వ యాజమాన్యం, వ్యక్తికన్నా సమాజం అత్యధిక ప్రాముఖ్యం గలదన్న ప్రాథమిక సూత్రాలు ఇందులో లేవు. వాస్తవంగా గాంధీజీ వున్నత నైతిక మానవుడుగా పరిణామం చెందాలని, దీనివల్ల, యిటువంటి విశిష్ట పేరులున్న సమాజం, ఆదర్శ నీయంగా వుంటుందనీ, దీనిలో, ప్రభుత్వం వారిని పరిపాలించవలసిన అవసరం వుండదనీ విశ్వసించారు.

ఈ కారణాలవల్ల విప్లవ దౌర్జన్యవాదులకూ, కాంగ్రెస్ నాయకులకూ, ఉమ్మడి లక్ష్యాలున్నప్పటికీ, వాస్తవమైన సంబంధాలు లేవు. అందువల్ల నాయకుల దర్శకత్వమూ, మార్గదర్శకత్వమూ లేనందున ప్రజానీకం తగ్గిపోయింది.

ఇదే మోస్తరుగా విప్లవవాదులు, కృతనిశ్చయంతో పోరాడటానికి ప్రతిపాదించిన అవకాశాలను పూర్తిగా ఉపయోగించుకోలేదు. సర్వత్యాగాలకూ, ఆదర్శానికీ సిద్ధంగా వుండటం ఒక వ్యవస్థ ఏర్పాటు చేయాలన్న భావం లేకపోవడం, ప్రభావాన్ని బలహీనం చేసింది. చైతన్యవంతమైన కేంద్ర సమీకరణ బలం లోపించినట్టు కనుపించింది.

భగత్ సింగుకూ ఆయన సహచరులకూ వ్యతిరేకంగా ప్రభుత్వం, ఒక కేసును ప్రారంభించింది. దీనిని లాహోర్ కుట్రకేసు అనేవారు. నిందితులలో కొంతమంది

తమను రాజకీయ ఖైదీలుగా కాకుండా, మామూలు నేరస్థులుగా చూస్తూ వున్నందుకు ఆక్షేపణ తెల్పారు. రాజకీయ ఖైదీలు, రాజుమీద ప్రత్యక్షంగా యుద్ధాన్ని ప్రకటించారు. తమ వైఖరి పట్ల ప్రజల దృష్టిని కేంద్రీకరింపడంకోసం వీరు, నిరాహార దీక్ష జరిపారు. చిట్టచివరికి జైలు అధికారులు, వీరు మరణించి అమరవీరులు కాకుండా చూడటంకోసం, వారికి బలవంతంగా ఆహారం పెట్టవలసి వచ్చింది. అయితే జతీన్‌దాస్ "ప్రాణం పోయేవరకూ పట్టు విడువం" అని ఆఖరి మాటలు చెబుతూ, ఆహారం, మందులు తినడానికి నిరాకరించాడు; 1929 సెప్టెంబరు 13 తేదీన ఆయన మరణించారు.

భగత్‌సింగ్, విప్లవ దౌర్జన్యవాదులు అనేకమంది అప్పటికే, 1925 తర్వాత, మార్క్సిజం మూలసూత్రాలను ఆకళింపు చేసుకున్నారు. అప్పుడు జైలులోనూ, వెలుపల వున్న అనేకమంది, పదేపదే పరిశీలన జరుపుకుంటూ వ్యక్తిగత దౌర్జన్యం, వీరత్వాలను వదులుకొని, చిట్టచివరకు ప్రజల సోషలిష్టు విప్లవభావాలకు అనుకూలంగా తయారయారు. ఇది, ఉత్తర భారతావనిలో దౌర్జన్యాలు తగ్గడానికి దారితీసింది.

1930 సంవత్సరాలలో స్వాతంత్ర్య సమరం ఏవిధంగా జరిగిందో, పూర్తిగా అవగాహన చేసుకోవడానికి, కాంగ్రెసు ఆమోదించిన లాహోరు పూర్ణస్వరాజ్ (స్వాతంత్ర్యం) తీర్మానానికి ముందు కొన్ని పరిణామాలగురించి తెలుసుకోవలసివుంది. బ్రిటిష్ సాధారణ ఎన్నికల్లో లేబర్‌పార్టీ అధికారంలోకి వచ్చింది. సోషలిస్టు, భారత జాతీయతా భావానికి యింతకిముందు మిత్రుడు అయిన రామ్‌సే మెక్‌డొనాల్డు కొత్త ప్రధానమంత్రి అయ్యాడు. అయితే ఆయన కూడా బ్రిటిష్ సామ్రాజ్యమన్న మూలభావాన్ని బలపరిచేవాడు. సామ్రాజ్య వాదాన్ని ఈయన సమర్ధించడం ఈయన్ను ప్రశంసించే కొంతమంది భారతీయులకు నిరాశ కలిగించింది. వైస్‌రాయ్ లార్డు ఇర్విన్, సంప్రతింపులకు ఇంగ్లండు వెళ్ళారు; భారతదేశానికి తిరిగి వచ్చిన తర్వాత 1929 అక్టోబరులో ఒక ప్రకటన జారీ చేశారు. సైమన్ విచారణసంఘం తుది నివేదిక సమర్పించిన దరిమిలా, ప్రతిపాదనలకు అన్ని పార్టీల అంగీకారాన్ని సాధ్యమైనంత వరకూ సంపాదించడానికి రౌండుటేబిల్ మహాసభ జరుగుతుందని, తెలియజేశారు. అఖిలపక్ష మహాసభ (1929 చివరలో గాంధీజీ, మోతీలాల్‌నెహ్రూ నాయకత్వం క్రింద) అక్టోబరులో ఇర్విన్ చేసిన ప్రకటనను హర్షిస్తూనూ, బ్రిటిష్‌వారి సహృదయతను ఋజువుచేసుకుంటూ రాజకీయ ఖైదీల నందరినీ, క్షమించి విడిచిపెట్టాలని కోరుతూనూ, ఒక ప్రణాళికమీద సంతకాలుచేశారు. జవహరిలాల్ నెహ్రూ మొట్టమొదట సుభాష్ చంద్రబోస్‌తో యింకా ఎక్కువ సమాధానపూర్వకమయిన ప్రణాళికను తీసుకురావాలని తలపెట్టారు. అయితే తమ తండ్రి, గాంధీజీ ప్రతిపాదించిన ప్రణాళిక మీద సంతకం చేసేటట్టు ఆయనకు నచ్చచెప్పారు. గాంధీజీ అప్పటికి

ఆయనకు, అనుభవంగల విశ్వసనీయమైన సలహాదారు అయ్యారు. మహమ్మదాలీ జిన్నా కూడా ఢిల్లీ ప్రణాళికతో అంగీకరించారు. అయితే ఇర్విన్ ప్రకటనను బేషరతుగా బలపరచివుంటే ఆయన ఎంతో యిష్టపడి వుండేవాడు. ఈ విధంగా లాహోర్ కాంగ్రెసుకు ప్రఖ్యాత స్వాతంత్ర్య తీర్మానానికి ముందు, జాతీయవాదులు యునైటెడ్ ఫ్రంట్‌కు బహు దూరమయ్యారు. పాతవారికీ, కొత్తవారికీ, అధికారం అంతరించిపోతూవున్న మితవాద నాయకులకూ మధ్య, యువజనుల భావనపై ప్రభావం కలిగించిన వామపక్ష నాయకులకు మధ్యా సామ్రాజ్యంలో ప్రస్తుత డొమీనియన్ ప్రతిపత్తికి తృప్తిపడే వారిమధ్యా, ఒక ప్రక్క గాంధీజీ, మోతీలాల్ నెహ్రూ, మరోప్రక్క జవహరిలాల్ నెహ్రూ, సుభాస్ బోస్‌కూ ఆయన రేడికల్ వర్గానికీ మధ్య పూర్ణస్వరాజ్ విషయంలో సమాధానానికి రాకుండా కృతనిశ్చయంతో నిలబడినవారికీ మధ్య విభేదాలేర్పడ్డాయి. ఈ విభేదాలమధ్య ముందడుగు వేయడానికి 1930 లో జవహరిలాల్ నెహ్రూ ప్రధాన కారకులయ్యారు.

ఢిల్లీ ప్రణాళిక ఆశించిన కన్‌వెన్షన్‌లకు కూడా బ్రిటిష్ ప్రభుత్వాన్ని అంగీకరింప చేయలేని వైస్‌రాయ్ అసమర్థత. ఇర్విన్, రేడికల్ వ్యతిరేకుల మధ్య పెరుగుతూ వున్న స్నేహం విచ్ఛిన్నం కావడానికి దారితీసింది. లాహోర్ కాంగ్రెసు సమావేశం కావడానికి ముందు డిసెంబరు 23 తేదీన తమను కలుసుకున్న గాంధీజీ, మోతీలాల్, జిన్నాలతో రౌండుటేబిల్ సమావేశంలో ప్రభుత్వం ఎటువంటి వైఖరికి కట్టుబడివుండేటట్టు తాము చేయజాలమని చెప్పారు. చివరి క్షణంలో గాంధీజీ, పూర్ణ స్వరాజ్ గురించి వామపక్ష బేషరతు వైఖరిని మన్నించడానికి సుముఖత కనబరిచారు. "నేను ఒక విధానానికి తిరుగు లేకుండా కట్టుబడ్డాను" అని ఆయన అన్నట్టు తెలుస్తోంది. కాగా వామపక్ష శిబిరంలో ఆయన చేరడంద్వారా, సమాధానానికి రానివారి వైఖరిని ఆయన బలహీనం చేశారని కొంత మంది భావిస్తున్నారు.

డిసెంబరు 30 తేదీన, హిందుస్తాన్ సోషలిష్టు రిపబ్లికన్ అసోసియేషన్ కార్య కలాపాలకు యింకా యిప్పటికీ కేంద్రమయిన లాహోర్‌లో సమావేశమయిన కాంగ్రెసు ఒక తీర్మానాన్ని ఆమోదించింది. ఇది ఢిల్లీ ప్రణాళికను బలపరుస్తూనే, లార్డు ఇర్విన్ వైఖరివల్ల, రౌండుటేబిల్ సమావేశంలో పాల్గొనడం మూలంగా కాంగ్రెసు సాధించేది ఏదీ లేదని పేర్కొన్నారు. రాజ్యాంగాన్ని తయారు చేయడం కోసం మోతీలాల్ నెహ్రూ సంఘం రూపొందించిన పథకానికి కూడా కాలదోషం పట్టిందనీ ఇప్పుడిహ సంపూర్ణ స్వాతంత్ర్యం కోసం ఉద్యమాన్ని ప్రారంభించడం అవసరమని కూడా ఈ తీర్మానంలో పేర్కొన్నారు.

కాంగ్రెసు తీర్మానంలో ఈ ఉద్యమాన్ని శాసనోల్లంఘనగా వర్ణించారు. ఇది, శాసన, పరిపాలన, యితర ప్రభుత్వ వ్యవస్థల నన్నింటినీ బహిష్కరించడమేనని మార్పులకు అనుకూలంకాని వర్గం పేర్కొంది. యువజనులు, దౌర్జన్య విప్లవాన్ని జరుపుతామని బెదిరిస్తూ వుండటంవల్ల గాంధీజీ దీనిని బలపరిచారు. "శాసనోల్లంఘన మాత్రమే దేశాన్ని, అరాచకము, రహస్య నేరాలనుంచి కాపాడగలదు. దేశంలో దౌర్జన్యకరమైన పార్టీ ఒకటి ఉన్నందువల్ల, అది ప్రసంగాలనూ, సమావేశ తీర్మానాలనూ పట్టించుకోలేదు; ప్రత్యక్ష చర్యలో మాత్రమే దానికి విశ్వాసముంది" అని ఆయన తెలియజేశారు. పోరాటాన్ని శాసనసభలకు కూడా తీసుకెళ్లాలన్న స్వరాజ్యవాదుల వైఖరిని వదులుకున్నారు. అయితే, నిర్మాణాత్మక విప్లవ ఉద్యమాన్ని ఏర్పాటుచేయాలనీ, "దేశంలో ప్రతి ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయడమే కాంగ్రెసు లక్ష్యంగా వుండాలనీ, ఈ లక్ష్యసాధనకోసం, కార్మికులనూ, కర్షకులనూ, యువజనులనూ ఆర్గనైజ్ చేసే కర్తవ్యాన్ని చేపట్టాలనీ," సుభాస్‌బోస్ ప్రతిపాదించిన తీర్మానం, వీగిపోయింది.

అయినప్పటికీ, స్వాతంత్ర్య ఉద్యమ అంతరంగిక స్వరూపాన్ని బలహీనంచేసే వైరుధ్యాలున్నాయని, గుర్తించినప్పటికీ 1930 జనవరి ఒకటో తేదీన వున్న ఐక్యతభావం వాస్తవికతను మనం విస్మరించజాలం. పూర్ణస్వరాజ్ కావాలన్న కాంగ్రెసు కోర్కెను భారత ప్రజానీకం సానుభూతితో చూశారు. ఈ కోర్కె యువజనులకు మాత్రమేకాక, పెద్దతరంవారికీ, మితవాద స్వరాజ్య వాదులకూ, కాంగ్రెసులో మార్పులుకోరని వారికీ నచ్చింది. స్వపరిపాలనా ప్రభుత్వంతో భారత ప్రజలను ప్రభుత్వం విశ్వసించదనీ, భారతదేశం ప్రగతి సాధించాలంటే, స్వాతంత్ర్య మొక్కటే మార్గమనీ, వీరు, హృదయ పూర్వకంగా భావించారు. పూర్ణస్వరాజ్ కోర్కెను, ముస్లింలీగ్, స్థానిక కుమ్మక్కు దార్లబృందాలు, లిబరల్సు మాత్రమే బలపరచలేదు, అయితే వీరు అల్ప సంఖ్యాకులు. ఈ మేరకు, 'సైమన్ తిరిగి వెళ్ళిపో' అన్న ఉద్యమం సృష్టించిన ఐక్యతా భావం, యింకా కొనసాగుతూనే వుంది.

చిన్న స్థానిక బృందాలతో స్థానిక ఉద్యమాన్ని ఏర్పాటు చేయాలన్న సుభాస్ బోస్, యితరుల కోర్కెను విస్మరించడానికి వీలులేదు. అయితే దేశమంతటా 1930 లో ఈ ఉద్యమానికి ప్రజల అండ లభించింది అంటే, గాంధీజీ యిచ్చిన జాతీయత, ఆత్మ గౌరవం, గ్రామాలలో పునర్నిర్మాణ కార్యక్రమ సందేశమే కారణం.

## స్వేచ్ఛా సూచనలు

### శాసనోల్లంఘన ఉద్యమానికి సన్నాహాలు

1930 జనవరిలో, భారత దేశంలో ఆనంద ఉత్సాహాలు వెల్లివిరిశాయి. ఉద్యమాన్ని ప్రారంభించడానికి తేదీ ఏదీ నిర్ణయించలేదు సరికదా, కార్యక్రమమేదీ రూపొందించ లేదు. వీటిని గాంధీజీ నిర్ణయానికి వదలివేశారు. చేరీ చేరా సంఘటన తర్వాత యిది సంభవించింది కాబట్టి, ఈ ఉద్యమాన్ని తాత్కాలికంగా నిలిపి వేయడం గానీ, విర మించడంగానీ జరగదని గాంధీజీ హామీ యిచ్చారు. దీనిని గురించి తమ ఆత్మకథలో నెహ్రూ, యిలా ప్రస్తావించారు.

"శాసనోల్లంఘనను ప్రారంభించినపుడు, చెదురు మదురు దౌర్జన్య చర్యవల్ల, దీనిని నిలిపి వేయడం జరిగిందన్న అభిప్రాయాన్ని గాంధీజీ కలగ జేశారు. ఈ హామీ మాలో చాలా మందిని తృప్తి పరచడానికి ఎంతో దోహదమయింది".

1930 జనవరి 26 వ తేదీన, దేశమంతటా సాధ్యమైనంత ఎక్కువ మంది ప్రజలు బహిరంగంగా స్వాతంత్ర్య ప్రణాళికను లేక స్వాతంత్ర్య ప్రతిజ్ఞను పూనాలన్న ప్రతి పాదనను, ఆమోదించారు. ఈ తేదీన శాసనోల్లంఘన ప్రారంభం కావలసి వుంది. దీనిని స్వాతంత్ర్య దినంగా ప్రకటించారు.

ఆయా భాషల్లో ప్రకటించడం ప్రారంభమయిన స్వాతంత్ర్య ప్రతిజ్ఞ, సామ్రాజ్యవాద వ్యతిరేకులు, లిబరల్స్, రాడికల్‌డెమోక్రాట్‌లు, భారత సోషలిస్టులు అందరికీ ఒకే విధంగా నచ్చింది; ఉద్యమాన్ని ప్రారంభించడానికి యివే కారణ మయ్యాయి.

"మిగతా ప్రజల మోస్తరుగానే స్వాతంత్ర్యాన్ని పొందటానికీ, తమ కష్టం ఫలితాలను అనుభవించడానికీ, జీవిత అవసరాలన్నీ పొంది, అభివృద్ధి చెందటానికి పూర్తి అవకాశాలను కలిగివుండటానికి, భారత ప్రజలకు, అన్యాక్రాంతం చేయడానికి వీలులేని హక్కు వుందని మేము విశ్వసిస్తున్నాం. ప్రజలకు ఈ హక్కులు లేకుండాచేసి, వారిని అణగ ద్రొక్కినట్లయితే, దీనిని మార్చడానికిగాని, రద్దు చేయడానికి గానీ మరికొంత హక్కు వుందని కూడా మేము విశ్వసిస్తున్నాము. భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వం, భారత ప్రజలకు తమ స్వాతంత్ర్యం లేకుండా చేయడమే కాక, పామరజనాన్ని పీడించి పిప్పి చేసి, భారతదేశాన్ని ఆర్థికంగా, రాజకీయంగా, సాంస్కృతికంగా, ఆధ్యాత్మికంగా సర్వ నాశనమూ చేసింది. అందువల్ల భారతదేశం, బ్రిటన్‌తో సంబంధాలను పూర్తిగా త్రెంచి వేసుకొని పూర్ణస్వరాజ్ లేక పూర్తి స్వాతంత్ర్యాన్ని పొందాలని కూడా మేము భావిస్తు న్నాము."

ఈ ప్రతిజ్ఞ అన్ని వర్గాలకూ, బృందాలకూ ఒకేవిధంగా నచ్చడం వల్లనే, కొన్ని వైరుధ్య సమస్యలను లెఖ్ఖచేయడం జరగలేదు. అనేక శతాబ్దాలనుంచి గ్రామీణ ప్రజలకు జీవనాధారమయిన ప్రాచీన హస్తకళలనూ, వ్యవసాయ వుత్పత్తినీ నాశనం చేయడమే దేశం ఆర్థికంగా సర్వనాశనం కావడానికి కారణమని పేర్కొన్నారు; కొత్త రూపాలలో భారతదేశంనుంచిసంపద బ్రిటన్‌కు వెళ్ళిపోతూ వుండటం గురించి కూడా ప్రస్తావించారు. సామ్రాజ్యవాదుల విచక్షణ వల్ల కూడా దెబ్బతిన్న ఆధునిక పారిశ్రామికీకరణ సమస్యల గురించి ఎటువంటి ప్రస్తావనా జరగలేదు. "విద్యా పద్ధతి" వల్లనే రాజకీయ వినాశనం జరిగిందని అన్నారుకాని, ఇది, తగిన సంజాయిషీ కాదని చెప్పవచ్చు. ఆయుధాలు ధరించడానికి భారతీయులకు అనుమతిని యివ్వకుండా వుండటం వల్లా, "ఆక్రమణ సేన" వుండటంవల్లా, అంతరంగిక భద్రత కోసం విదేశ సైనిక శక్తి మీద ఆధారపడి వుండటం వల్లా, భారతదేశం ఆధ్యాత్మిక పతనంచెందిందని, ఈ ప్రతిజ్ఞలో పేర్కొన్నారు. ఈ కారణాలవల్ల స్వాతంత్ర్య సమరానికి గాంధేయ అహింసాత్మక శాసనోల్లంఘన ఒక ఆయుధంగా ఉపకరించడం సమర్థనీయమయింది.

"స్వాతంత్ర్యాన్ని సాధించడానికి హింసావిధాన మొక్కటే మార్గం కాదని మేము గుర్తించాము. అందువల్ల మేము, బ్రిటిష్ ప్రభుత్వంనుంచి స్వచ్ఛందంగా వైదొలగి, పన్నులు చెల్లించడానికి నిరాకరించడంతో సహా, శాసనోల్లంఘనకు సన్నద్ధమవుతాము. స్వచ్ఛంద సహాయాన్ని ఉపసంహరించి, రెచ్చగొట్టినప్పటికీ హింసకు దిగకుండా, పన్నులు చెల్లించడానికి నిరాకరించినట్లయితే, అమానుషమయిన పరిపాలన అంతమయి తీరుతుందని మాకు నమ్మకం కుదిరింది".

ఆ తర్వాత పూర్ణ స్వరాజ్ స్థాపనకు కాంగ్రెసు, ఎప్పటికప్పుడు విడుదలచేసే ఆదేశాలను విధేయతతో పాటిస్తామని ప్రతిజ్ఞ చేశారు. దేశం ఎదుర్కొంటున్న నాలుగు రకాల విపత్తులలో, సోషలిస్టు భావాలు ప్రతిబింబించలేదు. విదేశ పాలకులు తమ హృదయాన్ని మార్చుకోవాలన్న విజ్ఞప్తిని చేసే పద్ధతిని, కార్యవర్గం అవలంబించింది. అయితే యిది ఫలవంతం కావడం, పాలకవర్గం వైఖరిమీద ఆధారపడి వుంది

సరిగ్గా ఈ సమయంలో, గాంధీజీ తమ పత్రిక "యంగ్ ఇండియా" లో వ్రాసిన వ్యాసంలో పరిపాలనా సంస్కరణకు పదకొండు అంశాలను సూచించారు. లార్డు ఇర్విన్ వీటికి అంగీకరించినట్లయితే, శాసనోల్లంఘన పిలుపును ఉపసంహరించాలని, గాంధీజీ భావించారు. కార్యాచరణకు ఎటువంటి విధానాన్ని అవలంబించాలో ఆయన యింకా నిర్ణయించలేదు. రేడికల్ వర్గానికి చెందిన గొప్ప భారత కవి, జాతీయవాదులు అయిన రవీంద్రనాథ్ టాగూర్ అడిగినపుడు, గాంధీజీ యిలా సమాధానమిచ్చారు;

"నేను రాత్రింబవళ్లు తీవ్రంగా ఆలోచిస్తున్నాను అయితే అంధకారాన్ని అంతంచేసే ఆశాజ్యోతి ఏదీ కనుపించడంలేదు."

మార్చి 6 తేదీన ఇర్విన్‌కు వ్రాసిన లేఖలో, తాము సూచించిన 'పదకొండు అంశాల' కార్యక్రమం చెడుగులను తక్షణమే తొలగించాలనీ, లేని పక్షంలో, కర్షకులకు అర్థమయ్యే విధంగా తాము బ్రిటిష్ చట్టాలను ధిక్కరించవలసి వస్తుందనీ పేర్కొన్నారు. జవహరిలాల్ నెహ్రూ తమ ఆత్మకథలో యిలా పేర్కొన్నారు.

"స్వాతంత్ర్యం కావాలన్న దృష్టితో మాట్లాడుతూ వున్నప్పుడు రాజకీయ-సాంఘిక-సంస్కరణల జాబితాను తయారుచేసి ప్రయోజనమేమిటి? గాంధీజీ, యీ పదాన్ని మేము వుపయోగించిన అర్థంలోనే వుపయోగించారా? లేక, మేము మరో భాషలో మాట్లాడుతున్నామా?"

## ఉప్పు సత్యాగ్రహం

చిట్టచివరికి గాంధీజీ ఒక నిర్ణయం తీసుకున్నారు. 1930 మార్చి 12 తేదీన 78 మందిఎన్నికయిన అనుచరులవెంట సాబర్మతి ఆశ్రమంనుంచి బయలుదేరి గుజరాత్ గ్రామాల ద్వారా 2 వందల మైళ్ళు నడిచి సముద్రతీరంలోని దండి చేరుకుంటారు. అక్కడ, గాంధీజీ, ఆయన అనుచరులు, చట్టవిరుద్ధంగానే అయినా బహిరంగంగా సముద్రం నుంచి ఉప్పు తయారుచేసి చట్టాన్ని ధిక్కరిస్తారు. గాంధీజీ దండి సత్యాగ్రహం ప్రారంభించినపుడు సార్వత్రిక జాతీయ చైతన్యం పెల్లుబికింది. సన్నగా, కర్షకుడి మోస్తరుగా వున్న ఈయన కట్టుపోటు వేసుకుంటూ నడుస్తూ వెళ్ళినపుడు, ఈ నిత్యావసరంపై పన్నుల ద్వారా ధర ఎక్కువచేసినందుకు, చట్టాన్ని ధిక్కరించడానికి వెడుతూవున్న మహాత్ముణ్ణి చూడటానికి గ్రామీణులుగుంపులుగుంపులుగా మూగారు. దండికి వెడుతోన్న అహింసాత్మక గుంపులో చేరడానికి వలంటీర్లు అశేషంగా వచ్చారు.

భారతదేశమంతటా పెద్ద పట్టణాలలో క్రింది మధ్య తరగతి ప్రజలలో ఆనంద ఉత్సాహాలు మిన్నుముట్టాయి. శాసనోల్లంఘన ఉద్యమంలో మహిళలు చేరడం, దీనికి ఒక ఉదాహరణ. ఏప్రిల్ 30 తేదీన యంగ్ ఇండియాలో గాంధీజీ, మహిళలు చరఖా, మీద నూలు వడకడం ప్రారంభించాలనీ, తమ గృహాలనుంచి వెలుపలికి వచ్చి విదేశ వస్తువులనూ, మద్యాన్నీ అమ్ముతూవున్న దుకాణాలముందూ, ప్రభుత్వ కార్యాలయాల ముందూ పికెటింగ్ జరపాలని విజ్ఞప్తి చేశారు. ఇంతకిముందు, సి.ఆర్. దాస్, మోతీలాల్ నెహ్రూ వంటి జాతీయ నాయకుల కుటుంబాలకూ చెందిన కొద్దిమంది మహిళలు, లేక,

పెద్ద పట్టణాలలో కొంతమంది కళాశాల విద్యార్థులు మాత్రమే బహిరంగ రాజకీయ ప్రదర్శనల్లో పాల్గొన్నారు. యిప్పుడు యింకా ఎక్కువమంది మహిళలు ఉద్యమంలో చేరి, అరెస్టు కావడానికి సిద్ధమయ్యారు. ఆ రోజుల్లో సనాతన నగరమనుకుంటున్న ఒక్క ఢిల్లీ నగరంలోనే, రాజకీయ కార్యకలాపాలు జరిపినందుకు 16 వందలమంది మహిళలను జైలులోపెట్టారు బొంబాయిలో మధ్యతరగతి మహిళలు అనేకమంది జాతీయసమరంలో చేరారు. శాసనోల్లంఘన ఉద్యమం ఏమీ సాధించకపోయినప్పటికీ భారతీయ మహిళలు ఏకమొత్తంగా సాంఘిక సముద్ధరణ సాధించడానికి యిది ఎంతో దోహదమయిందని బ్రిటిష్ పరిశీలకులు కూడా వ్రాశారు. ఇది వొక మంచి విశేషం. భారతీయ మహిళల సముద్ధరణ కోసం సాంఘిక సంస్కరణ ఉద్యమాలు 75 సంవత్సరాలలో సాధించని దానిని యిది కొద్ది వారాలలో సాధించింది.

ఇలా వుండగా 1930 ఏప్రిల్, మే వేసవిలో వలంటీర్లు ఉప్పు చట్టాలను ధిక్కరించారు. గాంధీజీని, సత్యాగ్రహం జరిపి, ధరసానా ప్రభుత్వ డిపోలో ఉప్పు తయారు చేయకపూర్వమే అరెస్టు చేశారు. ఉద్యమ నాయకులుగా ఈయన స్థానాన్ని బృహత్ బొంబాయి నేషనలిష్టు ముస్లిం కుటుంబానికి చెందిన షియా అబ్బాస్ తయాబ్జీ, స్వీకరించారు. ఆయన్ను కూడా అరెస్టు చేశారు. ఆ తర్వాత ప్రఖ్యాత కవయిత్రి, నేషనలిష్టు అయిన సరోజిని నాయుడు నాయకత్వం వహించారు. మే 21వ తేదీన ధరశానా మీద దాడి జరపడానికి ఆమె చేసిన ప్రయత్నాన్ని అమెరికన్ జర్నలిస్టు వెబ్ మిల్లర్ ఎంతో కష్టంమీద అక్కడికి చేరుకున్న తర్వాత యిలా వర్ణించారు.

"శ్రీమతి నాయుడు పదయాత్ర ప్రారంభం కావడానికి ముందు ప్రార్థనలు జరిపారు. ప్రజలంతా యిందులో పాల్గున్నారు. అప్పుడామె యిలా అన్నారు: 'భారతదేశపు గౌరవం మీ చేతుల్లో వుంది....మిమ్మల్ని కొడతారు. అయినా మీరు ప్రతిఘటించకూడదు. కొడుతూవున్నా మీరు చేతులు అడ్డం పెట్టకూడదు.' అని ఆమె అనేటప్పటికి ప్రజలంతా హర్షధ్వానాలు చేశారు.

మెల్లిగా మౌనంతో అరమైలు దూరాన వున్న ఉప్పుడిపోలకు ప్రజలు పదయాత్ర సాగించారు. ఉప్పు డిపోల చుట్టూ నీటి గుంటలున్నాయి; సూరత్ స్థానిక పోలీసులు నాలుగు వందల మంది కాపలా కాస్తున్నారు. అరడజను మంది బ్రిటిష్ అధికారులు వీరిని కమేండ్ చేస్తున్నారు. పోలీసుల చేతుల్లో లాఠీలు మాత్రమే కాక ఉక్కు తొడుగు లున్న ఐదు అడుగుల పొడవుగల కఱ్ఱలున్నాయి. తీగకంచెకు లోపల తుపాకులు ధరించిన 25 మంది సిద్ధంగా వున్నారు.



దండిలో గాంధీజీ ఉప్పు శాసనాన్ని ఉల్లంఘించడం



జవహర్‌లాల్ నెహ్రూ



కృష్ణమీనన్, జనరల్ లిస్టర్, జవహర్ లాల్ నెహ్రూ—1938లో స్పెయిన్‌లో



గోవింద్ వల్లభ్ పంత్



జయప్రకాష్ నారాయణ్



ఐ. ఎన్. ఏ. లో మహిళల పటాలం

ఏవొక్క చోటనయినా ఐదుగురికంటె ఎక్కువమంది గుమికూడదన్న అంతకుముందే విధించిన నిబంధన ననుసరించి, ప్రదర్శకులు చెదిరిపోవాలని పోలీసు అధికారులు ఉత్తర్వు చేశారు. పికెటింగ్ చేస్తూవున్న బృందం ఈ హెచ్చరికను విస్మరించి మెల్లిగా ముందడుగు వేసింది. అనేకమంది స్థానిక పోలీసులు ఒక్కసారి వీరిమీద విరుచుకుపడి ఉక్కుపన్నులుగల లాఠీలతో వారి తలలమీద దెబ్బలు కొట్టారు. ప్రదర్శకులలో ఒక్కరు కూడా దెబ్బలకు చేతులు అడ్డం పెట్టలేదు. అడ్డులేని వారి తలలమీద లాఠీలతో పడుతూ వున్న దెబ్బల శబ్దం వినిపిస్తూవుంది. అక్కడ నిలబడి చూస్తూవున్న గుంపులు, ప్రతి దెబ్బకు సానుభూతితో, ఎంతో బాధతో, మూలుగుతూ తమకు దెబ్బ తగిలినట్టుగా దీర్ఘ నిచ్ఛ్వాసాలను విడిచారు.

రెండు మూడు నిమిషాలలో భూమిమీద అంతా శరీరాలు చెదురు మదురుగా పడి పోయాయి. వారి తెల్లని బట్టలన్నీ రక్తసిక్తమయ్యాయి. మొదటి బృందంలో ప్రతి వొక్కరు పడిపోయిన వెంటనే పోలీసుల వొత్తిడి లేకనే, స్ట్రెచర్‌లతో వచ్చినవారు, గాయపడినవారిని మోసుకెళ్ళారు.

ఆతర్వాత మరో బృందం సిద్ధమయింది. ఆత్మనిగ్రహశక్తిని కోల్పోవద్దని వారి నాయకులు వీరిని ఉద్బోధించారు. వీరు ముందడుగు వేశారు. సంగీతంకానీ, చప్పట్లు కొట్టేవారి ప్రోత్సాహం లేకుండానే, తీవ్రమైన గాయాలనుంచిగానీ, మరణంనుంచిగానీ తప్పించుకునే అవకాశాలు లేకుండానే వీరు, ముందడుగు వేశారు. పోలీసులు వెంటనే ఒకపద్ధతి ప్రకారం వీరిపైబడి,యంత్రాల మోస్తరుగా రెండో బృందాన్ని కొట్టారు. ... గాయపడిన 18 మందిని ఆదేసమయంలో తీసుకెళ్ళడం నేను చూశాను. మరో 42 మంది రక్తం కారుతూ భూమిమీద పడివుండటం నేను చూశాను. వీరిని మోసుకెళ్లేవారు యింకా రాలేదు."

చేదిరిపోవలసిందిగా యిచ్చిన ఉత్తర్వును ధిక్కరించి కూర్చొని వున్న గుంపుమీదికి వెళ్ళి, వారిని చావమోదుతూ వున్న భారత పోలీసుల గురించి మిల్లర్ యిలా వర్ణించారు.

"ఒకప్పుడు, ప్రతిఘటించని వ్యక్తులను కొట్టడంవల్ల వారి శరీరాలనుంచి కారుతూ వున్న రక్తం ఎంత విషాదాన్ని కలిగించిందంటే, ఆ దృశ్యాన్ని చూడలేక పరుగెత్తి పోవలసి వచ్చింది. వర్ణించడానికి సాధ్యంకాని కోపమూ, బాధ, నాకు కలిగాయి.

అహింసా ఉద్యమాలు అనేకసార్లు విఫలమయ్యాయి. గాంధీజీ ఆదేశాలను గుర్తుంచు కోవలసిందిగా, రెచ్చిపోయిన వారిని నాయకులు పదేపదే ఉద్బోధించవలసి వచ్చింది. నిరాయుధులయిన గుంపులు వొక్కసారి మూక వుమ్మడిగా పోలీసులమీద విరుచుకు

పడుతున్నారా ! అని అనిపించేది. గుంపుమీద కాల్పులు జరపడానికి, తమ రైఫిల్ మెన్‌ను ప్రక్కనేవున్న గుట్టమీద బ్రిటిష్ పోలీసు సూపరెన్‌టెన్‌డెంట్ సిద్ధంగా వుంచారు. ఆ సమయంలో సరోజినీ నాయుడు మహారాణి మోస్తరుగా వ్యవహరించారు.

బ్రిటిష్ అధికారి ఒకరు ఆమెను సమీపించి, ఆమె భుజంమీద చేయివేసి "సరోజిని నాయుడు మీరు అరెస్టు కాబడ్డారు" అన్నారు. వెంటనే కోపంతో ఆమె, భుజంమీద నుంచి చేయిని తీసివేసి "నేను వస్తాను, నన్ను ముట్టుకోకు" అన్నారు.

ఆ రోజు మధ్యాహ్నం 11 గంటలయ్యేటప్పటికి ఎండవేడి ఎక్కువయింది. ఉష్ణోగ్రత 116 డిగ్రీల ఫారిన్‌హైట్‌ను అందుకుంది; ప్రదర్శనలు సద్దుమణిగాయి. 320 మందికి తీవ్రమైన గాయాలు తగిలాయి, యిద్దరు మరణించారు, కొద్దిమంది నేషనలిష్టు డాక్టర్లు మాత్రమే అక్కడ వున్నారు. ఈ కథను ప్రపంచ పత్రికలకు పంపడానికి మిల్లర్ ప్రయత్నించినపుడు, అధికారులు మొదట దానిని నిలిపివేశారు; ఆ తర్వాత సెన్సార్ చేశారు. చాలా కాలం తర్వాత ఆయన దానిని ఒక పుస్తకంగా ప్రచురించారు.

గాంధీజీ అరెస్టుకు నిరసనగా భారతదేశమంతటా ప్రదర్శనలు జరిగాయి. బొంబాయిలో, ఉప్పు కొటార్లున్న భెండి బజార్‌లోనూ, వడాలాలోనూ కొట్లాటలు జరిగాయి, అయితే యూరొపియన్లు నివసించే ప్రాంతంగుండా జరిగిన ఊరేగింపు, అహింసాత్మకంగా జరిగింది. మద్రాసులో పోలీసులు విచక్షణలేకుండా కొట్టారు. బెంగాల్, బీహార్ ఒరిస్సాలలో బ్రిటిష్ వస్త్రాన్ని ఎక్కువగా బహిష్కరించారు. ఉత్తర ప్రదేశ్‌లో పన్నులు చెల్లించవద్దని కర్షకులనూ జమిందార్లనూ కోరారు; అక్టోబరు తర్వాత జమిందార్లకు కౌలు చెల్లించవద్దని కర్షకులను కోరారు. మధ్య రాష్ట్రాలలో అటవీ పన్నులకు వ్యతిరేకంగా సత్యాగ్రహం ప్రారంభమయింది. కర్ణాటకలో, పన్నులు చెల్లించకుండా వుండే వుద్యమాన్ని విజయవంతంగా ప్రారంభించారు.

ఈ ఉద్యమం త్వరగా విస్తరించి, దేశంలో మారుమూల ప్రాంతాలను కూడా చేరుకుంది. వాయవ్య సరిహద్దు రాష్ట్రం పశ్చిమ కొండల్లో బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా పఠాన్ ఆదిమవాసులు అనేకసార్లు తిరుగుబాటు జరిపారు. దేరాఇస్మయిల్‌ఖాన్, పెషావర్, బన్నూ, కోహట్ నదీలోయ ప్రజలు, స్థానిక అధిపతుల క్రింద స్థిమితమయిన వ్యవసాయ పరిస్థితులలో నివసించారు.

పెషావర్ సమీపంలో ఉత్మంజాయి గ్రామానికి చెందిన పెద్దలలో ఒకరయిన ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్, మొట్టమొదటి పఠాన్‌విద్యా సంఘాన్ని ప్రారంభించారు. 1919 లో హిజ్‌రాత్, ఆఫ్ఘన్ అనుకూల ఉద్యమాలను బలపరిచే కార్యకలాపాలలో పాల్గొన్నందువల్ల ఆయన్ను జైలులో వుంచారు; ఆ తర్వాత రాష్ట్రంనుంచి చాలాకాలం

అజ్ఞాతవాసంలో వుంచారు 1929 కి ముందు ఆయన తిరిగి వచ్చారు. ఆధునిక విద్యను నేర్చుకున్న ఆయన పెద్ద అన్న డాక్టర్‌ఖాన్ సాహెబ్‌తో కలిసి, అహింసాత్మక గాంధీ ఉద్యమాన్ని బలపరుస్తూ అనేకమంది పఠాన్‌లను తయారుచేశారు. తమ ప్రవర్తన శక్తికీ, కృతనిశ్చయానికీ పేరుపొందిన అబ్దుల్ గఫార్‌ఖాన్ ఫ్రాంటియర్ గాంధీ అని ప్రఖ్యాతి వహించారు. మొట్టమొదట ఆయన పఠాన్ జిర్గా లేక కొండ తెగల సమితి జాతీయవాదుల శాఖను ఏర్పాటు చేశారు కాంగ్రెసు వాలంటీర్ విభాగాల మోస్తరుగా వుండే ఈ శాఖను ఖుదై ఖిద్‌మత్‌గార్స్, అంటే భగవంతుని సేవకులు అనేవారు. వీరు ధరించే దుస్తులవల్ల, వీరిని రెడ్‌షర్ట్స్ అని ప్రజలు అంటూ వుండేవారు. పఠాన్ ప్రాంతీయ జాతీయవాదుల ఐక్యతకావాలనీ, వలస రాజ్యాధిపత్యానికి వ్యతిరేకంగా సమరం జరపాలనీ, హస్తకళా కార్మికుల పేదరికాన్ని రూపుమాపాలనీ, వీరు కోరారు. పామరజనం, పేదకర్షకులు, పట్టణ హస్తకళా కార్మికులు కూడా వీరిని బల పరిచారు. 1930 లో ఖుదై ఖిద్‌మత్‌గార్స్ సంఖ్య 80 వేలు వుండేది. దేశంలో యితర ప్రాంతాలలో గాంధేయ నాయకత్వంకన్నా, తమ అనుచరుల దౌర్జన్యపూరితమైన కోర్కెలను కంట్రోలు చేయడం అబ్దుల్ గఫార్‌ఖాన్‌కి బహు కష్టంగా వుండేది.

పెషావర్‌లో ఏప్రిల్ 20 తేదీన అనేకమంది పేదకర్షకులు ఈద్ ఉత్సవాలకు గుమికూడినపుడు శాసనోల్లంఘన ఉద్యమం ప్రారంభం కావలసివుంది. అనేకమంది సరిహద్దు కొండ తెగల ప్రజలు మైదానాలలో ఆయా కాలాలకు అనుగుణమైన పనులను చేసుకున్న తర్వాత తిరిగి స్వగృహాలకు రావలసినవారు, ఈ ఉత్సవాలలో పాల్గొనడానికి హాజరయ్యారు. స్థానిక కాంగ్రెస్‌వాదులను అరెస్టు చేసినపుడు పట్టణగుంపు ఆక్షేపణ తెలిపి, పోలీసులనుంచి వారిని విడిపించడానికి గట్టి ప్రయత్నం చేశారు. కొండ తెగలవారు కూడా, వీరితో చేశారు. ఉద్రేకాలు పెచ్చుపెరిగిపోయాయి; రెండు వైపుల నుంచి కాల్పులు జరిగాయి. ప్రజా తిరుగుబాటు ప్రారంభమయింది. పెషావర్ తిరుగు బాటును అణచివేయడానికి పంపబడిన కవచ శకటాలు ముందుకు వెళ్ళకుండా అడ్డం కులు పెట్టారు. అధికారులు, పట్టణ పై తరగతి పెద్దలు సైనిక కంటోన్‌మెంటులో తలదాచుకున్నారు. ఈలోగా అకాలీలు, వీర శిక్కు సంస్కర్తలు, జాతీయవాదులు సైన్యానికి చెందిన భారతీయ సైనికులలో తిరుగుబాటును ప్రేరేపించే ప్రయత్నం చేశారు. గుంపుమీద కాల్పులు జరపవలసిందిగా రాయల్ ఘద్వాల్ రైఫిల్స్, క్రేక్ హిల్ సైనికులు అన్న రెండు పటాలాలకూ ఉత్తర్వులిచ్చినపుడు, తమ సహచరులలో వొకరయిన చెందర్‌సింగ్ ఘద్వాలీ విజ్ఞప్తిని మన్నించి, కాల్పులు జరపడానికి వీరు నిరాకరించారు; ముస్లిం పఠాన్ సోదరులలో సౌభ్రాత్రత కనబరిచారు. "విభజించి పరి పాలించు" అన్న బ్రిటిష్ విధానం బలహీనమయినదని అనడానికి యిది మరో ఉదాహ

రణ. సమైక్యంగా వుండాలని పీడిత ప్రజలకు ముందుగా బోధించినట్లయితే, ఈ విధానం విజయవంతం కానేరదు.

కంటోన్ మెంటునుంచి వచ్చిన బ్రిటిష్ సైన్యాలు ఘద్వాలీ పటాలాలను చుట్టు ముట్టాయి; వారికి ఆ తర్వాత సైనిక శిక్షలు విధించాయి. తిరుగుబాటు జరిపినందుకు వారి నాయకుల్లో కొంత మందిని ఉరితీశారు. అయితే మే నెలారంభంలో అఫ్రిది, మోహమ్మద్ కొండజాతులు తిరుగుబాటు జరిపి, పట్టణ తిరుగుబాటులో చేరడానికి, పెషావర్‌కు వచ్చారు. పంజాబ్‌లో, పెషావర్ పట్ల, ముఖ్యంగా అకాలీలు సమైక్యత ప్రకటించారు. స్థానిక అలజడిదార్లకు తోడ్పడటానికి అకాలీలు ఒక బృందాన్ని పంపారు. ఈ బృందాన్ని జీలం నది దగ్గర బ్రిటిష్ సైన్యం ఆపివేసింది. చిట్టచివరికి ప్రజలను శిక్షించే బ్రిటిష్ సైన్యం వాయవ్య సరిహద్దు రాష్ట్రంలోనికి వెళ్ళి ఆదిమవాసులను కొండలలోకి తరిమివేసింది.

తూర్పు బెంగాల్ రేవు అయిన చిట్టగాంగ్‌లో ప్రఖ్యాత దౌర్జన్యవాది సూర్యసేన్ నాయకత్వం క్రింద, స్థానిక క్రిందిమధ్యతరగతి యువజనులు తిరుగుబాటు ప్రయత్నం జరిపారు. తూర్పు బెంగాల్‌లోని బ్రిటిష్ సైనిక స్థావరాలమీద వొకేసారి దాడులు జరపడానికి వీరు పథకాలు వేశారు.

సూర్యసేన్ అనుచరులయిన స్థానిక కాంగ్రెసు వ్యక్తి అంబికా చక్రవర్తి, లోక్‌నాథ్ బాల్, ఆ తర్వాత ప్రముఖ కమ్యూనిష్టులయిన గణేశ్ ఘోష్, స్థానిక కళాశాలలూ పాఠశాలల విద్యార్థులను సమీకరించారు. వీరిలో యువకులయిన ఆనందగుప్త, టెగ్‌రా (టైగర్) బాల్, ధైర్య సాహస యువతులయిన కల్పనాదత్, ప్రీతిలతా వాదేదార్‌లాంటి వారున్నారు.

భారత రిపబ్లికన్ సైన్యం, చిట్టగాంగ్ శాఖ పేరుమీద సూర్యసేన్ విడుదల చేసిన ప్రణాళికలో, బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా యుద్ధం జరపాలని భారతీయులను కోరారు. ఆయన, ఆయన సహచరులు చిట్టగాంగ్‌లో నాలుగుచోట్ల యూరోపియన్లు నివసించే ప్రాంతాలపై దాడి జరిపారు. పోలీసు గిడ్డంగులమీద, 50 మంది యువకులు బ్రిటిష్ భారత సైన్యం దుస్తులు ధరించి మారువేషంతో, దాడి జరిపారు. ఈ ఉదంతాన్ని చిట్టగాంగ్ డిపోదాడి అని అంటూ వుంటారు.

అయితే తొందరలో వారు, తమ చేతికందిన లూయిస్ గన్స్‌కి, రైఫిల్సుకి తూటాలు తీసుకోడానికి మరిచిపోయారు. ఒక చిన్న తగిన ఆయుధాలులేని ప్రభుత్వదళం, పోలీసు డిప్యూటి ఇన్‌స్పెక్టర్ జనరల్ నాయకత్వం క్రింద వీరిని ఎదుర్కొని, పట్టణంనుంచి, చిట్టగాంగ్‌కు దూరంగావున్న కొండలలోకి వారిని ఉపసంహరించుకునేటట్టు చేసింది.

మే 22 తేదీన 57 మంది విప్లవవాదులను జలాలాబాద్ కొండలలో బ్రిటిష్ పటాల మొకటి చుట్టు ముట్టింది. అయినప్పటికీ గెరిల్లా యుద్ధాన్ని సాగించడానికి, అనేకమంది తప్పించుకుపోయారు ; దీనికిముందు వీరు 64 మంది బ్రిటిష్ సైనికులను చంపివేశారు. విప్లవవాదులలో కడు చిన్నవాడయిన తెగ్రాబాల్, మొదటి గుండ్లవల్ల బలమైన గాయాలు తగిలాయి. మరణించేముందు లోకేనాథ్‌తో ఆయన "నేను వెళ్లిపోతున్నాను, చివరి వరకు పోరాడండి" అన్న ఆఖరిముక్కలు చెప్పాడు.

ఇది జరిగిన తర్వాత విప్లవ దౌర్జన్యవాదుల కార్యకలాపాలు బెంగాల్ అంతటా విస్తరించాయి. ఆగస్టులో, ఢాకామిట్‌ఫోర్డు హాస్పిటల్ స్కూల్ విద్యార్థి బినయ్‌బోస్ ఢాకాలో ఒక సీనియర్ బ్రిటిష్ పోలీసు అధికారిమీద కాల్పులు జరిపి ఆయన్ను చంపిపేసి, పారిపోయాడు. డిసెంబరులో మరోయిద్దరు, బాదల్, దీనేష్‌లతో కలిసి అతను కలకత్తా డల్‌హవుసీస్క్వేర్‌లోవున్న ప్రభుత్వప్రధాన కార్యాలయం రయిటర్సుబిల్డింగ్‌లో ప్రవేశించాడు. జైళ్ళ ఇన్‌స్పెక్టర్ జనరల్‌ని ఆయన ఆఫీసులో కాల్చివేశారు. ఆతర్వాత నడవ ద్వారా పరుగెత్తుతూ కనుపించిన యూరొపియన్ అధికారుల మీదంతా కాల్పులు జరిపారు. పట్టుబడటంకంటే మంచిదని బాదల్ సయనయిడ్ తిని మరణించాడు; బినయ్, దీనేష్ తమను తామే కాల్చుకున్నారు. బినయ్ బోస్ కొద్దిరోజులలో మరణించాడు, అయితే దీనేష్ తేరుకున్నాడు కాని, అతన్ని విచారించి ఉరితీశారు.

ఉత్తరాదిలో, ప్రఖ్యాత చంద్రశేఖర్ ఆజాద్ దౌర్జన్యకాండ జరుపుతూనే వచ్చాడు. పోలీసులు ఆయన సహచరులను పట్టుకున్నారు, సప్లయిలు ఎక్కడినుంచి అందుతున్నాయో తెలుసుకున్నారు ; అయినప్పటికీ చంద్రశేఖర్ వారికి చిక్కలేదు. 1931 ఫిబ్రవరిలో పోలీసులు ఆయన్ను మోసగించారు. చివరి వరకూ పోరాడుతూ వళ్ళంతా గుండ్ల గాయాలతో అలహాబాద్‌లోని అల్‌ఫ్రెడ్‌పార్కులో మరణించాడు. అంతకిముందు 1930లో ప్రభుత్వం లాహోర్ కుట్రకేసు ఆర్డినెన్సు క్రింద విశేషన్యాయ అధికారాలను పొందింది, దీనివల్ల భగత్‌సింగునూ, ఆయన అమచరులనూ, సాక్షులు, అప్పీలు చేసుకునే హక్కువంటి మామూలు నియమాలు లేకుండా విచారించవచ్చు. అక్టోబరు 7 తేదీన భగత్‌సింగ్, సుఖదేవ్, రాజ్ గురులకు మరణశిక్షలు విధించారు. మిగతావారికి యావజ్జీవ జైలు శిక్షలు విధించారు. వీరిలో అనేకమందిని అండమాన్ దీవులలోని పోర్టుబ్లెయర్‌లో గుంభ్రని జైలులో కఠిన నరకంలో వుంచారు.

ఈ విప్లవ దౌర్జన్యవాదుల దాడులు తూర్పుబెంగాల్, ఉత్తర ప్రదేశ్ క్రింది మధ్య తరగతి యువకులలో దేశభక్తిని సూచిస్తున్నాయి. సంప్రదాయ సిద్ధమైన జాతీయ ఉద్యమం ద్వారా వీరి ప్రగాఢ వాంఛలు నెరవేరలేదు. గాంధేయ అహింసాత్మక తత్వం

కూడా వారికి నచ్చలేదు. అందువల్ల వీరు, దౌర్జన్యాలకు దిగారు. అయితే వీరి దౌర్జన్య చర్యలే వీరిని అంతంచేశాయి. ఇందులో పాల్గొన్న బాల బాలికలు అశేష ధైర్య సాహసాలు ప్రదర్శించినప్పటికీ ప్రభుత్వ పోలీసు, సైన్యం శక్తిముందు వీరు విజయం సాధించ జాలరు. బ్రిటిష్‌వారు నిజంగా భయకంపితులు కాలేదు. విప్లవ దౌర్జన్య వాదులను సర్వనాశనము చేయాలన్న దృఢనిశ్చయం వీరిలో యింకా బలపడింది. దౌర్జన్య వాదుల దాడులవల్ల సానుభూతితో ప్రజాతిరుగుబాట్లు జరగవన్నది వొకకారణం. ప్రజా సామాన్యానికి రాజకీయ చైతన్యం కలగ జేయడంగానీ, విప్లవవాదులు వారిని వ్యవస్థీకరించడంగానీ జరగనందున ప్రజానీకం దౌర్జన్య పూరిత విప్లవంలో పాల్గొనడానికి గానీ, దానిని తీసుకు రావడానికి గానీ సిద్ధంగా లేరు.

దక్షిణ మహారాష్ట్రలో ప్రత్తిపండించే జిల్లా అయిన షోలాపూర్ పట్టణంలో కార్మికులు ప్రజా తిరుగుబాటులో పాల్గొనలేదు. స్థానిక కాంగ్రెసు సంఘం ఏర్పాటుచేసిన యుద్ధసమితి, మేనెలలో యిక్కడ శాసనోల్లంఘన ఉద్యమాన్ని ప్రారంభించింది. పట్టణంలో జాతీయ పతాకను ఎగురవేశారు, బ్రిటిష్ రాజ్‌కు విధేయులయిన పోలీసులు, యితర సివిలియన్ అధికారులు రైలు స్టేషన్‌కు వెళ్ళిపోయారు.

షోలాపూర్‌నుంచి వార్తలపై బ్రిటిష్ పాలకవర్గం నిషేధం విధించింది. తిరుగుబాటును అణచివేయడానికి 2 వేలమంది బ్రిటిష్ సైనికులను పంపవలసి వచ్చింది. తిరుగుబాటు జరిపిన విప్లవవాదులలో చాలామందిని ఉరితీయడమో, జైలులో వుంచడమో జరిగింది.

ఈ విప్లవ కార్యకలాపాలతోపాటు అనేక కర్షక ఉద్యమాలుకూడా పెంపొందాయి. 1930లో పన్నుల నిరాకరణ ఉద్యమం ఈ ఉద్యమాలకు దారితీసింది. అయితే యింతకన్న ప్రబలకారణం భూకామందులు కర్షకులను పీడించుకు తినటమే.

ప్రపంచ పెట్టుబడిదారి వ్యవస్థలో క్లిష్ట పరిస్థితి ఏర్పడటంవల్ల, వ్యవసాయ సరుకుల అంతర్జాతీయ మార్కెట్ ధరలు పడిపోయాయి. అమ్మకాలవల్ల లాభాలలో కర్షకుల వాటా తగ్గిపోవడంవల్ల కౌలురూపంలో భూకామందులకూ, భూమిశిస్తు, యితర పన్నుల రూపంలో ప్రభుత్వానికీ బకాయీలను చెల్లించడం కష్టమయింది.

(జవహరిలాల్ నెహ్రూ అధ్యక్షులుగావున్న) ఉత్తర ప్రదేశ్ కాంగ్రెసు సంఘం 1930 మార్చిలో ఒక తీర్మానాన్ని ఆమోదిస్తూ, జాతీయ కార్యక్రమంలో భూమిపన్ను తగ్గించడం, వడ్డీవ్యాపారులకు కొంతవరకూ పరిహారం చెల్లిస్తూ ఋణాల మీద మారటోరియం యివ్వడం, కౌలుదార్లను వెళ్లగొట్టకుండా భూకామందులకు నిరంకుశాధికారాలు లేకుండా చేయడం,— మున్నగు ప్రతిపాదనలను సూచించారు.

పన్నుల నిరాకరణ ఉద్యమం అలహాబాద్ జిల్లాలోని అవధ్‌లో ప్రారంభమయింది. ఇక్కడ ఎమ్. ఎన్. రాయ్, ఆయన అనుచరులు, గ్రామాలలో సోషలిష్టు భావాలను పరివ్యాప్తం చేయడంలో, కాంగ్రెసులో చేరారు. కేవలం జనుము మాత్రమే పండించే తూర్పు బెంగాల్‌లోని కిషోర్‌గంజ్‌లో, ప్రపంచ పెట్టుబడిదారి వ్యవస్థ మాంద్యం ప్రత్యక్ష ఫలితంగా ప్రపంచ జనపనార ధరలు పడిపోవడంవల్ల, జనుము పండించే కర్షకులందరూ దెబ్బతిన్నారు. వీరు కౌలు చెల్లించడం నిలిపివేశారు. కలకత్తా కార్మికులు వీరి పట్ల సానుభూతి కనబరిచి, వీరిని బలపరిచారు. కర్షక ఉద్యమాన్ని అణచివేయడానికి, సైనికులను కిషోర్‌గంజ్‌కి పంపవలసి వచ్చింది. బీరార్‌లోని బుల్దానా జిల్లాలో డిసెంబరులో వర్తకులు, వడ్డీవ్యాపారులు నిర్దాక్షిణ్యంగా పీడించుకు తినడంవల్ల, కర్షకులు ఎన్నోబాధలకు గురి అయ్యారు. తాము ముఖ్యంగా పండించే ప్రత్తిని వీరు తీసుకొచ్చారు. స్థానిక భూకామందులు, కౌలుదార్లనూ, వ్యవసాయ కూలీలనూ పీడించుకు తినడం ఎక్కువయింది. అందువల్ల బుల్దానా కార్మికులు, కర్షకులు, ఒక కర్షక యూనియన్‌ని ఏర్పాటుచేశారు. పన్నులనూ, కౌలునీ, వడ్డీనీ చెల్లించకూడదని ఈ యూనియన్ కోరింది. వ్యవస్థీకృతమైన కర్షక వలంటీర్లు బ్రిటిష్ పన్నుల అధికార్లను ప్రతిఘటించి, దప్పులేస్తూ, ఒక గ్రామంనుంచి మరోగ్రామానికి వెడుతూ, వడ్డీవ్యాపారులూ, భూకామందుల ఆస్తినీ, పంటలనూ దోచుకుంటూ, వారియిండ్లకు నిప్పుపెట్టారు. ఈచర్య వివిధ కులాలనూ, హిందువులనూ, ముస్లింలనూ సమైక్యం చేసింది. గ్రామపేదలు వాస్తవంగా తిరుగుబాటు జరపడమే దీనిభావం. మళ్ళీసైనికులను, పోలీసులకు మద్దతుగానూ, తిరుగుబాటును అణచివేయడానికీ, బుల్దానాకు పంపవలసి వచ్చింది.

ఇటువంటి కర్షక తిరుగుబాటులు, గాంధీజీ దండిపదయాత్ర ప్రపంచప్రజలు లేక భారతప్రజల దృష్టి నాకర్షించినట్టుగా, ఆకర్షించలేదు. అయితే యివి అఖిలభారత కిసాన్ సభకు మొట్టమొదటి కీలకాలుగా పనిచేశాయి. ఈ కిసాన్‌సభ, తమను పీడించుకుతినే పరిస్థితులకు సామ్రాజ్యవాదం కారణమన్న చైతన్యాన్ని కర్షకులకు కలిగించింది. వీరకర్షకులు తమవర్గం స్థితిగతులను మెరుగుపరచడానికి సమరం జరిపారు. అయితే వీరు పల్లెసీమల్లో పనిచేసిన సాహస పట్టణ విప్లవాదుల పట్లకూడా సానుభూతి కనబరిచారు. ఈ విధంగా, 1930 శాసనోల్లంఘన ఉద్యమంతర్వాత పలురకాల ప్రజాఉద్యమాలు బయలుదేరాయి: అయితే అన్నీ, గాంధేయ అహింసా సూత్రాలకు అనుగుణంగా వ్యవస్థీకృతం కాలేదు.

## ప్రభుత్వ వైఖరి

ప్రజావుద్యమాలు దౌర్జన్య పూరితంగా పరిణమించినప్పటికీ, ప్రభుత్వం, సమాధాన పూర్వకమైన వైఖరిని ప్రదర్శించలేదు. తూర్పుబెంగాల్‌లో జిల్లాఅధికారిగానే దమన నీతికి ప్రసిద్ధికెక్కిన, ఢిల్లీలో హోమ్‌సెక్రటరీగా వున్న ఐ.సి.ఎస్ అధికారి ఎమర్‌సన్, శాసనోల్లంఘన ఉద్యమమంటే విరుచుకుపడేవాడు. ఏప్రిల్ ఆఖరులో, పత్రికలనుంచి పూచీలు కోరుతూనూ, కాంగ్రెసు సంస్థలను చట్ట విరుద్ధమయిన సంస్థలుగా నిషేధిస్తూనూ ఆర్డినెన్సులు జారీచేశారు. వీటి ఆస్తులను స్వాధీనం చేసుకోడానికి ప్రభుత్వానికి అధికారం లభించింది. చట్టాలను ధిక్కరించిన వారిని ఏకమొత్తంగా అరెస్టుచేశారు; మేనెల ఆరంభానికల్లా కాంగ్రెసు నాయకులను జైళ్ళలోపెట్టారు. ఆ తర్వాత కాంగ్రెసు పెద్దలనూ, సభ్యులనూ, వారిపట్ల సానుభూతి చూపేవారినీ హింసించడం మొదలుపెట్టారు.

ప్రభుత్వానికి వ్యతిరేకంగా పలుప్రజలు తెచ్చిన హింసాత్మక ఆరోపణల గురించి దరియాప్తు జరపడానికి, కాంగ్రెసు ఒక అనధికార విచారణ సంఘాన్ని నియమించింది. ఈ విచారణ సంఘం నివేదికను కాంగ్రెసు ఆరోపణలు అన్న పేరుతో ప్రచురించారు; భారత దేశంలోని వివిధ ప్రాంతాలలో అధికారులు జరిపిన హింసాచర్యలను యిందులో ఉదాహరించారు. పట్టణాలలో ప్రజలు తిరగబడినపుడు, బ్రిటిష్‌సైనికులు దోవలో నడుస్తూవున్న పురుషులు మహిళలమీద జరిపిన అత్యాచాలగురించి యిందులో పేర్కొన్నారు. మద్రాసులో మొట్టమొదటిసారిగా అవలంబించిన ఒకచర్య, ఆతర్వాత భారతదేశమంతటా పరిపాటి అయిపోయింది.

చట్టవిరుద్ధంగా గుమికూడారన్న ఆరోపణమీద ప్రజలపై కేసులు పెట్టడంలో పోలీసులు ఒక కొత్తపద్ధతిని అవలంబించారు. వివిధ కేంద్రాలలో పికెటింగ్ జరిపినవారిని, ఒక చోట చేర్చి, వారిని ఒక లారీలో పడేసి, పట్టణానికి దూరంగా తీసుకెళ్ళి, అక్కడ వారిని వదిలివేసేవారు. తిరిగిపట్టణానికి చేరుకోడానికి వీరివద్ద డబ్బులేనందువల్ల వారు నాన అవస్థలు పడేవారు.

కర్ణాటకలోని అంకోల, సిద్ధాపూర్ తాలూకాలలో 2 వేలమంది సభ్యులుగల 330 కుటుంబాల భూములను స్వాధీనం చేసుకున్నారు. 116 యిండ్లనూ, చరాస్తినీ స్వాధీనం చేసుకున్నారు. శిక్షింపబడిన ప్రజలు చాలా పేదవారు; వారు చాలా కొద్ది ఆస్తిగలవారు. సిద్ధాపూర్‌లో 37 మంది మహిళా సత్యాగ్రహులు, స్వాధీనం చేసుకొని ఆతర్వాత వేలం వేసిన ఆస్తిని కొన్నవారి యిండ్ల గుమ్మాలదగ్గర నిరాహారదీక్ష జరిపారు. అయితే ఆస్తిని కొనడానికి సిద్ధంగావున్న ప్రజలు కొంతమంది యింకా వున్నారు అంటే గాంధేయ తత్వాన్ని యావద్దేశ ప్రజలు యింకా ఆమోదించలేదని స్పష్టమవుతోంది.

బెంగాల్‌లో, కాల్పులు, లాఠీచార్జీలు జరగని రోజులేదు. పోలీసులు కలకత్తా విశ్వ విద్యాలయంలో తరగతుల్లోనికి వెళ్ళి అమాయకులయిన విద్యార్థులను నిర్దాక్షిణ్యంగా కొట్టే వారు. గుజరాత్‌లో కర్షకులు సరిహద్దులను దాటి బరోడా సంస్థానానికి వెళ్ళడం మొదలు పెట్టారు. భారతప్రజలకు స్నేహితుడయిన ఒక ఇంగ్లీషువ్యక్తి హెచ్.ఎన్. బ్రెయిల్స్ ఫోర్డు, వింతగా వీరు వలస వెళ్ళిపోవడం గురించి ఇలావ్రాశాడు.

కొద్దిమంది పుష్కలంగా పండిన పంటను తగులబెట్టారు; వీటిని తీసుకెళ్ళడానికి వీలులేక పోయింది. వారి శిబిరాలలో ఒక దానిని నేను చూశాను. చుట్టూ చాపలు కట్టి, తాటాకుల కప్పువేసిన తాత్కాలిక ఆశ్రయాలను వారు నిర్మించారు. తమ యిండ్లను ఎందుకు వదలి పెట్టవలసి వచ్చింది అని వారిని అడిగాను. మహిళలు వెంటనే "మహాత్మాజీ జైలులో వున్నందువల్ల" అని సూటిగా సమాధానం చెప్పారు. పురుషు లయితే యిక ఆర్థిక యిబ్బంది వున్నట్టు "వ్యవసాయం లాభసాటిగా లేదు, పన్నులు అన్యాయమైనవి, అని అన్నాడు. ఒకరిద్దరు "స్వరాజ్ సాధించడానికి" అని అన్నారు.

తిరిగి వెళ్ళ దలిచిన ప్రజలను సూరత్ పోలీసులు ఎలా భయపెట్టారో బ్రెయిల్‌ఫోర్డు సవివరంగా పేర్కొన్నారు.

పశ్చిమ బెంగాల్‌లోని మిడ్నపూర్ జిల్లాలో గూర్ఖా సైనికులు, శిక్షించే పోలీసులు హింసాత్మక చర్యలకు పూనుకున్నారు. వీరు మహిళలను కూడా అగౌరవ పరిచారు. సామాన్య కర్షకులు తమగుడిసెలనూ, ఈ భూమిమీద తమకున్న కాస్త వస్తువులనూ బుద్ధి పూర్వకంగా సర్వనాశనం చేయడాన్ని సంతోషంతో భరించారుగాని, పన్నులు చెల్లించడానికి మాత్రం నిరాకరించారు.

## మొట్టమొదటి రౌండు టేబిల్ సమావేశం

1930 మధ్యలో, ఈ గొడవల కన్నింటికి కారణమయిన సైమన్ కమిషన్ చిట్ట చివరికి తమనివేదికను సమర్పించింది. నవంబరులో బ్రిటిష్ ప్రభుత్వం లండన్ లో మొదటి రౌండు టేబిల్ సమావేశాన్ని ఏర్పాటుచేసింది. రామ్‌సే మెక్‌డొనాల్డు అధ్యక్షత క్రింద దీనిని బ్రిటిష్ వారు అఖిలపక్ష సమావేశమని అన్నారు. ఈ సమావేశాన్ని మామూలుగానే కాంగ్రెసు బహిష్కరించింది. పార్లమెంటరీ పద్ధతి ప్రభుత్వంతో, సంస్థానాలతో సహా భారత ఫెడరేషన్ ఏర్పాటు చేయాలని, యితర భారత సభ్యులూ,

భారత రాజుల ప్రతినిధులు అంగీకరించారు. సమిష్టి బాధ్యత ప్రాతి పదికగా మంత్రివర్గ పద్ధతి ప్రభుత్వంతో డొమీనియన్ ప్రతిపత్తి, ఈ సమావేశానికి ఆమోదకరం.

వెను వెంటనే జైలులో వున్న కాంగ్రెసు కార్యవర్గ సభ్యులను విడుదల చేశారు. రౌండు టేబిల్ సమావేశం ప్రతినిధులు భారతదేశానికి తిరిగివచ్చిన తర్వాత తేజ్ బహదూర్ సప్రూ గాంధీజీని కలుసుకొని, లార్డ్ ఇర్విన్ కలుసు కోవలసిందిగానూ, కాంగ్రెసు పేరు మీద పరిష్కారానికి సంప్రదింపులు జరుపవలసిందిగానూ ఆయనకు నచ్చచెప్పడానికి ప్రయత్నించారు.

ఇలా వుండగా 1930 డిసెంబరులో ముస్లింలీగ్ అలహాబాద్ సమావేశంలో శాస నోల్లంఘన ఉద్యమాన్ని బహిరంగంగా ప్రతిఘటించింది. దీనివల్ల, వీరి తరపున గాంధీజీ మాట్లడటం లేదనీ, అందుమూలంగా యావద్ భారతజాతికీ ప్రాతినిధ్యం వహిం చడంలేదనీ లార్డు ఇర్విన్ వాదించడానికి వీలయింది. యావద్ భారత జాతికీ తాము ప్రాతినిధ్యం వహిస్తున్నామని కాంగ్రెసు వాదన.

## గాంధీ—ఇర్విన్ ఒప్పదం

ఫిబ్రవరి 17 నుంచి మార్చి 5 వరకూ గాంధీజీ డిల్లీలో వైస్ రాయ్‌తో, పరిష్కా- రానికి సంప్రదింపులు జరిపారు. కాంగ్రెసు స్వాతంత్ర్య తీర్మానాన్నీ, జనవరి 26 తేదీ ప్రతిజ్ఞనూ ఈ సంప్రదింపులలో విస్మరించారు. ఇది నెహ్రూకూ, యితర వామపక్ష నాయకులకూ ఎంతో బాధ కలిగించింది. మొదటి రౌండు టేబిల్ సమావేశంలో ఆమోదించిన ఒప్పందాలు ప్రాతిపదికగా, కాంగ్రెసు చర్చలు ప్రారంభించడానికి సిద్ధంగా వుందని గాంధీజీ తెలియజేశారు. శాసనోల్లంఘన ఉద్యమంలో బాధలకు గురి అయిన వారికి పరిహారం చెల్లిస్తామనిప్రభుత్వం హామీ యిచ్చినట్టయితే, ఆ ఉద్యమాన్ని విరమిస్తామన్నారు. సంభాషణల ఫలితాల గురించి చర్చించడానికి 1931 మార్చి 5 తేదీ తెల్లవారు ఝామున రెండున్నర గంటలకు సమావేశమయిన కాంగ్రెసు కార్యవర్గంలో చీలికలొచ్చాయి. వైస్ రాయ్, పరిష్కారానికి సంప్రదింపులు జరుప వలసి వున్నందున, యిది వొక విజయమని అనేక మంది హర్షించారు; కొంతమంది సంతోషపడలేదు. మహాత్మా స్వయంగా తన అభిప్రాయాలను, జవహరి లాల్ నెహ్రూకు ఏకాంతంగా విశదీకరించారు. నెహ్రూ ఆ తర్వాత యిలా వ్రాశారు.

(ప్రభుత్వ పద్ధతి గురించి చర్చలకు అవకాశం కల్పించిన ఒప్పందం రెండో క్లాజుకు) చెప్పిన అర్థ వివరణ, వాదాన్ని నెత్తిన రుద్దినట్టుగా అనుపించింది, నాకు అది నచ్చలేదు.

అయితే ఆయనమాటలు నాకు కొంత వుపశమనం కలిగించాయి... ఒకటి రెండు రోజులు ఏమిచేయాలో తోచక తికమక పడ్డాను. అప్పట్లో ఆ ఒప్పందాన్ని అరికట్టే ప్రశ్నేలేదు.

వాస్తవంగా చెప్పాలంటే మార్చి 5 తేదీనే రెండు పార్టీలు ఈ ఒప్పందంమీద సంతకాలు చేశాయి; దానిని గాంధీ — ఇర్విన్ ఒప్పందం అన్నారు.

వైస్‌రాయ్‌తో తమ సంభాషణల్లో గాంధీజీ అనేక యితర అంశాలను లేవతీశారు. ప్రత్యేక ఆర్డినెన్సుల క్రింద, దౌర్జన్యానికి శిక్షవేయబడిన రాజకీయ ఖైదీలందరినీ క్షమించాలన్న ప్రశ్న వీటిలో ఒకటి. అసలు నిజానికి ఈ ఆర్డినెన్సులను ఉపసంహరించాలని గాంధీజీ వాదించారు. భూములను స్వాధీనంచేసుకున్న వారందరికీ పరిహారం చెల్లించాలని కూడా ఆయన కోరారు. గాంధీజీ లేవతీసిన ఈ ప్రశ్నలన్నింటిమీదా ఇర్విన్‌బింకం చూపారు. కొన్నిప్రాంతాలలో భూమిశిస్తును కొద్దిగా తగ్గించడానికి ఆయన అంగీకరించారు. అయితే భగత్‌సింగ్, సుఖదేవ్, రాజ్‌గురులకు విధించిన మరణశిక్షను రద్దుచేయాలన్న ముఖ్యసమస్యపై గాంధీజీ విజ్ఞప్తిని, ఆయన తిరుగులేకుండా నిరాకరించడమేకాక, ఈ విషయాన్ని వాయిదా వేయడానికికూడా ఆయన అంగీకరించలేదు. మార్చి 23 తేదీన వారిని ఉరితీశారు. వివిధ సమస్యలమీదా ప్రభుత్వ దమనచర్యలను ఏవిధంగానూ సడలించలేదు; తాను కోరిన కన్‌సెషన్‌లు సాధించలేక పోయారు గాంధీజీ.

## కరాచీ కాంగ్రెసు

లాహోర్ తర్వాత కాంగ్రెసు మొట్టమొదటి సారిగా మార్చి 29 తేదీన, భగత్ సింగ్, సుఖదేవ్, రాజ్‌గురులను ఉరితీసిన ఆరు రోజులకు, కరాచీలో సమావేశ మయింది. కాంగ్రెసు అధికార చరిత్రకారులయిన పట్టాభి సీతారామయ్య "ఆ సమయంలో భగత్ సింగ్‌పేరు భారతదేశ మంతటా ప్రతివొక్కరికితెలుసు, గాంధీజీ ఎంత ప్రజారంజకంగా వుండేవారో, ఆయనకూడా అంత ప్రజారంజకంగా వుండేవాడు" అని పేర్కొన్నారు. నిజానికి, గాంధీజీ, కరాచీ కాంగ్రెసుకు వచ్చినప్పుడు, వ్యతిరేక ప్రదర్శనలు జరిగాయి, దౌర్జన్య వాదుల సాహసాన్నీ ఆత్మత్యాగాన్నీ ప్రశంసిస్తూ ఒకతీర్మానాన్ని ఈ సమావేశంలో ఆమోదించాలని ప్రతిపాదించారు. సంస్థ అహింసాత్మక సనాతన తత్వానికి యిది విరుద్ధం, ప్రాథమిక క్లాజు నొక దానిని చేర్చిన తర్వాత మాత్రమే గాంధీజీ దీనిని ఆమోదించారు. సవరించిన రూపంలో యిది యిలావుంది.

"కాంగ్రెసు, రాజకీయ దౌర్జన్యాన్ని ఏరూపంలో నయినా, పద్ధతిలోనయినా ఖండిస్తూ, వాటితో ఎటువంటి సంబంధము లేకుండా, ధైర్య సాహసాలనూ, త్యాగాన్నీ ప్రశంసిస్తూ.."

ఈ సవరణను సుభాస్ బోస్ అండతో యువ వలంటీర్లు వ్యతిరేకించారుగాని కొద్ది ఓట్ల మెజారిటీతో, విఫలమయ్యారు.

సాధారణంగా చెప్పాలంటే కరాచీ సమావేశం ప్రధాన రాజకీయ తీర్మానం, మద్రాసు కలకత్తా సమావేశాల రాజీవైఖరిని పోలివుంది. పూర్ణ స్వరాజ్ కావాలని యిది కోరింది, అయితే గాంధీ-ఇర్విన్ ఒప్పందాన్ని ఆమోదించింది. ఈ ఒప్పందం లక్ష్యాల గురించి పునరాలోచించడానికి మార్గాన్ని సుకరంచేసింది. 1930 జనవరి ఉత్సాహం కొంతవరకూ సన్నగిల్లడం సహజం. అప్పటి పరిస్థితిలో ప్రజలు పాల్గొనే అవకాశాలులేవు. తర్వాతి చర్య గురించి నిర్ణయించ వలసింది నాయకులే.

అయితే ఒక్కవిషయంలో కరాచీ కాంగ్రెసు 1930 జనవరి నుంచి ఒక అడుగు ముందుకు వేసిందని చెప్పవచ్చు. ప్రాథమిక హక్కులు, ఆర్థిక విధానం గురించి ఒక తీర్మానం ఆమోదించారు. భవిష్యత్తులో పార్టీ రాజకీయ, ఆర్థిక, ప్రజాస్వామిక సాంఘిక కార్యక్రమం యిందులో విశదమయింది. దీనిని యింతకి ముందు స్పష్టంగా వివరించ లేదు; దీనిలో ముఖ్యమైన విషయమేటంటే;

1) ప్రజల ప్రాథమిక హక్కులకు హామీవుండాలి.

2) అన్ని వర్గాల ప్రజల కులమత వివక్షతలను తొలగించాలి.

3) ప్రాంతీయ జాతీయ భాషలను అభివృద్ధి పరచాలి; భారత రాష్ట్రాలను భాషా ప్రయుక్త ప్రాతి పదికమీద ఏర్పాటు చేయాలి.

4) పన్నులు తగ్గించాలి.

5) వెనుకబడిన ప్రాంతాలలోనూ, సంస్థానాలలోనూ అమలులో వున్న బెగార్ లేక వెట్టిచాకిరి చేయడాన్ని నిషేధించాలి.

6) ఉప్పు పన్ను రద్దుచేయాలి.

7) కార్మికుల ప్రత్యేక హక్కులయిన ఆరోగ్యవంతమైన పని పరిస్థితులు, కనీస జీవన వేతనాలు, నిరుద్యోగ భీమా, రోజుకు 8 గంటల పని, జీతంతో సెలవులు, వీటికి రక్షణ కల్పించాలి.

మధ్యయుగపు భూకామందుల కున్న పెద్ద ఎస్టేట్లను రద్దుచేయాలని కరాచీ కాంగ్రెసు గట్టిగా కోరలేక పోయినప్పటికీ, తమ వ్యవసాయ కార్యక్రమాన్ని రూపొందించ డానికి కాంగ్రెసు పూనుకుంది. ఈ పోకడ, 1930 కార్యకలాపాలలో వామపక్ష విప్లవ పోకడ పూర్తిగా పరాజయం పొందినప్పటికీ, అంతకిముందు నాలుగేండ్లలోనూ, ప్రజా తిరుగుబాటు ఫలితంగా జాతీయనాయకులు కనీసం రేడికల్ ప్రజాస్వామ్యం సూత్రాలు

కొన్నింటిని ఆమోదించవలసి వచ్చిందని, స్పష్టం చేస్తోంది. జాతీయనాయకులు యిప్పుడిహ స్వాతంత్ర్య సమరం మిగతాకాలంలో ఈ ప్రజాస్వామిక సూత్రాల పతాకం క్రింద సంచరించవలసి వచ్చింది. ఈ విధంగా కరాచీసమావేశం, అంతరంగిక, బాహ్య సంఘర్షణలను, నచ్చచెప్పే హేతువాదంద్వారా అంతంచేసే గాంధేయ విధానం రాజకీయ విజయాన్ని సూచించినప్పటికీ,కాంగ్రెసు కార్యక్రమంలో రేడికల్, సోషలిష్టు, పోకడను ఒక ముఖ్యమైన అంశంగా ప్రవేశ పెట్టడానికి నాందీ ప్రస్తావన చేసింది.

## రెండో రౌండ్ టేబిల్ సమావేశం, మత సమస్య

కాంగ్రెసుతోపాటు, కార్మికులు కర్షకుల పార్టీ, అఖిల భారత యువజనుల లీగ్ కరాచీలో సమావేశమయ్యాయి. కార్మికులు కర్షకుల పార్టీ, కార్మిక కర్షక సమస్య మీద ఒక కార్యక్రమాన్ని ఆమోదించింది; ఇది, ప్రాథమిక హక్కులు ఆర్థికవిధానం గురించి కాంగ్రెసు ఆమోదించిన తీర్మానంకన్నా చాలా పటిష్టమయినదిగా కనుపించింది. అఖిల భారతయువజనలీగ్ పూర్ణస్వరాజ్ కోసం సమరం సాగిస్తూనే వుండాలని కోరింది, వీరు, గాంధీ—ఇర్విన్ ఒప్పందాన్నీ, రెండో రౌండ్ టేబిల్ సమావేశంలో పాల్గొన్నాలన్న కాంగ్రెసు నిర్ణయాన్నీ కూడా ఖండించారు.

కాగా మత సమస్య తీవ్రత ఎక్కువవుతోంది. మార్చి 24, 25 తేదీలలో కాన్పూర్‌లో హింసాత్మక మత కొట్లాటలు జరిగాయి; ఫలితంగా రెండు పక్షాలలోనూ కొంత మంది మరణించారు. దీనితో మత కొట్లాటలు మొదలయ్యాయి, దరిమిలా జిన్నా, అభివృద్ధి నిరోధక ముస్లిం వర్గము, కాంగ్రెసు రాజకీయ కార్యక్రమం నుంచి విడిపోతున్నట్టు ప్రకటించారు.

1931 ఏప్రిల్ మొదలు జూన్ వరకూ రెండో రౌండ్ టేబిల్ సమావేశంలో తమ దృక్పధాన్ని తెలియ జెయ్యడం గురించి, కాంగ్రెసు చర్చ జరిపింది. ప్రభుత్వం ఆమోదించడానికి సిద్ధంగా వున్నప్పటికి పెద్ద ప్రతినిధివర్గాన్ని పంపడానికి బదులు కాంగ్రెసు తరపున ప్రాతినిధ్యం వహించడానికి గాంధీజీని మాత్రమే ఎన్నుకున్నారు. డాక్టర్. అన్సారీ వంటి జాతీయవాద ముస్లిం, కాంగ్రెసు వ్యక్తిగా గాంధీజీ వెంట లండన్ వెళ్ళివున్నట్టయితే కాంగ్రెస్, పురోగామి ముస్లిం ప్రజాభిప్రాయానికి ప్రాతినిధ్యం వహిస్తోందని బ్రిటిష్ ప్రజలకు నమ్మకం కుదిరివుండేది. దీనికి బదులు కాంగ్రెసు, తనకుగల హక్కుద్వారా అన్సారీని ఈ సమావేశానికి నామినేట్ చేస్తారని ఆశించింది.

సుభాస్ బోస్ పేర్కొన్నట్టుగా, గాంధీజీ యిలా చెప్పడం మొదలు పెట్టారు. "ముస్లింలు గనుక ప్రాతినిధ్యం, నియోజక వర్గాలు మొదలయిన వాటి విషయంలో, కొత్త రాజ్యాంగంలో సమైక్యకోరికను వ్యక్తపరచినట్టయితే ఈ కోరికను తాము మన్నిస్తాము" అని అన్నారు. ఇది, అభివృద్ధి నిరోధక ముస్లింల కృతనిశ్చయాన్ని యింకా బలపరిచింది. సుభాస్‌బోస్ పట్టుదల, జాతీయవాద ముస్లింల ప్రకటనవల్ల ఆ తర్వాత గాంధీజీ ప్రత్యేక నియోజక వర్గాల కోర్కెను మన్నించ జాలమని స్పష్టంగా ప్రకటించవలసి వచ్చింది.

ఏకారణం చేతనయినా, హిందువులకూ ముస్లింలకూ ఉమ్మడినియోజక వర్గా లుండాలన్న కోర్కెను మహాత్మా, వదులుకొని, ప్రతి కులానికీ ప్రత్యేక నియోజకముం డాలన్న అభివృద్ధి నిరోధకుల కోర్కెను ఆమోదించినట్టయితే, వారు (అంటే, జాతీయ వాద ముస్లింలు) అభివృద్ధి నిరోధక ముస్లింలనూ, మహాత్ముని కూడా ప్రతిఘటిస్తారు, ఎందువల్లనంటే ప్రత్యేక నియోజకవర్గాలు యావద్ దేశానికి మాత్రమే కాక, వివిధ కులాలకు కూడా మంచిది కాదని వారికి నమ్మకం కుదిరింది.

అగస్టులో లార్డుఇర్విన్ తర్వాత లార్డువిగ్ లండన్ వైస్‌రాయ్ అయ్యాడు, కొత్తవైస్‌రాయ్ అసలు లిబరల్‌వైఖరిని అవలంబించడానికి కూడా సిద్ధంగాలేడు. రాష్ట్రప్రభుత్వాలు, రాజకీయ నేరస్తులపై పగసాధించ కూడదన్న గాంధీ — ఇర్విన్ ఒప్పందం నిబంధనను అతిక్రమిస్తున్నాయన్న గాంధీజీఫిర్యాదుతో ఆయన ఏకీభవించలేదు. విభేదాలను పరిష్కరిచడానికి పరిష్కర్తల బోర్డు ఒకటి ఏర్పాటు చేయాలన్న గాంధీజీ విజ్ఞప్తిని ఆయన తిరస్కరించారు. ఇది కాంగ్రెసు సమాన అధికారానికి అంగీకరించినట్టు అవుతుందని ఆయన అధికారులు భావించారు. ఈలోగా వాయవ్య సరిహద్దు రాష్ట్రంలోనూ, ఉత్తరప్రదేశ్‌లోనూ ఖుదైఖిద్‌మత్‌గార్‌లమీదా, పన్నులు చెల్లించకూడదన్న ఉద్యమం దార్లమీదా తీవ్రమైన పగసాధించడం కొనసాగించి. లండన్‌వెళ్ళడానికి నిరాకరించడం ద్వారా, అగస్టులో ఈసమస్యను పైకితీసుకురావడానికి గాంధీజీ ప్రయత్నించారు. అయితే విలింగ్‌డన్ తలబిరుసుగా వున్నారు; అంతేకాకుండా. కాంగ్రెసు సభ్యుడయినందువల్ల అన్సారీ స్వతంత్ర అభ్యర్థిత్వాన్ని యితర ముస్లిం ప్రతినిధులు వ్యతిరేకిస్తున్నారన్న కారణాన రౌండుటేబిల్ సమావేశానికి డాక్టర్. అన్సారీని నామినేట్ చేయకూడదన్న నిర్ణయాన్నికూడా ఆయన బలపరిచారు. నిజానికి, బ్రిటిష్‌ప్రభుత్వం, 'విభజించి పరి పాలించు' అన్న తమవిధానంలో భాగంగా హిందూ — ముస్లిం మతవాదులను బలపరచా లని నిర్ణయించింది. అన్సారీవంటి జాతీయవాదులను నామినేట్ చేయడానికి ఒకప్రక్క నిరాకరించగా, హిందూ. సిఖ్ఖు, ముస్లిం మతవాదులకు, దేశంలో వారికిగల రాజకీయ

పలుకుబడికి పూర్తిగా సమానంగాని ప్రాతినిధ్యాన్ని యివ్వడం జరిగింది. గాంధీజీ చివరకు, వైస్‌రాయ్‌ని, సిమ్లాలో, వల్లభాయిపటేలు, ప్రకాశంకర్ పఠానీ, జవహరిలాల్ నెహ్రూతోపాటు కలుసుకున్న తర్వాత అంగీకరించారు. కొన్నినూరత్ తాలూకాలలో బల వంతంగా భూమిశిస్తు వసూలుచేయడం గురించి ప్రభుత్వం దరియాప్తు జరుపుతుందన్న హామీ యిచ్చారుగాని, "యింతవరకూ కాంగ్రెసు లేవతీసిన యితర అంశాల విషయంలో హామీ యివ్వలేదు". దరియాప్తు జరిపించక పోయినట్టయితే, కాంగ్రెసు ప్రత్యక్షచర్యకు దిగుతుందని, మహాత్మా, షరతుపెట్టారు. అయితే 1931 అగస్టు 15 దీన ఆయన లండన్ వెళ్ళడంవల్ల, ఆయన మెత్తబడ్డారని భావించారు.

ఇవన్నీ, 1931 సెప్టెంబరునుంచి డిసెంబరువరకూ జరిగిన రెండో రౌండుటేబిల్ సమావేశంలో కాంగ్రెసు విఫలమయిందన్న సూచనలను ముందుగానే తెలియజేశాయి. ఇతరప్రతినిధుల తర్వాత గాంధీజీ, సమావేశం ప్రారంభంకావడానికి ఒకరోజు ముందుగా చేరుకున్నారు. బ్రిటిష్ కార్మికులు ఆయనకు ఘనమైన స్వాగతమిచ్చారు. ఆయన లండన్ ఈస్టు ఎండ్‌లో బసచేసి, లాంకషైర్ పర్యటించారు. బ్రిటిష్ జవుళి వస్త్రాలను కాంగ్రెసు బహిష్కరించడం వల్ల, ఈ ప్రాంతంబాగా దెబ్బతిన్నప్పటికీ, కార్మికులు, భారతప్రజలు జరుపుతోన్న సామ్రాజ్యవాద వ్యతిరేక సమరంపట్ల సానుభూతి కనబరిచారు. అయితే బ్రిటిష్‌మంత్రులు, అనేకమంది మతనాయకులు జాతీయవాదులను అయోమయంలో వుంచడానికి వొకమార్గాన్ని కనిపెట్టారు. రాజ్యాంగ సంస్కరణల నొప్పందానికన్నా మతసామరస్య సమస్యకు ప్రాధాన్యమివ్వాలని వారుపట్టుబట్టారు. రాజ్యాంగ సంస్కరణలకు గాంధీజీ, అత్యధికప్రాధాన్యమిచ్చారు. ఈ సమస్యమీద అల్ప సంఖ్యాక వర్గాల సంఘంలో ప్రతిష్టంభన ఏర్పడింది. దీనికి ప్రధానమంత్రి అధ్యక్షత వహించారు. మతసమస్యను పరిష్కరించి, తమనిర్ణయానికి కట్టుబడివుంటామని హామీ యిస్తూ, సంయుక్త విజ్ఞప్తిమీద సంతకాలుచేసి, తమకు యివ్వాలని ఆయన సభ్యులందరినీ అడిగారు. అందరూ అంగీకరించలేదు సరికదా అంగీకరించరుకూడా. వివిధమత నాయ కులు వొకరినొకరు పరీక్షించుకుంటారని బ్రిటిష్‌వారికి తెలుసు. గాంధీజీ ఈ సంఘంలో సహేతుకంగా ఒక విజ్ఞప్తిచేస్తూ, "విదేశ ఆధిపత్యం కారణంగా మనవిభేదాలు పటిష్ట మయినందువల్లా, అవి ఉత్పన్నం కాకుండావున్నా, స్వరాజ్‌రాజ్యాంగం కిరీటమేకాని, దాని పునాదులు, పరిష్కారం కాజాలవు. స్వాతంత్ర్య భానుని వేడిక్రింద మతవిభేదాలన్న మంచుకొండ కరిగి పోతుందనటంలో నాకు కించిత్తైనా సందేహంలేదు" అనిఅన్నారు.

అయితే సమావేశంలో ముస్లిం మతవాదులయిన ఆగాఖాన్‌వంటివారు, బ్రిటిష్ సామ్రాజ్యవాదం రక్షణక్రింద తమను కాపాడుకోవచ్చునని, అభివృద్ధి నిరోధక ప్రయో

జనాలను కాపాడుకోడానికి ప్రయత్నించారు. వీరంతా వారివారి వేరువేరు పద్ధతుల్లో, ఈ సమావేశంలో సమైక్య ఉద్యమాన్ని ప్రదర్శించడానికి గాంధీజీ చేస్తూవున్న కృషిని విఫలం చేయడానికి అతిముఖ్యపాత్ర నిర్వహించారు.

చిట్టచివరికి 1931 డిసెంబరులో మెక్డొనాల్డు, 1930 సమావేశ నిబంధనలను అమలు జరపాలనీ, విల్లింగ్‌డన్ విధానాన్ని బలపరచాలనీ, తలపెట్టారు. భారత ప్రభుత్వచట్టం ముఖ్య అంశాలను వివరించారు దీనిప్రకారం పటిష్టమయిన ఫెడరల్ కేంద్రమూ, రాష్ట్రాలకు పరిమిత స్వపరిపాలనా ప్రభుత్వాన్ని యిస్తూ, రాష్ట్ర స్వపరిపాలనా ప్రతిపత్తి ఏర్పడుతుంది. అతి ముఖ్యమయిన ఫెడరల్ అంశాలయిన ఆర్థికశాఖ, విదేశసంబంధాలు (యుద్ధాలనుచేసే నిర్ణయంతోసహా) రక్షణ, బ్రిటిష్‌పార్లమెంటు, వైస్‌రాయ్ ప్రత్యేక అధికారాలక్రింద వుంటాయి. విసిగిపోయి గాంధీజీ భారతదేశానికి తిరిగి వచ్చివేశారు.

## అధికారుల దమన విధానం మళ్ళీ ప్రారంభం కావడం

విల్లింగ్‌డన్ ప్రభుత్వం యిప్పుడిహ, 1930లో ఇర్విన్ తీసుకున్న వాటికన్నా పటిష్టమయిన దమన చర్యలనూ మొత్తం జాతీయ ఉద్యమంమీద తీసుకోవాలని నిర్ణయించారు. ప్రభుత్వంతో సంప్రదింపులు జరగందే కౌలు చెల్లించరాదని ఉత్తరప్రదేశ్ కాంగ్రెసు వ్యక్తులు కర్షకులకు సలహా యిచ్చినపుడు, వారి నాయకులు నెహ్రూ, పురుషోత్తందాస్ టాండన్‌లతో సహా అందరినీ ఏకమొత్తంగా, లండన్‌నుంచి గాంధీజీ తిరిగి రావడానికి ఐదురోజులు ముందు అరెస్టుచేశారు. వాయవ్య సరిహద్దు రాష్ట్రంలో ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్‌నీ, ఆయన పెద్ద అన్న డాక్టర్ ఖాన్ సాహెబ్‌నూ ఇతర జాతీయవాద నాయకులనూ, జైలులో పెట్టారు. బెంగాల్‌లో చిట్టగాంగ్ పట్టణంలో యూరొపియన్ అనధికారులు మూడు రోజులపాటు రౌడీల తోడ్పాటుతో జాతీయవాదుల గృహాలను, పోలీసుల జోక్యం లేకుండా దోచుకున్నప్పుడు దిక్కు లేకపోయింది. 1931లో ఖరగ్‌పూర్ సమీపంలోవున్న హైజిల్ జైలులోని ఖైదీలనుకూడా, జైలర్లు చావమోది, ఆ తర్వాత వారిమీద కాల్పులు జరపడంవల్ల, యిద్దరు మరణించారు.

## వ్యక్తిగత శాసనోల్లంఘన ఉద్యమం

గాంధీజీ తిరిగివచ్చిన తర్వాత విల్లింగ్‌డన్‌కు ఆక్షేపణ తెల్పినపుడు ఆయనపట్ల చలబిరుసు వైఖరి ప్రదర్శించారు. అయితే కాంగ్రెసు యింకా అప్పటికీ, వైస్‌రాయ్, ఆర్డినెన్సు

లను ఉపసంహరించి పూర్ణస్వరాజ్ ఉద్యమాన్ని కొనసాగించడానికి కాంగ్రెసుకు అనుమ తి యిచ్చిన పక్షంలో, "ప్రభుత్వంతో సహకరించడానికి సిద్ధంగావుంది. లాహోర్ సమావేశ వైఖరికి యిది భిన్నమైన వైఖరి. అయినప్పటికీ పౌరశాసనోల్లంఘన ఉద్యమాన్ని మళ్ళీ ప్రారంభిస్తామన్న బెదిరింపు యిందులో వుంది. 1932 జనవరి 4 తేదీన, గాంధీజీ, కాంగ్రెసు అధ్యక్షులయిన వల్లభాయి పటేల్‌తోసహా కాంగ్రెసు నాయకుల కొత్తజట్టును అరెస్టుచేశారు. ఇప్పుడిహ, రాజకీయ ఖైదీలను జైళ్ళలో కొట్టడం, వారిని మామూలు నేరస్తులుగా చూడటం, యింతకి ముందుకన్నా ఎక్కువయింది. 1932లో అధికారుల హింసాత్మక చర్యలకు వ్యతిరేకంగా దౌర్జన్యవాదులు పగసాధించడం పెచ్చుపెరిగిపోయింది. శాసనోల్లంఘనను ఏకమొత్తంగాకాక, వ్యక్తిగతంగా, కొన్ని ప్రత్యేక చర్యలద్వారా జరపాలని, గాంధీజీ తెలియజేశారు. అహింసాత్మక ప్రజలు స్వయంగా నిలబడే ధైర్యం వుండాలని ఆయన వాదించారు. అయితే వాస్తవమైన కారణమేమిటంటే, ప్రభుత్వం రెచ్చగొట్టడంవల్ల, ఉద్యమం విజయవంతం కావడంలేదన్న నిరుత్సాహంతో ప్రజాచర్య దౌర్జన్యానికి దారితీయవచ్చునని భయం. ఏప్రిల్ 24 తేదీన ఢిల్లీలో మదన్ మోహన్ మాలవ్యా తాత్కాలిక అధ్యక్షతక్రింద కాంగ్రెసు వార్షిక సమావేశం ప్రారంభం కావలసి వున్నపుడు, ప్రముఖ సభ్యులు అనేకమందిని, ఆర్డినెన్సులక్రింద అరెస్టుచేశారు. మిగతావాదు అహమ్మదాబాదు ప్రతినిధి అయిన సేట్ రంఛోడాస్ తాత్కాలిక అధ్యక్షత క్రింద, ఢిల్లీలో చాందినీచౌక్ క్లాక్‌టవర్ దగ్గర సమావేశం జరిపారు. వీరినికూడా అరెస్టు చేశారు; అయితే మే ఒకటో తేదీన విడుదల చేశారు.

## మత నివేదిక

హరిజనులు, షెడ్యూల్డు కులాలు తెగల అండ సంపాదించడానికి ప్రజా ఉద్యమాలలో ఒక నూతన పోకడను తీసుకు రావడానికి గాంధీజీ చాలాకాలం నుంచీ ప్రయత్నించారు. బ్రిటిష్ వారు అనుసరిస్తోన్న "విభజించి పరిపాలించు" అన్న విధానానికి, యిది ఆయన సమాధానం. 1932 ఆరంభంలో రాంసే మెక్‌డొనాల్డు ప్రకటించిన అధికార మత నివేదిక బ్రిటిష్ విధానాన్ని ప్రతిబింబించింది. ఈ నివేదికలో హిందువులకూ, "అంటరానివారికీ," ముస్లింలకూ, నూతన ఫెడరల్ శాసన సభలలో వేరువేరు నియోజక వర్గాలను ఏర్పాటుచేశారు. హిందువులనూ – హరిజనులనూ వేరువేరు రాజకీయ వర్గాలుగా, యిందులో పేర్కొన్నారు. గాంధీజీ దీనిని ఒక సవాలుగా భావించారు. ఈయన్ను ఎమ్. సి. రాజావంటి అనేక మంది అంటరాని వారు బలపరిచారు.

అంటరాని వారికి ప్రత్యేక సీట్ల కేటాయింపుతో ఉమ్మడి నియోజక వర్గాలు కావాలని వీరు తెలియ జేశారు. అయితే డా॥ అంబేద్కర్ నాయకత్వాన వీరిలో కొంతమంది అంటరాని తనాన్ని రద్దు చేయకుండా "అంటరాని వారిని" హిందువులనే పద్ధతిని ఆమోదించడానికి నిరాకరించారు. ఈ అవకాశాలను అదనుగా తీసుకొని విలింగ్డన్ మత నివేదికను ఆమోదించి తీరాలని పట్టుబట్టారు. ఆ సమయంలో, పూనా సమీపంలో యరవాడ జైలులో నిర్బంధంలో వున్న గాంధీజీ, సెప్టెంబరులో ఆమరణాంత నిరాహార దీక్షకు పూనుకొన్నారు. నివేదికను, ఈయన ప్రతిఘటించారు; అయితే నివేదికలో సూచించిన దానికన్నా హిందూ నియోజక వర్గానికి లోబడి "అంటరానివారికి" ఎక్కువ సీట్లు కేటాయించాలని ఆయన గట్టిగా కోరారు. మత నివేదికకు ఒక సవరణగా పూనా ఒడంబడికను, ప్రభుత్వం ఆమోదించింది.

దీనివల్ల, అఖిల భారత అస్పృశ్యత లీగ్, అంటరాని సేవకుల సంఘం వంటి సంస్థలలో, కాంగ్రెస్ పలుకుబడి ఎక్కువయింది. కాంగ్రెసు పట్ల సానుభూతితోవున్న ఇంగ్లీషు మాజీ మిషనరీ వెరియర్ ఎల్విన్, షాంరావు హివలె వంటివారు అంకితమై పనిచేస్తూ వుండటంవల్ల, మధ్యభారతదేశం, దక్షిణ బీహార్, ఒరిస్సాకొండ ప్రాంతాలలోని వెనుకబడిన తెగలలో కాంగ్రెసు ప్రచారం, యిప్పటివరకూ భారత జాతీయతా భావమంటే తెలియని ప్రజలలో, జాతీయత, ప్రజాస్వామ్య భావాలను పరివ్యాప్తం చేసింది. దేవాలయాలన్నింటిలో హరిజనులకు ప్రవేశ మివ్వాలన్న అలజడి ఈ ఉద్యమంలో వుండటం కూడా అతిముఖ్యమైనది. 1933 జనవరి 8 తేదీని దేవాలయ ప్రవేశ దినంగా పరిగణించారు. హిందూ కులమత వర్గాలూ ప్రాంతీయ భాషా వర్గాలు వున్న అనేక భారతీయ యాత్రికుల కేంద్రాలలో దీనజనసముద్ధరణకు జాతీయతా భావంతో సంబంధం వుందని భావించారు; వీరి విజ్ఞప్తిని యిది బలపరిచింది.

ఇలా వుండగా, రెండవ శాసనోల్లంఘన ఉద్యమం, లేక "వ్యక్తిగత ఉల్లంఘన" ఉద్యమం, పామరజనంపై ప్రభావాన్ని కలిగించడానికి సంబంధించినంతవరకూ 1930 ఉద్యమంకన్నా బలహీన మయింది. అయితే కర్షకులలో కాంగ్రెసు ప్రభావం ఎక్కువయింది. పన్నులు, అద్దెలు చెల్లించకుండా వుండే ఉద్యమం ఉత్తర ప్రదేశ్‌లోనూ, వాయవ్య సరిహద్దు రాష్ట్రంలోనూ కొనసాగింది.

భారతదేశంలో బ్రిటిష్ పరిపాలనకు 1932—33 ఆఖరి సంవత్సరమని చెప్పవచ్చు. ఈ సంవత్సరంలో సనాతన దౌర్జన్య వాదుల జ్వాలలు (అహింసాత్మక పౌర శాసనోల్లంఘన, పౌర ప్రతిఘటనకు భిన్నమైనది) మిన్నుముట్టాయి; ఆ తర్వాత దమన చర్యలద్వారా, ముఖ్యంగా బెంగాల్‌లో వీటిని ఆర్పివేశారు. అనేక రకాల దౌర్జన్య

చర్యలు జరిగాయి: పేరు ప్రఖ్యాతులు లేని కొంతమంది అధికారులను హత్యచేశారు. వీరిలో ఒకరిద్దరు భారతీయులు కూడా వున్నారు. కలకత్తా విశ్వవిద్యాలయం స్నాతకోత్సవంలో బెంగాల్ కొత్త గవర్నర్ సర్‌స్టాన్‌లీ జాక్‌సన్ అధ్యక్షత వహిస్తూవుండగా డయోసిసాన్ మహిళల కళాశాలకు చెందిన అత్యంత తెలివితేటలు గల విద్యార్థిని బీనాదాస్ బహిరంగంగా ఆయన మీద కాల్పులు జరిపింది; అయితే గుండు, ఆయన జేబులో వున్న చిన్న పుస్తకానికి తగలడం వల్ల ప్రాణహాని కలగలేదు. బీనాదాస్‌కు యావజ్జీవ కారాగారవాసం విధించారు; స్వాతంత్ర్యం వచ్చేవరకూ ఆమెను విడుదల చేయలేదు.

1932 జూన్‌లో, చిట్టగాంగ్ సమీపంలోని ఒక గ్రామంలో సూర్యసేన్, మరో నలుగురు గెరిల్లాలు దాగుకొనివున్న ఒక ఇంటిని, సైనికులు చుట్టుముట్టారు. మెట్లమీద నుంచి జరిపిన కాల్పుల జోరులో వారి నాయకుడు కేప్టెన్ కెమెరాన్ మరణించాడు; త్రొక్కిడిలో సూర్యసేన్, ప్రీతిలత వాదేదార్. కల్పనాదత్ అన్న మహిళా కామ్‌రెడ్‌లతో పారిపోయారు. 1933 ప్రారంభంలో ఒక గ్రామీణుడు ద్రోహం చేయడంవల్ల పెద్ద గూర్ఖాబలం సూర్యసేన్‌ను గైరాలా గ్రామంలో పట్టుకుంది; చిట్టచివరకు ఈయన్ను ఢాకాలో ఉరితీశారు. ఈనాటికి కూడా బంగ్లాదేశ్ నాయకులు, ప్రజలు, ఈయన్ను జాతీయ వీరుడిగా స్మరిస్తూ వుంటారు. ముఖ్యంగా పట్టణ పాఠశాలలు, కళాశాల విద్యార్థులు గల దౌర్జన్యవాదులు ఏకాకులు అయిపోవడంవల్లా-ఉత్తర ప్రదేశ్‌లోనూ, యితర ప్రాంతాలలోను ప్రారంభమయిన పూర్తి వ్యవసాయ కార్యక్రమం అవసరాలగురించి కర్షకులకు తెలియ జెప్పకపోవడంవల్లా, ఈ ఉద్యమం విఫలమయింది.

1933 లో స్వాతంత్ర్య దినోత్సవాన్ని అమితోత్సాహంతో జరుపుకున్నారు. బెంగాల్‌లో హుగ్లీ జిల్లా బదన్‌గంజ్‌లో, కాంగ్రెసు ఊరేగింపును పోలీసులు కాల్పులు జరిపి చెదరగొట్టారు. ఫిబ్రవరిలో కస్తూర్బా గాంధీ, గుజరాత్‌లోని బొర్‌సాద్ వద్ద మరో కాంగ్రెసు ఊరేగింపుకు నాయకత్వం వహించినపుడు ఆమెను అరెస్టుచేసి ఆరునెలల జైలుశిక్ష విధించారు. 1933 మార్చిలో కలకత్తాలో మళ్ళీ మదన్‌మోహన్ మాలవ్యా అధ్యక్షత క్రింద, కాంగ్రెసు సమావేశం జరిగింది. హాజరవడానికి ముందే వేయి మంది ప్రతినిధులను అరెస్టు చేశారు. హాజరయిన మరో వేయిమంది ప్రతినిధులపై పోలీసులు లాఠీచార్జి జరిపారు. సమావేశాన్ని విచ్ఛిన్నం చేయడానికి పోలీసులు ప్రయత్నిస్తూ వుండగా, గుంపు మధ్యలో వున్న ప్రతినిధులు, తాత్కాలిక అధ్యక్షులయిన జె. ఎమ్. సెన్ గుప్త అధ్వర్యం క్రింద సమావేశం జరిపారు; పూర్ణ స్వరాజ్ లక్ష్యాన్ని పునరుద్ఘాటించారు. శాసనోల్లంఘన పద్ధతిని అనుసరించాలనీ, విదేశ వస్త్రాలనూ, బ్రిటిష్ వస్తువులనూ బహిష్కరించాలనీ నిర్ణయించారు.

ఈ సమయంలో దాదాపు అనేక వేలమంది మహిళలు, బాలలతోసహా లక్ష ఇరవై వేల మందిని అరెస్టుచేసి జైలులో పెట్టారు. దీనిని బట్టి శాసనోల్లంఘన జరపాలన్న ప్రజల కృతనిశ్చయంలో ఎటువంటి మార్పు రాలేదని విదితమయింది. అయితే గాంధీజీ, హరిజన సమస్య మీద తమ దృష్టిని కేంద్రీకరించారు. 1933 మే నెలలో తన హృదయాన్నీ, తమ సహచరుల హృదయాలనూ పవిత్రం చేసుకోడానికీ, హరిజనుల సమస్య మీద దృష్టిని కేంద్రీకరింపచేయడానికీ 21 రోజులు నిరాహారదీక్ష జరుపుతున్నట్టు ఆయన ప్రకటించారు. ప్రభుత్వం ఆయన్ను వెంటనే విడుదల చేసింది. కాంగ్రెసు తాత్కాలికంగా శాసనోల్లంఘనను విరమించాలని అప్పుడాయన శిఫార్సుచేస్తూ ఒక ప్రకటన జారీ చేశారు. ఒక ఏడాది తర్వాత 1934 ఏప్రిల్‌లో ఈ ఉద్యమాన్ని చిట్టచివరికి వదులుకున్నారు.

ఇలావుండగా, 1932 నవంబరులో బ్రిటిష్ ప్రభుత్వం లండన్‌లో మూడో రౌండ్ టేబిల్ సమావేశాన్ని ఏర్పాటుచేసింది, ప్రభుత్వం అనుసరించిన వైఖరివల్ల ప్రయోజన మేదీ వుండదన్న వాదనతో ఈ ఆహ్వానానికి అంగీకరించకూడదని నిర్ణయించటంవల్ల, కాంగ్రెసు ఇందులో పాల్గొనలేదు. ఈ సమావేశంలో జరిగిన చర్చలు, మరికొన్ని సంస్కరణలను ప్రవేశపెడుతూ 1935 ఇండియా చట్టాన్ని ఆమోదించాలన్న బ్రిటిష్ ప్రభుత్వ నిర్ణయానికి దారి తీశాయి. కొత్త చట్టం ప్రకారం, కేంద్రంలో ఫెడరల్ ప్రభుత్వమూ, ఎక్కువ స్వపరిపాలనా ప్రతిపత్తితో రాష్ట్రప్రభుత్వాలు వుండాలని నిర్దేశించారు. ఫెడరల్ యూనియన్‌లో బ్రిటిష్ ఇండియా రాష్ట్రాలు, సంస్థానాలు వుండవలసి వున్నందున, సంస్థానాలను మొట్టమొదటిసారిగా ప్రత్యక్షంగా రంగంలోకి తెచ్చారు. ఇది, భారతదేశం ఒకే దేశము, భారతీయులందరూ ఒకే జాతి అన్న సూత్రానికి అనుగుణంగా వున్నట్టు కనుపించింది. అయితే సంస్థానాధిపతులను, సామ్రాజ్యవాద వ్యతిరేక సిద్ధాంతాలనూ, జాతీయ నాయకుల కార్యక్రమాలనూ సమతూకంలో లేకుండా చేసే పడికట్టు రాళ్ళుగా ఉపయోగించుకోవడమే బ్రిటిష్ వారి వాస్తవ ఉద్దేశం. అందువల్లనే రాష్ట్రాలకు కేంద్రంలోని ఫెడరల్ ఉభయ శాసన సభల్లోనూ సమతూకంలో లేని ప్రాతినిధ్య మిచ్చారు. అంతేకాకుండా రాష్ట్రాల ప్రతినిధులను ప్రజా ఓటుద్వారా ఎన్నుకోవడం కాక, పరిపాలకులే నియమించేవారు. మిగతా దేశంలోకూడా ఓటింగ్ అర్హతలపై తీవ్రమైన పరిమితులు విధించారు. బ్రిటిష్ ఇండియాలో 14 శాతానికి మించిన జనాభాకు వోటింగ్ హక్కులేదు. వీరితో ఏర్పాటయిన శాసన సభకు కూడా పూర్తి అధికారాలు లేవు. రక్షణ, విదేశ సంబంధాల మీద దీనికి కంట్రోలు లేదు. దీని అధికారం కిందకి వచ్చే మిగతా అంశాల మీద కూడా గవర్నర్ జనరల్‌కు

ప్రత్యేక కంట్రోలు వుండేది. గవర్నర్ జనరల్‌పీ, గవర్నర్లపీ, బ్రిటిష్ ప్రభుత్వమే నియమిస్తూ వుండేది; వారు దానికే ప్రత్యక్షంగా బాధ్యులు.

రాష్ట్రాలలో, యిచ్చిన కొద్ది స్వపరిపాలనాధికారాలూ, గవర్నర్‌కు వున్న ప్రత్యేక అధికారాల ద్వారా రద్దయి పోయేవి. వీరికి, ఎన్నికయిన ప్రతినిధుల శాసన చర్యమ వీటో చేసే అధికార ముండటమేకాక, తమ యిష్టం వచ్చిన చట్టాలు చేసి, అర్డి నెన్సులు చేసే అధికారాలు కూడా వుండేవి. సివిల్ సర్వీసు, పోలీసు మీద పూర్తి కంట్రోలు కూడా గవర్నర్‌కు వుండేది.

1935 ఇండియా చట్టం, కొద్దిమందిని మాత్రమే తృప్తి పరిచింది. ఇది "పూర్తిగా నిరాశాజనకంగా వుందని" కాంగ్రెస్ పేర్కొంది. అనేక రకాలుగా యిది తృప్తికరంగా లేదని యితరులు తెలియ జేశారు. భారత ప్రజలమీద తాము సంపాదించిన రాజకీయ ఆర్థిక అధికారాన్ని బ్రిటిష్ ప్రభుత్వం వాస్తవంగా వారికి అందజేయలేదు. ప్రభుత్వ స్వరూపం మాత్రమే కొద్దిగా మారింది. ప్రజలు ఎన్నుకున్న మంత్రులను భారతదేశంలోని బ్రిటిష్ పాలక వర్గంలో ప్రవేశ పెట్టారు కాని, విదేశ పాలన కొన సాగుతూనే వుంటుంది.

చట్టంలో రాష్ట్రాలకు సంబంధించిన విధానాన్ని వెంటనే అమలులో పెడతారు; ఫెడరల్ భాగాన్ని తర్వాత అమలు జరుపుతారు. ఈచట్టం నిబంధనలకు పూర్తిగా వ్యతిరేకమే అయినప్పటికీ, ఈ చట్టం అమలులో సహకరించడంకన్నా, దేశంలో తమ పార్టీకి ఎంత బలముందో బ్రిటిష్ ప్రభుత్వానికి తెలియజెయ్యడానికి, ఎన్నికల్లో పోటీ చేయాలని కాంగ్రెస్ నిర్ణయించింది ఈ లక్ష్యాన్ని పూర్తిగా సాధించడం జరిగింది. అనేక రాష్ట్రాలలో కాంగ్రెసుకు అధిక మెజారిటీ వచ్చింది. భారత ప్రజలలో అత్యధికులు దీనిని బలపరుస్తున్నారనడంలో సందేహం లేదు. ఎన్నికల్లో గెలిచారు. కాబట్టి పదవికి అంగీకరించకుండా నిరాకరించడంలో అర్థం లేదని అనేకమంది వాదించారు. నెహ్రూ, యితర వామపక్ష నాయకులు పదవికి అంగీకరించడానికి వ్యతిరేకులు. స్వాతంత్ర్య సమరానికి యిది అవరోధం కలిగిస్తుందని వారు భావించారు. అయితే ఎక్కువమంది పదవులకు అంగీకరించడానికి సుముఖంగా వున్నారు. 1937 జూలైలో పదకొండు రాష్ట్రాలలోనూ ఏడు రాష్ట్రాలలో కాంగ్రెస్ మంత్రివర్గాలు అధికారంలోకి వచ్చాయి. కొద్ది రోజుల తర్వాత మరో రెండు రాష్ట్రాలలో కాంగ్రెసు సంకీర్ణ మంత్రి వర్గాలను ఏర్పాటు చేసింది. బెంగాల్, పంజాబ్‌లలో మాత్రమే కాంగ్రెసేతర మంత్రివర్గాలు ఏర్పడ్డాయి.

రాష్ట్ర ప్రభుత్వాల అధికారాలు పరిమితంగా వుండటంవల్లా. కాంగ్రెసు సాంఘిక పునాదివల్లా, కార్మికులు. కర్షకులు పెట్టుబడిదార్లు, భూకామందులు పార్టీలో వుండటం వల్లా ఆధిపత్యంగల కాంగ్రెసు నాయకుల సనాతన స్వభావంవల్లా, కాంగ్రెసు మంత్రి వర్గాలు పరిపాలన మూలస్వభావాన్ని మార్చడానికి ప్రయత్నించలేదు, పెద్దమార్పులను వీరు ప్రవేశపెట్టలేదు. అయితే అనుమతించిన కొద్దిపరిమితులలో ప్రజల స్థితిగతులను కొంతవరకు మెరుగుపరచడానికి వీరు ప్రయత్నించారు. పరిపాలనలో వాకకొత్తదృక్పథాన్ని వీరు ప్రవేశపెట్టారు; విజాయితీ, సేవలలో చెప్పుకోతగిన ప్రమాణాలను నెలకొల్పారు. ప్రాథమిక సాంకేతిక ఉన్నతవిద్యను మెరుగుపరచడానికీ, ప్రజారోగ్య సేవలను మెరుగుపరచడానికీ ఎక్కువ ప్రయత్నాలు జరిగాయి. కర్షకులకు తోడ్పడటానికి నూతనకౌలుదారీ, ఋణసహాయ చట్టాలను ఆమోదించారు; ఈ చట్టాలను భూకామందులూ, జమీందార్ల సమ్మతితో ఆమోదించడంవల్ల, యివి రాజీ శాసనాలని చెప్పవచ్చు. కొన్ని రాష్ట్రాలలో ట్రేడ్‌యూనియన్లు సంకుల సమరం జరపవలసి వచ్చినప్పటికీ, మెరుగయిన పనిపరిస్థితులకూ ఎక్కువవేతనాలకూ సంప్రదింపులు జరపడానికి, వీటికి ఎక్కువస్వేచ్ఛ లభించింది. పౌరస్వేచ్ఛలమీద కంట్రోలును సడలించారు; పత్రికలస్వేచ్ఛ ఎక్కువయింది: అయితే పోలీసు, పరిపాలకవర్గంపట్ల ప్రజల భయమూ, విముఖత మాత్రం పోలేదు.

అయితే మానసికంగా అతిముఖ్య ప్రయోజనం కలిగిందని చెప్పవచ్చు. ప్రజలు కొంతవరకూ సంతృప్తి చెందారు. మామూలుగా జైలుకువెళ్ళే నాయకులు అధికార పదవుల్లో వుండటం విజయచిహ్నంగా కనిపించింది. ఆశాభావమూ, ఆత్మవిశ్వాసమూ ప్రబలాయి. స్వాతంత్ర్యానికి యివే మొదటి సూచనలని ప్రజలు భావించారు.

# VI స్వాతంత్ర్య సాధన

రెండో ప్రపంచయుద్ధానికి ఐదేళ్ళముందు భారతదేశమంతటా ఒక నూతన ఆలోచనా ప్రవంతి పరివ్యాప్తమయింది. అందరూ, జాతీయత, సామ్రాజ్యవాద వ్యతిరేక భావాలకూ, స్వాతంత్ర్య సాధన అన్న మహత్తర లక్ష్యానికి పూర్తిగా కట్టుబడి వున్నప్పటికీ, కొంత మంది కాంగ్రెసు కార్యక్రమాన్నీ, దానిని అమలు జరిపే పద్ధతినీ, ఆమోదించలేదు. అంతేకాకుండా, భావనలో స్పష్టమయిన ధృవీకరణకూడా లేదు. కాంగ్రెసేతర నాయకులు, బృందాలు భిన్న ఆదర్శాలనూ, భిన్న కార్యాచరణ పద్ధతులనూ అనుసరించడమే కాక, కాంగ్రెసులోనే రెండురకాల రాజకీయ భావనారీతులు అభివృద్ధిచెంది ప్రాబల్యాన్ని సంపాదించాయి.

ఈ కొత్తభావన మొట్టమొదటి ఫలితం ఒక విధంగా తప్పనిసరిగా వ్యతిరేక మయినది. దౌర్జన్యవాదం విప్లవశక్తిగా మాత్రమే ఉపకరించి నశించింది. బ్రిటిష్‌వారిని పడగొట్టడానికి జాతీయ తిరుగుబాటును జరపడానికి ప్రజలను ప్రేరేపించడంలో యిది విజయం సాధించ లేకపోయింది. దౌర్జన్య వాదులలో అనేకమందిని ఉరితీయడంద్వారా, లేక జైలులోపెట్టడంద్వారా, లేక వారిని కమ్యూనిష్టు, యితర ఉద్యమాలలో చేర్చు కొవడం ద్వారా విప్లవ దౌర్జన్యవాదం అణగిపోయింది.

ఇహ అనుకూలపక్షంలో, ముఖ్యంగా మూడుపోకడలు స్పష్టంగా కనుపించాయి. మొదట కాంగ్రెసు లోపల, వెలుపల సోషలిస్టు భావాలు పరివ్యాప్తమయ్యాయి. రెండోది, ట్రేడ్‌యూనియన్ ఉద్యమం, జాతీయ స్వాతంత్ర్య ఉద్యమం అభివృద్ధి చెందాయి. చివరిది కర్షక ఉద్యమం పెంపొందింది.

1929లో అమెరికాలో బాగా ధరలు పడిపోవడం లేక ఆర్థికమాంద్యం ఏర్పడింది. ఈ మాంద్యం తప్పనిసరిగా, యితర పెట్టుబడిదారీ దేశాలకుకూడా వ్యాపించింది. ఉత్పత్తి బాగా పడిపోయింది : విదేశవర్తకం ఆదుర్దా కలిగించేటంత క్రిందిస్థాయికి పడిపోయింది. దీని ఫలితంగా తీవ్రఆర్థిక దుస్థితి, విస్తృతంగా నిరుద్యోగ సమస్య ఏర్పడ్డాయి. పరిగ్గా దీనికి వ్యతిరేకంగా సోవియట్ రష్యాలో పరిస్థితి ఎంతో ఆకర్షణీయంగావుంది. రష్యాలో ఆర్థిక మాంద్యంలేదు; నిరుద్యోగ సమస్యలేదు. రెండు పంచవర్ష ప్రణాళికల తర్వాత,

ఉత్పత్తి నాలుగురెట్లు ఎక్కువయింది. ఈ భేదం స్పష్టంగా కనుపించడంవల్ల కమ్యూనిష్టు పద్ధతి, సోషలిజం, ఆర్థిక పథకరచన లాభాలూ ప్రజల దృష్టిని ఆకర్షించాయి.

బయటి ప్రపంచంలోని ఈ పరిణామాలు, భారతదేశంలోకూడా ప్రజల దృష్టిని బాగా ఆకర్షించాయి. దీనిమూలంగా సోషలిస్టు భావాలు నాయకులలోనూ, ప్రజలలోనూ కూడా కొత్త ఆలోచనను బాగా ప్రోత్సహించాయి. నూతన ఆదర్శం, ముఖ్యంగా యువజనులు, కార్మికులు, కర్షకుల దృష్టిని ఆకర్షించింది.

కాంగ్రెసులో, ఈవామపక్ష పోకడ 1936 లోనూ 1937 లోనూ రెండుసార్లు వరుసగా జరిగిన సమావేశాలలో కాంగ్రెసు అధ్యక్షులుగా జవహరిలాల్ నెహ్రూ ఎన్నిక కావడానికి దారితీసింది. నెహ్రూ తర్వాత సుభాస్‌చంద్రబోస్ ఎన్నికయ్యారు; తమ రేడికల్ నూతన భావాలకు ఈయనకూడా పేరుపొందారు. స్వయంగా గాంధీజీ ఆయన సహచరులు అనేకమంది 1939 లో ఈయన్ను వ్యతిరేకించినప్పటికీ 1938 లోనూ, మళ్ళీ 1939 లోనూ, సుభాస్ కాంగ్రెసు అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. 1936లో లక్నోలో జరిగిన కాంగ్రెసులో, సోషలిజంని కాంగ్రెసు లక్ష్యంగా ఆమోదించాలని నెహ్రూ బహిరంగంగా వాదించారు. పార్టీ కర్షకులకూ పట్టణ కార్మిక వర్గానికీ సన్నిహితం కావాలని ఆయన కోరారు. మతతత్వంనుంచి ప్రజానీకాన్ని వైముఖ్యలను చేయడానికి యిది వుత్తమ పద్ధతిఅని ఆయన పేర్కొన్నారు. తమ అధ్యక్షోపన్యాసంలో యిలా అన్నారు:

"ప్రపంచ సమస్యలకూ, భారతదేశపు సమస్యలకూ పరిష్కారమార్గం సోషలిజంలో మాత్రమే వుందని నాకు నమ్మకం కుదిరింది. నేను ఈ పదాన్ని ఉపయోగిస్తున్నాను అంటే అస్పష్టమయిన మానవతా భావంతో కాక శాస్త్రీయ, ఆర్థిక సంబంధమైన అర్థంతో వుపయోగిస్తున్నాను. ఇది జరగాలి అంటే మన రాజకీయ, సాంఘిక స్వరూపంలో విప్లవాత్మకమైన గొప్ప మార్పులు రావాలి; భూములు, పరిశ్రమలలో స్వప్రయోజనపరులు నశించాలి: మధ్యయుగపు పెత్తందారీ నిరంకుశ భారత సంస్థానాల స్వరూపము అంతంకావాలి. అంటే దీని అర్థం, పరిమిత భావంలో తప్ప, వ్యక్తిగత ఆస్తి అంతం కావాలి; ప్రస్తుత లాభాలు గడించే పద్ధతికి బదులు సహకారసేవ ఉన్నత ఆదర్శం అమలులోకి రావాలి. అంటే చిట్టచివరికి మన స్వభావంలోనూ, అలవాట్లలోనూ, వాంఛలలోనూ మార్పు రావాలి. ఒక్క మాటలో చెప్పాలంటే, ప్రస్తుత పెట్టుబడిదారీ వ్యవస్థకు పూర్తిగా భిన్నమయిన నూతన నాగరికత అమలులోకి రావాలని అర్థం".

కాంగ్రెసుకు వెలుపల నాయకత్వంలో కూడా సోషలిష్టు పోకడ స్పష్టంగా కనుపించింది. ఇది, కమ్యూనిష్టుపార్టీ పెంపొందటానికీ, కాంగ్రెసు సోషలిష్టుపార్టీ

ఏర్పాటు కావడానికి దారితీసింది. ప్రారంభంలో కమ్యూనిష్టుపార్టీ, పి. సి. జోషి నాయకత్వంక్రింద పనిచేసింది. 1934లో ఆచార్య నరేంద్రదేవ్, జయప్రకాష్ నారాయణ్, కాంగ్రెసుసోషలిష్టు పార్టీని ఏర్పాటు చేశారు. దీనికి ఒక వ్యవస్థ, వొక పత్రిక,స్పష్టంగా నిర్వచించబడిన పూర్వ స్వరాజ్యవాదుల లక్ష్యాలు వుండేవి. సోషలిష్టు సూత్రాలను అనుసరించవలసిందిగా కాంగ్రెసుమీద వొత్తిడి తేవాలని వీరు పట్టుబట్టారు. కేరళ, ఆంధ్ర, తమిళనాడుల్లో, కాంగ్రెసు సోషలిష్టులు ఉత్తర భారతదేశంలోని కాంగ్రెసు సోషలిష్టుల కన్నా మార్క్సిసమ్‌కి సన్నిహిత మయ్యారు.

దమన విధానంవల్ల, ట్రేడ్ యూనియన్ ఉద్యమంకూడా అస్తవ్యస్త మయింది. కమ్యూనిష్టుపార్టీ మీద అధికారులు నిషేధం విధించిన తర్వాత, రెడ్‌ఫ్లాగ్ ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్‌మీద ప్రభుత్వం, 1934 చివరలో నిషేధం విధించింది. ఈవిధంగా మీరట్ విచారణ తర్వాత, జైళ్ళనుంచి విడుదలచేసిన కమ్యూనిష్టులకు, అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు సభ్యత్వాన్ని తిరిగిపొంది, పనిచేయడం తప్ప మరోగత్యంతరం లేకపోయింది. కాంగ్రెసులోనూ, రాయిస్టులు ఎక్కువగాకల ఎ. ఐ. టి. యు. సిలోనూ వీరి సంఖ్య తక్కువగా వుండేది. జోషి, చమన్‌లాల్, మ్రినల్ కాంతీబోస్ నాయకత్వానవున్న భారత జాతీయట్రేడ్ యూనియన్ ఫెడరేషన్, ఈలోగా వి.వి. గిరి నాయకత్వానవున్నా అఖిలభారత రైల్వే పనివారి సమాఖ్యతో సంలీనమయింది. గిరి, మ్రినల్ కాంతీబోస్ అప్పట్లో, కాంగ్రెసు సంస్థలో ప్రబలంగావున్న జాతీయతా భావానికి సన్నిహితంగా వుండేవారు. ఇప్పుడు, జాతీయ ట్రేడ్ యూనియన్ సమాఖ్య (ఎన్. టి. యు. ఎఫ్) అనబడే అవిభక్త వ్యవస్థ వొకటి ఏర్పాటయింది. జాతీయ వాదులలో వామపక్ష సభ్యులుకూడా దీనిని బలపరిచారు. కమ్యూనిష్టులూ, ఎమ్. ఎన్. రాయ్, ఆయన అనుచరులూ ప్రబోధించే వర్గ సమర సిద్ధాంతాలను, వీరు ఆమోదించలేదు.

రెడ్‌ఫ్లాగ్ ట్రేడ్‌యూనియన్ సమాఖ్యమీద నిషేధం విధించడానికిముందు, ఈమూడు సమాఖ్యలు, తమ వేతనాలలో పెద్దకోత విధించినందుకు నిరసనగా 1934 వేసవిలో బొంబాయినుంచి భారత జవుళి కార్మికుల సమ్మెను పరిమితంగా ఏర్పాటు చేయగలిగారు. దాదాపు 1,20,000 మంది కార్మికులు ఈసమ్మెలో పాల్గొన్నారు. పోలీసుల దమన విధానము, రైట్‌వింగ్ ట్రేడ్‌యూనియన్ నాయకుల వుపేక్షాభావము, యజమానులకు విధేయులుగా కొంతమంది కార్మికులు పనిచేయడం — ఇవి (వొక్క బొంబాయిలోనే నిరుద్యోగ కార్మికులు 90,000 మంది వుండేవారు) జూన్‌లో సమ్మె విఫలం కావడానికి దారి తీశాయి.

ఈ కాలంలో వుధృతమవుతూవున్న మూడోపోకడ, గాంధీయిజం, కాంగ్రెసు సోషలిజం, కమ్యూనిజం, శైశవంలోవున్న కిసాన్ లేక కర్షక వుద్యమాలలోకి వ్యాప్తిచెందటం. 1920 సంవత్సరాలలో కార్మికులు కర్షకుల పార్టీలనూ, 1929 - 31 మాంద్యంలో యదేచ్ఛగా పెల్లుబికిన కర్షక నిరసన ఉద్యమాలనూ వెల్లింగ్‌డన్ అణచివేశారు. కొన్ని జిల్లాలలో కర్షక నాయకులు యిప్పుడు మళ్ళీ తలఎత్తి తమ కార్య కలాపాలను తిరిగి ప్రారంభించడం మొదలు పెట్టారు.

బీహార్‌లో, సహజానంద సరస్వతి, శక్తివంతమైన స్థానిక కిసాన్ సభను ఏర్పాటు చేశారు. అంతకిముందు ఉత్తరప్రదేశ్‌లో ప్రజామోదం పొందిన వామపక్ష వ్యవసాయ కార్యక్రమాన్ని వీరు ప్రచారం చేశారు. బీహార్ వెనుకబడిన జిల్లాలలో ఆ తర్వాత పలుకుబడిని సంపాదించిన కర్షక నాయకులలో మరో ముఖ్యులు కార్యానందశర్మ. వాయవ్య సరిహద్దు రాష్ట్రంలో ఖుదైఖిద్‌మత్‌గార్లు, దక్షిణ మహారాష్ట్రలో రాయిస్టులు, కర్షకుల కోర్కెలను మళ్ళీ ప్రచారంలోకి తెచ్చారు. పెద్దదయిన హైదరాబాదు సంస్థానంలో, దక్షిణ మహారాష్ట్ర సరిహద్దు జిల్లాలలో పేద కర్షకులను పీడించడాన్ని స్వామి రామానంద తీర్థ ప్రతిఘటించారు. మహారాష్ట్ర జిల్లాలోని ఒక గాంధేయ పాఠశాలలో ఆయన జీవితం ప్రారంభించారు: బొంబాయి నగర ట్రేడ్ యూనియన్ ఉద్యమం సంస్కరణ శాఖలో ప్రవేశించారు. ఆ తర్వాత ఔరంగాబాదు జిల్లాలో గాంధేయ గ్రామీణ సంక్షేమ సంస్థను ప్రారంభించారు. ఆ తర్వాతి సంవత్సరాలలో రామానందతీర్థకృషి, హైదరాబాదు సంస్థాన ప్రజా కాంగ్రెసులో సామాన్య కర్షక పునాదిని ఏర్పాటు చేసింది. ఇది, 1947 తర్వాత, హైదరాబాదు, భారతయూనియన్‌లో సంఘటితం కావడానికి సమరానికి నాయకత్వం వహించింది. దక్షిణ భారతావనిలో, ఉత్తర తమిళనాడులో ఎక్కువ సంఖ్యలోవున్న వన్నియార్లు షెడ్యూల్డు కులాల సంస్థలూ, దక్షిణ తమిళనాడులో ఎక్కువ సంఖ్యలోవున్న తేవర్‌లూ, నాడార్‌లూ, కేరళలోని ఇరువాలూ, పురపాలక, ప్రజాస్వామిక స్వపరిపాలనా ప్రభుత్వంలో యింకా ఎక్కువ వాటా యివ్వాలని గట్టిగా కోరారు. నైఋతి బెంగాల్‌లోని మన్‌భూమ్, పురిలియా జిల్లాలోనూ, బీహార్‌లోని రాంచీ, సింగ్‌భుమ్ జిల్లాలలోనూ, గాంధేయ కార్యకర్తలు, వెనుకబడిన కర్షకులలో, జాతీయత, అహింస, గాంధేయ ఆదర్శాలను పరివ్యాప్తం చేయడానికి కృషిచేయడం ప్రారంభించారు. ఈ భావాలు వాకొక్కప్పుడు, వెనుకబడిన ఆదిమవాస ప్రజలకు కూడా పరివ్యాప్త మయ్యాయి. ఛోటా నాగపూర్‌లో టానా భగత్ కొండ తెగల ఆక్షేపణ వుద్యమం ఆతర్వాత, గాంధీమహరాజ్ సమాజాన్ని ఏర్పాటుచేసింది. (అస్సాం ప్రక్కనే వున్న) నాగాలేండ్‌లో, వారి మతపెద్దలలో వొకరి నాయకత్వంక్రింద కొంతమంది నాగాలు

బ్రిటిష్ పరిపాలనకు వ్యతిరేకంగా దౌర్జన్యపూరితమైన తిరుగుబాటు జరిపారు. వీరు భగవత్ శక్తివుందని అనుకున్న గైడాలో అన్న యువతిని తమ రాణిగ ప్రకటించు కున్నారు. రాణి గైడాలో జాతీయ వుద్యమాన్ని బలపరిచింది. 1930 సంవత్సరాల చివరిలో ముస్లిం మత పండితులు మౌలానా అబ్దుల్ హమీద్ ఖాన్ భాషానీ, దక్షిణ అస్సాంలోని సిల్‌హెట్ జిల్లాలో శక్తివంతమైన కర్షక వుద్యమాన్ని ఏర్పాటు చేశారు. ఈ వుద్యమం పొరుగునవున్న మైమన్‌సింగ్ జిల్లాలోకి వ్యాపించింది.

ఈ ఉద్యమాలు సమైక్యంగానూ లేవు, అన్నీ కాంగ్రెస్ కంట్రోలు క్రిందా లేవు. అనేక కిసాన్ సభలకు కాంగ్రెసు సోషలిష్టులు నాయకత్వం వహించారు. అప్పు డప్పుడు కొన్ని కర్షక ఉద్యమాలు ఉదాహరణకు, బెంగాల్‌లో తారకేశ్వర్ సత్యా గ్రహం, ట్రవాన్కూర్ రాష్ట్రంలో వయలార్ సత్యాగ్రహం, స్థానిక కమ్యూనిష్టు అగ్ర నైజర్ల నాయకత్వం క్రింద ప్రభావితమై నడిచాయి. కాంగ్రెసు నిర్మాణ కార్యకర్తలు నాయకత్వం వహించిన సందర్భాలలో, కర్షకులకు, సంస్కరణ, జాతీయ భావాలలో చైతన్యం కలిగింది. మిగతా సందర్భాలలో, కర్షకులు, స్థానికవర్గ సమస్యలతోనూ ఎప్పుడో, జాతీయ ఉద్యమంతోనూ, సతమత మవుతూ వుండేవారు. ఈ ఉద్యమాలు కొన్నింటిలో మత నాయకత్వం ప్రధానంగా వుండేది. వెనుక బడిన ప్రాంతాలలోకర్ష కులు, అప్పుడప్పుడు ఆది నైతిక సూత్రాలతో ఉద్వేగ పూరితులవుతూ వుండే వారు. ఈ నైతిక సూత్రాలను వారి స్థానిక మత, కుల, తెగల ప్రబోధకులు బోధిస్తూ వుండేవారు. పీడనకు వ్యతిరేకంగా పరోక్షమైన ఆక్షేపణగా యిటువంటి మత విజ్ఞప్తులు అనేక దేశాల కర్షక విమోచన సమరాల చరిత్రలో సామాన్యంగా కనబడుతూ వుంటాయి.

ఇదే సమయంలో, గ్రామ కర్షకుల విద్య, వారి వ్యవస్థీకరణ రంగాలలో పనిచేస్తూ వున్న అనేక మంది రాజకీయ కార్యకర్తలు, కమ్యూనిష్టులూ కాంగ్రెసు సోషలిష్టులూ ప్రతిపాదించిన మార్క్సిష్టు ఆదర్శంతో ప్రభావితులయ్యారు. సంయుక్త ఉద్యమ రాజ కీయ ప్రదర్శనలు, ఉమ్మడి సమావేశ వేదికను కల్పించాయి. ఇదే మోస్తరుగా, అనేకమంది రాజకీయ ఖైదీలను ఒకేచోట నిర్బంధంలో వుంచినపుడు, సంబంధాలు పటిష్ఠమయ్యాయి. ఉదాహరణకు, హిజ్‌లీ, బక్సర్, మాండలే, అండమాన్ నిర్బంధ శిబిరాలు, జైళ్ళలో యిటువంటిది జరిగింది. అనేకమంది గాంధీవాదులు, దౌర్జన్య వాదులు, జైళ్ళలో వున్నప్పుడు, పుస్తకాలు, కరపత్రాలు చదువుకోడానికి వ్యవధిదొరి కింది. దీని వల్ల వీరు, అహింసాత్మక సిద్ధాంతాలనుంచీ, బాంబులు, బృంద వీరత్వం నుంచి, వర్గ సమర మార్క్సిష్టు సిద్ధాంతాలను ఆమోదించారు. 1935 మే దినోత్సవం

రోజున భగత్‌సింగ్ మిగతా సహచరులతో సహా అండమాన్ జైలులో వున్న 31 మంది నిర్బంధితులు కమ్యూనిస్టు సమన్వయ సంఘంగా ఏర్పడ్డారు. ఆ తర్వాత అండమాన్సులో చిట్టగాంగ్ బృందం లోని కొంతమంది సభ్యులు కూడా కమ్యూనిజంను అనుసరించారు. అయితే వీరి సంఖ్యకన్నా గ్రామప్రాంతాలలో కృషిచేస్తూ వున్న కాంగ్రెసు రాజకీయ కార్యకర్తల సంఖ్య ఎక్కువగా వుండేది. వీరిలో ఎక్కువ మంది గాంధీజీ సర్వోదయ ఆదర్శాన్ని ప్రచారం చేసేవారు.

ఈ సాధారణ పోకడల దృష్ట్యా, విమోచన సమరంలో కొత్త సంబంధాలు తల ఎత్తాయి.

## జాతీయ సమరంలో సంస్థాన ప్రజా ఉద్యమాలు

బ్రిటిష్ - భారతదేశాన్ని వైస్‌రాయ్ ప్రత్యక్ష పాలనాధికారంతో పరిపాలించేవారు. మిగతాదేశం సంస్థానాధీశుల ఆధీనంలో వుండేది. బ్రిటిష్ వారు వీటిని సంస్థానాలు అని అంటూ వుండేవారు. పెద్ద చిన్న ప్రాంతాలు, జనాభాలు గల యీ సంస్థానాలు, దేశమంతటా వుండేవి; బ్రిటిష్ భారత ప్రాంతంలో యివి మధ్య మధ్య వుండేవి. రాజులు అధిపతుల ద్వారా, బ్రిటన్ పరోక్షంగా వీటిని పరిపాలిస్తూ వుండేది.

రాజులు తమ సంస్థానాలను, తమ చిత్తంవచ్చినట్టుగా పరిపాలించేవారు. బ్రిటిష్ పరిపాలకులతో తమ సంబంధాలు అణిగి మణిగి వుండేవిధంగా కొనసాగుతూ వుండేటట్టు చూసేవారు. కొద్దిమంది యిలా చేసేవారుకాదు. ఇది బ్రిటిష్ అధికారులకు కోపం కలిగించింది; తమ సంస్థానాల మీద కంట్రోలును కోల్పోయే ఫలితాలను సంస్థానాధిపతులు అనుభవించవలసి వచ్చింది. అయితే భారతదేశంలో బ్రిటిష్‌పాలన, ప్రభావాల వల్ల అభివృద్ధి నిరోధక పెత్తందారీ నిరంకుశత్వాలు కాపాడబడి, అనేక సంస్థానాలలో కొనసాగాయన్న విషయాన్ని ముఖ్యంగా గమనించవలసి వుంది. మొత్తంమీద ప్రజాస్వామిక ప్రభుత్వ మనేది లేదు. ప్రజల జీవన ప్రమాణం, రాజులూ వారి సేనాధిపతులూ పటాటోపంతో, దుబ్బారా చేస్తూ జీవించడంతో పోల్చి చూసినట్టయితే, అతి హీనాతి హీనంగా వుండేదని చెప్పవచ్చు. కొన్ని సందర్భాలలో వీరు, ప్రజలను పీడించుకు తింటూ వుండేవారుకూడా. మామూలు పరిస్థితులలో, అవినీతి కరమైన లేక నిరంకుశ పరిపాలకులను, అంతరంగిక తిరుగుబాటు ద్వారా కాపీ, బాహ్య దురాక్రమణద్వారా గానీ, పడగొట్టేవారు. భారత సంస్థానాల విషయంలో బ్రిటిష్

పాలన, ఈ రెండింటినీ అసంభవం చేసింది. సంస్థానాధిపతులు, క్షేమంగా భద్రత కలిగి వుండేవారు. తమ పెత్తందారి స్థానాలలో శిలగొట్టు కొని వుండేవారు.

ఈ అసంతృప్తి కరమైన వైరుధ్య పరిస్థితులు, సంస్థానాలలో స్థానిక సంస్థలు తల ఎత్తటానికి దారితీశాయి. ప్రజల అశాంతి వీటిలో ప్రతిబింబిస్తూ వుండేది. వీటిని మామూలుగా ప్రజామండల్ లేక సంస్థాన ప్రజల మహాసభ అంటూ వుండేవారు. మైసూర్ సంస్థాన కాంగ్రెస్ ఒకటి వుండేది. ఇవన్నీ స్థానికంగా, ఆయా సంస్థానానికి చెందిన వ్యవహారాలతో మాత్రమే సంబంధం కలిగి వుండేవి. మొదటి ప్రపంచ యుద్ధంలో పోరాడటానికి సంస్థానాలు పంపిన సైనిక పటాలాలు తిరిగి వచ్చినపుడు తమ సంస్థానాలలో ప్రజాస్వామిక భావాలు పరివ్యాప్తం కావడానికి వీరు తోడ్పడ్డారు. అంతేకాకుండా సహాయ నిరాకరణ వుద్యమం గొప్ప ప్రభావాన్ని కలిగించింది.

1920 లో, కాంగ్రెసు, నాగపూర్‌లో జరిపిన మొట్టమొదటి వార్షిక సమావేశంలో తమ సంస్థానాలలో పూర్తి బాధ్యతాయుత ప్రభుత్వాన్ని వెంటనే నెలకొల్పాలని మొట్ట మొదటి సారిగా రాజులను కోరారు. అయితే యిదే సమయంలో, సంస్థానాల్లోని ప్రజలు (సంస్థాన ప్రజలు అని ప్రస్తావించేవారు) కాంగ్రెసులో వ్యక్తిగత సభ్యులైనప్పటికీ ఈ సభ్యత్వాన్ని తమతమ సంస్థానాల అంతరంగిక వ్యవహారాలలో జోక్యం కలిగించు కోడానికి వుపయోగించరాదని తమ తీర్మానాలలో స్పష్టంచేశారు. వారు అలా చేయదలచి నట్టయితే అది వారి వ్యక్తిగత హోదాలో మాత్రమే జరగాలిగాని, భారత జాతీయ కాంగ్రెసు పేరుమీద జరగరాదని పేర్కొన్నారు. ఇది, కాంగ్రెసులోని బ్రిటిష్ భారత సభ్యులకు కూడా వర్తిస్తుంది. సాధారణంగా ప్రతి సంస్థానంలోనూ రాజకీయ కార్య కలాపాలను స్థానిక ప్రజామండల్, లేక సంస్థాన ప్రజల మహాసభ ఆర్గనైజ్ చేసి కంట్రోలు చేయాలని కాంగ్రెసు అభిప్రాయపడింది.

సంస్థానాధిపతులందరితో, రాజుల సమితి (నరేంద్ర మండల్) అనబడే కేవల సలహా సంస్థను, బ్రిటిష్ ప్రభుత్వం ఏర్పాటు చేసింది. వీరిమధ్య సంబంధాలు వొకే స్థాయిలో వుండేటట్టు చేయడమే దీని ఉద్దేశ్యం. అయితే పలురకాల రాజుల అంతస్థులలో తేడాలు కారణంగా ఈ సమితిలో చీలికలేర్పడ్డాయి. సైమన్ కమిషన్‌ను నియమించిన సంవత్సరం లోనే, సంస్థానాలకూ, కేంద్రప్రభుత్వానికీ మధ్య మెరుగయిన సంబంధాలు ఏర్పాటయ్యే టట్టు చూడటానికి తీసుకోవలసిన చర్యలగురించి శిఫార్సు చెయ్యడంకోసం, బ్రిటిష్ ప్రభుత్వం హార్‌కోర్టు బట్లర్ భారత సంస్థానాల సంఘాన్ని కూడా నియమించింది. ప్రభుత్వం తీసు కున్న ఈ చర్యకు సమాధానంగా, సంస్థానాలలోని బల్వంతరాయ్ మెహత, మణిలాల్ కొఠారీ - కథియవాడ్ దక్కన్‌కు చెందిన జి. ఆర్. అభ్యంకర్ వంటి జాతీయవాదులు,

1927 డిశంబరులో అఖిల భారత సంస్థాన ప్రజల మహాసభను ఏర్పాటు చేశారు. పశ్చిమభారతంలోని సంస్థానాల పూనికపై యిది జరిగినప్పటికీ, భారతదేశమంతటినుండి 700 ప్రతినిధులు దీనికి హాజరయ్యారు. సంస్థానప్రజల సమిష్టి అభిప్రాయానికి అనుగుణంగా, పరిపాలనలో అవసరమయిన సంస్కరణలను ప్రవేశపెట్టేటట్లు చేయడానికీ, అన్ని సంస్థానాలలోనూ ఎన్నికల సూత్రం ప్రకారం, ప్రజా ప్రాతినిధ్యమూ, స్వపరిపాలనా ప్రభుత్వమూ ఏర్పడేటట్లు చేయాలనీ, సంస్థానాల ప్రభుత్వాలకు నచ్చచెప్పడమే ఎ.ఐ.ఎస్.పి.సి. ఏర్పాటు చేయడంలో ఉద్దేశ్యం. ప్రజల రెవెన్యూకూ, పరిపాలకుడి ప్రయివేటు ఆదాయానికీ మధ్య తేడాను స్పష్టంగా గుర్తించాలని కూడా ఈ మహాసభ కోరింది. వ్యక్తిగత ఖర్చులకోసం ప్రజల ధనాన్ని దుర్వినియోగం చేయకుండా చూడటానికి, యిది అవసరం. న్యాయశాఖను పరిపాలనా శాఖనుంచి వేరుచేయాలనీ, అందువల్ల నిరంకుశ ఉత్తర్వులు రద్దయి తీరుతాయనీ కూడా ఈ మహాసభ వాదించింది. బ్రిటిష్ భారతదేశానికీ, భారత సంస్థానాలకూ మధ్య రాజ్యాంగబద్ధమైన సంబంధాలు ఏర్పాటు కావాలనీ, ఈ సంబంధంలో సంస్థానప్రజల వాణి వినిపించేటట్లు చూడాలనీ ఎ.ఐ.ఎస్.పి.సి. కోరింది. దీనివల్ల యావద్భారతదేశమూ స్వరాజ్‌ను త్వరగా పొందించవచ్చునని గట్టిగా పేర్కొన్నారు.

1927 డిసెంబరులో మొట్టమొదటి సమావేశం జరిగినప్పటినుంచీ, అఖిలభారత సంస్థానప్రజల మహాసభ శాశ్వతమైన సజీవ రాజకీయ సంస్థగా రూపొందింది. ఇది పెత్తందారీ విధానానికి పూర్తిగా విరుద్ధం; అయితే కాంగ్రెసంత స్పష్టమైన సామ్రాజ్యవాద వ్యతిరేకి కాదు. సంస్థానప్రజలకు సంబంధించినంతవరకూ మధ్యయుగపు పెత్తందారీ వ్యవస్థ ప్రత్యక్షంగా పీడించుకుతింటూ వుండటమే దీనికి కారణం.

ఏ.ఐ.ఎస్.పి.సి. ఏర్పాటుచేసినందువల్ల వెంటనే కలిగిన ఫలితమేమిటంటే, భిన్న సంస్థానాల ప్రజల సమరాలు, స్థానిక సంఘటనలు ఏకాకి కావడానికి వీలులేక పోవడమే కాక, వాటికి అఖిలభారత ప్రాధాన్యం వచ్చింది. ఈ విధంగా జవహరిలాల్ నెహ్రూ లాహోర్ కాంగ్రెసులో అధ్యక్షోపన్యాసమిస్తూ పూర్ణ స్వరాజ్ గురించి అధికారపూర్వకంగా యిలా ప్రకటించారు.

"భారత సంస్థానాలు, మిగతా భారతదేశంనుంచి వేరుగా జీవించజాలవు. సంస్థానాల భవిష్యత్తుగురించి నిర్ణయించే హక్కుగల ప్రజలు ఈ సంస్థాన ప్రజలు మాత్రమే."

1929 లో కాంగ్రెసు కూడా ఏ.ఐ.ఎస్.పి.సి. కోర్కెలను బలపరుస్తూ ఒక తీర్మానాన్ని ఆమోదించింది.

సంస్థానాలను యావద్ భారతదేశంలో అంతర్భాగాలుగా భావించాలన్న వీరివైఖరికి ప్రత్యక్షఫలితంగా, మొదటి రౌండుటేబిల్ సమావేశంలో సంస్థానాల ప్రజలకు ప్రాతినిధ్య మివ్వడానికి అంగీకరించాలని ఏ.ఐ.ఏస్ పి.సి బ్రిటిష్ప్రభుత్వాన్ని కోరింది. ఈ విజ్ఞప్తికి అంగీకరించలేదు. ఆతర్వాత ఏ.ఐ.ఎస్.పి.సి. అఖిలభారత ఫెడరల్ రాజ్యాంగాన్ని బలపరుస్తూ కాంగ్రెసుకు వొకవిజ్ఞప్తిని సమర్పించింది. ఈరాజ్యాంగం ప్రకారం, బ్రిటిష్ భారతదేశంలో అమలుపరచాలని కరాచీ కాంగ్రెసు కోరిన ప్రాథమికహక్కులు, ప్రత్యేక హక్కులుఅన్నీ, సంస్థానాల ప్రజలకుకూడా యివ్వాలి. పెత్తందారీ వ్యతిరేకవుద్యమం ఈ విధంగా ప్రజా స్వామికమయి జాతీయఉద్యమంతో సన్నిహితమయింది.

అయితే 1920 లో గాంధీజీ జోక్యం కలిగించుకోని వైఖరిని పునరుద్ఘాటించారు. బయటినుంచి ప్రారంభమయిన వుద్యమం, విజయవంతం కానేరదనీ, సంస్థానాలప్రజలు స్వయంశక్తిమీద ఆధారపడి వుండటం నేర్చుకోవాలనీ గాంధీజీ వాదించారు. అయితే, సంస్థానాధిపతులు తమ ప్రజలకు ప్రాథమిక హక్కులను యివ్వాలన్న కాంగ్రెసు తీర్మానాన్ని ఆయన ప్రోత్సహించారు.

1935 వ సంవత్సరపు భారతచట్టంలో ఫెడరల్ సూత్రాన్ని గుర్తించారు. అయితే యీ ప్రతిపాదనలు పరిస్థితిని ఎంత నైపుణ్యంతో అదుపుచేయగలిగాయి అంటే,సంస్థానాలు జాతీయతాభావానికి అడ్డంకులు పెట్టగలిగాయి. ఈ చట్టం, ఎగువ సభలో ఐదింట రెండు వంతుల సీట్లనూ, దిగువసభలో మూడింట ఒకవంతుసీట్లనూ, కేంద్రంనుంచి రాష్ట్రాల వరకూ ఏర్పాటుచేసింది. ఇది వొకవ్యక్తికి వొకేవోటు అన్నపద్ధతిని గుర్తించి చేసినది కాదు, సంస్థానాల ప్రతినిధులు వాస్తవంగా సంస్థానప్రజలకు ప్రాతినిధ్యం వహించారు. వీరుకేవలం పరిపాలకుల నామినీలుగా మాత్రమే వుంటారు.

అనేక సంస్థానాలలో, ముఖ్యంగా, రాజ్‌కోట్, జయపూర్, కాశ్మీర్, హైదరాబాదు, తిరువాన్కూర్‌లలో, ప్రజాస్వామిక సూత్రాన్ని గుర్తించాలనీ, ప్రభుత్వ పాలనా యంత్రాంగాన్ని పునర్ వ్యవస్థీకరించాలనీ గట్టిగా కోరుతూ పెద్దవుద్యమాలు ప్రారంభమయ్యాయి. వీటికి సమాధానంగా,రాజులు నిర్దాక్షిణ్యమైన దమన విధానాన్ని అనుసరించారు. కొంతమంది, మతవిద్వేషాలను రెచ్చగొట్టడంద్వారా ప్రజాతిరుగుబాటు వుద్యమాలను అరికట్టడానికి ప్రయత్నించారు. ఉదాహరణకు హైదరాబాదు నిజాం ప్రజావుద్యమాన్ని, ముస్లిం వ్యతిరేకవుద్యమమని చెప్పడానికి ప్రయత్నించారు. ఇదేమోస్తరుగా కాశ్మీర్ మహారాజా, ప్రజావుద్యమం హిందూవ్యతిరేక వుద్యమమని పేర్కొనడానికి ప్రయత్నించారు. తిరువాన్కూర్‌లో, క్రైస్తవులూ, వారిమతమూ, వెనుకనుంచి అలజడిని నడిపించారనీ, హిందూ మహారాజును పడగొట్టడమే వీరి వుద్దేశ్యమనీ సూచించడం జరిగింది.

సంస్థానాలప్రజలు జరుపుతోన్న స్వాతంత్ర్య సమరాన్ని బలపరచడం భారత జాతీయకాంగ్రెసు ప్రారంభించింది. ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని ప్రవేశపెట్టాలనీ, ప్రజలకు పౌరస్వేచ్ఛలను యివ్వాలనీ గట్టిగాకోరింది. స్వాతంత్ర్యంగురించి కాంగ్రెసు మాట్లాడిందిఅంటే, సంస్థానాల ప్రజలతోసహా భారతదేశంలోని ప్రజలందరి స్వాతంత్ర్యమే అంతిమలక్ష్యమని అర్థమని స్పష్టంచేసింది. (1938) త్రిపురి కాంగ్రెసులో, సంస్థానాల వుద్యమాలతో, వ్యవస్థ యింకా సన్నిహిత సంబంధం పెట్టుకోవాలని నిర్ణయించారు. భారతప్రజలందరి వుమ్మడిఆశయాలను స్పష్టం చేయడానికి, అఖిలభారత సంస్థాన ప్రజల మహాసభ, 1939లో జవహరిలాల్ నెహూౄను తమ అధ్యక్షులుగా ఎన్నుకుంది. సంస్థానాలలో వుద్యమాలు, సంస్థాన ప్రజలలో రాజకీయ చైతన్యాన్ని రేకెత్తించడమేకాక భారతదేశపు ఐక్యతాభావానికి వొక కొత్త స్వరూపాన్ని ప్రవేశపెట్టడానికి కూడా కారణమయాయి.

## ప్రపంచ వ్యవహారాలలో శ్రద్ధ

1930 సంవత్సరాల చివరలో, భారత జాతీయ వుద్యమం ముఖ్యంగా కాంగ్రెసు నాయకత్వం, ప్రపంచ వ్యవహారాలలో ఎక్కువ చైతన్యవంతమైన శ్రద్ధను కనబరచి, విదేశాలలోసంఘటనలకూ, దేశంలో ప్రజలమీద వాటి ప్రభావానికీ సంబంధం పెట్టడం నేర్చుకోడానికి మొదలు పెట్టింది. మొట్టమొదటినుంచీ, విదేశాలలో, ముఖ్యంగా ఆఫ్రికా - ఆసియా దేశాలలో బ్రిటిష్ సామ్రాజ్యవాద కాంక్షలను ప్రోత్సహించడానికి భారతీయ సైన్యాన్నీ, భారతదేశపు సాధన సంపత్తులనూ వుపయోగించడానికి, భారతనాయకులు అభ్యంతరం తెలిపారు. ఈ వ్యతిరేకత స్పష్టమయి, 1885 లో కాంగ్రెసు ఏర్పడినప్పటినుంచీ, దాని విధానంగా రూపొందింది. దీని ప్రత్యక్ష ఫలితంగా, కాంగ్రెసు, దేశానికి విదేశాంగ విధానాన్ని రూపొందించడం కూడా ప్రారంభించింది. ఇది బ్రిటన్ ప్రయోజనాలకు అనుగుణంగా కాక తన స్వంత ప్రయోజనాలను కాపాడేదిగా ఉండేట్టు తీర్చి దిద్దడం ప్రారంభించారు. ఈ విధానం, సాధారణంగా సామ్రాజ్యవాదాన్ని అన్ని రూపాలలోనూ ప్రతిఘటించడానికి అనుకూలంగా వుంది. 1927 ఫిబ్రవరిలో జవహరిలాల్ నెహ్రూ, బ్రసెల్సులో జరిగిన కాంగ్రెసుకు (లేక అణగద్రొక్కబడిన దేశాల మహాసభకు) హాజరయ్యారు. ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాల రాజకీయ బహిష్కరణ పొందిన వారు, విప్లవవాదులూ, ఈ సమావేశాన్ని ఏర్పాటు చేశారు. ఈ దేశాలప్రజలు సామ్రాజ్యవాద దేశాల ఆర్థిక, రాజకీయ పీడనవల్ల

అనేక బాధలకు లోనవుతున్నారు. బ్రసెల్సు మహాసభ సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా వుమ్మడి సమరానికి పథకం వేసి సమన్వయం చేయాలని భావించింది. భారత జాతీయ కాంగ్రెసు ప్రతినిధిగా నెహ్రూ దీనికి హాజరయ్యారు. ఈ మహాసభలో మాట్లాడుతూ నెహ్రూ:

"పరిపాలన క్రిందవున్న ప్రజలు, అణగద్రొక్కబడిన ప్రజలు ఈనాడు జరుపుతోన్న సమరంలో ఎన్నో వుమ్మడి విషయాలున్నాయని మేము గ్రహించాము. వీరిని వ్యతిరేకించేవారు వొక్కొక్కప్పుడు భిన్న ముసుగుల్లో కనుపించినప్పటికీ వొకే రకమైన వారు. ప్రజను దాస్యంలో వుంచడానికి వారు అవలంబించే పద్ధతులు కూడా వొకేరకమైనవి."

బ్రసెల్సు కాంగ్రెసులోనే, సామ్రాజ్యవాద వ్యతిరేక లీగ్‌ను స్థాపించారు. నెహ్రూను లీగ్ కార్యవర్గ సమితి సభ్యులుగా ఎన్నుకున్నారు. అదే ఏడాది చివరిలో మద్రాసులో జరిగిన కాంగ్రెసులో ఉద్రేకపూరితమైన చర్చ జరిగిన తర్వాత, తమ సామ్రాజ్యవాద లక్ష్యాలను మరికొంత పదిల పరచుకోడానికికీ బ్రిటన్ జరిపే ఏ యుద్ధాన్ని కానీ, యుద్ధం వంటి కార్యకలాపాన్ని గానీ బలపరచడానికి భారతదేశం సిద్ధంగా వుండదని, ప్రభుత్వాన్ని ఖచ్చితంగా హెచ్చరించారు.

1930 సంవత్సరాలలో, ప్రపంచంలో యేప్రాంతంలోనయినా సరే సామ్రాజ్యవాదాన్ని ప్రతిఘటించడంలో కాంగ్రెసు వైఖరి మరింత దృఢతరమయింది. ఆసియా, ఆఫ్రికా దేశాలలో జాతీయ వుద్యమాలను కాంగ్రెసు, బాహాటంగా బలపరిచింది. సరిగ్గా అదే సమయానికి, ప్రజాస్వామ్యానికి నూతన ముప్పుగా, ఇటలీ, జర్మనీ, జపాన్‌లలో ఫేసిజం తలఎత్తుతోంది. దాని స్వంత మూర్తత్వంలో ఫేసిజం వొక రకమైన సామ్రాజ్య వాదమని చెప్పవచ్చు. దృక్పథంలో యిది కూడా జాతి విచక్షణ స్వభావం కలది. అందువల్ల కాంగ్రెస్, ఇథియోపియా, స్పెయిన్, జకోస్లోవేకియాలలో ఫేసిస్టు వ్యతిరేక సమరాలను, తిరుగు లేకుండా బలపరిచింది. 1937 లో జపాన్ చైనామీద దాడి జరిపింది. కాంగ్రెస్ దీనిని సామ్రాజ్యవాద దురాక్రమణ చర్య అని పేర్కొంది. "చైనా ప్రజల పట్ల సానుభూతి సూచనగా, జపాన్ వస్తువులను వుపయోగించకూడదని" భారత ప్రజలను కోరుతూ, వొక తీర్మానాన్ని ఆమోదించింది. ఆ తర్వాతి సంవత్సరం 1938 లో, డాక్టర్ కోట్నిస్‌తో సహా డాక్టర్ ఎమ్. అటల్ నాయకత్వాన వొకవైద్య బృందాన్ని చైనా సైన్యంతో కలిసి పనిచేయడానికి చైనాకు పంపారు.

ఆసియా, ఆఫ్రికా దేశాల భవిష్యత్తు ముడిపడి వుందనీ, ఫేసిజంకీ, స్వాతంత్ర్యం, సోషలిజం, ప్రజాస్వామ్య శక్తులకూ మధ్య జరుగనున్న సమరం, భారతదేశంపై

తీవ్రప్రభావాన్ని కలిగిస్తుందనీ, గుర్తించటం వల్ల భారతజాతీయ కాంగ్రెసు, ఈవిధానాన్ని అవలంబించింది. భారతనాయకులలో ఎక్కువమంది యీ అభిప్రాయాలతో పాలుపంచుకున్నప్పటికీ నెహ్రూ విదేశ వ్యవహారాలలో వారి ప్రధాన ప్రతినిధిగా వ్యవహరించారు. ఈ విషయంలో నెహ్రూ కాంగ్రెసు తరపున మాత్రమే కాక, యావత్ దేశం తరపున మాట్లాడారు. మన దేశాభివృద్ధిలో ప్రపంచ సంఘటనల ప్రాముఖ్యాన్ని గుర్తించిన భారతనాయకులలో నెహ్రూ మొట్టమొదటి వారు. ఈ అంశం మీద తమ అభిప్రాయాలను ఆయన అనేకసార్లు తెలియ చేశారు. ఉదాహరణకు 1936 లో లక్నో కాంగ్రెసులో అధ్యక్షోపన్యాస మిచ్చినపుడు ఆయన యిలా అన్నారు.

"స్వేచ్ఛ కోసం జరుగుతోన్న విస్తృత సమరంలో, మనం జరుపుతోన్న సమరం వొక భాగం మాత్రమే. మనలను ప్రేరేపించిన శక్తులు ప్రపంచ మంతటా కోట్లాది ప్రజలను ప్రేరేపిస్తున్నాయి. చర్యతీసుకోడానికి పూనుకునేటట్టు చేస్తున్నాయి. పెట్టుబడిదారి విధానం, యిబ్బందులలో వున్నప్పుడు, ఫేసిజంను అవలంబించింది. తమ స్వదేశాలు కొన్నింటిలోనే యిది. వలసదాస్యం క్రిందవున్న దేశాలలో దీని ప్రతిరూపమయిన సామ్రాజ్య వాదమే, ఈ రూపంగా మారిపోయింది. ఫేసిజం, సామ్రాజ్యవాదం యీ విధంగా, యిప్పుడు అంతరించి పోతూవున్న పెట్టుబడిదారి విధానానికి రెండు రూపాలుగా నిలిచి పోయాయి. పశ్చిమ దేశాలలో సోషలిజం, తూర్పు యితర పరాధీన దేశాలలో తలఎత్తుతూ వున్న జాతీయతా భావము, ఫేసిజం సామ్రాజ్య వాద సంయుక్త స్వరూపాన్ని ప్రతిఘటిస్తున్నాయి అని అన్నారు.

సామ్రాజ్య వాద దేశాలమధ్య జరిగే యే యుద్ధంలో నయినా భారతదేశం పాల్గొనబోదని నెహ్రూ గట్టిగా నొక్కి చెప్పారు. అయితే భారతదేశం "ప్రపంచ అభ్యుదయ శక్తులకూ, స్వాతంత్ర్యం కోసం నిలబడి రాజకీయ సాంఘిక అడ్డుగోడలను విచ్ఛిన్నం చేసే వారికి" అండనిస్తుందనీ, ఎందువల్లనంటే, సామ్రాజ్యవాదం, ఫేసిస్టు అభివృద్ధి నిరోధకులమీద జరుగుతున్న సమరంలో మేము జరుపుతున్న సమరం వొక సమరమని మేము గుర్తించాము, అని అన్నారు.

## మతతత్వం పెంపొందటం

1935 వ సంవత్సరపు చట్టంవల్ల యివ్వబడిన పరిమిత ప్రజాస్వామ్యం, ప్రాంతీయతత్వం, మతతత్వం పోకడలను మళ్ళీ రెచ్చగొట్టింది. ప్రభుత్వం అనుసరిస్తోన్న "విభజించి

పరిపాలించు" అన్న విధానం వీటికి ప్రోది చేసింది. దేశమంతటా వున్న జమీందార్ల పెత్తందారీ శక్తులూ, భూకామందులూ, వొక రకమైన వీర మతఉన్మాదమూ కూడా వీటికి దోహదమయ్యాయి: ముస్లింలకు ప్రత్యేకంగా కేటాయించబడిన 58 సీట్లలోనూ, కాంగ్రెసు పోటీచేసి, 26 సీట్లను మాత్రమే గెలిచింది. ఈ 26 సీట్లలోకూడా 15 సీట్లను వాయవ్య సరిహద్దు రాష్ట్రంలో, ఖాన్ అబ్దుల్‌గఫార్‌ఖాన్, ఆయన ఖుదై ఖిద్ మత్‌గార్ల పటిష్ఠమయిన పలుకుబడివల్ల గెలిచారు. ముస్లింలీగ్, ముస్లింలకోసం ప్రత్యేకంగా కేటాయించిన ఈ సీట్ల నుంచి ఎక్కువ సీట్లను గెలుచుకోలేకపోయింది. యావత్ దేశంకోసం, పాటుబడాలన్న వాంఛ మనస్ఫూర్తిగా వున్నప్పటికీ, తమ సభ్యులలో జాతీయవాద ముస్లింలున్నప్పటికీ, ముస్లిం ప్రజానీకం ఆదరణను యింకా సంపాదించవలసివుందని, కాంగ్రెసు గ్రహించింది. అందువల్ల, పార్టీ జయించిన విజయాలతో తన స్థానాన్ని పటిష్ఠం చేసుకొని, సామాన్య ప్రజానీకంతో సన్నిహిత సంబంధం ఏర్పాటుచేసుకునే కార్యక్రమం గురించి తీవ్రంగా ఆలోచించవలసిన అవసరముందని భావించింది.

ముస్లిం అల్పసంఖ్యాక వర్గాల ప్రత్యేకతనూ సంఘటిత తత్వాన్నీ లేకుండా చేయడానికి కాంగ్రెసు ప్రయత్నిస్తోందని ఆరోపిస్తూ, ముస్లింలీగ్ కాంగ్రెసును దుయ్యబట్టడం ప్రారంభించింది. హిందువులు, ముస్లింలు రెండు భిన్న జాతులన్న సిద్ధాంతాన్ని ప్రచారం చేయడం లీగ్ ప్రారంభించింది.

హిందువులలో కూడా సాధారణ ప్రజాస్వామిక పతాకాల క్రింద కులం ప్రాతిపదికగాగల సంఘాలు యిప్పుడు పేరులోకి వచ్చాయి. వీటిలో ముఖ్యమయినవి ఎన్.టి.యు.ఎఫ్. నాయకులు బలపరిచిన ముఖ్యంగా దళితవర్గాల కార్మికులుగల బొంబాయిలోని డాక్టర్. అంబేడ్కర్ స్వతంత్ర కార్మికుల పార్టీ, బ్రాహ్మణుల ఆధిపత్యం క్రింద వుందని అనుకుంటున్న కాంగ్రెసుకు వ్యతిరేకమయిన మద్రాసులో పునరుద్ధరింపబడిన జస్టిస్ పార్టీ. ఇతర ప్రాంతాలలో కూడా యిదే మోస్తరు సంస్థలు తలఎత్తాయి. హిందూమహాసభ, అప్పటికే అమలులో వుంది. 1925 ఆరంభంలో 'రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్' అవతరించింది. హిందూ మతోన్మాదులు అనేక సంవత్సరాలవరకూ, అంతకి ముందే బెడిసిపోయిన సంబంధాలను మరీ అధ్వానం చేశారు. రెండుజాతుల ముస్లిం మత సిద్ధాంతానికి వ్యతిరేకంగా, హిందువులవల్ల భారతజాతి ఏర్పడిందనీ, యితర మతాలను అనుసరించేవారు 'విదేశీయులనీ' అన్న అశాస్త్రీయ సిద్ధాంతాన్ని వీరుకూడా రూపొందించారు. ఈ రెండు మత సిద్ధాంతాల ప్రభావమేమిటంటే, భారత ప్రజలను విభజించి, విదేశ పాలనకు వ్యతిరేకంగా జరుగుతూవున్న సమరాన్ని బలహీనం చేయడమే. అంతేకాకుండా ఈ హిందూ, ముస్లిం మతసంస్థలు, కాంగ్రెసుకు వ్యతిరేకంగా పోరాటం జరపవలసిందిగా

తమ అనుచరులకు ఉద్బోధించాయి. విదేశ సామ్రాజ్యవాదులపట్ల వీరు, లొంగివుండి సహకరించే వైఖరిని ప్రదర్శించారు. బ్రిటిష్ ప్రభుత్వం కాంగ్రెసునూ, యితర జాతీయ సంస్థలనూ విమర్శించినపుడల్లా ఈ రెండు మతవర్గాలు అధికారులతో సహకరించేవి.

1939 తర్వాత మత ఉద్రిక్తత పెరిగిపోయింది. మత ఉద్రిక్తత పెరగడానికి సమాధానానికి రాని కాంగ్రెసు వైఖరి కారణంకాదు. బ్రిటిష్ సామ్రాజ్యవాద విధానానికీ, భారత మతతత్వమూ - ప్రాంతీయ తత్వమూ మధ్య జరిగిన వైరుధ్యమే దీనికి కారణం. ఒకప్రక్క ప్రాతినిధ్య ప్రభుత్వ పరిమాణాన్ని ఎక్కువ చేయడానికి ప్రయత్నిస్తూవున్నట్టు నటిస్తూనే, పట్టణాలలో ఆస్తిపాస్తులున్న, ధనిక, కర్షక వర్గాలు, క్రిందినుంచి పైవరకూ, ప్రజాస్వామిక విరుద్ధ సనాతన భావాలున్న కొన్ని వర్గాల ప్రజలలో అధికార వాంఛను ప్రోత్సహించడానికి బ్రిటిష్‌వారు ప్రయత్నించారు. ఈ వర్గాలు ప్రాంతీయ తత్వమూ, మతతత్వమూ గల పార్టీలనుంచీ, హిందూ-ముస్లింల నుంచీ సహాయాన్ని కోరడానికి ప్రయత్నించాయి. ఇవి 'విభజించి పరిపాలించు' అన్న విధానానికి అనుగుణంగా పనిచేశాయి.

కాంగ్రెసు మంత్రివర్గాలు అధికారంలోకి వచ్చిన రాష్ట్రాలలో, ఆయా ప్రభుత్వాలు, కార్మిక వివాద తీర్పులు, హరిజనుల పరిస్థితులను మెరుగుపరచడం, ప్రాథమిక విద్య గరపడం, పట్టణాలలో పారిశ్రామిక ప్రాంతాల సమీప దుకాణాలలో చౌకగా మద్యం అందుతూవున్న ప్రత్యక్ష సమస్యను పరిష్కరించడం వంటి రంగాలలో, అనేక సంస్కరణలను ప్రవేశపెట్టారు. మద్రాసులో కాంగ్రెసు మంత్రివర్గం మద్యపాన నిషేధాన్ని ప్రవేశపెట్టింది. భావి కాంగ్రెసు కార్యక్రమంలో మద్యపాన నిషేధం వొకభాగం కావడానికి యిది దారితీసింది. కార్మిక వివాదాలలో త్రైపక్షసంప్రదింపుల పద్ధతినికూడా, మద్రాసు ప్రభుత్వం ప్రవేశపెట్టింది. ట్రేడ్ యూనియన్లు, యజమానులు, తమ విభేదాలను పరిష్కరించుకోడానికి ప్రభుత్యం రాజీయంత్రాంగాన్ని ఏర్పాటుచేసింది. ఈ పద్ధతి, స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత కార్మిక సంబంధాలలో అతిముఖ్యమయిన విషయమయిందికూడా. సమిష్టి సంప్రదింపుల పద్ధతిని వుపయోగించడంద్వారా కార్మిక వివాదాలను పరిష్కరించడానికి యిది వొక వుదారమయిన ప్రయత్నంగా భావించబడింది. ట్రేడ్‌యూనియన్ల రాజకీయశక్తిని, యిది ఎక్కువచేయడమేకాక, పారిశ్రామిక శాంతిని కాపాడాలన్న విజ్ఞప్తులను వారు మన్నించేటట్టు చేసింది కూడా. కార్మికులు — పెట్టుబడీదారుల మధ్యవర్గ సహకారానికి యిది దారితీస్తోందనీ అందువల్ల పెట్టుబడిదారీ వ్యవస్థ శాశ్వత మవుతుందనీ, వామపక్ష ట్రేడ్‌యూనియన్లు విమర్శించాయి. మొత్తంమీద కాంగ్రెసు మంత్రివర్గాలు, 1937 నుంచి 1939 వరకూ తీసుకున్న సత్‌చర్యలు, గాంధేయ సిద్ధాంతాలను అమలు జరపడానికి రైట్‌వింగ్, మితవాద జాతీయ నాయకుల

ప్రయత్నాలను ప్రతిబింబిస్తున్నాయి. ఇవి, స్వాతంత్ర్యం సంపాదించిన ప్రారంభ సంవత్సరాలలో భారత ప్రభుత్వ అధికార విధానంలో వొక భాగమయ్యాయి.

వాయవ్య సరిహద్దురాష్ట్రం, పంజాబ్, సింధు, బెంగాల్, అస్సాంలతో పాకిస్తాన్‌ను ఏర్పాటుచేయాలని, 1935లో గట్టిగా కోరారు. అయితే ఈ ప్రాంతాలలో జరిగిన ఎన్నికల్లో ముస్లింలీగ్‌కు బాగా తక్కువ స్థానాలొచ్చాయి. ఉత్తర ప్రదేశ్‌వంటి ముస్లింలు అల్ప సంఖ్యాక వర్గంగావున్న రాష్ట్రాలలో మాత్రమే, దీనికి బాగా సీట్లువచ్చాయి. 1937 ఎన్నికల పాఠాలను కాంగ్రెసు సరిగ్గా పరిశీలించినట్లయితే, అనేకమంది ముస్లింలు ఓట్లువెయ్యకపోవడానికి కారణం, మత అధిక సంఖ్యాకులయిన హిందువులు, రాష్ట్ర ప్రభుత్వాలలో తమకున్న అధికసంఖ్యాబలాన్ని, వీరిని తొలగించడానికి వుపయోగించగలరని, ప్రాంతీయ మత అల్పసంఖ్యాక వర్గాలు భయపడటమే కారణమని తెలుసుకుని ఉండేది. ఇటువంటి అపోహలు ఏదేశంలో నయినా అల్పసంఖ్యాక వర్గాలకు కలగవచ్చుననీ, కాంగ్రెసు లోపల, వెలుపలకూడా మతభావాలున్నవారు ఎక్కువమంది వుండటం వల్ల, ఈ అపోహలకు ప్రోత్సాహం లభించిందనీ, కాంగ్రెసు తెలుసుకోలేక పోయింది. అనేకమంది కాంగ్రెసు నాయకులు, తమపార్టీ సభ్యులు మత తత్వానికి వ్యతిరేకంగా, సంకులసమరంలు జరిపి, సామ్రాజ్యవాద వ్యతిరేక, స్వతంత్ర ముస్లింలపట్ల, స్నేహ అవగాహన వైఖరిని ప్రదర్శించి వారిని లోబరుచుకొని పెత్తందారీ వర్గాలకు వ్యతిరేకంగా కర్షకులను పురికొల్పడానికి గట్టి ప్రయత్నం చేయడమొక్కటే పరిస్థితికి సమాధానమని భావించారు.

1937 మార్చిలో, నెహ్రూ, ముస్లిం ప్రజానీకంతో సన్నిహితత్వం ఏర్పరుచుకొని సామ్రాజ్యవాద వ్యతిరేక సమరం గురించి వారికి తెలియజెయ్యడానికి, కాంగ్రెసు విభాగమొకటి ఏర్పాటు చేసినట్లు ప్రకటించారు. దీనివల్ల, మఝూ-నీ-అహరార్, జమీయత్-ఉలేమా-ఇ-హింద్ వంటి ఉత్తర భారత ముస్లిం మతవర్గాలు కాంగ్రెసుతో చేతులు కలపే అవకాశం కలిగింది. అయితే ప్రజానీకంతో సంబంధం పెంపొందించుకునే కార్యక్రమం, పూర్తిగా జయప్రదం కాలేదు; ఎందువల్లనంటే, అన్ని వర్గాల పీడిత ప్రజలను కాంగ్రెసు నాయకులు సమాయత్త పరచలేకపోయారు.

అయితే ప్రజాసామాన్యంతో సంబంధం పెట్టుకునే ఈ కార్యక్రమం, లియాఖత్ అలీఖాన్‌వంటి పశ్చిమ ఉత్తర ప్రదేష్‌కు చెందిన సంపన్న భూకామందులైన లీగర్ల అపోహలను ఎక్కువచేసింది. లియాఖత్ అలీఖాన్, హిందూవ్యతిరేక జిన్నా అనుయాయులలో వొకరయ్యారు. అంతకంతకి ఎక్కువవుతోన్న కాంగ్రెసు రేడికల్ వ్యవసాయ కార్యక్రమం, తమ పెత్తందారీ స్థానానికి విఘాతం కలిగిస్తుందనీ, ముస్లింలలో

సామ్రాజ్యవాద వ్యతిరేక భావాలు పెంపొందటం, మతనాయకుల అధికార మద్దత్తు వుప సంహరణకు దారితీయ వచ్చునవీ భయపడ్డారు.

అయితే కాంగ్రెసును తాము ప్రతిఘటించడానికి యివి కారణాలని మతవర్గాలు తెలియ జెయ్యలేక పోయాయి. దీనికిబదులు, కాంగ్రెసు సాధించజాలనివాటిని, అతిశయోక్తిగా చెప్పడానికి, వీరు, ఈ అవకాశాన్ని వినియోగించుకున్నారు. బెంగాల్‌లో కాంగ్రెసు, భూకామందు అనుకూల రైట్‌వింగ్ విధానాన్ని అనుసరిస్తోందని ఆరోపించారు. ఉత్తర ప్రదేష్‌లో, ప్రజానీకంతో సంబంధం ఏర్పరుచుకునే కాంగ్రెసు విధానం విఫలం కావ డాన్ని అదనుగా తీసుకున్నారు. ముస్లిం పైవర్గాన్ని బలహీనం చేశారని, యిదే సమ యంలో ఆరోపించారు. 1937లో లీగ్‌జరిపిన లక్నో సమావేశంలో అధ్యక్షోపన్యాస మిస్టర్ జిన్నా, కాంగ్రెసు మంత్రివర్గాలు, ముస్లింలపట్ల అన్యాయమైన దమన విధానాన్ని అనుసరిస్తున్నాయని ప్రకటించారు.

ముస్లింలీగ్, రాజకీయ కార్యాచరణ కార్యక్రమాన్నొక దానిని ప్రారంభించింది. 1938 కల్లా, 170 నూతన లీగ్ శాఖలు ఏర్పడ్డాయి. ఉత్తరప్రదేశ్‌లో 90, పంజాబ్‌లో 40 ఏర్పడ్డాయి. వొక్క ఉత్తరప్రదేశ్‌లోనే లక్షమంది సభ్యులు చేరారు. 1940లో, పాకిస్థాన్ ఏర్పడాలన్న గట్టికోరిక దృష్ట్యా, ముస్లింలీగ్ రాజకీయాలలో యీ ఘట్టాన్ని బంగ్లాదేష్ చరిత్రకారులు ప్రొఫెసర్.ఎ.ఎఫ్. సలాహుద్దీన్ అహమ్మద్, సరిగ్గా అంచనా వేశారు. బంగ్లాదేష్‌గురించి విశ్వవిద్యాలయ గ్రాంట్లసంఘం 1972 ఏప్రిల్‌లో కలకత్తాలో జరిపిన సదస్సుకు వొకవ్యాసం సమర్పిస్తూ ప్రొఫెసర్ సలాహుద్దీన్ యిలా తెలియజేశారు. "పాకిస్థాన్ ఏర్పాటుకు దారితీసిన ఉద్యమం మతవుద్యమంకాదు ... హిందూరాజకీయ ఆధిపత్యంవల్ల (ముస్లిం) మతవర్గం రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక ప్రయోజనాలకు విఘాతం కలుగుతుందన్న భయం, ఈ వుద్యమం ఏర్పాటుకు అతిముఖ్య ప్రక్రియగా వుపయోగపడినట్లు కనుపిస్తోంది. సంప్రదాయసిద్ధమయిన ఇస్లాంలో, రాజకీయాలు - మతం, వేరుచేయడానికి వీలులేని వయినప్పటికీ, సమకాలీన ముస్లింసమాజంలో యిది ఎంత మాత్రమూ నిజంకాదు. ... ... ఉద్యమం నాయకులలో ఎవ్వరికీ సంప్రదాయసిద్ధమయిన ఇస్లాంతో వ్యక్తిగత సన్నిహితత్వమేదీ లేదు. సరిగ్గా యీకారణం వల్లనే, మైహాన్ - ఇ - అహరార్, మయత్ - ఉల్ - హింద్ వంటిసంస్థలలో ప్రాతినిధ్యమున్న సనాతన ముస్లింలెవ్వరూ లీగ్‌ను బలపరచలేదు. లీగ్‌నాయకులు వాస్తవమైన ఇస్లాంకిచెందివారు కాదని వీరి అభిప్రాయం. ఈసనాతన ముస్లిం ఆధ్యాత్మికవాదులు ప్రతిఘటించినప్పటికీ (ముస్లిం ఆధ్యాత్మిక వాదులందరూ ముస్లింలీగ్‌కు వ్యతిరేకమని అనుకోకూడదు) ముస్లిం లీగ్, ముస్లిం మధ్యతరగతి ప్రజలనూ, వారిద్వారా ముస్లిం ప్రజానీకాన్నీ ఆకట్టుకో

గలిగింది. వీరికి, పాకిస్థాన్, పోటీఅన్న భయంలేకుండా బహుముఖ అభివృద్ధికి, వొక అవకాశాన్ని కల్పించింది."

## రెండో ప్రపంచ యుద్ధం

1939 సెప్టెంబరులో, యుద్ధం ప్రజ్వరిల్లినపుడు, ఇది భారతనాయకులను యిబ్బంది కరమైన పరిస్థితిలో పెట్టింది. జాతి విచక్షణ విధానంతో కూడిన వొకరకమైన నిర్దాక్షిణ్య నిరంకుశతత్వం ఫేసిస్టు తత్వంతో వికృతంగా తాండవిస్తూ వుండటానికి వీరు పూర్తిగా వ్యతిరేకం. 1939 కి ముందుకూడా, దురాక్రమణ పూరిత విస్తరణ కార్యక్రమంతో రాజకీయ తత్వంగా ఫేసిజం రూపొందుతూ వున్నప్పుడు జవహర్‌లాల్ నెహ్రూవంటి అనేక మంది భారతీయ నాయకులకు యూరోప్‌లో పరిణామాలు కలవరం కలిగించాయి. కాంగ్రెస్, తిరుగులేని విధంగా ఫేసిజంను ఖండించింది; బాధలు పడుతూన్న స్పెయిన్, ఇథియోపియా, జకొస్లోవేకియా ప్రజలను బలపరుస్తూ వున్నట్టు బాహాటంగా ప్రకటించింది. జపాన్‌లో ఫేసిస్టు పోకడల పట్ల కూడా యిదే మోస్తరు వైఖరి ప్రదర్శించారు. చైనా మీద దాడి జరిగినపుడు జపాన్‌ను, దురాక్రమణ దారుగా ప్రకటిస్తూ హేతువాదంతో చైనాను బలపరిచారు. అయితే సామ్రాజ్యవాదాన్ని కూడా యిదే తీవ్రతతో ప్రతిఘటించారు. అందువల్ల యుద్ధం పట్ల వీరివైఖరి దాని ఆశయాలు, లక్ష్యాల మీద ఆధారపడి వుంటుంది. అనేక ఆసియా - ఆఫ్రికా దేశాల మీద తమ వలస ఆధిపత్యాన్నీ, తమ వలసలనూ కాపాడుకోడానికి అదుర్దాగా వున్న పాత సామ్రాజ్యవాద దేశాలకూ, వలసరాజ్యాధిపత్యం లాభాలలో తమ వాటా కోరుతూ వున్న ఫేసిస్టు దేశాలకు ప్రాతినిధ్యం వహించే నూతన సామ్రాజ్యవాద దేశాలకూ మధ్య జరిగే యుద్ధమే అయినట్టయితే, దీనితో భారతదేశానికి ఎటువంటి సంబంధము లేదు. అయితే మిత్రదేశాలు తమ పద్ధతులను మార్చుకొని "ప్రపంచాన్ని ప్రజాస్వామ్యం కోసం కాపాడదలిచి, వాస్తవంగా చిత్తశుద్ధితో ఫేసిస్టులతో పోరాటం జరిపినట్టయితే, భారతదేశం సాధ్యమైనంత ఎక్కువ మేరకు తన అండనిస్తుంది. అయితే తాము చెబుతూవున్న మాటలు వాస్తవమైనవని ఋజువుచేయడానికి స్పష్టమయిన నిదర్శన వుండాలి. బ్రిటన్ కచ్చితంగా, భారతదేశంమీద తన సామ్రాజ్యవాద, వలస ఆధిపత్యాన్ని తక్షణమే అంతంచేసి భారతీయులతోనే స్వయంగా సహేతుకమైన పరిమాణంలో స్వపరిపాలనా ప్రభుత్వానికి ఏర్పాట్లు చేయాలి.

అయితే భారత నాయకుల-ప్రజల యీ భావాలను లెఖ్ఖచేయలేదు సరికదా, వాటిగురించి ఆలోచించనయినా ఆలోచించలేదు. 1939 సెప్టెంబరు 3 వ తేదీన, యుద్ధాన్ని ప్రకటించారు. ఇది యుద్ధబాధ్యత భారాన్ని స్వచ్ఛందంగా భారతదేశంమీద పడేటట్టు చేసింది. 1935 భారతచట్టం ఫెడరల్ భాగాన్ని యింకా అమలుజరపలేదు. అందువల్ల రాజ్యాంగ రీత్యా వైస్‌రాయ్ చర్య చట్టబద్ధమైనది; చెల్లుతుంది. అయినప్పటికీ భారతీయుల అభిప్రాయాలను యిది మెప్పింపజాలదు. కేంద్ర శాసనసభ వొకటి వుంది. రాష్ట్రాలలో ప్రజాప్రాతినిధ్య ప్రభుత్వాలు అమలులో వున్నాయి. ఇవి బాగా వ్యవస్థీకృత మయ్యాయి; దేశంలోని రాజకీయ పార్టీలను పూర్తిగా గుర్తించాయి. సమస్యలకు పరస్పర ఆమోదకరమైన పరిష్కారాలను సాధించడంకోసం ప్రభుత్వం పరిపాటిగా సంప్రదింపులు జరిపే భారతప్రజల నాయకులు అనేకమంది వున్నారు. అయితే వీరిలో ఎవ్వరితోనూ సంప్రదింపులు జరగలేదు. యుద్ధంపట్ల భారతనాయకుల వైఖరి గురించి ప్రభుత్వానికి ముందుగానే తెలుసు కాబట్టి, భారత ప్రజలకు యిది యింకా విభ్రాంతి కలిగించింది. 1939 వేసంగిలో కేంద్ర శాసనసభలోని కాంగ్రెసు పార్టీ, భారత సైన్యాలను ముందు జాగ్రత్త చర్యగా మలయాకు, దూరప్రాచ్యానికి పంపినందుకు నిరసనగా సమావేశానికి హాజరుకాలేదు!

అయితే నాయకులలో గాఢమైన ఫేసిస్టు వ్యతిరేక భావాలుండటంవల్ల, యుద్ధ ప్రకటనపట్ల కాంగ్రెసువైఖరి సమాధాన పూర్వకంగా వుండివుండవచ్చు. 1939 సెప్టెంబరు 14 తేదీన కాంగ్రెసు ఒక ప్రకటన విడుదలచేస్తూ పార్టీ దృక్పథాన్ని స్పష్టంగా విశదంచేసింది.

"యుద్ధం, యథాతథ పరిస్థితినీ, సామ్రాజ్యవాద స్థానాలనూ, వలసలనూ, స్వప్రయోజనాలనూ ప్రత్యేక హక్కులనూ కాపాడటానికే అయినట్టయితే, భారతదేశానికి దీనితో ఎటువంటి ప్రమేయములేదు. అయితే ప్రజాస్వామ్య సమస్య, ప్రజాస్వామ్య ప్రాతిపదికగాగల ప్రపంచవ్యవస్థ సమస్యకోసమే అయినట్టయితే, భారతదేశానికి, యిందులో అత్యంత శ్రద్ధాసక్తులున్నాయి. స్వతంత్ర ప్రజాస్వామిక భారతదేశం, దురాక్రమణకు వ్యతిరేకంగా పరస్పర రక్షణ, ఆర్థిక సహకారంకోసం యితర స్వతంత్ర దేశాలతో సంతోషంగా సహకరిస్తుంది. అయితే సహకారమన్నది సమానులమధ్య పరస్పర అంగీకారంతో జరగాలి. అందువల్ల ప్రజాస్వామ్యం, సామ్రాజ్యవాదం, నూతన వ్యవస్థలపట్ల తమయుద్ధ లక్ష్యాలేమిటో, ముఖ్యంగా ఈ లక్ష్యాలను భారతదేశానికి ఎలావర్తింప చేస్తారో, ప్రస్తుతం వీటిని ఎలా అమలు జరుపుతారో, ... ఏ ప్రకటనకయినా ... దానిని ప్రస్తుతం వర్తింప చేయడమే నిజమైన పరీక్ష ... తిరుగులేని

విధంగా ప్రకటించ వలసిందిగా కార్యవర్గం బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఆహ్వానిస్తోంది" అని ప్రకటించారు.

వైస్‌రాయ్ సమాధానం తృప్తికరంగా లేదు. భారత దృక్పథానికి దీనికి ఎక్కడా పొందిక లేదు. సమాధాన మివ్వడానికి వొక నెలరోజులు ఆలస్యం చేసిన తర్వాత 1939 అక్టోబరు 17 తేదీన వైస్‌రాయ్ సమాధానమిస్తూ, ప్రధానమంత్రి చెప్పినదానికన్నా ఎక్కువగా బ్రిటన్ యుద్ధలక్ష్యాలను వివరించజాలమని తెలియజేశారు. తక్షణచర్యగా కార్యవర్గ సమితిలో ఎక్కువమంది భారతీయులను చేర్చడానికి వైస్‌రాయ్ సుముఖత తెలియజేశారు. యుద్ధకాలంలో భారతప్రజలకు ఎక్కువ అధికారాలను బదలాయించడం ఆచరణ సాధ్యం కాదని భావించారు. అతి విషాదంగా నిరాశచెందిన భారతప్రజలకు కొంతవూరట కలుగుతుందన్న భావంతో, ముల్లంగిని, చేతికి అందకుండా కొంతదూరంలో వుంచారు. యుద్ధం తర్వాత 1935 చట్టంలో ఏసవరింపులుఅవసరం అన్న విషయం గురించి, బ్రిటన్, వివిధ వర్గాలు, బృందాలతో సంప్రదింపులు జరపడానికి సిద్ధంగా వుంటుంది. దీనివల్ల, "భారత దేశం తన సముచిత స్థానాన్ని గొప్ప డొమినియన్లమధ్య పొంద గలుగుతుంది."

అధికారాన్ని అందజేయడానికి బ్రిటన్ సుముఖంగా వుందన్న సూచనలు వెంటనే లేకుండా వుండటమే కాక, భవిష్యత్తులో కూడా సామ్రాజ్యంలో అది, పూర్తి, సంపూర్ణ సాతంత్ర్యంతో కాక డొమినియన్ ప్రతిపత్తి కలిగివుండాలి. ఈ ప్రకటన కాంగ్రెసుకు సుతరామూ అంగీకారంకాదు; అందువల్ల కార్యవర్గం వైస్‌రాయ్ ప్రతిపాదనను తిరస్కరించి అక్టోబరు అంతమయ్యేలోగా రాజీనామాలు యివ్వాలని కాంగ్రెసు మంత్రివర్గాలను ఆదేశించింది.

అయినప్పటికీ తలుపు యింకా కొద్దిగా తీసే వుంది. బ్రిటన్ వైఖరీ విధానంలో మార్పు వచ్చినట్టయితే సహకారానికి అవకాశమేర్పడవచ్చునని ఈ ప్రకటనలో సూచించారు. "ఈ పరిస్థితులలో, కార్యవర్గం, గ్రేట్‌బ్రిటన్‌కు ఎటువంటి అండనివ్వడం సాధ్యంకాదు; ఎందువల్లనంటే, అది, సామ్రాజ్యవాద విధానాన్ని బలపరచడమే అవుతుంది......" అని ఈ ప్రకటనలో తెలియజేశారు.

అంటే భారతదేశం పట్ల బ్రిటిష్ విధానం మారినట్టయితే కొన్ని షరతులమీద సహకరించడానికి సంసిద్ధతను వ్యక్తపరచడమన్నమాట.

ఒక ఏడాది అనంతరం 1940 అక్టోబరులో కూడా, కొత్తగా సత్యాగ్రహ ఉద్యమాన్ని ప్రారంభించాలని గాంధీజీ భావించినపుడు ఈ ఉద్యమం ఎన్నుకున్న కొంతమందికి మాత్రమే పరిమితం కావాలని నిర్ణయించారు. ప్రభుత్వం సమాధానానికి రాని వైఖరి ప్రదర్శించినప్పటికీ కాంగ్రెసు గానీ, గాంధీజీగానీ ప్రజావుద్యమంవల్ల యుద్ధకృషికి

తీవ్రమైన అంతరాయం కలగాలని భావించలేదు. భారతదేశం మనస్ఫూర్తిగా యుద్ధకృషికి తోడ్పడుతోందన్న బ్రిటిష్ బుకాయింపు నిజంకాదని ఋజువుచేయడానికే, ఈ సత్యాగ్రహాన్ని వుద్దేశించారు. వ్యక్తిగత సత్యాగ్రహ వుద్యమ లక్ష్యాన్ని గాంధీజీ, వైస్‌రాయ్‌కి వ్రాసిన లేఖలో యిలా విశదం చేశారు.

"నాజీయిజం విజయానికి ఏ బ్రిటిష్ పౌరుడయినా ఎంత వ్యతిరేకో కాంగ్రెసుకూడా అంతవ్యతిరేకే. అయితే తమ లక్ష్యాన్ని, వారు, యుద్ధంలో పాల్గొన్నంత మేరకు తీసుకెళ్ళ జాలరు. యావద్ భారతదేశము, స్వచ్ఛందంగా యుద్ధకృషికి తోడ్పడుతోందని, మీరూ, భారతదేశాంగమంత్రీ, ప్రకటించారు. కాబట్టి, భారత ప్రజలలో ఎక్కువమందికి దీనిలో శ్రద్ధలేదని స్పష్టంగా ప్రకటించవలసిన అవసరమేర్పడింది. నాజీయిజంకూ, భారతదేశాన్ని పాలిస్తున్న ద్వంద్వ నియంతృత్వానికీ మధ్య తేడా వుందని భారత ప్రజలు భావించడంలేదు".

## క్రిప్సు రాయబారం

ఈ వ్యక్తిగత పేర శాసనోల్లంఘన ఉద్యమాన్ని 1940 అక్టోబరులో ప్రారంభించారు, సత్యాగ్రహం జరపడానికి, గాంధీజీ ఎన్నుకున్న మొట్టమొదటి నాయకులు వినోబాభావే.

యూరొప్‌లో యుద్ధం, 1941 లో పరాకాష్ఠ నందుకుంది. పోలెండ్, బెల్జియం, హాలెండ్, నార్వే, ఫ్రాన్సు, తూర్పుయూరొప్‌లో ఎక్కువభాగము జయించి నందువల్ల, బ్రిటన్‌పై యుద్ధంలో పరాజయం పొందినప్పటికీ, జర్మనీ, 1941 జూన్‌లో రష్యాపై దండయాత్ర జరిపింది. డిసెంబరులో, పెరల్‌హార్బర్ మీద హఠాత్తుగా దాడి జరిపి జపాన్, యుద్ధంలోకి దిగింది. ఈ విధంగా 1941 అంతానికల్లా, యుద్ధం, ప్రపంచ యుద్ధంగా మారింది; అమెరికా, సోవియట్ యూనియన్లు యుద్ధంలోకి దిగి, మిత్ర దేశాల పక్షంలో పోరాటం ప్రారంభించాయి. అయితే త్వరలో విజయం సాధించే సూచనలేవీ కనుపించలేదు. కాగా ఆసియారంగంలో మొదటి విజయాలు అనేకం, జపాన్‌కు దక్కాయి. ఫిలిప్పీన్సు, ఇండోచైనా, ఇండొనీషియా, మలయా, బర్మా — వీటన్నిటినీ త్వరత్వరగా జయించడం జరిగింది. 1942 మార్చిలో జపాన్ దళాలు, రంగూన్‌ను, ఆక్రమించాయి. భారతదేశపు సరిహద్దులకు ప్రత్యక్ష ముప్పు ఏర్పడింది.

జపాన్ దాడిని అరికట్టడానికి మాత్రమేకాక, మొత్తం యుద్ధకృషికి భారతదేశపు పూర్తి, క్రియాత్మక సహకారాన్ని సంపాదించడానికి బ్రిటన్ యిప్పుడు తహతహలాడింది. ఈ సహకారాన్ని సంపాదించడంకోసం, భవిష్యత్తులో భారతదేశానికి, కొన్ని

నిర్దుష్టమయిన హామీలు యివ్వాలనీ, ప్రస్తుతానికి, పూర్తి స్వపరిపాలనా ప్రభుత్వాన్ని యివ్వాలనీ, బ్రిటన్ అభిప్రాయపడింది. దీనిప్రకారం, బ్రిటిష్ ప్రభుత్వం, యుద్ధ మంత్రి మండలి సభ్యులయిన సర్‌స్టాఫర్డు క్రిప్సును, ముసాయిదా ప్రకటనతో, భారత దేశానికి పంపించింది. మేధా న్యాయవాది, పటిష్ఠమయిన సోషలిష్టు అయిన యీయన, భారత సమస్యగురించి చాలాకాలంనుంచీ తీవ్రపరిశోధన చేస్తూవుండేవారు; భారతీయుల కోర్కెల పట్ల సానుభూతితో వుండేవారన్న ఖ్యాతి ఈయనకు వుండేది. నెహ్రూకు, ఈయన స్వయంగా తెలుసు. అయితే ఈయన తెచ్చిన ముసాయిదా ప్రకటనలో దీనిని ఆమోదించవలసినంత ముఖ్య విషయాలేవీలేవు. యుద్ధం అంతమయిన వెంటనే డొమీని యన్ ప్రతిపత్తి యిస్తామని యిందులో ప్రతిపాదించారు. అయితే విడిపోయే హక్కు కూడా భారతదేశానికి యిచ్చారు. ఈ ప్రతిపాదనను అమలు పరచడానికి, యుద్ధం అంతమయిన వెంటనే, రాజ్యాంగనిర్ణయ సభను ఏర్పాటు చేస్తారు. బ్రిటిష్ భారతదేశానికీ, సంస్థానాలకూ చెందిన సభ్యులు, ఈ సభలో వుంటారు. బ్రిటిష్ భారతదేశం సభ్యులను రాష్ట్రీ శాసన సభల దిగువ సభలు ఎన్నుకుంటాయి. సంస్థానాల ప్రతినిధులను పరిపాలకులు నామినేట్ చేస్తారు. రాజ్యాంగ నిర్ణయసభ తయారుచేసిన రాజ్యాంగాన్ని ఆమోదించి, భారతదేశంతో ఒప్పందం ఏర్పాటు గురించి సంప్రదింపులు జరపడానికి బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరించింది. అయితే, ఏ రాష్ట్రీమయినా, భారత యూనియన్‌కు వెలుపల వుండాలని అనుకున్నట్టయితే, బ్రిటన్‌తో ప్రత్యక్ష సంప్రదింపులు జరపవచ్చున్న నిబంధన ఒకటివుంది. యుద్ధ సమయంలో రాజ్యాంగ మార్పులేవీ తలపెట్టలేదు. అయితే భారతీయ పార్టీలు, నాయకులు, జాతీయ ప్రభుత్వం యేర్పాటయి-పనిచేయడంలో సహకరించడానికి అంగీకరించగలరన్న ఆశాభావాన్ని వ్యక్తపరిచారు. రక్షణకు సంబంధించిన సైనిక విషయాలను బ్రిటిష్ సైన్యాధిపతి చూస్తూవుంటారు. అయితే రక్షణ సభ్యుడుగా, భారతీయు డొకరు వుంటారు.

ఈ ప్రకటనను అన్నిపార్టీలు, అనేక భిన్నకారణాలవల్ల, తిరస్కరించాయి. ఏ రాష్ట్రీమయినా చేరక పోవచ్చునన్న సూత్రాన్ని, కాంగ్రెసు హర్షించలేక పోయింది. అయితే కార్యవర్గం, ప్రజాస్వామిక స్వయం నిర్ణయాధికార సూత్రాన్ని ఆమోదించింది. అందువల్ల కార్యవర్గం ఆమోదించిన తీర్మానంలో "తమ అభీష్టానికి వ్యతిరేకంగా భారత యూనియన్‌లో వుండిపోవాలని ఏ ప్రాదేశిక విభాగం ప్రజలను వొత్తిడి పెట్టడం గురించి కార్యవర్గం ఆలోచించజాలదని" పేర్కొన్నారు. "ప్రాతినిధ్యంలేని వర్గాలను రాజ్యాంగ నిర్ణయ సభలో ప్రవేశపెట్టడం, తమకు అంగీకారం కాదనికూడా," కాంగ్రెసు పేర్కొంది. అయితే అన్నిటికన్నా ముఖ్యంగా భవిష్యద్ హామీలమీద ఆధార పడ

కూడదని భావించింది. ప్రస్తుతం రాజకీయ అధికారంలో తగిన అధికారాన్ని కోరింది. ఇతర దేశాలలో స్వాతంత్ర్యసమరం జరపడానికి, యిక్కడ, యిప్పుడే ఏదో వొకరక మైన స్వపరిపాలనా ప్రభుత్వం వుండాలని అన్నది. కాగా ముస్లింలీగ్, రాష్ట్రాలు, యూని యన్‌కి వెలుపలవుండే అవకాశాన్ని హర్షించింది. ముస్లింలు, అత్యధిక సంఖ్యలోవున్న రాష్ట్రాలు, ప్రాంతాలు, తమకు యిష్టమయినట్టయితే, వేరుగా తమ స్వంత యూనియన్‌ని ఏర్పాటు చేసుకోవచ్చునన్న భావాన్ని గుర్తించడమే, దీనికి కారణం. అయితే లీగ్, ఈ ప్రతిపాదనలను విమర్శించింది. ఎందువల్లనంటే, రాజ్యాంగాన్ని ముసాయిదా చేయ డానికి సూచించిన పద్ధతి కచ్చితంగాలేదు . అసలు ప్రతిపాదనే, ఎటువంటి మార్పులు చేయడానికి వీలులేని విధంగావుంది; దేశాన్ని విభజించగలరన్న భయంతో హిందూ మహాసభ, ప్రతిపాదనలను, వ్యతిరేకించింది. ముస్లింలు ఎక్కువగావున్న పంజాబ్, యూనియన్‌కు వెలుపల వుంటామని తెలియజెయ్యవచ్చునన్న అపోహతో, శిఖ్ఖుమత వాదులు, వీటిని ప్రతిఘటించారు. 'అస్పృశ్యులను' సవర్ణ హిందువుల దయాదాక్షిణ్యా లకు వదలగలరన్న భయంతో, అంబేడ్కర్, ఎమ్. సి. రాజా, వీటిని వ్యతిరేకించారు. పరిపాలనమీద భారతీయులకు ఎటువంటి కంట్రోలు వుంటుందో నిర్దుష్టంగా పేర్కొనక పోవడంవల్ల, తాత్కాలిక కాలానికి సూచించిన యీ ప్రతిపాదనలు అస్పష్టంగా వున్నా యనీ, తృప్తికరంగా లేవనీ అందరూ భావించారు. సంప్రదింపుల ప్రారంభఘట్టంలో 'జాతీయ ప్రభుత్వం' గురించీ, 'మంత్రి మండలి' గురించి మాట్లాడిన క్రిప్స్, వైస్‌రాయ్ కార్యవర్గ సమితిని విస్తరించాలని మాత్రమే తలపెట్టారని హఠాత్తుగా స్పష్టం చేయడంతో, స్వపరిపాలనా ప్రభుత్వం రూపంలో పెద్ద ప్రతిపాదన ఏదీ జరగలేదని విదితమయింది. చిట్టచివరికి, ఈ ప్రతిపాదనలను తిరస్కరించారు; క్రిప్స్ రాయబార వర్గం, ప్రతిష్ఠంభనను పరిష్కరించజాలక, విఫలమయింది.

## 1942 సంవత్సరపు తిరుగుబాటు

క్రిప్స్ రాయబారం విఫలంకావడంతో దేశం, నిరాశ, కోపంతో మునిగిపోయింది. అనేక వర్గాలలో నిస్పృహ ప్రబలింది. యుద్ధంవల్ల ఎక్కువ వుపాధి అవకాశాలు లభించి, కొద్ది ఖరారునామాలు లభించిన ముస్లింలీగ్, కొంతమంది వ్యక్తులు మాత్రం నిరాశ చెంద లేదు. అయితే, తర్వాత ఏం చర్య తీసుకోవాలి? అన్నదే సమస్య. స్తబ్దంగా వుండటం సహించరానిది.

క్రిప్సు ప్రతిపాదనలో, గాంధీజీ ఎక్కువ శ్రద్ధ చూపలేదు. అయితే ఈ రాయబార వర్గం విఫలంకావడం ఆయన్ను నిరాశ పరిచింది. ఆగ్నేయ ఆసియాలో పరిణామాలు కూడా ఆయన్ను కలవర పరిచాయి. మలయా, సింగపూర్, బర్మాలనుంచి బ్రిటిష్ ఉప సంహరణ తర్వాత, స్థానిక ప్రతిఘటన పూర్తిగా కూలిపోయింది; జపాన్‌కు పూర్తిగా, నీచాతినీచంగా లొంగిపోవడం జరిగింది. ఫిలిప్పీన్సు, ఇండొనీషియాలకు కూడా యిదే మోస్తరు దుర్గతి పట్టింది. భూదగ్ధ విధానంతో 'లోతురక్షణ' అన్న పద్ధతివల్ల ఈ దేశాలన్నీ సర్వ నాశనమయ్యాయి. తూర్పు సరిహద్దులనుంచి దాడి జరిగినట్టయితే, శత్రువుల చేతిలో పడకుండా అరికట్టడంకోసం బెంగాల్‌లో సర్వనాశనం చేయబడిన వేలాది చిన్న పడవల ఫలితాన్నిబట్టి చూసినట్టయితే, భారతదేశ భవిష్యత్తు ఎలా వుంటుందో అర్థమవుతుంది. బెంగాల్ ఆర్థిక వ్యవస్థ తీవ్రంగా దెబ్బ తినడం మాత్రమేకాక, ఆహారసప్లయిల పంపిణీలో క్లిష్టపరిస్థితి ఏర్పడింది. మలయా బర్మాలలో జరిగినది, భారతదేశంలో జరగకూడదని గాంధీజీ, యితర కాంగ్రెసు నాయకులు ఆదుర్దా చెందారు. సైనిక దురాక్రమణ ఎదురయ్యేటప్పటికి, ప్రజలు భయకంపితు లయిపోయారు. ప్రతిఘటించాలన్న కృతనిశ్చయంతో, క్లిష్ట పరిస్థితిని ఎదుర్కొనలేదు. దీనిని కూడా భారతదేశంలో అరికట్టాలి. తమ భవిష్యత్తు తమ చేతుల్లోనే వుందనీ దేశరక్షణ తమ కర్తవ్యమనీ, రక్షణ. బ్రిటిష్‌వారికి సంబంధించిందన్న విశ్వాసంతో తమ, బాధ్యతను విడనాడకూడదన్న భావాన్ని భారతప్రజలలో కలిగించడమొక్కటే, వారి భయాన్ని పోగొట్టి, దురాక్రమణదారునితో పోరాటం జరపడానికి మార్గమన్న నిర్ణయానికి గాంధీజీ వచ్చారు. అందువల్ల, అధికారాన్ని భారతీయులకు అప్పగించి, వైదొలగవలసిందిగా బ్రిటిష్‌వారిని కోరుతూ వొక వుద్యమాన్ని ప్రారంభించాలని, ఆయన నిర్ణయించారు. "ఈ కొత్త ఆలోచన, అదీ యీ సమయంలో అనేకమంది ప్రజలకు విభ్రాంతి కలిగించిందని నాకు తెలుసు. పిచ్చివాడని, నన్ను అనే ప్రమాదమున్నప్పటికీ, నా ఆత్మసంతృప్తి కోసం యదార్థాన్ని నేను చెప్పక తప్పదు. యుద్ధానికి, యిది, నేను చేసే గట్టి సహాయంగానూ, వినాశనంనుంచి భారతదేశ విముక్తికి నేను చేసే సహాయంగానూ భావిస్తున్నాను" అని గాంధీజీ విశదం చేశారు.

ఇటువంటి గట్టి కోరికను వ్యక్తపరచడానికి యిది తగిన తరుణంకాదని, అనేకమంది నాయకులు అభిప్రాయపడ్డారు. వొకప్రక్క భీతి, అరాచకత్వము పరిణామాలు, మరోప్రక్క జపాన్‌వంటి నిర్దాక్షిణ్యమైన శత్రువుక్రింద ప్రజల పూర్తి, నిస్సహాయ దాస్యమూ, వీరికి భయాన్ని కలిగించాయి. నెహ్రూకు యింకా యితర ఆలోచనలు వుండేవి. క్రిప్సు రాయబారం విఫలంకావడం వల్ల దేశరక్షణలో పూర్తిగా సహకరించే అవకాశం నాయకులకు లేకుండా

పోయింది. మిత్రదేశాలు చేస్తున్న ఫేసిస్టు వ్యతిరేక కృషి విఫలమయ్యే స్థితికి దేశాన్ని కూలద్రోయటమేనా? భారతదేశంపై బ్రిటన్ సామ్రాజ్యవాద ఆధిపత్యాన్ని అంతంచేయ డానికి పోరాటం జరపటమా, శత్రుదేశాలతో జరుపుతున్న యుద్ధంలో రష్యా, చైనాలను వదలివేయటమా? అన్న విషయం ఆయనకు ముఖ్యంగా ఆదుర్దా కలిగించింది.

వాదనలు, చర్చలు సుదీర్ఘంగా తీవ్రంగా జరిగాయి. గాంధీజీ దృఢంగా ఎంతో నచ్చచెప్పే విధంగా మాట్లాడారు. బ్రిటిష్ సైన్యాలు భారతదేశంలో వుండటానికి ఆయన అంగీకరించారు. భారతదేశానికి రాజకీయ అధికారాన్ని వెంటనే బదలాయించే పక్షంలో యిక్కడి నుంచి పనిచేయడానికి స్థావరాలు యిస్తామనికూడా అన్నారు. ఇది కూడా అంగీకారం కాని పక్షంలో, కాంగ్రెసును వదిలి, "భారత దేశపు ఇసుక రేణువుల నుంచి కాంగ్రెసు కన్నా యింకా పెద్ద వుద్యమాన్ని సృష్టిస్తాను" అని అన్నారు.

కార్యవర్గం వర్ధాలో జులై ఆరంభంలో సమావేశమయి "జాతీయ కోర్కెను" రూపొం దించింది. భారతీయులకు అధికారాన్ని వెంటనే బదలాయించి, "క్విట్ ఇండియా" అని బ్రిటన్‌ను వీరు అడిగారు. ఈ ప్రతిపాదనను తిరస్కరించినట్లయితే "కాంగ్రెసు 1920 నుంచి సంపాదించిన అహింసాత్మక బలాన్నంతటినీ తప్పని సరిగా వుపయో గించి" ప్రత్యక్షచర్య వుద్యమాన్ని ప్రారంభించ వలసి వస్తుంది. ఈ విధాన నిర్ణ యాన్ని బలపరచడానికి ఆగస్టు 7వ తేదీన బొంబాయిలో అఖిల భారత కాంగ్రెసు సంఘం సమావేశం ఏర్పాటు చేశారు.

ఇలా వుండగా, చైనాకు చెందిన జనరలిస్మో చాంగ్ కై షేక్, అమెరికా అధ్య క్షులు రూజ్‌వెల్టు, ప్రతిష్టంభనను పరిష్కరించి భారతదేశంతో అంగీకారానికి రావల సిందిగా బ్రిటన్‌కు నచ్చచెప్పడానికి ప్రయత్నించారు. అయితే చర్చిల్ సమాధానానికి రాలేదు. "బ్రిటిష్ సామ్రాజ్యం అంతానికి అధ్యక్షత వహించడానికి, తాము చక్రవర్తి మొట్టమొదటి మంత్రికాలేదని" ఆయన బహిరంగంగా ప్రకటించారు.

1942 ఆగస్టులో బొంబాయిలో జరిగిన ఏ. ఐ. సి. సి. సమావేశం, చరిత్రాత్మక మయింది. ప్రఖ్యాత "క్విట్ ఇండియా" తీర్మానాన్ని వీరు ఆమోదించారు. అయితే యిది రాజీకి రాని కోర్కె యేమీ కాదు. యుద్ధ కృషిలో సహకరించ గలమన్న ప్రతిపాదన యిందులో వుంది. ప్రభుత్వం వెంటనే చర్యతీసుకోవాలనికూడ సవాలు చేసింది. "భారత స్వాతంత్ర్య ప్రకటన జరిగిన తరువాత తాత్కాలిక ప్రభుత్వం ఏర్పా టవుతుంది; స్వతంత్ర భారతదేశం యునైటెడ్ నేషన్సు మిత్రదేశ మవుతుంది." "ఫెడ రేటింగ్ విభాగాలకు ఎక్కువ స్వపరిపాలనా ప్రతిపత్తితో, మిగులు అధికారాలను, యీ విభాగాలకు యిస్తూ" వొక రాజ్యాంగాన్ని తయారు చేస్తామని, ముస్లిం లీగ్‌కు

హామీ యిచ్చారు. చివరన, ఈ తీర్మానంలో. "ఒక సామ్రాజ్యవాద అధికారదర్పం గల ప్రభుత్వానికి వ్యతిరేకంగా తమ అభిష్టాన్ని తెలియ జెయ్యడానికి ఒక దేశం చేస్తూవున్న కృషిని అణచివేయడం యిహ ఎంత మాత్రమూ సమర్ధనీయం కాదు ... అందువల్ల కాంగ్రెసు సంఘం, అహింసాత్మక పద్ధతుల్లో, సాధ్యమైనంత విస్తృత ప్రాతిపదికమీద ప్రజాసమరం ప్రారంభించటానికి అనుమతి యిస్తోంది. ఇటువంటి సమరం తప్పనిసరిగా, గాంధీకనాయకత్వాన జరగాలి."

తీర్మానం ఆమోదించిన తర్వాత, గాంధీజీ సమావేశమయిన ప్రతినిధుల నుద్దేశించి ప్రసంగించారు. తమ ప్రసంగంలో ఆయన యిలా అన్నారు. "వాస్తవసమరం ఈ క్షణం నుంచి ప్రారంభం కావడం లేదు. మీరు కొన్ని అధికారాలను మాత్రమే, నా చేతిలో పెట్టారు. గౌరవనీయులయిన వైస్‌రాయ్‌ని కలుసుకొని, కాంగ్రెసు కోర్కెను మన్నించ వలసిందిగా ఆయనతో గట్టిగా చెప్పడం నా ప్రథమ కర్తవ్యంగా వుంటుంది. ఇది రెండుమూడు వారాలు పట్టవచ్చు. ఈలోగా మీరు ఏమిచేస్తారు? రాట్నముంది ... అయినప్పటికీ యింతకన్నా చేయవలసింది కూడా వుంది. ఈ క్షణంనుంచి మీలో ప్రతివొక్కరు, స్వతంత్రమయిన పురుషుడులేక మహిళగా భావించాలి. స్వేచ్ఛ పొందినట్టుగా ప్రవర్తించాలికూడా. ఈ సామ్రాజ్య వాదపు కాలిజోళ్ళక్రింద యిహ ఎంత మాత్రము లేమనే భావించాలి"....

అయితే ప్రభుత్వం, గాంధీజీ వైస్‌రాయ్‌ని కలుసుకునే వరకూ వేచివుండలేదు. అధికార యంత్రాంగాన్ని సిద్ధంగా వుంచారు. ఇది అత్యంత వేగంతో, దుష్టఆగ్రహంతో పనిచేసింది. ఆగష్టు 8 తేదీ అర్ధరాత్రితర్వాత ఏ.ఐ.సి సి. సమావేశం పూర్తయిన కొద్ది గంటల్లోనే గాంధీజీని, కాంగ్రెసు కార్యవర్గం మిగతా సభ్యులందరినీ అరెస్టుచేసి, బొంబాయినుంచి ప్రత్యేకరైలులో తీసుకెళ్ళి పోయారు. గాంధీజీని, పూనాలో ఆగాఖాన్ సౌధంలో నిర్బధంలో వుంచారు; మిగతా నాయకులను అహమ్మద్ నగర్ కోటకు పంపారు.

క్విట్ ఇండియా తీర్మానవార్తలు, నాయకుల అరెస్టు వార్తలు, ఒకేసారి ఆగష్టు 9 తేదీ వుదయం ప్రజలకు అందేయి. వారు విభ్రాంతి చెందారు; ఇది జరుగుతుందని అనుకోలేదు. ప్రజలభావాలు తక్షణమే, స్వచ్ఛందంగా యధేచ్ఛగా వెల్లువికాయి. జీవితం స్తంభించి పోయింది. వ్యాపార కార్యకలాపాలన్నీ ఆగిపోయాయి. ప్రతి నగరంలోనూ, పట్టణంలోనూ హర్తాళ్ జరిగింది. ఎక్కడచూసినా ప్రదర్శనలు, వూరేగింపులు జరిగాయి. నాయకులను విడుదల చేయాలని జాతీయగీతాలూ, నినాదాలు ప్రతిధ్వనించాయి. అప్పటికి యింకా దౌర్జన్యాలు జరగలేదు. ఆందోళనచెంది వుద్రేకపూరితులయినప్పటికీ, ప్రజలు

మొత్తంమీద ప్రశాంతంగా వున్నారు. అయినప్పటికీ వుద్రిక్తత పెరిగిపోయింది. బ్రహ్మాండమైన ప్రజా సమూహాలను చూసేటప్పటికి, ప్రభుత్వానికి కంపనం పట్టుకుంది. హెచ్చరికలను లెఖ్ఖ చేయకుండా, చెదిరిపోడానికి నిరాకరించడంతో గుంపులమీద పోలీసులు యిష్టం వచ్చినట్లు కాల్పులు జరిపారు. వొక్కఢిల్లీలోనే (ఆగష్టు 11, 12) రెండురోజుల్లో, పోలీసులు నిరాయుధులయిన గుంపులమీద 47 భిన్న సందర్భాలలో కాల్పులు జరిపారు; 76 మంది మరణించారు; 114 మంది తీవ్రంగా గాయపడ్డారు. ప్రతిచోట వొకే మోస్తరుగా, ప్రజల ప్రదర్శనలు, పోలీసుల దౌర్జన్యం, కాల్పులు, అరెస్టులు జరిగాయి.

త్వరలోనే పరిస్థితి పూర్తిగా అదుపు దాటిపోయింది. ప్రజలకు మార్గదర్శకులు లేరు; నాయకులలో అనేకమంది జైళ్ళలో వున్నారు. కొంతమంది అజ్ఞాతంలోకి వెళ్ళిపోయారు. కోపోద్రేకాలు పెచ్చుపెరిగిపోయాయి. వ్యక్తులు, బృందాలు పరిస్థితిని తమకు తోచిన విధంగా అర్థంచేసుకున్నారు; తమకు వుత్తమమని తోచినవిధంగా చర్యతీసుకున్నారు. పోలీసుల పట్టువిడువని దమన విధానమూ, "ఉక్కుద్వల రాజ్" ప్రజల భావాలను ఇంకా రెచ్చగొట్టాయి. పౌరశాసనోల్లంఘన జరపాలని, కాంగ్రెసు ఆదేశమివ్వలేదు. అందువల్ల కోపంతో ధిక్కరించే వ్యక్తిగతచర్యలు త్వరలో వొక ఉద్యమంగా మారాయి; ఈ ఉద్యమం తిరుగుబాటుగా మారిపోయింది.

తిరుగుబాటుకు విద్యార్థులు, కార్మికులు కర్షకులు నాయకత్వం వహించారు. ఫేక్టరీలలోనూ, కళాశాలలలోనూ, పాఠశాలలలోనూ సమ్మెలు జరిగాయి. దేశంలో బ్రిటిష్ అధికారానికి చిహ్నాలుగావున్న పోలీసు ఠాణాలు, పోస్టాఫీసులు, రైలుస్టేషన్లమీద దాడిజరిపారు, తగులబెట్టారు, సర్వనాశనం చేశారు. ఆ తర్వాత కొన్ని విధ్వంసక కార్యకలాపాలుకూడా జరిగాయి. టెలిఫోన్ తీగలను త్రెంచివేశారు; రైళ్ళను పడగొట్టడానికి ప్రయత్నాలు జరిగాయి. పన్నులు చెల్లించవద్దని కర్షకులకు ఎడతెరిపిలేకుండా వుద్బోధించారు. అనేక ప్రాంతాలలో కర్షకులు ప్రత్యామ్నాయ పాలకవర్గాలను ఏర్పాటుచేశారు; అక్కడ ప్రభుత్వ విభాగాలు రోజులు, వారాలవరకూ పనిచేయలేదు. బలియాలో, స్థానిక నాయకులు పట్టణాన్ని స్వాధీనం చేసుకున్నారు; కాని సాయుధ బృందాలు వారిని తరిమివేశాయి, సతారాలోనూ కర్ణాటకలోనూ, కర్షకులు బ్రిటిష్ పరిపాలనకు వ్యతిరేకంగా అజ్ఞాత గెరిల్లా ప్రతిఘటన వుద్యమాన్ని 1944 వరకూ సాగించారు. అజ్ఞాత వుద్యమంలో జయప్రకాష్ నారాయణ్, రామ్ మనోహర్ లోహియా, అరుణాఆసఫ్ ఆలీ ప్రముఖ నాయకులుగా వుండేవారు. విప్లవ దౌర్జన్యాలు భారీయెత్తులో జరిగాయి. తిరుగుబాటు బ్రిటిష్ భారతదేశానికి మాత్రమే పరిమితం కాలేదు. అనేక సంస్థానాల ప్రజలుకూడా పాల్గొన్నారు. ప్రభుత్వం వెంటనే,

ప్రజలను హడలగొట్టే విధానాన్ని అవలంబించింది. లాఠీచార్జీలు, కాల్పులు, మూక వుమ్మడి అరెస్టులు ఎంత విస్తృతంగా జరిగాయంటే దేశం, పోలీసురాజ్యంగా మారి పోయింది. నిరాయుధులయిన గుంపులమీద, విమానాలమీదనుంచి మరతుపాకులతో కాల్పులు జరిపిన సందర్భాలు ఎన్నో వున్నాయి. పోలీసుల అత్యాచారాలు నిత్యకృత్యా లయిపోయాయి. ప్రజలను శిక్షించే జరిమానాలు, మరణశిక్షలు విధించడంపరిపాటయ్యాయి. తిరుగుబాటు కొద్దికాలమే జరిగినా, వుధృతంగా జరిగింది. ప్రభుత్వం దీనిని అణచివేయ గలిగింది కాని పోలీసులు, సైనికుల కాల్పులలో పదివేలమందికి పైగా మరణించారు. 1857 తిరుగుబాటు దరిమిలా దేశంలో యింత విస్తృతంగా తిరుగుబాటుకానిదాన్ని తీవ్రదమన విధానంతో ఈ విధంగా అణిచివేయడంగాని జరగలేదు.

1942 తిరుగుబాటు విఫలమయింది; ఎందువల్లనంటే, నాయకులు లేకుండా, సరి యైన వ్యవస్థలేకుండా నిరాయుధులయిన ప్రజలు, అధికారంలో వున్న సామ్రాజ్య వాద ప్రభుత్వ బలవత్తర శక్తిమీద విజయం సాధించజాలరు. అయితే ఈ తిరుగుబాటు రెండింటినీ సాధించింది. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా భారతదేశపు కోపోద్రేకాన్ని బాహాటంగా వ్యక్తంచేసింది; స్వేచ్ఛసాధించాలన్న కృత నిశ్చయాన్ని తిరుగులేని విధంగా స్పష్టం చేసింది. శ్వేత జాతివారి హింసను ఎదుర్కోడానికి జాతీయవాదులు ఏ మేరకు సన్నద్ధమయ్యారో, తమకు గల స్వాతంత్ర హక్కును వుపయోగించుకోడానికి బాధలకోర్చి; త్యాగాలు చేయడానికి, ప్రజలు ఎంతవరకూ సన్నద్ధమయ్యారో ఋజువు చేయడానికి యిది సజీవమైన వుదాహరణ. రెండోది 1942 తిరుగుబాటు తర్వాత భారత దేశంపై సామ్రాజ్యవాదుల ఆధిపత్యం అంతమయ్యే రోజులు దగ్గర పడ్డాయని బ్రిటిష్ పరి పాలకులకు తేటతెల్లమైంది.

ఒక విధంగా 1942 తిరుగుబాటు భారత స్వాతంత్ర్య వుద్యమం పరాకాష్ఠ నందు కోవడం సూచించింది. 1942 ఆగష్టు తిరుగుబాటు తర్వాత, అధికారాన్ని వాస్తవంగా ఏ విధంగా బదలాయించాలి, స్వాతంత్ర్యం తర్వాత దేశానికి ఏ పద్ధతి ప్రభుత్వం వుండాలి అన్న విషయాన్ని నిర్ణయించి ఎప్పుడు స్వాతంత్ర్య మివ్వాలి, అన్నదే ముఖ్య ప్రశ్న అయింది. 1942 తిరుగుబాటుకూ 1947 వాస్తవంగా స్వాతంత్ర్యం రావడానికీ మధ్య ఎన్నో రాజకీయ పరిణామాలు, సమావేశాలు, బేరసారాలు జరిగాయనటంలో సందే హము లేదు. అయితే స్వాతంత్ర్య సమరం విజయం సాధించ బోతోందన్న విషయంలో ఎటువంటి సందేహము లేక పోయింది.

## సిమ్లా మహాసభ:

1945 వేసవికల్లా యూరోప్‌లో యుద్ధం అంతం కావస్తోంది. భారతదేశంలో లిన్ లిత్‌గో తర్వాత వేవెల్, వైస్‌రాయ్ అయ్యాడు. ఈయన వృత్తిరీత్యా సైనికుడు, లిన్ లిత్‌గో వైస్‌రాయ్‌గా వున్నప్పుడు ఈయన భారతదేశపు సైన్యాధిపతిగా వున్నాడు. జపాన్‌తో యుద్ధం కనీసం మరో ఏడాది జరుగవచ్చునని, ఆసమయంలో సైనిక నిపుణులు భావించారు. సైనిక వ్యక్తిగా వేవెల్, ఈ అభిప్రాయంతో ఏకీభవించాడు. (1945 ఆగస్టులో అణ్వాయుధాలను ప్రవేశపెట్టడంతో, ఆసియాలో యుద్ధం హఠాత్తుగా ఎప్పుడు అంతమవుతుందో సూచనలు కనుపించలేదు.) ఆసియాలో యుద్ధాన్ని కొనసాగించడమూ అంటే, భారతదేశంలో స్థావరాలనూ, సాధనసంపత్తులనూ, యింకా ఎక్కువగా వుపయోగించుకోవడమని అర్థం. దేశంలో అప్పుడున్న రాజకీయ వాతావరణంలో అస్థిమిత పరిస్థితిని అంతం చేసి భారత నాయకులనూ, ప్రజలనూ, జపాన్‌తో యుద్ధానికి సంసిద్ధం చేసే మార్గాన్ని అన్వేషించడం అత్యవసరమని వేవెల్ భావించారు.

1945 ఏప్రిల్‌లో యూరోప్‌లో యుద్ధం అంతమయింది. చర్చి రాజీనామా యిచ్చారు. కొత్త ఎన్నికలు జరుగబోతున్నాయి. జూన్ 14 వ తేదీన "1935 భారత ప్రభుత్వ చట్టానికి లోబడి" భారతదేశంలో మరికొన్ని రాజ్యాంగ బద్ధమైన మార్పులను ప్రవేశపెట్టడానికి, కొత్త ప్రతిపాదనలను ప్రకటించారు. కాంగ్రెసుకార్యవర్గం సభ్యుల నందరినీ విడుదల చేశారు — గాంధీజీమీద నిర్బంధ వుత్తర్వును తొలగించారు — రాజకీయనాయక ప్రతినిధుల సమావేశం ఏర్పాటు చేశారు. జూన్ 25 తేదీన సిమ్లాలో యిది జరగాలి.

ప్రతిపాదనలు కొంతవరకూ సమాధాన పూర్వకంగా వున్నాయి; అయితే వొకవిధంగా అసంతృప్తికరంగానూ, రెచ్చగొట్టేవిగానూ వున్నాయి. వైస్‌రాయ్ కార్యవర్గ సమితి, వైస్‌రాయ్, బ్రిటిష్ సైన్యాధిపతి మినహా, పూర్తిగా భారతీయులతో వుండాలి. వైస్‌రాయ్ ప్రత్యేక అధికారాలు, అధికారపూర్వకంగా అంతంకావు; అయితే వీటిని "సహేతుకంకాని" విధంగా వుపయోగించబోమని హామీ యిచ్చారు. ఈ విధంగా యిది, వొక అడుగు ముందుకు వేసినట్టు భావించవచ్చు. ఆ తర్వాత విభజన లక్షణం తలఎత్తింది. సమితిలో, "సవర్ణ హిందువులు — ముస్లింల సమాన నిష్పత్తి" వుంటుంది అంటే దీని అర్థం, రాజకీయసమానత్వంకాకుండా మత సమానత్వ ముండాలన్న ముస్లిం లీగ్ కోరికను, బ్రిటిష్ విధానపు అధికార ప్రకటనలో మొట్టమొదటిసారిగా

బలపరిచారు. అయితే ఈ ప్రతిపాదనలను, "రాజ్యాంగ పరిష్కారాన్ని సాధించడానికీ లేక విధించడానికీ సూచించలేదనీ, వీటి గురించి సిమ్లా మహాసభలో చర్చిస్తారని పేర్కొన్నారు.

మహాసభ ప్రారంభమయినపుడు ఆశాభావం కనుపించింది. అయితే వెంటనే సమాధానానికి రాని జిన్నా వైఖరి, సామ్రాజ్యవాదుల ముందు జాగ్రత్త చర్యలు, యిది విజయవంతం కావడం అసంభవం చేస్తాయని స్పష్టమయింది. కార్యవర్గ సమితిలోని ముస్లిం సభ్యుల నందరినీ లీగ్ నామినేట్ చేయాలని జిన్నా పట్టుబట్టడం వల్ల, సంప్రదింపులు విఫలమయ్యాయి. ముస్లింలీగ్ వొక పార్టీగా లేకుండా కాంగ్రెసుతో ఎటువంటి వొప్పందం మీదా సంతకం చేయడానికి బ్రిటిష్‌వారు సుముఖంగా లేరు. 'విభజించి పరిపాలించు' అన్న విధానం పరాకాష్ఠ నందుకుంది.

## భారత జాతీయ సైన్యం

1942తిరుగుబాటును అణచివేసిన తర్వాత, 1945 లో యుద్ధం అంతమయ్యే వరకూ, దేశంలో రాజకీయ కార్యకలాపాలేవీ జరగలేదు. ప్రఖ్యాత నాయకులందరూ జైలులో వుండిపోయారు. పరిస్థితి, కొత్తనాయకుణ్ణి తయారుచేసేటంత శక్తివంతంగా లేదు. నిగూఢమయిన కోపోద్రేకాలు కొనసాగుతూ వున్నప్పటికీ, విసిగిపోయిన భావం కనుపించింది. యుద్ధం కొనసాగింది; అయితే జాతీయ వుద్యమం చలనం లేకుండా ఆగిపోయింది.

సోవియట్ యూనియన్‌కు వెళ్ళి, భారత స్వాతంత్ర్య సమరంలో వారిసహాయాన్ని కోరడంకోసం, సుభాస్ చంద్రబోస్, 1941 మార్చిలో భారతదేశంనుంచి రహస్యంగా బయలుదేరారు. అయితే 1941 జూన్‌లో జర్మనీ, సోవియట్ యూనియన్‌మీద దాడి జరపడంవల్ల, అది, మిత్రదేశాలతో చేరింది. అందువల్ల సుభాస్ చంద్రబోస్ జర్మనీ వెళ్ళారు; వారిసహాయంకోసం ప్రయత్నించారు. జర్మన్లనుంచి హామీ లభించిన తర్వాత, జపాన్ సహాయంతో భారతదేశపు విమోచనకు ఏర్పాట్లు చేయడానికి జపాన్‌కు వెళ్ళారు. ఈలోగా జపాన్, మలయా, బర్మాలనుంచి బ్రిటన్ వుపసంహరణ తర్వాత వదిలివేయబడిన భారతసైనిక అధికారులు - సిబ్బందితోనూ, వొక్క మలయాలోనే వుండిపోయిన 60 వేలమంది ఖైదీలతోనూ, యిప్పుడు తిరిగి స్వదేశానికి రాలేక చిక్కుబడి పోయిన ఆగ్నేయ ఆసియా దేశాలలోని భారత పౌరులతోనూ, భారతజాతీయసైన్యాన్ని తయారు చేయడానికి ప్రయత్నించింది. సుభాస్ బోసు, ఈ సైన్యానికి అధిపత్యం వహించారు.

ఇప్పుడు ఈ సైన్యం, జపాన్ సైన్యంతోచేరి భారతదేశంవైపు పురోగమించడం ప్రారంభించింది. ఐ.ఎన్.ఏ. అధికారులు సిబ్బంది, దేశభక్తితో వుద్వేగం పొందారు. విమోచన దార్లుగా వీరు భారతదేశంలో ప్రవేశించ తలపెట్టారు. స్వతంత్ర భారతదేశం తాత్కాలిక ప్రభుత్వానికి సుభాస్‌బోస్ అధిపతిగా వుండవలసింది.

ఐ.ఎన్.ఏ పథకాలు, జపాన్ పరాజయంతో పటాపంచలయ్యాయి. సుభాస్‌బోస్, టోకియో వెడుతూవుండగా విమాన ప్రమాదంలో మరణించారు. భారతదేశం, జపాన్ వంటి దేశమూ, దానిఫేసిస్టు మిత్రదేశాల తోడ్పాటుతో స్వాతంత్ర్యం సంపాదించాలన్న భావాన్ని అనేకమంది నాయకులు హర్షించకపోవడం వాస్తవమే. అయితే యుద్ధం ముగియవస్తూ వున్నపుడు సుభాస్‌బోస్ ఐ.ఎన్.ఏ., స్వదేశంలో నిస్పహాయస్థితిలో, నిరాశచెందిన భారత జాతీయవాదుల అంతరించి పోతోవున్న భావాలను చైతన్యవంతం చేయడానికి తోడ్పడ్డారు. సైన్యంలో పనిచేస్తువున్న వారితోసహా అన్నివర్గాల భారత ప్రజలకూ, ధైర్య సాహసాలకూ, దేశభక్తికీ వుద్వేగం కలిగించే మహత్తర ఉదాహరణను వీరు నెలకొల్పారు.

అందువల్లనే, బ్రిటిష్ ప్రభుత్వానికి విధేయులైవుంటామన్న ప్రమాణాన్ని ఉల్లంఘించినందున, దేశద్రోహ నేరానికి ఐ. ఎన్. ఏ. ఆఫీసర్లు కొంతమందిమీద కేసులు పెట్టాలన్న తమ నిర్ణయాన్ని ప్రభుత్వం ప్రకటించినపుడు, జాతీయ వాదులందరూ తీవ్రమైన ఆక్షేపణ తెల్పారు. దేశమంతటా బ్రహ్మాండమైన ప్రదర్శనలు జరిగాయి. అధికారులను విడుదలచేయాలని గట్టిగా కోరడం జరిగింది. వొక్క కాంగ్రెసు మాత్రమేకాక, దేశపు రాజకీయ నాయకులు యావన్మంది వీరి విచారణను ప్రతిఘటించారు; ఐ. ఎన్. ఏ. అధికారులను విడుదల చేయాలని నొక్కి చెప్పారు. కాంగ్రెసు, ఐ. ఎన్. ఏ. డిఫెన్సు సంఘాన్ని ఏర్పాటు చేసింది. ఇందులో ప్రఖ్యాత న్యాయవాదులయిన బూలభాయి దేశాయి, తేజ్‌బహదూర్‌సప్రూ, కైలాస్‌నాధ్ కట్జూ,అసఫ్‌అలీ వంటివారు వున్నారు. నెహ్రూకూడా ఈ సంఘంలో సభ్యులు. ఢిల్లీలోని చరిత్రాత్మక ఎఱ్ఱకోట హాలులో ఐ. ఎన్. ఏ ఆఫీసర్ల తరపున వాదించడానికి ఈ జాతీయ నాయకులు దృఢంగా నిలబడినపుడు, ఈ నాటకం యావద్ దేశ ప్రజల దృష్టిని ఆకర్షించింది. సైనిక న్యాయస్థానం నిందితులందరూ దోషులని తీర్పుచెప్పి, వారికి శిక్షలు విధించింది. అయితే ప్రజలు ఎంత ఉద్రేకంతో రెచ్చిపోయారంటే, ప్రభుత్వం వీరి అభిప్రాయానికి తలవొగ్గవలసి వచ్చింది. శిక్షలను ఆపివేసి, ఐ. ఎన్. ఏ. ఆఫీసర్లను విడుదలచేశారు.

## సమరం అంతం కావడం

యుద్ధం అంతమయిన వెంటనే, భారతదేశపు స్వాతంత్ర్యాన్ని యిహ ఎంతమాత్రమూ జాప్యంచేయడానికి వీలులేదని స్పష్టమయింది. విదేశాలలోనూ, దేశంలోనూ వివిధ పరిణామాలు, బ్రిటన్‌కు ఈ బుద్ధిపుట్టించడానికి కారణమయ్యాయి. ప్రపంచంలో బ్రిటన్ స్థానాన్నీ, అధికారాన్నీ, యుద్ధం పూర్తిగా, మార్చివేసింది. సోవియట్ యూనియన్, అమెరికా, అగ్రరాజ్యాలుగా వెలిశాయి; రెండూ భారత స్వాతంత్ర్యానికి సుముఖంగా వున్నాయి. యుద్ధంలో బ్రిటన్, విజయం సాధించినప్పటికీ, దాని ఆర్థిక వ్యవస్థ, సైనిక శక్తి తీవ్రంగా దెబ్బతిన్నాయి, పునర్నిర్మాణానికీ, పునరావాసానికి, దానికి వ్యవధి కావలసి వచ్చింది. బ్రిటిష్ ప్రజలు, ముఖ్యంగా రక్షణ సిబ్బంది, యుద్ధంతో అలిసిపోయారు; సామ్రాజ్య రక్షణకోసం శ్రమపడటానికి యిహ సిద్ధంగాలేరు. కన్సర్వేటివ్‌లు, ఎన్నికలలో ఓడిపోయారు; అధికారంలోకి వచ్చిన లేబర్‌పార్టీ, భారతదేశపు కోర్కెలను మన్నించడానికి సుముఖంగావుంది. భారతదేశంలో పరిస్థితి పూర్తిగా మారిపోయింది; బ్రిటన్, అధికారంలో వుండటం యిహ ఎంతమాత్రమూ సాధ్యంకాదన్న యదార్థాన్ని ముఖ్యంగా ఆలోచించవలసి వచ్చింది. ఐ. ఎన్. ఏ. విచారణ, దేశం యిహ ఎంత మాత్రమూ దమన విధానాన్ని సహించదనీ, కల్లవాగ్దానాలతో తృప్తిపడదనీ, స్పష్టంగా ఋజువు చేసింది. భారతదేశపు సమరతత్వం పెరిగిపోయింది, జాగృతమయింది; జాతీయవాదుల కోర్కెలను సరియైన విధంగా తీర్చకపోయినట్టయితే, పరిస్థితి అతిప్రమాదకరంగా పరిణమించవచ్చు. ఈ నిర్ణయానికి రావడానికి తగిన ఆధారాలున్నాయి. 1946 ఫిబ్రవరిలో బొంబాయిలో భారతనౌకా సిబ్బంది తిరుగుబాటు జరపడం, భారత విమానదళంలో అసంతృప్తి, సమ్మెలు పరివ్యాప్తంకావడం, జబ్బల్‌పూర్‌లో భారత సిగ్నల్‌కోర్ సమ్మెజరపడం, — ఇవన్నీ దీనిని ఋజువు చేశాయి. పోలీసులు, అధికారులుకూడా జాతీయ వాదులపట్ల సానుభూతి కనబరచడం ప్రారంభించారు. జాతీయ వుద్యమాన్ని అణచివేయడానికిగానీ, అంతం చేయడానికిగానీ, వీరిని వుపయోగించడం క్షేమకరం కాజాలదు. అంతేకాకుండా సమ్మెలు, హర్తాళ్లు, ప్రదర్శనలు బ్రిటిష్ భారతదేశమంతటా ఎక్కువవుతున్నాయి; యివి, సంస్థానాలకు కూడా, వ్యాప్తిచెందుతున్నాయి.

బ్రిటిష్ ప్రభుత్వం అందువల్ల, భారతదేశానికి అధికారాన్ని బదలాయించి దీర్ఘకాల స్వల్పకాల వివరాలను రూపొందించాలని నిర్ణయించింది. కేబినెట్ రాయబారవర్గాన్ని వీరు, భారతదేశానికి పంపారు. అన్ని పార్టీలకూ, సంస్థలకూ ప్రాతినిధ్యం వహించే వివిధ నాయకులతో సుదీర్ఘమైన, క్షుణ్ణమైన చర్చలు జరిగిన తర్వాత కేబినెట్ రాయబారవర్గం

తన పథకాన్ని ప్రకటించింది. దీనిని కాంగ్రెసు - ముస్లింలీగ్ రెండూ ఆమోదించాయి. అయితే, ఆ తర్వాత ఈ పథకానికి అర్థం చెప్పడంలో విభేదాలు తల ఎత్తాయి. అయితే వేవెల్, తాత్కాలిక ప్రభుత్వాన్ని ఎంత త్వరలో ఏర్పాటుచేస్తే అంత బాగుంటుందని ఆదుర్దా చెందారు. ఇటువంటి ప్రభుత్వాన్ని చిట్టచివరకు కాంగ్రెసు, 1946 సెప్టెంబరులో జవహరిలాల్ నెహ్రూ, మంత్రిమండలి ప్రధానిగా, ఏర్పాటు చేసింది. అక్టోబరులో ముస్లింలీగ్ కూడా మంత్రిమండలిలో చేరింది; అయితే, రాజ్యాంగ నిర్మాణంలో పాల్గొన కూడదని వీరు నిశ్చయించారు. బ్రిటిష్ ప్రధానమంత్రి క్లిమెంట్ అట్లీ, 1947 ఫిబ్రవరి 20 తేదీన, బ్రిటన్ అధికారాన్ని, భారతదేశానికి 1948 జూన్‌లోగా బదలాయిస్తుందని ప్రకటించారు.

అధికారాన్ని బదలాయించే ఏర్పాట్లు చేయడానికి వైస్‌రాయ్‌గా, లార్డు లూయీ మౌంట్ బేటన్‌ను, భారతదేశానికి పంపారు. కాంగ్రెసుకూ - ముస్లింలీగ్‌కూ తీవ్రమైన విభేదాలు తలఎత్తినప్పటికీ, లార్డు మౌంటుబేటన్ రాజీపథకాన్ని రూపొందించారు; ఒక సంవత్సరం లోగా అధికారాన్ని బదలాయించడానికి తేదీనికూడా సూచించారు. భారతదేశం 1947 ఆగష్టు 15 తేదీన స్వతంత్రదేశమవుతుంది. అయితే దేశాన్ని విభజిస్తారు. పంజాబ్ పశ్చిమ ప్రాంతాలు, వాయవ్య సరిహద్దురాష్ట్రం, పశ్చిమాన సింధు, బెలుచిస్థాన్, తూర్పున బెంగాల్‌లో సగంభాగం, అస్సాంలో సిల్‌హెట్ జిల్లా నూతన స్వతంత్ర పాకిస్థాన్ దేశంగా ఏర్పడాలి; దీనికి కూడా అదేసమయంలో ప్రారంభోత్సవం జరగాలి. అయితే, ప్రజాభిప్రాయాన్ని తెలుసుకోడానికి ఆ తర్వాత వాయవ్య సరిహద్దురాష్ట్రంలోనూ, సిల్‌హెట్ జిల్లాలోనూ ప్లెబిసెట్ జరగాలి.

స్వాతంత్ర్య సాధనలోని గర్వమూ, ఆనందమూ, విషాదకరమైన విభజన బాధ తోనూ, విభజన పరిణామాలతోనూ నీరుకారిపోయాయి. అయితే జాతి, సంతృప్తిపడి పూరుకోలేదు. స్వాతంత్ర్యం మొదటి అడుగుమాత్రమే. ఆత్మ విశ్వాసంతో, దృఢ నిశ్చలత, ఆశాభావంతో, భారతదేశం, స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, సాంఘికన్యాయం వంటి సవాళ్ళను ఎదుర్కోడానికి, ముందడుగు వేసింది.

printed at JJ Offset Printers, Delhi-110035